# శ్రీరాముడు-యోగ రహస్యము

## (The Secret of Yoga in Ramayanam)



చింతలపాటి వి ఎ దుర్గా ప్రసాద్

(CHINTALAPATI V A DURGA PRASAD)

## విషయసూచిక

# ముందు మాట

ముందుగా మా మాతా పితరులకు, గురువులకు వందనములు. ఈ గ్రంథ రచనకు నన్ను ప్రోత్సహించిన మిత్రులు, ధర్మపత్నికి, కుటుంబ సభ్యులకు ధన్యవాదాలు. నా ఇష్టదైవమైన హనుమత్ సమేత సీతారామలక్ష్మణులకు నమోవాకములు. నాలో రామ జిజ్ఞాస కలుగుటకు ప్రేరకులు, స్ఫూర్తి ప్రదాతలు మా బావ కీ.శే. కొమరగిరి రామమోహనరావు, మా మేనమామ కీ.శే. కొమరగిరి అంజయ్య గార్లు. శ్రీ భాష్యం అప్పలాచార్యులు వారి శ్రీమద్రామాయణము (తత్వదీపిక) మరియు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారి వసిష్ఠ గీత నాలోని శ్రీరాముడి మీద భక్తి భావము వృద్ధి అయినది. ఆ ప్రేరణతో మిత్రులు, శ్రేయోభిలాషుల ప్రోత్సాహముతో **"యోగ వాసిష్ఠ సంగ్రహము"** పూర్తి వ్యావహారిక భాషలో రాయడం జరిగింది. అందులో వసిష్ఠ మహర్షి ఒకటి రెండు సందర్భములలో శ్రీరామునికి ఈ జగత్తు అంతయు, లోకపాలకులు, త్రిమూర్తులు ఆ పరమేశ్వరి యొక్క నియతి ప్రకారమే నడచుకొనెదరని ఉటంకించారు. ఆ సందర్భములో కాకాజీ రాసిన "రామాయణము-యోగ రహస్యము" ఒక మిత్రుని ప్రోత్సాహముతో చదవడం జరిగింది. ఆ ప్రేరణచే వాల్మీకి రామాయణము, యోగ వాసిష్ఠము, శివ గీత లను అనుసంధానించుతు, **"శ్రీరాముడు-యోగ రహస్యము"** అనే ఈ చిరు పుస్తకములో శ్రీరాముని జీవితములోని యోగ రహస్యమును వివరించే ప్రయత్నము. చేయడమైనది. ఇందు కోసము లలిత సహస్ర భాష్యము, పతంజలి యోగ దర్శనము, శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులు వారి శ్రీమద్రామాయణము (తత్వదీపిక), ఆధ్యాత్మిక రామాయణము మరియు అంతర్జాలములో ఆయా విషయాలపై శోధన చేయడమైనది. సలహాలు, సూచనలు ఉంటె అందించ గలరు.

February, 2020 — భవదీయుడు

Hyderabad — చింతలపాటి వి ఎ దుర్గా ప్రసాద్

Mail ID: chvadurgaprasad@rediffmail.com. Ph: 9618014862

**గజానననం భూత గణాధి సేవితమ్, కపిత్థ జంబూ ఫల సార భక్షితమ్**
**ఉమా సుతం శోక వినాశ కారణమ్, నమామి విఘ్నేశ్వర పాద పంకజమ్**

గజ ముఖుడు, భూత గణములచే సేవించ బడే వాడు, వెలగ మరియు రేగు పండ్ల గుజ్జును భక్షించు వాడు, పార్వతీ పుత్రుడు, దుఃఖమును నశింప జేయుటకు కారణమైన వాడు అయిన విఘ్నేశ్వరుని పాద పద్మములకు నమస్కరిస్తున్నాను.

## శ్రీ సీతారామ ప్రార్ధన

**ఏతేషు చైవ సర్వేషు తత్వంచ బ్రహ్మతారకమ్, రామ ఎవ పరంబ్రహ్మ రామ ఎవ పరంతపః, రామ ఎవ పరంతత్వం శ్రీరామోబ్రహ్మతారకమ్.**

హనుమానుడు చెప్పుచున్నాడు: నామాటలు భవబంధాలను పోగెట్టేవి. వీటిని శ్రద్ధగా శ్రవణం చేయండి. సృష్టి లోని సకల తత్వాలలో తారకబ్రహ్మ తత్త్వం ఒక్కటే గొప్పది. శ్రీరాముడే ఆ పరబ్రహ్మ ఆయనే పరమ మతం, రాముడే ఆ తారక బ్రహ్మ.

**రామం త్రినేత్రం సోమార్ధ ధారణం శూలినం పరం, భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దినే ముపాస్మహే, రామాభిమాం సౌందర్య సీమాం సోమావతం స కామ్యాప్రశాంకుశ ధనుర్బాణ ధరాం ద్యాయే త్రిలోచనమ్.**

త్రినేత్రుడు, చంద్రకళని ధరించిన వాడు, త్రిశూలధారుడు, పరుడు, శరీరమంతా భస్మాన్ని పూసుకొన్న వాడు, జటాధారి అయిన శ్రీరాముడిని ధ్యానిస్తున్నాను శ్రీరాముడికి ప్రియురాలు, స్త్రీలందరి లోకి గొప్ప సౌందర్యవతి, చంద్రుణ్ణి శిరోభూషణంగా అలంకరించు కొన్నది, పాశాంకుశ ధనుర్బాణాల్నిధరించింది, మూడు నేత్రాలు కలిగింది, ఉమాదేవి స్వరూపిణి అయిన సీతాదేవిని ధ్యానిస్తున్నాను. (ఈమంత్రాలు శివ-రాముల అభేదాన్నితెలిపేవిగా చెప్పబడ్డాయి).

**ఐహికేషు చకార్యషు మహాపత్సుచ సర్వదా, నైవ యోజ్యో రామ మంత్రః కేవలం మోక్షసాధకః, ఐహికే సమను ప్రాప్తే మాంస్మ రేద్రామ సేవకం, యోరామం**

**సంస్మరేన్నిత్యం భక్త్యామను పరాయణః, తస్యాహమిష్ట సంసిద్ధ్యై దీక్షిత్తోస్మి మునీశ్వరః వంచితార్ధం ప్రదాస్యామి భక్తానాం రాఘువస్యతు, సర్వదా జాగరూకోస్మి రామాకార్య ధురంధరః**

ఐహిక సుఖాల కోసం, కష్ట నివారణ కోసం రామమంత్రాన్ని ఉపయోగించకండి.అలాంటి కష్టాలు ప్రాప్తిస్తే రామ సేవకుడైన (హనుమంతుడు) నా మంత్రాన్ని జపించాలి. ఎందుకంటే రామ మంత్రం మోక్షకారకమైనది. ఎవడైతే శ్రీరామచంద్రుడిని భక్తిగా సేవిస్తూ, ఉపాసిస్తూ ఉంటాడో, అలాంటి భక్తుల కోరికలు తీర్చడానికి నేను సదా సిద్ధంగా ఉంటాను.

**సదారామోహమస్మీతితత్వతఃప్రవదంతియే,**
**నతేసంసారినోనూనంరామఏవనసంశయఃఓంసత్యమిత్యుపనిషత్**

సర్వకాల సర్వావస్థలలో **"నేనే రాముడ్ని"** అని ఎవరు బావిస్తారో, వారు సంసారులు గారు. సాక్షాత్తూ రామ స్వరూపులు. ఇది సత్యం. **..... .. రామరహస్యోపనిషత్**

**స్వర్ణాభా మంబుజ కరాం, రామాలోకన తత్పరాం, ధ్యాయే త్సట్కోణ మధ్యస్తాం, జానకీం రామ వల్లభామ్.**

**ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి త్రయం యద్భావ సాధనం, తద్బ్రహ్మసత్తా సామాన్యం సీతాతత్వ ముపాస్మహే.**

**కైవల్య శ్రీ స్వరూపేణ రాజమానం మహోవ్యయం, ప్రతియోగి వినిర్ముక్తం శ్రీరామపాద మాశ్రయే.**

**ఆపదా మప హర్తారం, ధాతారం సర్వ సంపదాం, లోకాభిరామం శ్రీరామం, భూయో భూయో నమామ్యహం.**

**ఏకస్సన్నపి సర్వమంత్రఫలదో లోభాది దోషోజ్ఝితః శ్రీరామ శ్శరణం మమేతి సతతం మంత్రోయ మష్టాక్షరః**

ఒక్కటే అయినను సమస్త మంత్రముల ఫలములను కలుగ జేయు నదియు, లోభాది దోషములు లేనిదియు అయిన శ్రీరామ శ్శరణం మమ అను అష్టాక్షర మంత్రము సదా శ్రేయస్కరమైనది.

**రామ మంత్రార్ధ విజ్ఞాని జీవన్ముక్తో న సంశయః**

రామ మంత్రము యొక్క అర్ధమును తెలుసుకొనిన విజ్ఞాని జీవన్ముక్తుడు అగును అనుటలో సందేహము లేదు.

**ఆకారాక్షర సంభూత స్సౌమిత్రి ర్విశ్వభావనః ఉకారాక్షర సంభూత శ్శత్రుఘ్న స్తైజసాత్మకః**

**ప్రాజాత్మకస్తు భరతో మకారాక్షర సంభవః అర్ధమాత్రాత్మకో రామో బ్రహ్మానందైక విగ్రహః**

**అ** కారము నుండి జన్మించిన విశ్వుడు లక్ష్మణుడు. **ఉ** కారము నుండి జన్మించిన తైజసుడు శత్రుఘ్నుడు. **మ** కారము నుండి జన్మించిన ప్రాజ్ఞుడు భరతుడు. బ్రహ్మానంద స్వరూపుడు, **అర్ధమాత్రాత్మకుడు** శ్రీరాముడు గా భావించవలెను.

# గ్రంథ పరిచయము

మన భారతీయ సాహితీ సర్వస్వ వైవిధ్యానికి మూలకందాలు శ్రీరామాయణ, మహాభారత, భాగవతాలు. మానవుని జీవితము, నడవడిక, పురోభివృద్ధి, ధర్మాచరణ ఎలా ఉండాలో మనకు రామాయణములో సీతారాముల పాత్రల ద్వారా తెలియుచున్నది. ఇందు శ్రీరాముడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగా పురాణ, ఇతిహాసములు ఘోషిస్తున్నాయి. అనేకమంది భక్తులు రామాయణమును తమదైన శైలిలో వర్ణించారు. అయితే వాల్మీకి రామాయణములో ఎక్కడ కూడా మహర్షి శ్రీరాముడు జన్మించినది లగాయతు రావణ సంహారము వరకు శ్రీరాముని భగవంతునిగా వర్ణించలేదు. అలాగే శ్రీరాముడు కూడా శ్రీకృష్ణుడు లాగ ఎక్కడ తనను తాను భగవంతునిగా అభివర్ణించుకోలేదు. శ్రీరాముడు జన్మించినది మొదలు పట్టాభిషేకము వరకు తండ్రి మాట జవదాటని వాడుగాను, గురువుల యందు అఖండ భక్తి విశ్వాసాలు కలవాడిగాను, తన ప్రజల యందు అమితమైన ప్రేమకల పురాణ పురుషోత్తమునిగాను, ధర్మాచరణమునకు పట్టుకొమ్మగాను, సకల జీవ రాసులలో ప్రేమమూర్తిగా సుస్థిర స్థానము సంపాదించుకున్నాడు. మహాభారతములో శ్రీకృష్ణుడు యుద్ధమధ్యమములో అర్జునిడికి భగవద్గీత ఉపదేశిస్తాడు. యోగావాసిష్ఠములో వశిష్ఠమహర్షి చెప్పినట్లు శాస్త్ర జ్ఞానమును అవగాహన చేసుకోవడానికి శిష్య ప్రజ్ఞయే ముఖ్యము అని చెప్తారు. అలాగే శ్రీరాముని శిష్య ప్రజ్ఞ కారణంగానే గురుకులంలో సకల రాజనీతిని కూలంకషంగా అవగాహన చేసుకొన్నా, విశ్వామిత్రుని ప్రోద్బలం కారణంగా వసిష్ఠ మహర్షి ఆత్మజ్ఞానము ప్రభోదించినా, యాగ సంహరణార్ధము విశ్వామిత్రుడు శ్రీరాముని తీసుకొని వెళ్ళినప్పుడు అంతకుముందు సముపార్జించిన జ్ఞానానికి అనుసంధానంగా అనేక యోగ చక్ర మరియు అస్త్ర రహస్యాలను అభ్యాసము

చేయించినా, సీతాపహరణము తర్వాత దుఃఖంలో ఉన్న శ్రీరామునికి పరమేశ్వరుడు గీతను బోధించిన, శ్రీరాముడు తన ప్రజ్ఞ కారణంగానే ఆయా జ్ఞానమును అవగాహన చేసుకొని అభ్యాసము చేయగలిగాడు. ఉదాహరణకు ఇటీవల కాలంలో భగవత్ అది శంకరాచార్యులు గాని వివేకానందుడు గాని తమ శిష్య ప్రజ్ఞ వలెనె తమకు గురువు బోధించిన జ్ఞానాన్ని శ్రవణ మాత్రంచేతనే అవగాహన చేసుకొని కఠోర యమనియమాలతో అభ్యాసము చేయగలిగి భవిష్యత్ తరానికి ఆదర్శప్రాయులైనారు.

వ్యక్తి యొక్క శ్రద్ధ ఒకసారి తన లక్ష్యమైన శ్రద్ధాకేంద్రము నుండి మరలి నప్పుడు ఆ వ్యక్తి మరల పూర్వస్థితికి రావడము కష్టము. అంతేగాక మనస్సు చెల్లాచెదరవడం ఖాయము. అప్పుడు తనకు కలిగిన పూర్వజ్ఞానాన్ని మరల మరల పునఃసమీక్షించుకోవడము అవసరము.

శ్రీరాముడు గురుకులంలో విద్యాభ్యాసము పూర్తి చేసుకొని రాజగృహానికి వచ్చి కొద్దిరోజులు తీర్ధయాత్రలు చేసి, దేశ స్థితిగతులను, ప్రజలకు రాజుపై ఉన్న అనురాగమును తెలుసుకోవాలన్న కోరికతో రాజగు తన తండ్రి అయిన దశరధుని అనుజ్ఞ పొంది దేశ సంచారము చేసి అయోధ్యా నగరము చేరుకొంటాడు. ఇట్లుండ శ్రీరాముడు పదునారు సంవత్సరముల ప్రాయములో లోకము పోకడలను, అందు మానవుని దుఃఖము గమనించి వారి కష్టములను రూపుమాపే మార్గము కానరాక విరాగియై ఉన్న సమయమున విశ్వామిత్ర మహర్షి యాగ సంరక్షణార్థమై శ్రీరాముని గొనిపోవడానికి వస్తాడు. అంత శ్రీరాముని వైరాగ్యకారణము తెలుసుకొని విశ్వామిత్రుడు, వసిష్ఠ మహర్షితో శ్రీరామునికి జ్ఞానోపదేశము చేయవలసినదిగా ప్రార్థిస్తాడు. అంత వసిష్ఠ మహర్షి తనకు తన తండ్రి అయిన బ్రహ్మ ద్వారా కలిగిన జ్ఞానాన్ని కథల రూపంలో శ్రీరామునికి ఉపదేశిస్తాడు. ఇదియే వసిష్ఠ-రామ సంవాదమైన **"యోగా వాసిష్ఠము"**. పదుఎనిమిది రోజులు వసిష్ఠుని ద్వారా సమస్త జ్ఞానాన్ని ఎరిగి ఆత్మానందములో శ్రీరాముడు పరిపూర్ణుడు అయినాడు.

అప్పుడు శ్రీరాముడు అయోధ్యా ప్రజలతో వేద శాస్త్ర పురాణములందు గురువాక్యము విధి అని చెప్పబడినది కావున గురువాక్యము శిరోధార్యము అని చెప్తాడు. అరణ్య వాసములో సీతాపహరణ తర్వాత సమస్త జ్ఞానాన్ని తెలుసుకొన్న వాడైనప్పటికీ మాయా ప్రభావము వలన అరణ్యములో సర్వ శక్తిమంతుడైనప్పటికీ దుఃఖితుడై మార్గోపాయము కానరాక అగమ్య గోచరంగా సంచరిస్తుండగా అగస్త మహర్షి ఏతెంచి శ్రీరాముని జ్ఞానమును గుర్తు చేసి కర్తవ్య బోధన చేసి పరమేశ్వరుని ప్రార్థన చేయమని తద్వారా దుఃఖోపశమనము కలుగునని విరజా దీక్ష ఇస్తాడు. ఈ విధముగా శ్రీరాముని చాతుర్మాస్య దీక్ష వలన పరమేశ్వరుడు ప్రత్యక్షమై పాశుపతాస్త్రమును ప్రసాదించి జ్ఞానబోధ చేస్తాడు. ఇదియే శివ-రామ సంవాదరూపమైన పద్మపురాణాతర్గతమైన **"శివగీత"**

పై రెండు జ్ఞానబోధలు శ్రీరాముని నడవడిలో ఏ విధముగా ప్రభావము చూపినాయి, ఏ విధముగా శ్రీరాముని జీవితము సమస్త మానవాళికి ఆదర్శప్రాయము అయినది, ఇంకను రామాయణములో యోగ రహస్యములను వాటిని శ్రీరాముడు ఏ విధంగా అభ్యాసము చేసాడు? అని విశ్లేషణాత్మకంగా వాల్మీకి రామాయణములో శ్రీరాముని పాత్ర ద్వారా విశ్లేషించే చిరు ప్రయత్నమే **"శ్రీరాముడు-యోగరహస్యము"**. ముందుగా కథా విషయమై అవగాహనకు యోగరహస్యము, యోగ సూత్రాలు, జ్ఞానము, నాదము మొదలుగాగల విషయాలు స్థూలంగా అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిద్దాము. ఈ విషయాలు ఉపోద్ఘాతములో వివరించా బడ్డాయి.

రామాయణము జాగ్రత్తగా మొదటి నుంచి చివర వరకు గమనించితే మానవుని పురోభివృద్ధి ఎలా యుండవలెనో/సాగవలెనో రామాయణము కాండల రూపములో శ్రీరాముని పాత్ర ద్వారా వాల్మీకి వివరించారు. ఉదాహరణకు బాలకాండములో శ్రీరాముడు గురుకులంలో విద్యాభ్యాసము, వసిష్ఠ మహర్షి వద్ద ఆత్మ జ్ఞానము,

విశ్వామిత్రుని వద్ద అట్టి విద్యను సత్యధర్మములనే ఆయుధములుగా అభ్యాసము (ప్రాక్టీస్) చేసినాడు. అయోధ్యాకాండములో భరతునికి రాజ ధర్మమును బోధించుట ద్వారా ఆచార్యుడు (గురువు) గా దర్శనము చేసినాడు. అనగా తాను చదువుకున్నది అభ్యాసము చేసినవాడే సరియైన గురుస్థానమును పొందగలుగును. జాబాలి నాస్తిక వాదాన్ని ఖండించుట ద్వారా వేద ప్రమాణాన్ని నిలబెట్టాడు. (ఆది శంకరాచార్యులు ఇటులనే ప్రాచుర్యములో యున్న నాస్తిక వాదమైన బౌద్ధమును ఖండించడము గమనించ వచ్చు). అరణ్య కాండలో అసురభావములను నాశనము చేసి సత్య ధర్మములను ప్రతిష్ఠించవలెనని తన నడవడిక ద్వారా చాటి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణకై ఘోరమైన దండకారణ్యములో ప్రవేశించినాడు. కిష్కిందా కాండలో అట్టి అసుర భావములను నాశనము చేయుటకు మిత్రుని తోడ్పాటు కూడా అవసరమని గ్రహించి సుగ్రీవునితో స్నేహము చేసినాడు. Finally యుద్ధ కాండలో దుష్ట సంహారం చేసి, తనను శరణాగతిని చేసినవారిని రక్షించినాడు.
ఈ విధముగా మానవుడు అభ్యుదయము పొందవలెనన్న పరిణామ క్రమము ఎలా ఉండవలెనో తద్వారా మానవుడు భగవంతుడిగా ఎలా రూపాంతరము చెందవచ్చో శ్రీరాముని పాత్ర ద్వారా మనకు వాల్మీకి అవగతము చేసినారు.

# గురు ప్రోక్తము

దత్తాత్రేయ గురు పరంపరలో ముఖ్యమైన శ్రీ శ్రీపాదువల్లభ, శ్రీ నృసింహాసరస్వతి, శ్రీ నారాయణస్వామి, శ్రీ గోవిందస్వామి, తర్వాత పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవానంద సరస్వతి (ఈయననే తెంబే స్వామి అని అంటారు) ముఖ్యమైన వారు. శ్రీ వాసుదేవానంద సరస్వతి మాటలతో రామాయణమును చూద్దాము.

**దశేన్ద్రియ రథోధిహి రాజా దశరధః స్మృతః,**
**కౌసల్యా తత్త్రిపియా బుదిహ్ రామస్తత్రోహ్యాతః పరః.**

దశేన్ద్రియ యుక్తమైన శరీర రూప రధమునకు స్వామి దశరధుడు. ఆయన యొక్క కుశల బుద్ధియే ప్రియ పత్ని కౌసల్య. కానీ రాముడు వీటన్నిటి కంటే భిన్నమైన జీవాత్మ.

**వృత్వావ్మ్ సీతాం స్వానుభూతిమ్ సుఖమాస్తే ద దేవతః,**
**సంసార విపినం ప్రతిపాహంకారౌ రావణాభిధ్యాహ్.**

సాధకుడైన జీవాత్మకు సీత రాజస అనుభూతి అటువంటి స్వానుభూతి రూపమైన సీతాసహిత రామరూప సాధకుడు సుఖముగా ఉండును. సంసారము ఒక విపినము అనగా దండకారణ్యము. అందు రావణ రూప అహంకారము ప్రవేశించును.

**రాజసః స్వానుభూతింతాం సీతాం యత్నాజ్ఞ హారహ,**
**రామః పరాత్మపి తతః స్వానుభూతి వియోగతః.**

సాధనాయత్నము ద్వారా ప్రాప్టించినది రాజస వృత్తి అయిన సీత. ఈ రాజస వృత్తి రూప సీతను బ్రహ్మ రూప రావణుడు హరించినాడు. రామ జీవాత్మ పరమాత్మ స్వరూపుడైనప్పటికీ, రాజస వృత్తి హరింపబడినప్పుడు సీతావియోగమనే కారణములో దుఃఖితుడు అయ్యాడు.

**ప్రాప్తోదీన దశకం దుఖి సుశోచ విరహాతురః,**
**పరిభ్రతాం హనుమతాం వివేకేన చ సంగతః.**

వ్యాకులుడైన రాముడు వివేకవృత్తి రూపమైన హనుమానుని కలసినవాడై సీతను గురించి ప్రశ్నించెను.

**తేన సీతా స్వానుభూతి స్థితి వారార్తా ప్రకాశితా,**

**తతో వానర సహా వృత్తిసై త్యేనచ హనుమతా.**

చంచల వానరులు అనగా సాధకుని అనేక వృత్తులు.ఈ వానర సైన్యమును తీసుకొని వివేక రూప హనుమానుడు సీతను వెదికి రాముని అవస్థను విన్నవించెను.

**సేతుం బధ్వా సుజలధౌ సాధనాశ్మ భిత్కటైహ్,**

**తతోభవాబ్ధి ముల్లంఘ్య దీప జ్ఞానాగ్నినాభృశమ్.**

ప్రపంచ రూపసాగారునిపై సాధనా రూప రాతిని వేసి హనుమానుడు సేతువును తయారు చేసెను. అటువంటి సాధనా సేతువు ద్వారా అందరూ భవసాగరమును దాటిరి. దివ్య ప్రజ్వలితమైన జ్ఞానముతో హనుమంతాది సర్వులు లంకపై బడిరి.

**సూక్ష్మే దెహాఖ్యలంకాంచ దగ్ధవోపనిషధ స్రతః,**

**కామక్రోధాది రక్షామ్సి హత్వాబుద్ధే సహస్రతః.**

శరీరమునందలి సూక్ష్మ ఇచ్చారూప వాసనలను (లంకను) ఉపనిషద్రూపమైన అగ్ని ద్వారా దహనము గావించి హనుమానుడు కామ క్రోధ రూపములైన సహస్ర రాక్షసులను తన వివేకముతో నాశనము గావించెను.

**సాత్వికాహంకారం విభీషణ సాహాయ్యథాస్థహ్,**

**కుంభకర్ణ తామసాహంకారం రాజసమన్యద.**

సాత్విక అహంకార రూప విభీషణుని సహాయంతో రాముడు తామస రూప అహంకార కుంభకర్ణుని, రాజస రూప అహంకార రూప రావణాదులను నాశనము గావించెను.

**నిహత్య రావణం స్వానుభూతిమ్ సీతాం ప్రగృహ్యచ,**

**రామః స్వరూప సామ్రాజ్యేభిషిక్తో రీంరమతాయా.**

ఈ విధముగా బ్రహ్మరూప సాత్విక అహంకారియైన రావణ బంధము నుండి స్వానుభూతి రూప సీతను విడిపించుకొని రాముడు తన వృత్తి రూపమైన ఇంటికి తిరిగి వచ్చి స్వరూప సామ్రాజ్య రూప సింహాసనాభిషిక్తుడగును.

## ముఖ్యాంశాలు

1. ఈ సృష్టిలో చైతన్యము తప్ప వేరొకటి లేదు. ఆత్మయే చైతన్య రూపముగా భాసిస్తున్నది గాని నిజానికి దైవము మరియు వాటి రూపములు లేవు. ఆత్మ యందు స్థితుడై ఉన్న మానవుడు సాక్షాత్తు భవంతుడే. ఇట్టి ఆత్మ స్థితిని పొందడానికి యోగ మార్గము ఒక్కటే తరుణోపాయం అట్టి యోగ మార్గాన్ని అనుసరించిన మహాపురుషుడు శ్రీరాముడు. (పేరా A.1.1)

2. నిత్యమైన స్ఫోట, లేక శబ్దబ్రహ్మం మనం నోటితో ఉచ్చరించి, చెవులతో వినే లౌకిక శబ్దంగా పరిణమించడంలో నాలుగుదశలు చెప్పారు. 1.పరా, 2. పశ్యంతీ, 3. మధ్యమా, 4. వైఖరీ. పరా పశ్యంతీ దశల లోని శబ్దాన్ని ఎవరో యోగులు తప్ప మన సాధరణ ఇంద్రియ జ్ఞానంతో మనం గ్రహించలేము. జపాదులవల్ల మధ్యమా దశలోని వాక్కును గుర్తించవచ్చు. ఇక వైఖరీవాక్కు ఒక్కటే మనకందరికీ తెలిసింది. అధిక ఫ్రీక్వెన్సీ కలిగిన సర్వోత్కృష్ట శబ్దాన్నే పరానాదం అంటారు. వినబడే ఓంకారం సర్వోత్కృష్ట నాదం కాదు. పరా నాదము, ఓంకారానికి మూలం. (పేరా A.3.2)

3. జాలంధర బంధ, ఉడ్యాన బంధ, మూల బంధములు త్రిబంధములు. అట్టి త్రిబంధముల సాధనయే బల, అతిబల విద్యల యొక్క యోగ రహస్యము. (పేరా 1.4.2)

4. **"గయాన్ త్రాయతే ఇతి గాయత్రీ"** అని ఆదిశంకరులవారు తనభాష్యములో వివరించారు. 'గయలు' అనగా ప్రాణములు అని అర్థము. 'త్రాయతే' అనగా రక్షించడం. కనుక ప్రాణములను రక్షించే మంత్రం గాయత్రీ మంత్రం. గాయత్రీ మంత్ర సృష్టికర్త విశ్వామిత్రుడు. విశ్వామిత్రుడు శ్రీరామునితో అట్టి శక్తి ఉపాసనను చక్ర,

అస్త్రముల ద్వారా అభ్యాసము చేయించినాడు. ఇదియే చక్రములు, అస్త్రములు శ్రీరామునికి ఒసగుటలోని యోగ రహస్యము. వాల్మీకి మహర్షి యోగచక్రముల రహస్యములన్నింటిని రామాయణములో పొందుపరిచారు. వాటిలోనివే దండచక్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణు చక్రము, ఇంద్రచక్రము. దండ చక్రమనగా నియంత్రణకు చెందిన చక్రము, వ్యక్తి యొక్క పిండ రచన, తత్సంబంధమైన శక్తి కేంద్రము ధర్మ చక్రము, కాలగతి, తత్సంబంధమైన కూట శాస్త్రమును తెలిపేదే కాలచక్రము, విశ్వసృష్టికి ఆవశ్యకమైన దివ్య ప్రదిక్షణ గతి తెలిపేదే విష్ణు చక్రము (సమస్త బ్రహ్మాండాలు ఒక శక్తి కేంద్రముగా ప్రదక్షిణ చేయుచుండును. ఆ శక్తియే లలితా పరమేశ్వరి), దివ్య యోగ చక్ర జ్ఞానమే ఇంద్ర చక్రము. మానవునిలోని ఏడు చక్రముల (మూలాధారము, స్వాధిస్ఠానము, మణి పూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, సహస్త్రారములు) సాధనయే ఇంద్ర చక్ర జ్ఞానము. (పేరా 1.5.1)

5. జన్మించినపుడున్న తన సంస్కారములను బట్టి జీవాత్మ ఏ గుణ స్వభావుములతో కాలము గడుపుచుండునో అటువంటి సంస్కారయుక్తమైన శరీరము నందే అట్టి జీవాత్మ ప్రకృతి మాధ్యమములో ముందుకు సాగుచూ ఉండును. ఉన్నతి సాధించే సమయములో జీవాత్మ ఇంద్రియములు క్రిందకు లాగుచుండును. గౌతముడనగా ఇంద్రియములను తన వశములో ఉంచుకొని ఉత్కృష్టమైన అవస్థకు తీసుకొని వెళ్లెడి సాధకుడు. కాని ఆ సాధకుని యొక్క జీవాత్మ అంతగా ఉన్నత సంస్కారయుక్తము కానందున అటువంటి నిమ్న సంస్కారయుతమైన (అహల్య) శరీరము తన ఇంద్రియములను భోగసుఖములకే వినియోగించును. ఇదియే అహల్యా శాపము. ఉచ్ఛ సంస్కార విచారణ ద్వారా

అహల్య సుహల్య గా మారును. ఇదియే అహల్యా శాపవిమోచనం లోని యోగ రహస్యము. (పేరా 1.10.2)

6. కోదండధారి అయిన రాముడు ఎప్పుడు బ్రహ్మము యందే లక్ష్యము నుంచి బాణమును సంధించును. ప్రణవ సాధనయే ధనుస్సు. జీవాత్మయే బాణము. ఈ బాణము యొక్క లక్ష్యము బ్రహ్మము. ఇదియే శివధనుర్భంగము లోని యోగ రహస్యము (పేరా 1.11.2)

7. మానవుడు సత్యనిష్ఠుడైతే అదియే ధర్మమును కాపాడుతుంది. సత్యవాక్పరిపాలన, రాజధర్మము (ప్రజాభీష్టము) మధ్య తలెత్తిన ఘర్షణలో దశరధుడు రాజధర్మమునకే మొగ్గుచూపి సత్యవాక్పరిపాలన కాదనుకొన్నాడు. సత్యమును పాటించుటకు ఇష్టము లేక ధర్మమును దానికి తోడుగా నిలిపి సత్యమును ప్రక్కకు తొలగించాడు. రామపట్టాభిషేకమునకు అందరూ అంగీకరించినా, దీక్ష స్వీకరింపచేసినా పట్టాభిషేకము కాలేదు. కారణము విడదీయరాని సత్యధర్మములను విడదీయవలెనని, ధర్మముచే త్రోసి పుచ్చవచ్చునని ప్రయత్నించాడు. (పేరా 2.5)

8. వచనముపై ధృడ చిత్తము కలిగిన రఘుకులమునకు మచ్చ రాకూడదు. సత్య ధర్మములను సమ దృష్టితో చూడవలెను. ధర్మాచరణము వలన సత్య నిష్ఠ భంగమైనచో ధర్మమును వదిలి వేయుటలో దోషము లేదు. దండకారణ్యమనగా మేరు దండము. అరణ్యము లతలు, వృక్షములు, పొదలు మున్నగు వాటితో ఏ విధముగా దట్టముగా ఉండునో అదే విధముగా మేరు దండము మజ్జాతంతువులతో (నాడీసమూహముతో) నిండి ఉండును. అట్టి మేరు దండ రూప దండకారణ్యమున నవ-పంచమ (9 +5) యోగము ద్వారాసాధన చేయనిదే

ప్రగతి సాధ్యము కాదు. కైకేయి రాముని తీవ్రమైన సాధనకు ప్రయత్నించుటయే వరముల యొక్క అంతరంగము. (పేరా 2.6)

9. చిత్రకూటమనగా సాధన యందు అనుభవమైన అవస్థ. సాధన చేయు కాలము నందు సాధకుడు తన కనుల ముందు అనేకమైన భావ చిత్రములు (కూట చిత్రములు) కాంచు చుండును. ఈ కూట చిత్ర అవస్థయే చిత్రకూటము. ఇదియే చిత్రకూటమి యొక్క యోగ రహస్యము (పేరా 2.14.2)

10. రజోగుణ పూర్ణమగు మనస్సు శరీరములో ప్రవేశించగానే ఆత్మపై అధికారమును ప్రసరింప చేయును. అట్టి అసుర స్వభావంలో మొదటిది విరాధుడు. అప్రధృశ్యము అగు మనస్సే విరాధుడు. మనస్సును విషయములపై ప్రసరింపకుండా నిరోధించ వలెను. దీనినే చిత్త వృత్తి నిరోధ మని అందురు. యోగం ద్వారా చిత్త వృత్తిని నిరోధించినప్పుడు ద్రష్టగా ఉన్న జీవుడు తన మూల స్వరూపమైన పరమాత్మలో (జాగృతి కలిగి, సృష్టి స్థితి లయ కారకుడై) తానుంటాడు. నిరంతరం ఆ ప్రయాణంలో మనిషికి అనేక చిత్త, దైవిక శక్తులు కలిగి మనుషులలో ఆదర్శ పురుషుడుగా/స్త్రీ గా పరిణామం చెంది ఆరాధనా స్థాయి కలిగిన వ్యక్తులుగా తమ జీవితంలోనూ , ఆ తరువాత గానీ పూజింపబడతారు. ఇదియే విరాధ సంహారములోని యోగ రహస్యము (పేరా 3.1.2)

11. పంచవటి అనగా సాధనా క్షేత్రము నందు అనుభవమును పొందెడు పంచ ప్రాణ సాధన. పంచవటి అనగా పంచ ప్రాణములైన ప్రాణ, వ్యాన, ఉదాన, అపాన, సమాన సాధన. (పేరా 3.7)

12. రామలక్ష్మణులనే ఇరువురు వ్యక్తులు వేల మంది రాక్షసులను ఒక గంటా 12 నిమిషాల్లో సంహరించ గలరా! సాధకుని జీవాత్మరూప రాముడు, వివేక రూప లక్ష్మణుడు బలగముగా యున్నచో అంతఃకరణము నందు యున్న వేలకొలది

దుర్గుణ రూప రాక్షసులను సంహరించ వచ్చును. ఖర దూషణులు ఎవరు? "క్షర" ము నుండి "ఖర" శబ్దము ఉత్పన్నమయినది. సాధనలలో కలుగు అనుభవములలో మునిగి పోయినచో ఆధ్యాత్మిక ఉన్నతి కలుగదు. పాత అనుభవములు (ఖరము) వదలి వేసినచో సాధకునకు క్రొత్త అనుభవములు కల్గును. ప్రారంభ దశలో ఉన్న సాధకుడు ఆ అనుభవములు (క్షరము) వదిలి వేయుటకు ఇష్టపడడు. రామునిగా మారవలెనన్నచో తన యందున్న అనుభవములు వదలలేని గుణములను సంహరింపవలెను. అంతేకాకుండా లోకుల నుండి కలుగు దూషణములు కూడా వదిలి వేయాలి. సామాన్యముగా సాధకుడు దూషణములకు భయపడి తాను చేయు సాధనమును వదులును. దూషణములు వదిలి సాధనములో ముందుకు పోవాలి. ఇదియే ఖరదూషణుల వధలోని యోగ రహస్యము (పేరా 3.10.2)

13. **(రకారాఽఽదీని నామాని రామ త్రస్త స్య రావణ, రత్నాని చ రథా శ్చైవ త్రాసం సంజనయన్తి మే)** "ర" శబ్దమును ఉచ్చరించిన మాత్రముననే కష్టమును పొందువాడు మారీచుడు. "రామ" అను మంత్రము లో "ర", అ, మ" అనే అక్షరాలు ఉన్నాయి. "ర" అంటే అగ్ని, "అ" అంటే సూర్యుడు, "రా" అనగా జ్ఞానము, "మ" అంటే చంద్రుడు, మనస్సు. "రామ" అనే మంత్రములో లోకానికి మూలమైన మూడు శక్తులు ఉన్నాయి. అట్టి "రామ" శబ్దము లోని "ర" శబ్దము వినలేని వాడు మారీచుడు. సిద్ధుల మాయలో పడి జ్ఞాన మార్గము నుండి తప్పిన వాడు "మారీచుడు". అట్టివారు "మారీచులు, అకర్షకులు, ఆకర్షకులు". సీత వంటి పతివ్రత కూడా మోహితురాలై బంగారు జింక (మాయావి మారీచుని) ప్రాప్తికై వివేకము కల్గిన రామలక్ష్మణ సాధకులను ఇబ్బందులలో పడవైచును. వివేకము (లక్ష్మణుని) తో కూడిన రామసాధకుడు కూడా సీతా రూప ఇంద్రియ వృత్తి

ఆధీనములో పడి మారీచ రూప మాయతో వెనుక పరిగెత్తును. అయితే రామ సాధకుడు అటువంటి మాయను ఛేధించెను. ఇదియే మారీచ వధ లోని యోగ రహస్యము. (పేరా 3.13)

14. సాధన ప్రగతి నొందుచున్న కొలది, తత్ఫలితముగా సాధకుని శక్తి వృద్ధి యగును. శక్తితో పాటుగా గర్వము, అహంకారము అధికమై సాధకుడు అనవసరమైన భ్రమలలో తేలియాడును. లేదా తొందరపాటుతో అనావశ్యక కార్యము లందు తనకు ప్రాప్తించిన అవస్థను ఉపయోగించును. సంపాతి అవస్థ ఇటువంటిదే అయిన ఉచ్చ అవస్థ నుండి క్రిందికి పడిపోతూ సాధన యొక్క దక్షిణ (పూర్వపు) అవస్థకు చేరుట. సంపాతి, జటాయు నిశాకరముని (రాత్రి యందు సాధన చేయువారు) శిష్యులు. వీరిరువురు ఆకాశ మార్గములో (ధ్యాన మార్గము ద్వారా) స్వర్గలోకమునకు ఏగిరి. స్వర్గము అనగా సమాధి. లోకము అనగా అవస్థ. స్వర్గలోకమనగా సమాధి అవస్థను ప్రాప్తించుకొని ఇంద్రియములను జయించుట. ఈ అవస్థయే శూన్య అవస్థ. స్వర్గ నరకములు మనస్సు యొక్క అవస్థలు. శరీరభావము అధిగమించిన (సమాధి) ప్రగతిశీల అవస్థయే స్వర్గలోకము. ఇంద్రియ శక్తుల ద్వారా ప్రగతి నిరోధక వృత్తిని సంహరించుట, ఆకాశ మార్గమున (ధ్యాన మార్గమున) సమాధి అవస్థకు చేరి, అచట నుండి సూర్య ప్రకాశము లేదా జ్ఞానము/బ్రహ్మ జ్ఞానము ప్రాప్తించుకోవాలి అనే కోరికతో తీవ్ర సాధనలో భరించలేని తాపము పొంది, మిగిలియున్న అహంకారము కారణంగా క్రింది అవస్థకు పడిపోవుట జరుగును. అదియే సాధన యొక్క దక్షిణ అవస్థ లేక దక్షిణాయనము. ఇదియే సంపాతి కథ యందలి యోగ రహస్యము (పేరా 4.16)

15. నిర్వికల్ప సమాధి యందు నిరాలంబ, నిర్గుణ, శూన్య అవస్థ తారసబడును. ఆ అవస్థ ఎవరికీ చెందినది కాదు. ఒకరు మరొకరిని ధారణ చేసినది కాదు.

అంతయు శూన్యము. నిరాలంబము, అవస్థ కాని అవస్థ. అటువంటి అవస్థయే కిష్కింధ.

**దుందుభి:** దుందుభి అనగా డోలు లేదా నగారా. శూన్య (సమాధి) అవస్థకు పోవునప్పుడు సాధకుడు అనాహత నాదములు వినును. కానీ పరమోచ్చ శూన్య అవస్థ ఈ అనాహత నాదముల కన్నా ఉత్కృష్టమైనది. దుందుభి సంహారమునకై బిలమునందు ప్రవేశించి ఒక సంవత్సర కాలము ఉండెను. అటువంటి చిన్నబిలము (రంధ్రము) నందు దుందుభి, వాలి వంటి విశాల కాయులు ప్రవేశించుట సాధ్యమా? గహన యోగ సాధన యందు ఉచ్చ సాధకునకు ఈ బిలము యొక్క అనుభవము కల్గును. ఈ బిలమే ఇడ, పింగళ మధ్య ఉన్న సుషుమ్నానాడి. సాధకుడు తన చిత్తము ద్వారా సుషుమ్నానాడిలో చరించు చున్నప్పుడు బాహ్యమునందున్న సమయము స్ఫురించదు. సమాధి అవస్థ యందున్న అట్టి సాధకుడు కాలాతీతుడు. మేరుదండమునందున్న అతి సూక్ష్మమైన సుషుమ్నానాడియే వాలి జొరబడిన బిలం. ఈ బిలం నందు ప్రవేశించినప్పుడు దుందుభి నాదము శాంత మగును. శాంతబడిన సుషుమ్న రూప బిలమున వాలి ఒక సంవత్సర కాలము దేహ భావమునకు అతీతుడగును. కాని సమాధి అవస్థకు బయిట నున్న సుగ్రీవునకు సాధారణ భావమున ఒక సంవత్సరమయ్యెను.

వానరులందరూ ఏకత్రితమై సీతా శోధనము హనుమానుని ద్వారానే జరుగ వలెనని నిశ్చయించిరి. హనుమానుడు మనస్సులో లంకను స్మరించుకొనెను. లంక అనగా మాయ. కామిని, కాంచనము మరియు కీర్తి - ఈ మూడింటి ప్రదేశము లంక. లంక చుట్టును సముద్రము యున్నది. సముద్రము అనగా సంసారము. లంక సంసారము మధ్యలో చిక్కు కొని యున్నది. (పేరా 4.17)

16. రాక్షసి తన నోరును శతయోజనములు పెంచినదియట. మానవుని శరీరము అందునా నోరు శతయోజనముల యంతటి పెద్దదిగా యుండునా? వివేకము భ్రష్టమైనప్పుడు మానవుడు తన దుర్గుణములు తద్వారా వాని అధఃపతనము శత విధముల/శతముఖముల జరుగును. కాని సాధకుడు అహంకార రహితుడై అణువంత చిన్న వాడైనచో అటువంటి వాని ముక్తి జరుగును. సిద్ధుల యొక్క మాయ శత యోజనముల యంత పెద్దదిగా యుండి మహాసాధకులను కూడా మ్రింగి వేయును. అందుచే బుద్ధిమంతుడైన హనుమ అట్టి మాయ నుండి ముక్తమగుటకై నమ్రతతో సూక్ష్మ రూపుడై తనకు ప్రాప్తించిన సిద్ధులన్నియు పరమాత్మకు సమర్పించును. సూక్ష్మ శరీరము ద్వారా తనలోని అహంకారమును హనుమ వదిలెను. ఇదియే సురసా రాక్షసి యందలి యోగ రహస్యము (పేరా 5.4.2)

17. ఆధ్యాత్మిక మార్గములో పయనించువాడు విహిత కర్మలను ఆచరించవలెను. నిషిద్ధ కర్మలను పరిత్యజించి వలెను. శాస్త్రములో చెప్పని కర్మలను ఆచరించిన యడల అవి మనలను హింసించును. కావున అవి "సింహిక" అనబడును. సింహిక అనగా హింసించునది. నిషిద్ధ కర్మకు మనమెట్లు వశమగుదమో మనకే తెలియదు. చేయకూడదని తెలిసియు, చేయవలదను కొనుచునే దానికి వశమగుదుము. అట్టి కర్మలు తెలియకుండా ఆక్రమించుట - సింహిక నీడను బట్టి లాగుట. అందుకనే సురసను చంపకుండా వదిలిన హనుమ సింహికను చంపెను. (పేరా 5.5)

18. సముద్ర లంఘనమున హనుమ చేసిన నాలుగు దుష్కర కార్యములు . అవి - నూరు యోజనముల సముద్రమును దాటి సీత జాడ కనుక్కొని వెనకకు రాగలనని సంకల్పించుకొనుట, మైనాకుని సగౌరవ విశ్రాంతిని సున్నితముగా తిరస్కరించుట, సురసను జయించుట మరియు సింహికను చంపుట. ఈ

నాలుగు నాలుగు లక్షణములు. 1 ధృతి: సర్వ వ్యాపారములను ఆత్మోన్ముఖం చేయుట, 2 దృష్టి: దేనిని పొందవలెనో దాని యందే దృష్టి తప్ప ఇతరములపై ఉండకుండుట. 3 మతి: ఆచరించ వలసిన కర్మలను ఆచరించుతూ బంధనమున పడకుండా "ఆత్మస్వరూప జ్ఞానము" ఉండుట. 4 దాక్ష్యము: నిషిద్ధకర్మ త్యాగము. ఇట్లు హనుమ ఈ నాలుగు లక్షణములతో సముద్రమును లంఘించినట్లే ఆధ్యాత్మిక మార్గములో పయనించువారు ముందుకు సాగుటకు ఈ నాలుగు ఆవశ్యకములు అని ఈ వృత్తాంతము సూచించును. (పేరా 5.6)

19. హనుమకు సీత జాడ కానరాక నిర్వేదము చెంది ఆత్మత్యాగమునకు సిద్ధపడెను. అప్పుడు హనుమ మరల తెలివి తెచ్చుకొని చనిపోయినచో ఎన్నో దోషములు సంభవించును. బ్రతికి యుండిన సుఖములు బడియ వచ్చును. అందువలన ప్రాణములు ధరించి యుందును అని నిశ్చయించుకొని దేవతా ప్రార్ధన చేసెను. అటులనే సీతమ్మ కూడా రావణుడి క్రూరమైన మాటలకు బెదరినదై ఆత్మ త్యాగమునకు సిద్ధపడగా ఆమెకు శుభశకునములు కనపడెను. జీవించియున్న మానవునికి నూరేండ్లకైనను ఆనందము కల్గును అని ఆలోచించి ఆ ప్రయత్నమును మానుకొనెను. రావణ సంహారము తర్వాత భరతుడు శ్రీరాముని క్షేమ వార్త తెలిసికొనినప్పుడు భరతుడు కూడా ఇదే విషయము చెప్పెను. కావున మానవుల విషయములో ఈ విషయము సర్వకాల సత్యము అని నిరూపిత మయినది. (పేరా 5.8)

20. హనుమ శత్రువులను చంపుట అను కార్యము చేయువాడను తాను కాదనియు, ఆ కర్మ తనది కాదనియు, దాని వలన కలుగు కష్టనష్టములు తనివి కాదనియు భావించుతూ, అహంకారమును వీడి హనుమ కర్మ చేసెను. నేను స్వతంత్రుడను అనుకొనుట, తనను తాను రక్షించుకోగలను అనుకొనుట, తాను

చేయు కర్మలు తనకొరకు అనుకొనుట. ఈ మూడింటిని జయించుటయే విరోధి విజయము. హనుమ అట్టి కార్యమును చేసెను. (పేరా 5.18)

21. హనుమ లంకను కాల్చి అందు సీతమ్మ కూడా ఆహుతి అయినది అనే సందేహముతో కోపము సర్వ వినాశనమును కలిగించునని చింతించెను. వచ్చిన కోపమును బుద్ధితో నీటితో నిప్పును చల్లార్చినట్లు ఎవరు నిరోధించుకొందురో వారు ధన్యులు అని ఆలోచన చేయును. ఇందు వాల్మీకి మహర్షి హనుమ కార్యము ద్వారా కోపమును వర్జించవలెనని చెప్పు చున్నారు. (పేరా 5.23)

22. నియమించిన కార్యమును చక్కగా నెరవేర్చుకొని వచ్చినప్పుడు ప్రభువు ఎట్లు ప్రవర్తించ వలెనో వాల్మీకి శ్రీరాముని ద్వారా లోకమునకు తెలియ చేయుచున్నాడు. గురువులను ప్రత్యక్షంగా స్తోత్రము చేయవలెను. మిత్రులను, బంధువులను పరోక్షంలో స్తుతించవలెను. దాసులను, భృత్యులను నియమించిన పని పూర్తి చేసిన వెంటనే ప్రశంసింప వలెను. పుత్రులను ఎన్నటికీ బైటికి ప్రశంసింప రాదు. మనసులోనే అభినందించు కొన వలెను. (పేరా 6.1)

23. సాగరము దుస్తరమైన సంసార రూప సాగరము. అటువంటి సాగరమును దాటి లంకకు పోయి సీతను వెతికి, తిరిగి వచ్చునప్పుడు నియంత్రణలో యున్న ఆ లంకను హనుమాన్ సాధకుడు దహనము గావించెను. అనగా మాయను దహింప చేసెను. సాగరమనగా దుర్గుణములతో కూడిన భవసాగరము. అదియే సంసార సాగరము. లేదా సంసారము. రావణాది రాక్షసులు అనగా చెడ్డ వృత్తులు. వీటిని సాధకుడు సంహరింప వలెను. రాముడు సీతా శోకమును నియంత్రణలో పెట్టుకోలేక పోయెను. శ్రీరాముడు వాల్మీకిచే రూపొందించబడిన ఆదర్శ పురుషుడు. పూర్వపు అనుభూతులు ప్రాప్తించక పోయినచో సాధకుడు గాబరా చెందును. ఈ సీతా శోకమున యున్న యోగ రహస్యము ఇదియే. (పేరా 6.3)

24. రావణుడు అహంకారంతో కూడిన, వివేకము లేని సాధకుడు. పరస్త్రీ అనగా సాధకుడు తన వృత్తిని లేదా ధర్మమును విడచి పరవృత్తిని స్వీకరించుట. రావణునికి మండోదరి వృత్తి స్వధర్మము. సీతావృత్తి పరధర్మము. సీతావృత్తిని బలాత్కారముగా గ్రహించినచో, రావణ ధర్మము విఘటనము చెంది నూరు ముక్కలగునని ఆంతర్యము. తన ధర్మము ననుసరించియే సాధన చేయవలయును. పరధర్మ సేవన చేసినచో సాధకుడు నూరు భాగములై అధఃపతనము చెందును. (పేరా 6.11)

35. భగవంతుని చేరడానికి ముఖ్యమైన అడ్డంకి అహంభావం. ఆ అహంకారాన్ని వీడి శరణు వేడితే ఆ భగవంతుడే దిగివచ్చి, భక్తుని వశమౌతాడు. సంపూర్ణ శరణాగతి పొందడమే ఆయన్ని చేరే సూటిమార్గం . శరణాగతికి పూర్తి నమ్మకము, విశ్వాసము ముఖ్యము. అట్టి నమ్మకము కలిగిన రాయి, రప్ప, చెట్టు, చేమ అన్నియు భగవత్ స్వరూపములో శరణాగతి చేయగలవు. (పేరా 6.13)

25. సేతు నిర్మాణములోని యోగ రహస్యము: సాగరము అనగా ఇది భవ సాగరము.  ధ్యాన మార్గము ద్వారా సాధించుటకై రాముడు దక్షిణ సాగర తీరము నందు కుశాసనముపై ఆసీనుడై మూడు దినములు, మూడు రాత్రుళ్ళు గహన ధ్యాన సమాధి అవస్థ యందు గడిపెను.పట్టువదలని ప్రయత్నముచే చివరకు రాముని మనస్సు శాంతించి సమాధి అవస్థను పొందెను. అయినను సంసార రూప సాగరమును దాటలేక పోయెను. అప్పుడు ప్రణవ రూప ధనుస్సులో ఆత్మరూప శరమును ఎక్కుపెట్టి బ్రహ్మరూప లక్ష్యముపై గురిపెట్టగా  సంసార రూప సాగరము భీతి నొంది రాముని చరణములపై పడెను. అప్పుడు సాధనా రూప రాళ్ళ ద్వారా వారధి కట్టి సంసార రూప సాగరమును దాటవలెనని, తన వృత్తి రూప వానరులను సేతువుపై నడిపి మాయారూప లంకలో నివసించెడి కామ, క్రోధ, లోభ, మోహ,

మధ, మాత్సర్యాది రాక్షసులను సంహరించవలెనని రాముడు తలచెను. (పేరా 6.21)

26. నాగపాశమనగా కుండలిని జాగృత్త అవస్థ. నాగపాశమున పుట్టిన విషమువలె కుండలిని జాగృత్త ఆ సమయమున అత్యంత తాపము ఉత్పన్నమగును. కుండలిని జాగృతము తర్వాత సాధకుని శరీరము, మనస్సు శుద్ధమై బలవర్ధకమగును. అందుండి సాధకునకు ఉత్కృష్ణ జ్ఞానము ప్రాప్తించును. ఆ అవస్థ నుండి మరింత పురోగతి సాధించుటకై ఉన్నతమైన వాయుతత్వ అవస్థమును పొందాలి. ఈ వాయుతత్వ అవస్థకు చిహ్నము గరుత్మంతుడు. (పేరా 6.28)

27. స్పందన లేని శూన్య అవస్థకు "అగస్త్యుడు" అని పేరు. సంసారమును సాగరముతో పోల్చినారు. అలాంటి సాగరమును ఒకే ఆచమనముతో త్రాగినాడు. అటువంటి పరాక్రముడు, పురుషార్థి అగస్త్య మహర్షి. అగస్త్య నక్షత్రము సూర్యుని కంటే 50 లక్షల రెట్ల పెద్దదని, అది ఒక డిగ్రీలో పదోభాగము భూమికి దగ్గరగా వచ్చినా సముద్రాలు ఆవిరై ఇగిరి పోతాయని చెప్పారు. దీనిని బట్టి అగస్త్యుడు సముద్రాల్ని త్రాగాడని భావము. (పేరా 6.49)

28. రావణాసురుడు, అతని కొడుకుల అధర్మవర్తన వలన రావణాసురుని ప్రేత సంస్కారము చేయడానికి ఒక్క కొడుకు గూడ మిగిలి లేడు. అతని వంశము మొత్తము సర్వ నాశనము అయ్యినది. కావున తండ్రి ధర్మవర్తనతో పిల్లలకు మార్గదర్శనం చేయవలసి యున్నది. (పేరా 6.52)

# ఉపోద్ఘాతము

## A.1.1 యోగసూత్రములు

ఈ సృష్టిలో చైతన్యము తప్ప వేరొకటి లేదు. ఆత్మయే చైతన్య రూపముగా భాసిస్తున్నది గాని నిజానికి దైవము మరియు వాటి రూపములు లేవు. ఆత్మ యందు స్థితుడై ఉన్న మానవుడు సాక్షాత్తు భవంతుడే. ఇట్టి ఆత్మ స్థితిని పొందడానికి యోగ మార్గము ఒక్కటే తరుణోపాయం అని వశిష్ఠ మహర్షి చెపుతారు. ఇట్టి యోగ విజ్ఞానము అనాది కాలం నుంచి (వేద కాలము నుంచి) అవ్విచ్ఛిన్నంగా వస్తున్నది. ఇట్టి విజ్ఞానాన్ని విపులంగా గ్రందీకరించినవారు పతంజలి మహర్షి. ఈ విషయాలు పతంజలి యోగసూత్రాలు ద్వారా గ్రహించవచ్చు. **అట్టి యోగ మార్గాన్ని అనుసరించిన మహాపురుషుడు శ్రీరాముడు.** పతంజలిరచించిన యోగసూత్రములలో మొత్తం 195 సూత్రములున్నాయి; నాలుగు పాదములుగా విభజింపబడినవి. అవి క్రమముగ: సమాధి, సాధన, విభూతి, కైవల్యపాదములు. ప్రథమపాదమున యోగము యొక్క ఉద్దేశము, లక్షణము, వృత్తుల లక్షణము, యోగోపాయములు, యోగభేదములను వర్ణింపబడింది. రెండవపాదమున క్రియాయోగము, క్లేశములు, కర్మవిపాకము, దాని దుఃఖస్వరూపము, చతుర్వ్యూహములు వర్ణిపబడినవి. తృతీయపాదమున, అంతరంగ-అంగములు, పరిణామములు, సంయమ భేదములు, విభూతి, వివేకజ్ఞానములుప్రస్తావింపబడినవి. నాల్గవపాదమున ముక్తి యోగ్యమగు చిత్తము, పరలోకసిద్ధి, బాహ్యార్థసిద్ధి, ఆత్మసిద్ధి, జీవన్ముక్తి, విదేహకైవల్యము ప్రసంగింపబడినవి.

## A.1.2 సమాధిపాదము

సాధకుడు తన గృహస్థ, సామాజికధర్మాలు నిర్వర్తించుకున్నతరవాత సమాధి పొందడానికి యోగ్యుడైన గురువును ఎంచుకుని, ఆ గురువు శిక్షణలో యోగవిద్య

ప్రారంభిస్తాడు. పతంజలిమహర్షి “ఇప్పుడుయోగాభ్యాసంగురించి” తెలుసుకో అంటూ ప్రారంభిస్తారు. మానవ వృత్తిలో చిత్తవృత్తులు ఒక భాగం. పతంజలి ఐదు చిత్త వృత్తులను గుర్తించి వాటిని యోగ సాధనకి అనుగుణంగా ఏవిధంగా మలుచుకో వలసి ఉందో వివరించారు. మూడవ సూత్రంలో చెప్పిన **“చిత్తవృత్తినిరోధః”**[1] అంటే చిత్తవృత్తులను ఆపడంకానీ అణిచిపెట్టడంకానీ కాదని ఆ చిత్తవృత్తులను యోగసాధనకి అనుకూలంగా మలుచుకునే విధానం. అనూచానంగా ప్రసిద్ధమైన జ్ఞానాన్ని గ్రహించడం, స్వయంగా వితర్కించుకుని సత్యాసత్యాలను గమనించడంతో సాధనమొదలవుతుంది. ప్రాపంచిక విషయాలలో వైముఖ్యం ప్రయత్నం వల్ల సాధ్యం కాగలదు. సాధనలో వేగిరపాటు తగదు. అవిరళంగా పటుతర నిష్ఠతో బహుకాలం సాగించవలసిఉంటుంది.

సాధన కొనసాగించడానికి వ్యాధి, అలసత, అస్థిమితం వంటి అవరోధాలు కలుగుతాయి. అవిదుఃఖం, ఆందోళన, వణుకు వంటి బాహ్య రూపాలలో గోచరిస్తాయి. మైత్రీ, కరుణ, సాధుత్వం, ఉపేక్ష వంటి సుగుణాలను పెంపొందించుకోడంద్వారా పై అవరోధాలను అధిగమించి యోగసాధనకి అవసరమైన ప్రశాంతత పొందవచ్చు. చిత్త స్థైర్యం సాధించడానికి కొన్ని పద్ధతులు సూచించారు పతంజలి. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు క్రమబద్ధం చేయడం (ప్రాణాయామం), ముక్కు, చెవి వంటి ఇంద్రియ ప్రవృత్తుల మీద తదేక దృష్టితో ధ్యానించడం ద్వారా కూడా ప్రశాంతత చేకూరుతుంది. ఈప్రయత్నాలన్నిటిలోనూ అంతర్గత భావం ఇతర విషయాల నుండి చిత్తమును యోగం వైపు మళ్ళించడం, యోగం మీద దృష్టిని సుస్థిరంగా నిలపడం. వైరాగ్యం అంటే భౌతిక విషయాలలో ఆసక్తిని నిరోధించడం. వ్యక్తి తాను ఏవిషయాలలో అనురక్తుడో గుర్తించి ఆ అనురక్తిని నిర్మూలించడమే వైరాగ్యం. అభ్యాసంతో ఈ వైరాగ్యం సాధించాలి

---

[1] చిత్త వృత్తి నిరోధము గురించి అరణ్య కాండ లో పూర్తి వివరణ ఈయడము జరిగినది

అంటారు పతంజలి మహర్షి. సాధకుడు దృశ్యమాన ప్రపంచంలో తన అనుభవాలతో మమైక్యం కావడం క్లేశములకు హేతువు. ఆ భావాన్ని ఉపసంహరించుకోవాలి .వస్తువు, శబ్దము, అర్థము ఒకటే కావని గుర్తించి, వీటికి అతీతుడయిన పరమ పురుషుని యందు చిత్తమును నిలపడం కోసం సాధన చేయాలి. ఇలా సాధన చేస్తే సాధకుడికి పిపీలికాది బ్రహ్మపర్యంతం సమస్తమూ స్వాధీనమవుతాయి. నిర్మలచిత్తము భగవంతుని యందు సుస్థిరముగానిలిపితే, స్వచ్ఛమైన మణివలె ఆ భగవంతుని ప్రతిఫలింపగల శక్తిని పొందుతుంది. పూర్వజన్మలలో చేసిన సాధన స్మృతులుగా (వాసనలు) తరవాతి జన్మలలో కొనసాగుతాయి.ఆపూర్వ వాసనలు, సాధనలో ఏకాగ్రత, దృఢత – ఇవి ఎంతబలంగా ఉంటే అంత త్వరగా సమాధి స్థితిని చేరుకోగలడు. తర్కం, నిశిత పరిశీలన, పరంపరానుగతంగా పొందిన జ్ఞానం సమాధికి మార్గాలు. సాధనకి అనేకమార్గాలు ఉన్నాయి. ఏపద్ధతిని సాధకుడు ఎంచుకున్నా, శ్రద్ధతో తదేక ధ్యానంతో చేస్తే శారీరకంగానూ, మానసికంగానూ దృఢత్వం కలుగుతుంది. ఈవిధంగా చేసిన సాధన మూలంగా సమాధిస్థితిలో ఒకస్థాయికి చేరుతాడు. అది సబీజసమాధి. ఆ బీజాన్ని కూడా తొలగించుకోడానికి సాధన కొనసాగించాలి. సమాధి అంటే పరమ పురుషునిలో ఐక్యముకావడం. ఆ పరమపురుషుడు కాలానికి అతీతుడు. గురువులందరికీ గురువు. ఆ పరమ పురుషుని చిహ్నం ఓంకారం. ఓంకారము జపించడం సమాధికి మార్గం.

### A.1.3 సాధన

సాధన ద్వారా సాధకుడికి సమస్త వస్తువులూ స్వాధీనమవుతాయి. సమాపత్తి సాధిస్తాడు. సమాపత్తి అంటే వస్తువు, శబ్దము (వస్తువుకి మానవుడు ఇచ్చుకున్నపేరు), అర్థము – ఈ మూడింటిని గూర్చిన అవగాహన పొందినప్పటి స్థితి. ఇది పరమ పురుషుని గురించిన అవగాహనలో తార్కికమైన వివరణ.ఆ

తార్కిక వివరణ, అవగాహన స్థితిని అధిగమించడానికి సాధనకొనసాగించాలి. తాను సమాధి పొందాను అన్న స్పృహ కూడా నశించిన తరవాత పొందిన సమాధి స్థితిని నిర్బీజ సమాధి అంటారు. ఇంత వరకూ చెప్పినది సాధనకి వివరణలో పూర్వ భాగం.ఉత్తర భాగంలోసాధన ఆచరణలో ఎలా ఉంటుందో వివరించారు.

## A.1.4 సాధనపాదము

ఇది మూడు భాగాలుగా సాగుతుంది. అవి తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరుని యందు మనసును సంపూర్ణంగా నిలపడం. అష్టాంగాలుగా చెప్పుకుంటున్న ఈక్రియా విశేషాలలో మొదటి రెండూ యమనియమాలు. ఇవి మళ్ళీ ఐదు ఉపభాగాలుగా వర్ణించారు. యమంలో వివరించిన సత్యపాలన, అహింస, చోరగుణం నిరసించడం, పరుల సొమ్ము స్వీకరించ నిరాకరించడం వంటివి నిత్యవ్యవహారంలో కూడా చూస్తాం. అలాగే నియమంలో క్రమశిక్షణ యొక్కప్రాధాన్యత కనిపిస్తుంది. రాగద్వేషాలు, అహమిక, అభినివేశాలకి అవిద్య మూలకారణం. నిరంతరయోగ సాధనతో ఈ నాలుగు క్లేశములను జయించవచ్చు. ప్రజ్ఞావంతులు సైతం రాగద్వేషాలకీ, అహంభావానికీ అతీతులుకారు .క్లేశాలకు మూలకారణాలు తెలుసుకొని, వాటి ప్రభావం నుండి తప్పుకుని సాధన కొనసాగిస్తే సమాధి పొందగలరు. ఒక జన్మలో ఆచరించిన కర్మలు మరుజన్మలో రాగద్వేషాలు, అహమిక, అభినివేశాల వంటి క్లేశములకు కారణమవుతాయి. తిరిగి ఆక్లేశముల మూలంగా కర్మలు ఆచరిస్తారు. ఆవిధంగా కర్మలు, క్లేశములు ఒకదానికొకటి కారణమవుతూ మళ్ళీమళ్ళీ పుట్టడానికి కారణమవుతాయి. అలా పునర్జన్మలకి కారణమయిన క్లేశములను, కర్మలనూ నివర్తించి సమాధి ధ్యేయంగా సాధన కొనసాగించాలి. సత్వతమోరజోగుణాల మూలంగా వివిధ అనుభవాలకు సాధకుడు లోనవుతాడు. వివేకవంతుడు ఆవిషయం గ్రహించి, వాటిని అధిగమించడానికి ప్రయత్నిస్తాడు. ధారణ, ధ్యానం, సమాధి – అచంచల దీక్షతో కొనసాగించిన సాధకునికి అలౌకికమైన శక్తులు సిద్ధిస్తాయి. ఎదటివారి చిత్తము

గ్రహించడం, ఎదటివారికి అగోచరము కావడం, నీటి మీద నడవడం వంటివి. అయితే సాధకునికి ఈ శక్తులే పరమావధి కారాదు. ఆ శక్తుల ప్రభావాలకు లోనుకాకుండా, వాటిని కూడా నిరోధించి, యోగం కొనసాగిస్తేనే పరమపురుషునిలో లీన మవడం జరుగుతుంది.

### A.1.5 విభూతిపాదము

సాధన, సమాధి పాదాలలో వివరించిన మార్గాలు అనుసరిస్తూ సాధన చేసిన తరవాతి స్థాయి విభూతి స్థాయి.విభూతి పాదంలో సంయమనం అంటే ఏమిటో, అదిఎలా చెయ్యాలో, తద్వారా సాధకుడు ఏమిసాధించగలడో వివరించడం జరిగింది. సూక్ష్మంగా, ఒకవస్తువుపై దృష్టి కేంద్రీకరించడం ధారణ. ధారణ నిరవధికంగా కొనసాగించడం ధ్యానం. ధారణ, ధ్యానం ద్వారా మనోలయము (విభూతి) చేయడానికి కృషిచేయాలి. పతంజలి వరుస క్రమంలో ఏ అంశం మీద సంయమం చేస్తే ఏ శక్తి పొందగలడో వివరించారు. అయితే అతీంద్రయ శక్తులే (సిద్ధశక్తులు) సాధకునికి ధ్యేయం కారాదు. సాధకుడు వాటిని కూడా ముక్తికి అవరోధాలుగానే గుర్తించి, నిరోధించి, ముక్తికోసం ధ్యానం కొనసాగించాలి అంటాడు పతంజలి.

### A.1.6 కైవల్యపాదము

ముందు పాదాలలో వివరించిన విధంగా సాధన కొనసాగించి సమాధి స్థితికి చేరే వరకు గల పరిణామ స్థితిని వివరించారు. కైవల్యపాదంలో.- పాపపుణ్యాలు, కర్మఫలితాలు, క్లేశములు పూర్వజన్మ వాసనలు మరుజన్మలోఎలా పునరావృత్తమవుతాయి, సాధకుడు వాటిని గురించిన అవగాహన పెంపొందించుకుని, ముక్తిమార్గాన్ని అనుసరించడానికి ఏమిచేయాలి అన్న విషయం వివరించడంతో ఈ పాదముముగుస్తుంది.

## A.2 పతంజలి యోగ సూత్రములు (అష్టాంగయోగము)

**యమము:** అహింస, సత్యవచనము, బ్రహ్మచర్యము, పాపరహితము, పరుల వస్తువులను ఆశించకుండుట, ఈ ఐదు వ్రతములు యమము. బ్రహ్మచర్యము, దయ, క్షాంతి (క్షమ), ధ్యానము, సత్యము, పాపరహితస్థితి, అహింస, అస్తేయము, మాధుర్యము, దమము ఇవి యమమని చెబుతుంది.

**నియమము:** శౌచం, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము నియమములు అని వేదాంత సారం చెబుతుంది. తపము, సంతోషము, అస్తిక్యము, దానము, దేవతాపూజ, సిద్ధాంతము,
శ్రవణము, మనో నిగ్రహము జపము, అగ్నికర్మ (హోమము) ఇవి నియమములని తంత్రసారము చెబుతున్నది.

**ఆసనం:** ఆసనం అంటె యిప్పుడు భౌతికమైన హలాసనం, గరుడాసనం, శీర్షాసనం వంటి అనేక యోగాసనాలుగా పొరబడ్డారు. నిజానికి ఈ ఆసనాలన్నీ యమ, నియమ, స్థాయిలోనే సాధకునిచే సాధనచేయిస్తారు. నిజానికి పతంజలి చెప్పిన "ఆసనం" అంటే మనస్సును ఆత్మతో సంధానం చేసి స్థిరంగా ఉండటం. దీనినే "స్థిరసుఖాసనం" అన్నారు. ఆసనం అష్టాంగ యోగం మూడవ అంగము. ఐదు విధములైన కరచరణస్థానములను నిర్దేశించేది. **"పద్మాసనం స్వస్తికాఖ్యంభద్రం వజ్రాసనం తదా వీరాసన మితిప్రోక్తం క్రమాదాసన పంచకమ్"(భాగవతం)**

**ప్రాణాయామం:** శరీర స్పందనలన్నింటినీ క్రమబద్ధీకరించడమే ప్రాణాయామం. ప్రాణాయామము వలన దేహదోషాలు, ధారణ వలన చేసిన పాపాలు అపరాధాలు, ప్రత్యాహారము వలన సంసర్గతా (సాంగత్య) దోషాలు, ధ్యానము వలన అనీశ్వరగుణాలు తొలగుతాయి. ప్రణవం (ఓంకారం) తో ముమ్మారు ప్రాణాయామం (పూరక,కుంభక,రేచకాలతో) చేయాలి. ప్రాణాయామం అనేక రకాలు. అందు ముఖ్యమైనవి అష్ట కుంభకాలు. పూరక, కుంభక, రేచకాలు 1:4:2 నిష్పత్తిలో చేయాలి.

**ప్రత్యాహారం:** ఇంద్రియ జనితములైన బాహ్య ప్రపంచ శబ్దములు దృశ్యముల నుండి దృష్టిని గ్రహించి అంతరంగముపై చింతించుట ప్రత్యాహారము.

**ధారణ:** ధారణ అంటే బ్రహ్మమును (ఈశ్వరుడు అనుకోవచ్చు) హృదయ పద్మములో ధరించుట. ఇదిమనోస్థితి. •ధ్యానం బ్రహ్మ ఆత్మల గురించిన చింత .ఇది సాధన. (ప్రగతితోకూడినగతి) .గమ్యం సమాధి.

అహంబ్రహ్మతత్త్వం అనుభవం లోనికి వచ్చే స్థితి.

**ధ్యానము:** ధ్యేయ వస్తువుపై మనసును లగ్నముచేసి, అన్య పదార్థములను గమనించక, నిశ్చలమైన మనసుతో (చిత్తములో) ధ్యేయ వస్తువైన ఈశ్వరుని గురించిన చింతలో ఉండుటయే ధ్యానము. సాధనా పూర్వకముగా పొందిన ద్వైత రహిత స్థితి సమాధి. (జీవుని ఈశ్వరుని వేరుగా భావించుట ద్వైతము, వానిని ఒకే వస్తువుగా అనుభవైంచుట అద్వైతసిద్ధి, అదేసమాధిస్థితి.

**సమాధి:** నిత్యమూ శుద్ధమైన బుద్ధితో కూడి, సత్యమైన ఆనందముతో కూడిన తురీయ (మెలకువ, నిద్ర, స్వప్నస్థితులకు అతీతమైన) స్థితిలో ఏకము, అక్షరము (శాశ్వతము) ఐన నేనుఉన్నాను (అహమస్మి) అనే బ్రహ్మభావనలో అహంబ్రహ్మాస్మి (నేనేఆబ్రహ్మమును) అనే ఎరుక కలిగి యుండు అవస్థయే సమాధి.

పై సూత్రాలలో మొదటి నాలుగు విభాగాలు యిప్పుడిప్పుడే కొంత అవగాహనకు వచ్చి దీని పట్ల ఆకర్షితులవుతున్నారు. ఆతరువాత చెప్పబడే నాలుగు అధ్యాయాలూ మేధస్సుకు అందనివి. ఆమాట కొస్తే ఆధునిక భారతీయులలో కూడా చాలామందికి తెలియనివి.

ఇలా అనేకానేక యోగరహస్యాలన్నిటినీ పతంజలి తనయోగసూత్రములలో పొందుపరిచాడు. ఈగ్రంథములోని విషయాలు నిత్యజీవితంలో ఆచరించి

అనుభూతి చెందవలసినవే గాని కేవలం చదవడం వలన తెలియవచ్చేది తక్కువే అనిచెప్పవచ్చు.

యోగా వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి సప్త జ్ఞాన భూమికాలైన శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్వాపత్తి, అసంసక్తి, పదార్థ భావని, తుర్యగ లను వివరించుతూ.... రామా! ఈ ఏడు జ్ఞాన భూమికలకు అతీతమైన స్థితిని తుర్యాతీత స్థితి అంటారు. ఎవరు ఈ భూమికను పొందుతారో వారు 'ఆత్మారాములు' అట్టివారు బ్రహ్మ పదవిని పొందినవారే. జ్ఞాన భూమికలు యందు నిష్ఠులైన వారికి పరబ్రహ్మపదము కరతలామలకం. 'నేను, పరుడు' అను బేధ భావంకలిగినప్పుడు 'ఇది ఉన్నది, అది లేదు' అను భావము ఉదయించును. ఆ భావాభావములు లేనప్పుడు సర్వమగు బ్రహ్మ పదము సిద్ధించును. అది సర్వాత్మకము, ప్రశాంతము, నిరాలంబము, వ్యోమస్తము అయి ఉండును. ఇంకను శాశ్వతము, శివము, ననామయము అయి భాసించును. అయినను అనాభాసము, ననాత్మకమునై, కారణ రహితమై, ఆదిమధ్యాంత రహితమై ఉండును. సర్వజగత్ లక్షణమై, మనోవాగ గోచరమై, శూన్యమై, సుఖంబు కంటే సుఖమై, అసంవేదము, ననాతీతమై, ఆత్మవేదనమై ఉండును. ఇది బ్రహ్మ స్వరూపమని తెలియుము.

శ్రీరాముడు ఆయా యోగాభ్యాసములను నేర్చుకొని వాటిని విశ్వామిత్రుని వద్ద అభ్యాసన చేసి అరణ్య వాసములో నిరంతరము సాధన ద్వారా భూలోకములో పరబ్రహ్మగా భాసించి మానవులకు ఆదర్శ ప్రాయమైనాడు.

### A.3.1 లయ యోగం - నాద యోగం

యోగ సాధనలో మహర్షులు అనేక యోగ మార్గాలు ఉపదేశించారు. అందులో ఒకటి లయ యోగం. దీన్నే నాద యోగం అంటారు. అరాచకం, అస్థిరత్వం ఉన్న ప్రపంచంలో నాదయోగమే అన్నిటికంటే ఎక్కువ సత్ఫలితాల నిస్తుంది .అది మనిషి శారీరక బౌద్ధిక, ఆధ్యాత్మిక సమతా స్థితిని సమ బుద్ధిని కల్పిస్తుంది

.ఆధ్యాత్మిక ప్రకాశానికి **"నాద యోగం"** కొత్త క్షితిజ సమాంతరాలలోకి ప్రవేశం కల్పిస్తుంది. నాదయోగం ఆసక్తి , స్ఫూర్తి, పునర్జీవనం, ఉపశమనం కలిగించే గొప్ప సాధన. నాద యోగ సాధన చేస్తుంటే చాలా వింత,ఆనందదాయక ,ప్రేరణలనిచ్చే శబ్దాలు బయటి నుండికాక అంతరింద్రియాలలో వినిపించి దివ్యాను భూతిని కలిగిస్తాయి .దీనివలన ఆనంద మూలకారణం బాహ్య ప్రపంచం లో లేదని ,మనలోనే ఉన్నదని గ్రహింపు కలుగుతుంది .

భారత దేశం లో నాద యోగ సాధన ప్రక్రియలలో రాధాస్వామి ,కబీర్ పంథీ ,మార్మిక సాధన మొదలైనవి ఉన్నాయి .నాద బిందు ఉపనిషత్ ,ధ్యాన బిందు ఉపనిషత్ ,యాజ్న వల్క్య సంహిత ,శివ మహా పురాణం ,హఠ యోగం ,స్వామి స్వాత్మానంద గారి," హఠ యోగ ప్రదీపిక "మొదలైన గ్రంథాలు నాద యోగ వైశిష్ట్యాన్ని తెలియ జేశాయి **.నాద బిందు ఉపనిషత్** – 'సర్వ చింతాంసముత్సుజ్య సర్వ చేస్టా వివర్జితః –నాద మేవాను సందు ధ్యాన్నాదే చిత్తం విలోయతే అన్నది **.ధ్యాన బిందు ఉపనిషత్** అనాహతం తు యచ్చబ్దం తస్య శబ్దస్య యత్పరం, తత్పరం విదంతే యస్తు స యోగోచ్చిన్నా సంశయః అని చెప్పింది **.యాజ్నవల్క్య స్మృతి** వీణా వాదన తత్వజ్ఞః శృతి జాతి విశారదః – తాలజ్ఞశ్చా ప్రయాసేన మోక్ష మార్గ స గచ్ఛతి అంటే **,హఠ యోగ ప్రదీపిక.** అభ్యస్య మానో నాదోయం బాహ్య మావ్రు శ్రుతే ధ్వనిం, పత్తాద్విత్తేప మఖిలం జిత్వా యోగీ సుఖా భవేత్ అనగా **,శివ పురాణం న** సుశ్రోతి యదా శ్రున్వయో మాభ్యసేన దేవికే –మ్రియతే మ్యసమానాస్తు యోగీ తిస్టే చ్చివానిశం-తస్మా దుత్పద్వే శబ్దా మృత్యు జిత్స ప్యాబి ధ్వనైః అని చెప్పింది .ఈ విధంగా నాద యోగ సాధన చాలా స్ఫూర్తిదాయకంగా ఉండటం వలన దాన్ని వదిలి పెట్టాలని ఎవరూ అనుకోరు. ఇటీవల కాలములో "త్యాగరాజు, అన్నమయ్య నాద యోగ సాధన ద్వార అనేక కీర్తనలు వ్రాసి, పాడి జీవన్ముక్తులు అయ్యారు.

ఈ యోగాన్ని మొదట చెప్పినవాడు పరమ శివుడు . నద్ అనే సంస్కృత పదానికి అర్థం ప్రవాహం .కనుక నాద యోగం అంటే చేతన ప్రవాహం అని అర్థం. చేతనాలహరి అనచ్చు .మామూలు భాషలో నాదం అంటే శబ్దం. స్ఫోటాయనేన యోగాత్తు తథా స్ఫోతాయనం కృతం ఇది ఒక సంస్కృత వ్యాకరణము. దీనిని స్ఫోటాయనుడు రచించాడు. స్ఫోట వాదము చాలా సనాతనమైనది. వాగ్దేవిని గూర్చిన స్తోత్రాలు ఋగ్వేదంలోనే కనిపిస్తాయి. అయినా వ్యాకరణ సాంప్రదాయం ప్రకారం స్ఫోట వాదానికి మూలపురుషుడు స్ఫోటాయనమహర్షి. భర్తృహరి, నాగేశభట్టు, మండవ మిశ్రుడు మొదలైనవారు ఈవాదాన్ని ప్రపంచించినవారు. నిత్యమైన స్ఫోట, లేక శబ్దబ్రహ్మం మనం నోటితో ఉచ్చరించి, చెవులతో వినే లౌకిక శబ్దంగా పరిణమించడంలో నాలుగుదశలు చెప్పారు. **1.పరా, 2. పశ్యంతీ, 3.మధ్యమా, 4. వైఖరీ.** పరా పశ్యంతీ దశల లోని శబ్దాన్ని ఎవరో యోగులు తప్ప మన సాధరణ ఇంద్రియ జ్ఞానంతో మనం గ్రహించలేమన్నారు. జపాదులవల్ల మధ్యమా దశలోని వాక్కును గుర్తించవచ్చుట. ఇక వైఖరీవాక్కు ఒక్కటే మనకందరికీ తెలిసింది. ఈ నాలుగు నాద దశలు శబ్దాల పౌనః పున్యం అంటే ఫ్రీక్వెన్సీ (frequency) సూక్ష్మత, మోటుతనాలను బట్టి ఏర్పడ్డాయి. **పరా నాదము, ఓంకారానికి మూలం. ఇది ఒక cosmic, transcendental శబ్దం. లలిత సహస్ర నామ 81 వ శ్లోకంలో "పరా, ప్రత్యక్చితీ రూపా, పశ్యంతీ, పరదేవతా, మధ్యమా, వైఖరీరూపా, భక్తమానస హంసికా"** అని చెప్ప బడినది. వివరణ తెలుసుకొందాము. పరా - పరాస్థితిలోని వాగ్రూపము. పశ్యంతీ - రెండవస్థితిగా వ్యక్తం కాబోయే వాక్కు, మధ్యమా - పశ్యంతీ, వైఖరీ వాక్కులకు మధ్య వుండు స్థితికి సంబంధించిన వాక్కు. వైఖరీరూపా - స్పష్టముగా వ్యక్తమైన వాక్కు. పరానాధం గురించి మరింత వివరములోకి వెళితే.....

### A.3.2 పరా నాదం :

అధిక ఫ్రీక్వెన్సీ కలిగిన సర్వోత్కృష్ట శబ్దాన్నే పరానాదం అంటారు .ఇది ఇంద్రియాలకు, బుద్ధికి అందదు వినిపించదు . పరా అంటేనే అవతలి అని అర్ధం .అంటే మనకు అందుబాటులో లేనిది .కనుక పరానాదం అంటే ఉత్కృష్టనాదం . దీనినే ఇంగ్లీష్ లో transcendental అంటారు .దీనివలన మనకు మన చేతనను దాటి అతి చేతనమైన ఒక ఆవరణ ఉన్నదని ,అక్కడ శబ్దం వేర్వేరు పరిమాణాలలో వినిపిస్తుందని గ్రహించాలి . ప్రతిస్వరానికి ప్రతి సెకండుకు అనేక రీతులలో మారే కంపనాలుంటాయని శాస్త్రీయ సంగీతం నేర్చిన వారికి తెలుసు .అవి పొడవు ,వేగం స్థాయి లలో తేడాలుగా ఉంటాయి .ధ్వని తరంగాలను రికార్డ్ చేసే సాధనాల వలన వీటిని తెలుసుకోవచ్చు .భారతీయ సంగీతం లో కంపనాలను" ఆందోళనలు" అంటారు .ఒకసెకను కాలం లో శబ్దం అనేక వేల కంపనాలను చేయచ్చు. కానీ ఒకనిర్దుష్ట గరిష్ట పరిమితి దాటిన కంపనాలు మనకు వినిపించవు . మన చెవులు వాటిని గ్రహించ జాలవు. కనుక విశ్వం లో ఉన్న అన్ని శబ్దాలను మనం గ్రహించలేము వినలేము కూడా .ఎక్కువ ఫ్రీక్వెన్సీ లో లయాత్మకంగా ఉన్న శబ్దాలు చివరికి నిశ్శబ్దాన్నే ఇస్తాయి .చెవులు వినగలిగిన శబ్ద పరిమితి దాటిన ఏ శబ్దమూ మనకు వినిపించదు .అలాంటి శబ్దాన్ని సృష్టిస్తే ఎవరూకూడా దాన్ని విశ్లేషించి అర్ధం చేసుకోలేరు. ఇలాంటి హై ఫ్రీక్వెన్సీ ఉన్న శబ్దమే పరా అంటే .....అనేక గ్రంథాలు పరా శబ్దానికి కంపనలే లేవు అని తెలియ జేశాయి .కనుక పరానాదానికి కదలికలు ఫ్రీక్వెన్సీలు ఉండవు .కాని అది శబ్దమే .కదలిక లేని శబ్దాన్ని మనం వినలేము. శబ్దం తారా స్థాయికి వెడితే (high pitch) అది అకస్మాత్తుగా నిశ్శబ్దం అవుతుంది .అదే పరా నాదం .ఉపనిషత్తులు ఓంకారం ... పరానాదం నుండి జనించింది అని చెప్పాయి. మనం ఉచ్చరించే "ఓం' పరానాదం

కాదు .కారణం ఈ ఓంకారం మనం చేస్తూ వింటాం కనుక. వినబడే ఓంకారం సర్వోత్కృష్ట నాదం కాదని గ్రహించాలి .కాని పరా అనేది కాస్మిక్ , transcendental శబ్దం. దానికి ఏ రకమైన కదలికా ఉండదు .అది నిశ్చలం, అనంతం కూడా .దానికి ఆకారం కాంతి కూడా ఉన్నాయి .దాని ఆకారం ''జ్యోతిస్వరూపం''.అది మనం వినే,అనుభవించే అన్ని రకాల ధ్వనులకు భిన్నమైనది.

**న వర్ణా న వర్ణాశ్రమాచార ధర్మా**

**నమే ధారణా ధ్యాన యోగాదయో-పి |**

**అనాత్మాశ్రయాహంమమాధ్యాసహానాత్**

**తదేకో-వశిష్టః శివః కేవలో-హమ్**

మానవబుద్ధికే అతీతమది. అదే ఋగ్యజుస్సామాథర్వాణాది వేదవాఙ్మయం. ఇది భూత భౌతిక ప్రపంచంలాగా సృష్టి అయింది కాదు. సృష్టికర్త అయిన హిరణ్యగర్భుడు కూడా జన్మించక పూర్వమే ఏర్పడి ఉన్నదది. **యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై** అని మంత్రవర్ణం. కాబట్టి శాస్త్రమనాది సిద్ధం. **అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయంభువా** అని మనువే చాటాడు లోకానికి. అయితే అనాది అంటే అక్షరరూపంగా కనిపించే ఈ గ్రంథమేనని అపోహ పడరాదు. గ్రంథ రూపంగా కాదనాది అంటే. శబ్దరూపంగా, శబ్దానికే వాక్కనికూడా నామాంతరం. ఈ వాక్కనేది నాలుగు భూమికలలో వర్తిస్తుంది. అందులో వైఖరీ రూపమైన వాక్కునే మనమిప్పుడు ఋగ్వేదమనీ, యజుర్వేదమనీ వ్యవహరిస్తున్నాము. ఇది శబ్దానికి స్థూలమైన రూపం. కాగా దీని వెనకాల అంతకన్నా సూక్ష్మమూ, సూక్ష్మతరమూ, సూక్ష్మతమమూ అయిన దశలుకూడా ఉన్నాయి. అన్నిటికన్నా సూక్ష్మమైన దానికే 'పరా' అని పేరు. ఈ 'పరా' అనేది పరమేశ్వరితో ఏకమై ఉంటుంది. అది కేవలము ఆ చైతన్య శక్తియే 'పరాస్య శక్తిః' అని శ్వేతాశ్వతరమే వర్ణిస్తున్నది. పరమాత్మతో ఓతప్రోతమయిన ఈ శక్తి ఆ చైతన్య సాగరంలో ఆవిర్భవించిన ఒక ఇచ్ఛా తరంగం. ఈశ్వర

సంకల్పమని/పరమేశ్వరి సంకల్పమని కూడా దీనినే పేర్కొంటారు. అయితే ఇది మనకు గలిగే సంకల్పాల లాగా నశ్వరమయినది కాదు, పరమాత్మ సత్యస్వరూపుడు కాబట్టి తద్గతమయిన సంకల్పంకూడా సత్యసంకల్పమే. దీనినే తపస్సనీ, దృష్టి అనీ, కామమనీ, ఈక్షణమనీ అనేక సంజ్ఞలతో వ్యవహరిస్తుంది శాస్త్రం. మొత్తానికిది విశ్వచైతన్యంతో ముడిబడిన ఒకానొక వృత్తి విశేషం, కనుకనే చైతన్యంలాగా ఇది నిత్యమే అయింది. అయితే అది ఇంకా అవ్యక్తంగానే ఉందిగాని వ్యక్తమయిన దశకు రాలేదు. అవ్యక్తంగా ఉన్నంతవరకూ అది పరా. ఆ పరారూపమయిన వాక్కే క్రమంగా ఆత్మ పరామర్శ చేసుకొని 'పశ్యంతి' అయింది. అది భూత సృష్టి కున్ముఖమయ్యేసరికి 'మధ్యమ' అయింది. తీరా సృష్టి జరిగే సమయానికి 'వైఖరి'గా మారిపోయింది. ఇప్పుడు మనం చూచేదంతా వైఖరి రూపమే. శక్తిరూపంగా ఉన్న వాక్కే వ్యక్తమయితే దాన్ని వైఖరి అంటున్నాము. వైఖరి ఎప్పుడయిందో అప్పుడే నామరూపాదులన్నీ ఏర్పడుతున్నాయి. కాబట్టి వాచ్యమయిన నామరూపాలకంటే వాచకమయిన శబ్దమే పూర్వసిద్ధమని గ్రహించాలి మనం. ఎంచేతనంటే శబ్దశక్తి ప్రకాశింప జేస్తుంటేనే నామరూపాది ప్రపంచమంతా ప్రకాశిస్తున్నది. ఆ శక్తి వివర్తమే ప్రస్తుతం మనకు గ్రంథరూపంగా కనిపించే ఈ ఋగాది శాస్త్రమంతా. పరారూపంగా అది నిత్యమే కాబట్టి తద్వివర్తమయిన ఇదీ నిత్యమే. నిత్యం గనుకనే నిత్యమయిన జీవిత సత్యాలనే అది మనకు నిరూపిస్తున్నది. అంచేత నామరూపాత్మకమయిన భౌతిక జగత్తు నొకవేళ కాదని త్రోసిపుచ్చినా తత్ప్రకాశకమయిన శబ్ద జగత్తు అంతకు పూర్వమే సిద్ధమయి ఉంది.

సందర్భానుసారంగా రామాయణము లోని వాక్ ప్రధానమైన పాత్రలను పరిశీలిద్దాము. శ్రీరాముని వంశమునకు ముఖ్యముగా మూలపురుషులు ముగ్గురు. వారు.......

**రఘువు:** ర అనగా అగ్ని బీజము. అఘ్ అనగా అగ్నిలో దహింప చేయువాడు. పాపరహిత మైన సాధకుడు.

**ఇక్ష్వాకు:** అంతఃకరణ శుద్ధమైన కారణముగా మధురమైన వాక్కును కలిగిన వాడు.

**కాకుస్థుడు:** స్వర జ్ఞానమును అందరకు చాటువాడు.

**సుగ్రీవుడు:** మధుర భాషణము గల సాధకుడు.

### A.3.3 : యోగము

యోగము అనగా కేవల ప్రాణాయామము మొదలగు ఆసనములే కాదు. మనస్సు నిర్మలంగా ఉండుట, మధురమైన వాక్కు, స్వరము కూడా యోగములోని భాగములే! వాక్కునకు స్వరము ముఖ్యము. మధురమైన స్వరము వలన మనస్సు ప్రశాంతముగా, ఎటువంటి అనారోగ్యము లేకుండా మంచి మిత్రులను పొందవచ్చు. అలాగే తీక్షణమైన, భీకరమైన స్వరము వలన కోపావేశాలు గలిగి, ఆరోగ్యము భంగము చేసి అనేక మంది శత్రువులు గూడతారు అనే విషయము అందరికి అనుభవమేగా! అదేవిధముగా ఉచ్ఛరించే వాక్కు మధురముగా ఉండాలి. అది మంత్రము కావచ్చు, నామము కావచ్చు, స్తోత్రము కావచ్చు. ఉదాహరణకు శ్రీరామ నామము కాని, సౌందర్య లహరి కాని, శివానంద లహరి కాని ఎప్పుడు విన్నా, ఉచ్చరించినా మనస్సు ప్రశాంతముగా ఉండును. నిరంతర యోగ సాధన ద్వారా శ్రీరాముడు మరియు హనుమానుడు యొక్క వాక్కు మధురముగా ఉండునని రామాయణము ద్వారా మనకు విదితమే!

# శ్రీరాముడు-యోగరహస్యము

శ్రీరాముడు యోగి, జీవన్ముక్తుడు. **జన్మతా జాయతే శూద్ర సంస్కారద్విజ ఉచ్యతే** అని భగవద్గీత చెపుతుంది. శ్రీరాముడు తన జీవితమంతయు అకుంఠిత యోగాభ్యాసము తో (యోగాభ్యాసము అనగా ప్రాణాయామ మొదలగు ఆసనములతో పాటు జ్ఞానము, తపస్సు, సత్య సంధత, వాక్ పరిశుద్ధత ఇత్యాది గా గ్రహించాలి) గురుబోధతో మానవుడు భగవంతుడుగా రూపాంతరము చెందవచ్చు అని నిరూపించారు.

శ్రీరాముడు వసిష్ఠ మహర్షిని అడుగుచున్నాడు. స్వస్వరూపమే పరమాత్మగా గ్రహించుటచే జనన-మరణ-సంసారాది దోషాలన్నీ తొలగిపోతాయి. అయితే ఆ దేవదేవుని శీఘ్రముగా పొందాలంటే ఏ కఠోర నియమాలు

ఆచరించాలి. అందుకు వసిష్ఠుడు చెప్పుచున్నాడు.

**పరిస్పందఫల ప్రాప్తౌ పౌరుషా దేవ నా-న్యతః** ఏ ఫలితమైనా పురుష ప్రయత్నము చేతనే లభిస్తుంది. అదే విధముగా పురుషాకారము చేతనే జీవునకు జ్ఞానము ప్రాప్తిస్తుంది. అట్టి జ్ఞానము వలననే కామ క్రోధాది తాపములను నశింపచేసి జీవన్ముక్తి లభిస్తుంది. **మనసా వాంచ్యతే యాచ్చ యధా శాస్త్రం న కర్మణా, సాధ్యతే మత్త లీలాసా మోహనీనార్ధ సాధనే.** శాస్త్ర విధిని అనుసరించి ప్రయత్నము చేయకుండా, మనస్సుతో కోరుకోవడం జీవుని యొక్క దౌర్భాగ్యము. **దైవేనతు అభియుక్తోహం, తత్కారో మాదృశం స్థితం, సమాశ్వాసనా వాగేషా! న దైవం పరమార్ధతః.** నేను అదృష్టము (దైవము) చేత పనులు చేస్తున్నాను అనుకొంటే అది వారిని వారు ఓదార్చుకోవడమే అవుతుంది. **యధా యధా ప్రయత్న స్యాత్, భవేదాశు ఫలం తథా, ఇతి పౌరుషమేవ ఆస్థి, 'దైవం' ఆస్తు తదేవచ** చేసే ప్రయత్నమును బట్టి ఫలితము ఉంటుంది.

అదృష్టము కూడా పురుషాకారమును బట్టియే ఉంటుంది. **స్వపౌరుష యత్నేన వివేకిన వికాసినా రాగ ద్వేష తమః క్రోధ మద మాత్సర్య వర్జనం, యధా సంభవయా వృత్యా లోకశాస్త్ర - విరుద్ధయా సంతోష సంతుష్టమనా భోగగంధం పరిత్యజేత్**

పురుష ప్రయత్నము/పౌరుషము చేత వివేకము-వికాసము పొందిన వాడే బ్రహ్మ సాక్షాత్కారము పొందుతున్నాడు. అరిషడ్వర్గములను పరిత్యజించాలి. భోగ వాసనలు వీడి లోక శాస్త్రములకు విరుద్ధముగా కానట్టి జీవితమును ఆచరించాలి. మనకు రామాయణములో శ్రీరాముని పాత్ర ముఖ్యముగా విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్ధమై శ్రీరాముని గొనిపోవ అయోధ్యా నగరమునకు వచ్చినప్పటి నుంచి కనపడుతుంది. అప్పటికి శ్రీరాముడు వయస్సు పదునారు సంవత్సరములు. అప్పటికే ఆయన గురుకులంలో విద్యాభ్యాసము చేసి దశరధుని అనుమతితోదేశాటనముచేసివస్తాడు. శ్రీరాముడు-యోగరహస్యము అను చిరు పుస్తకములో ముఖ్యముగా వాల్మీకి మహర్షి రామాయణము ఆధారముగా శ్రీరాముని జీవితములోని యోగ రహస్యము, మానవుడుగా జన్మించి తన జీవితము ద్వారా మానవుడు భగవంతుడిగా మారవచ్చు అని రుజువు చేసినాడు. శ్రీరాముడు రావణ సంహారము వరకు, బ్రహ్మాది దేవతలు అతను సాక్షాత్తు విష్ణు స్వరూపమని గుర్తు చేసేవరకు మానవుడుగానే ప్రవర్తించాడు. ఈ విషయాలు ముఖ్యముగా ఇందు పొందుపరచి బడ్డాయి. కథా సందర్భమునకు అనుగుణంగా, రామాయణములో ఇతర విషయములు, పాత్రలు వివరించబడ్డాయి.

# 1. బాలకాండ

## 1.1 విశ్వామిత్రుని ఆగమనం

**అయోధ్యా నామ నగరీ తత్రాఽఽసీ ల్లోక విశ్రుతా,**
**మనునా మానవేన్ద్రేణ యా పురీ నిర్మితా స్వయమ్**
**తాం తు రాజా దశరథో మహారాష్ట్ర వివర్ధనః,**
**పురీమ్ ఆవాసయా మాస దివి దేవపతి ర్యథా**

విశ్వామిత్రుడు యాగ సంరక్షణార్ధమై శ్రీరాముని గొనిపోవ అయోధ్యా నగరమునకు వస్తాడు. దశరధుడు ఆ నగరానికి రాజు. అయోధ్యా నగరము మనువు (మనస్సు) ద్వారా నిర్మితమైనది. మనస్సు చంచల మైనది. డోలాయమాన మైనది. వృత్తుల మధ్య సంఘర్షణతో కూడి ఉన్నది. ఈ సంఘర్షణ సమాప్తమై శాంత స్థితి యందున్న మనస్సే అయోధ్య. అయోధ్య అనగా యుద్ధము లేనిది. చిత్తము (మనస్సు) యొక్క శుద్ధ అవస్థయే అయోధ్యా నగరము. అటువంటి గొప్ప రాష్ట్రమునకు రాజు దశరధుడు. ఇంద్రుని వలెనె కార్యభారమును ఒనర్చును. దశరధుడు అనగా పది ఇంద్రియములకు స్వామి. దశరధ రూపపిండము యొక్క ఆత్మానంద స్వరూపుడే శ్రీరాముడు. యోగుల చిత్తమునందు వశించెడి ఆత్మానందమునకు రాముడిని పేరు. **"రమంతే యోగినః యస్మిన్ రామః", "రమయతి ఇతి రామః".**

**వశిష్ఠమహర్షి:**

సాధకుని యందు తన ఇష్ఠవృత్తులు ఆవశ్యకము. ఉత్తమమైన ఇష్ఠవృత్తులు యొక్క శరీరమే గురువులైన వసిష్ఠ రూపము

**విశ్వామిత్రుడు**

గాయత్రీమంత్ర సృష్టికర్త అయిన విశ్వామిత్రుడు సూర్యుని మాదిరి ప్రకాశమును ఇచ్చువాడు. గాయత్రి మంత్రము ద్వారా విశ్వవ్యాప్తి నొంది, అందరికి మేలు కలిగించును కావున విశ్వామిత్రుడు అయ్యెను. ఇతను ఆధ్యాత్మిక జగత్తు నందు ఒక అధికారిక వ్యవస్థ.

ఇంద్రియములను నియంత్రించ గలిగి మనస్సనే అయోధ్యా నగరమునకు రాజైన దశరథుడు తన రూపమైన ఆత్మానందమును (శ్రీరాముడు), ఇష్టవృత్తుల శరీరము (వసిష్ఠుడు) యొక్క సూచనతో విశ్వామిత్రునితో పంపుటకు సిద్ధమైనాడు. ఇక్కడ గమనించవలసిన విషయమేమేమనగా నిరాకార చైతన్యమైన మనస్సును నియంత్రించ గలిగిన దశరథుడు శ్రీరాముని పంపుటతోడనే తన ఆత్మానందమును కోల్పోయి దుఃఖితుడు అవుతాడు. పరమాత్ముని సాన్నిధ్యము దూరమవుతున్నది అనే భావనే భక్తునకు దుఃఖహేతువు కదా!

### 1.2.1 శ్రీరామునికి బల, అతిబల విద్యలు నేర్పుట మరియు సరయు నది విశిష్టత

అలా యాగ సంరక్షణార్థము శ్రీరామునితో ఒకటిన్నర యోజనములు నడచిన తర్వాత సరయూనది దక్షిణ తీరమందు శ్రీరామునికి బల, అతిబల అనే విద్యలను ఉపదేశించెను.

**రాఘువస్య వచశ్రుత్వా కౌతూహల సమన్వితః,**
**కథయామాస ధర్మాత్మా తస్య శబ్దస్య నిశ్చయమ్.**
**కైలాసపర్వతే రామ మనసా నిర్మితం సరః,**
**బ్రాహ్మణా నర శార్ధూల తేనెధామ్ మానసం సరః.**

పూర్వము బ్రహ్మ కైలాస పర్వతము నందు తన సంకల్పముచే ఒక సరస్సును నిర్మించెను. దానినే మానససరోవరవము అందురు. ఆ సరస్సు నుండి ఒక నది ప్రవహించింది. ఇది పవిత్రమైన నది. ఆ నది అయోధ్య చుట్టును పారుచున్నది. ఆ

నదిని సరయు నది అందురు. సరయు నది అనగా బ్రహ్మము వైపునకు తీసుకొనిపోవు చిత్తప్రవాహము.

**గృహాణ వత్స సలిలం మా భూత్ కాల స్య పర్యయః,**
**మన్త్రగ్రామం గృహాణ త్వం బలామ్ అతిబలాం తథా**
**న శ్రమో న జ్వరో వా తే న రూప స్య విపర్యయః,**
**న చ సుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యన్తి నైరృతాః**
**న బాహ్వోః సదృశో వీర్యే పృథివ్యామ్ అస్తి కశ్చన,**
**త్రిషు లోకేషు వై రామ న భవేత్ సదృశ స్తవ**
**న సౌభాగ్యే న దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధి నిశ్చయే,**
**న ఉత్తరే ప్రతి వక్తవ్యే సమో లోకే తవాఽనఘ**
**ఏతత్ విద్యా ద్వయే లబ్ధే భవితా నాస్తి తే సమః,**
**బలా చ అతిబలా చైవ సర్వ జ్ఞాన స్య మాతరౌ**
**క్షుత్పిపాసే న తే రామ భవిష్యతే నరోత్తమ,**
**బలామ్ అతిబలాం చైవ పఠతః పథి రాఘవ,**
**విద్యా ద్వయమ్ అధీయానే యశ శ్చాఽప్యతులం భువి**
**పితామహ సుతే హి ఏతే విద్యే తేజః సమన్వితే,**
**ప్రదాతుం తవ కాకుత్స్థ సదృశ స్త్వం హి ధార్మిక**
**కామం బహు గుణాః సర్వే త్వయి ఏతే న అత్ర సంశయః,**
**తపసా సంభృతే చ ఏతే బహు రూపే భవిష్యతః**
**తతో రామో జలం స్పృష్ట్వా ప్రహృష్ట వదనః శుచిః,**
**ప్రతిజగ్రాహ తే విద్యే మహర్షే: భావితాత్మనః**

బ్రహ్మ దేవుని కుమార్తెలైన బల, అతిబల అనే రెండు మంత్రాలని రాముడికి ఉపదేశించాడు. ఈ రెండు విద్యల వల్ల ఆకలి వెయ్యదు, దప్పిక కలగదు,

నిద్రపోతునప్పుడు కాని నిద్రపోనప్పుడు కాని రాక్షసులు ఏమి చెయ్యలేరు, దీనితో పాటు సమయస్ఫూర్తి, జ్ఞాపక శక్తి, బుద్ధి ప్రకాశిస్తాయి అని చెప్పి విశ్వామిత్రుడు ఆ మంత్ర దీక్ష ఇచ్చారు. వాటి వివరం క్రింద ఈయబడినది

### 1.2.2 బల, అతిబల విద్యల యొక్క యోగ రహస్యము

మన శరీరము నందు మూడు బంధములు ఉన్నవి. వాటిలో ఒకటైన జాలంధర బంధమును సిద్ధించుకొనిన మానవుడు (సాధకుడు) ఆకలి దప్పికలు తప్పించుకొని కష్టము నుండి, రోగము నుండి వికలుడు కాడు. హఠయోగములో చాలా రకములైన ముద్రలు బంధములు ఉన్నవి. వీటి అన్నిటి ప్రయోజనము ప్రాణాపాన వాయువులను ఏకం చేయడము ద్వారా నిద్రాణ స్థితిలో ఉన్న కుండలిని శక్తిని జాగృతము చేసి ఆ శక్తిని షట్చక్రముల ద్వారా ఊర్ధ్వగామినిని చేసి శిరస్సులో ఉన్న సహస్రదళ పద్మము వరకు చేర్చుటయే. ఈ క్రియలన్నిటిలో బంధత్రయము అనబడే మూడు బంధములు ముఖ్యమైనవి. అవి మూల బంధము, ఉడ్డియాన బంధము, జాలంధర బంధము. ప్రాణాయామము అభ్యసించు నపుడు అవసరమగు త్రి బంధములను గూర్చితెలిసి కొందము. త్రి బంధములనగా మూల బంధము, ఉడ్యాన బంధము జాలంధర బందము అనునవి. ఈ త్రి బంధములను ప్రాణమును శరీరములో కుంభించు నపుడు అది వెలికి పోకుండా అపాయము లేకుండగను సుఖముగను నిరోధించుటకు ఉపయోగ మైనవి. ఈ మూడు బంధములతో వాయువును కుంభించి అప్పుడు ప్రాణము అపానముతో సంయోగము పొంది సుషుమ్న యందు ప్రవేశించుటకు ఉపయోగ పడును.

#### 1.2.2.1 జాలంధర బంధము

గడ్డమును ఉరము యొక్క (రొమ్ము) ఉపరి భాగమున చేర్చి, గట్టిగా అదిమి పట్టుటను జలంధర బంధమని చెప్పబడినది. ప్రాణాయామము సాధనచేయు నపుడు శరీర మందున్న ప్రాణ వాయువును అధో భాగమునకు తిరోగమింప

చేయును. మరియు కుంభక సమయమున కంఠమునకు పైనున్న శిరో భాగములకు అనగా మెదడు నందలి నాడీ జాలమునకు ఎంత మాత్రము ఒత్తిడి కలుగ కుండ నిరోధించును. దీని వలన ప్రాణాయామము చాల సుఖముగా సాగును. నాలుకను దంత మూలములందు గట్టిగా అదిమి పట్టిన జిహ్వా బంధమనిరి.

### 1.2.2.2 ఉడ్యాన బంధము

నాభికి చుట్టును వున్నఉదర భాగమును, వెన్నునకు అంటు నట్లు మీదికిని వెనుకకును లాగి వుంచునది ఉడ్డియాన బంధము. ఉడ్డి యాన మనగా పక్షి వలె ఎగురుట. గర్భ కోశమున బంధింపబడిన ప్రాణము సుషుమ్న నాడీ మార్గమున ఎగురునట్లు చేయునది. కావున ఉడ్డీ యానమనిరి. ప్రాణము సుషుమ్నలో ప్రవేశించి సంచరించుటవలన యోగము యొక్క ఫలము అయిన సమాధిని త్వరిత గతిని పొంద వచ్చును. అందు చేత యోగులు దీనిని చాల ముఖ్యమైన దానినిగ పరిగణించిరి.

### 1.2.2.3 మూల బంధము

నాభికి చుట్టును వున్న ఉదర భాగము, వెన్నునకు అంటు నట్లు మీదికిని వెనుకకును లాగి వుంచునది ఉడ్డియానబంధము. ఉడ్డి యాన మనగా పక్షివలె ఎగురుట. గర్భ కోశమున బంధింపబడిన ప్రాణము సుషుమ్న నాడీ మార్గమున ఎగురునట్లు చేయునది. కావున ఉడ్డీ యానమనిరి. ప్రాణము సుషుమ్నలో ప్రవేశించి సంచరించుట వలన యోగము యొక్క ఫలము అయిన సమాధిని త్వరిత గతిని పొంద వచ్చును. అందు చేత యోగులు దీనిని చాల ముఖ్యమైన దానినిగ పరిగణించిరి. క్రిందికి పోవుటయే అపాన వాయువునకు ముఖ్య లక్షణము. బొడ్డు నుండి క్రింద నున్న వాయువును అపాన మందురు. మూలాధారమున (గుదము) గట్టిగా పీడించి సంకుచపరచి పైకి లాగి కొనిన, క్రిదికి పోవు చున్న ఆపాన

వాయువు యొక్క గమనము నిరోధించ బడి ఊర్ధ్వ గతి చెందును. అపుడు ఊర్ధ్వమందున్న ప్రాణ వాయువుతో సంయోగమును పొందును. **ప్రాణ ఆపాన వాయువుల సంయోగమే యోగమని చెప్పబడినది.** ఇట్లు ప్రాణాపానములు సంయోగము పొందినపుడు శరీరములో యోగాగ్ని ప్రజ్వరిల్లి యోగ నాడి మండలమున వున్న మలములు శోషక, దాహక క్రియల చేత (అనగా కాల్చి వేయుట, ఆర బెట్టుట) శుద్ధి పొందును. సూక్ష్మ నాడి మండలము శుద్ధి పొందిన యడల స్థూల నాడులు అనుబంధము వలన శుద్ధి పొంది దేహము లాగవమగును, తేజో వంతమగను ఉండును. శరీరమున వున్న రోగ పదార్థములు నాశన మగును. ప్రాణాయామాభ్యాసమునకు త్రిబంధములతో పాటు ముద్రలను కూడ అభ్యసించుట అవసరము. ముద్రలు పది. 1. మహాముద్ర, 2. మహాబంధ, 3. మహావేధ, 4. ఖేచరి, 5. ఉడ్యాన, 6. మూలబంధ, 7. జలాంధరబంధ, 8. విపరీత కరణి ముద్ర, 9. వజ్రోలి, 10. శక్తి చాలన ముద్ర అను నవి పది ముఖ్యంగా చెప్పబడినవి. ఇందులోని జాలంధర బంధ, ఉడ్యాన బంధ, మూల బంధములు త్రిబంధములుగా పైన వివరించ బడినవి.

లలితా సహస్ర నామావళిలో వీటి గురించి ఇలా చెప్పబడింది.

**82. కామేశ్వర ప్రాణనాడి కృతజ్ఞ్యా కామపూజితా**

**శృంగార రససంపూర్ణ జయా జాలంధరస్థితా**

**83. ఓఢ్యాణ పీఠనిలయా బిందుమండలవాసినీ**

**రహోయాగక్రమారాధ్యా రహస్తర్పణతర్పితా**

ఈ మంత్రం శ్లోకములలో రహో యోగము అనే ఒక రహస్య ప్రక్రియ నిగూఢముగా సూచించబడినది. ఈ ప్రక్రియ ఎటువంటి సిద్ధిని కలుగ చేస్తుందో తరువాతి మంత్రము తెలియ చేస్తుంది.

**84. సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా**

**షడంగదేవతా యుక్తా షాడ్గుణ్యపరిపూరితా**

ఇది తక్షణమే సిద్ధిని కలుగచేసి విశ్వము నంతటిని మనోనేత్రములో సాధకునికి దర్శింప చేస్తుంది.
యోగ వాసిష్ఠము లోని ఉపశమన ప్రకారణములో వసిష్ఠుడు రామునికి అనేకమైన యోగ మార్గాలు చెపుతారు.
విశ్వామిత్రుడు ఒసగిన ఈ విద్యలను ఆత్మ స్వస్వరూప ధ్యానములో స్వీకరించి, అభ్యాసము చేసి శ్రీరాముడు అత్యంత తేజోవంతుడు అయ్యెను. ఆ విద్యలు ఉపదేశము పొందగానే శ్రీరాముడు అధిక పరాక్రమములో శరదృతువులో సూర్యుడు వేయి కిరణములతో ప్రకాశించునట్లు ప్రకాశించెను.

### 1.3.1 త్రిపదా సంగమము

మరునాడు బ్రాహ్మీముహూర్తములో విశ్వామిత్రుడు ముందుగా లేచి నదికి ఏగి తన అనుష్ఠానము నెరవేర్చుకొని అర్ఘ్యప్రదానము, సూర్యోవస్థానము చేసి వచ్చెను. పడుకొన్న శ్రీరాముని మోహనాజనకమైన రూపమును చూసి పరవశుడై కౌసల్య యొక్క మహాభాగ్యమునకు మురిసిపోయి, కర్తవ్యము స్ఫురించి రాముని మేలుకొల్పుతున్నాడు.

**కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,**
**ఉత్తిష్ఠ నర శార్దూల కర్తవ్యం దైవమ్ ఆహ్నికమ్**

కౌసల్య యొక్క కుమారుడైన రామ, తూర్పు దిక్కున సూర్యుడు ఉదయిస్తున్నాడు కనుక నువ్వు నిద్రలేచి ప్రొద్దున్న చేసే పూర్వ సంధ్యా వందనం చెయ్యాలి. రాక్షసులను సంహరించే నువ్వు నరులలో శార్దూలం వంటివాడివి, దైవీ సంబంధమైన ఆహ్నికములను నెరవేర్చడానికి శుభప్రదమైన సమయం మించిపోకూడదు, అందుకని రామా నిద్రలే. ధర్మమును నీవు ఆచరించి, లోకులచే ఆచరింపచేయవచ్చిన నీవు సంధ్యా సమయమున నిద్రించుట తగదు లెమ్ము. (వెంకటేశ్వర స్వామి సుప్రభాతం లో ఇది మొదటి శ్లోకం). రామలక్ష్మణులిద్దరూ నిద్ర

లేచి చెయ్యవలసిన కార్యక్రమాలు పూర్తి చేశారు. అక్కడి నుంచి బయలుదేరి గంగ-సరయు సంగమ స్థానం (త్రిపదా సంగమము) దాక వెళ్లారు. అక్కడ ఒక ఆశ్రమాన్ని చూసి, అది ఎవరిదని రాముడు అడిగాడు. అప్పుడు విశ్వామిత్రుడు చెపుతూ... ఒకానొకప్పుడు పరమశివుడు ఇక్కడ తపస్సు చేస్తుండగా మన్మధుడు బాణ ప్రయోగం చెయ్యబోతే, శివుడు తన మూడవ కంటితో మన్మధుడిని భస్మం చేసిన ప్రదేశం ఇదే, మన్మధుడి అంగములన్ని కాలి బూడిదైన ఈ ప్రాంతాన్ని అంగదేశం అని పిలుస్తారు. ఆనాడు శంకరుడు తపస్సు చేసినప్పుడు ఆయనకి కొంతమంది శిష్యులున్నారు. శంకరుడితో ప్రత్యక్ష శిష్యరికం చేసినవాళ్ళ దగ్గరినుంచి ఈనాటి వరకు ఉన్న వీళ్ళందరూ పాపము లేనివాళ్ళు. కాబట్టి, రామ ఈ రాత్రికి వీళ్ళందరితో కలిసి పడుకో అని చెప్పాడు.

### 1.3.2 త్రిపదా సంగమము నందున్న యోగ రహస్యము

ఈ త్రిపదా సంగమము భౌగోళికమైనదియే గాక సాధకుని శరీరముందున్న విషయము తెలుప బడినది. అదే భ్రూమధ్యమముందున్న **"ఆజ్ఞాచక్రము". ఆజ్ఞా చక్రము:** శిరసు నందలి భ్రూ మధ్యమున హిందువులు తిలక దారణ చేయు ప్రదేశమున (2) రెండు దళములు గల పద్మము గుండ్రముగా నున్నది. హం, క్షం, అను రెండు శబ్దములు. చక్ర దళము నుండి ఉత్పన్నమయినది. "ఓం" అనునది బీజాక్షరము, పరమ శివుడు హంస రూపమున ఇందున్నాడు. అవ్యక్తము, అహంకారము, మనస్సు అనునది ఈ చక్రము యొక్క తత్వములు. సంకల్ప వికల్పములు దీని కార్యము. అనగా మనస్సునకు స్థానము. మనస్సు మెలకువలో వున్నప్పుడు శరీర మంతయు ప్రసరించి యుండగా, నిద్రలో ఈ చక్ర స్థానమున నిలిచి యుండునని చెప్పబడినది. హాకిని దేవత. ఇందు రుద్ర గంధి వున్నది. అలోపతి వైద్య శాస్త్రమున "కేవర్నస్ ప్లెక్సస్ " అని పిలువబడు చున్నది.

అటువంటి తీవ్రమైన సాధనాలు చేసిన తర్వాతనే చెడు వృత్తుల రూపమైన తాటకాది రాక్షస సంహారము సాధ్యమవును.

**1.4.1 మన్నియోగ రాజ్యము - తాటక వధ**

మరుసటి రోజున గంగా నదిని దాటడానికి విశ్వామిత్ర రామలక్ష్మణులు పడవలో ప్రయాణమయ్యారు. ఆ పడవ గంగా నదిలో వెళుతుండగా ఒక చోట గట్టిగా ధ్వని వినిపించింది. అప్పుడు రాముడు అంత గట్టిగా ధ్వని ఎందుకు వినిపిస్తుంది అని విశ్వామిత్రుడిని అడిగాడు. అప్పుడు ఆయన ఇలా చెప్పాడు "ఒకనాడు చతుర్ముఖ బ్రహ్మ తన మనస్సుతో కైలాస పర్వత శిఖరాల మీద ఒక సరోవరాన్ని నిర్మించారు. ఆ సరస్సుకి మానస సరోవరం అని పేరు. ఆ సరోవరం నుంచి ప్రవహించినదే సరయు నది. పవిత్రమైన ఆ సరయు నది ఈ ప్రాంతంలో గంగా నదితో సంగమిస్తుంది, కాబట్టి ఒకసారి ఆ నదీ సంగమానికి నమస్కరించ మన్నాడు". అవతలి ఒడ్డుకు చేరాక అందరూ పడవ దిగి అరణ్యంగుండా తమ ప్రయాణం కొనసాగించారు. అలా వాళ్ళు వెళుతుంటే అక్కడున్న అరణ్యంలో ఈల పక్షులు భయంకరమైన శబ్దాలు చేస్తున్నాయి, పులులు, సింహాలు, ఏనుగులు తిరుగుతున్నాయి. ఈ అరణ్యం ఇంత భయంకరంగా ఎందుకుందని రామలక్ష్మణులు విశ్వామిత్రుడిని అడగగా, ఆయన ఇలా చెప్పారు "పూర్వము ఇక్కడ మలదము, కరూషము అని రెండు జనపదాలు ఉండేవి. దీనినే మన్నియోగ (మనఃనియోగ) రాజ్య మందురు.

**కస్యచి త్వఽథ కాల స్య యక్షీ వై కామ రూపిణీ,**
**బలం నాగ సహస్ర స్య ధారయన్తీ తదా హ్యభూత్**
**తాటకా నామ భద్రం తే భార్యా సున్ద స్య ధీమతః,**
**మారీచో రాక్షసః పుత్రో యస్యాః శక్ర పరాక్రమః**
**వృత్త బాహు ర్మహా వీర్యో విపులాఽఽస్య తను: మహాన్ ,**

**రాక్షసో భైరవాఽఽకారో నిత్యం త్రాసయతే ప్రజాః**
**ఇమౌ జనపదౌ నిత్యం వినాశయతి రాఘవ,**
**మలదాం శ్చ కరూశాంశ్చ తాటకా దుష్ట చారిణీ**
**సేయం పన్థానమ్ ఆవృత్య వసతి అర్ధ యోజనే,**
**అత ఏవ చ గన్తవ్యం తాటకాయా వనం యతః**
**స్వ బాహు బలమ్ ఆశ్రిత్య జహి ఇమాం దుష్ట చారిణీమ్,**
**మన్నియోగాత్ ఇమం దేశం కురు నిష్కణ్టకం పునః**
**న హి కశ్చిత్ ఇమం దేశం శక్తో హి ఆగన్తుమ్ ఈదృశమ్,**
**యక్షిణ్యా ఘోరయా రామ ఉత్సాదితమ్ అసహ్యయా**

ఎంతో సంతోషంగా ఉండాల్సిన ఈ రెండు పట్టణాలు ఇవాళ అలా లేవు. దీనికంతటికి కారణం తాటక అనే ఒక స్త్రీ, ఆమె ఒక యక్ష కాంత, రాక్షసిగా మారి ఇక్కడున్న జానపదులందరినీ హింసించేది, ఒకప్పుడు ఇంద్రుడు వృత్రాసురుడనే రాక్షసుడిని సంహరించాడు, వృత్రాసురుడు బ్రాహ్మణుడు కావడం వల్ల ఆయనని చంపినందుకు ఇంద్రుడికి బ్రహ్మహత్యా పాతకం వచ్చింది. ఆ బ్రహ్మహత్యా పాతకం వల్ల ఇంద్రుడికి రెండు లక్షణాలు వచ్చాయి, ఆయనకి శరీరంలొ మలం పుట్టడం ప్రారంభమయ్యింది, అలాగే ఆకలి కూడా కలిగింది. అప్పుడు ఆయన ఋషులని ఆశ్రయిస్తే వాళ్ళు ఆ రెండు లక్షణాలని తొలగించారు. కాని ఆ రెండు భూమి మీద పడ్డాయి. అవి పడ్డ ప్రదేశాలని మలదము, కరూషము అనే రెండు జానపదములుగా వర్ధిల్లుతాయి, ఇక్కడున్న ప్రజలు సుఖసంతోషాలతో ఆనందంగా ఉంటారని ఇంద్రుడు వరం ఇచ్చాడు. అలాగే పూర్వ కాలంలో సుకేతు అనే యక్షుడికి పిల్లలు లేకపోతే బ్రహ్మ గూర్చి తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై నేను నీకు కొడుకులని ఇవ్వను, ఒక కూతురుని ఇస్తాను, ఆమె కామరూపి, మహా అందగత్తె, ఆమెకి 1000 ఏనుగుల బలముంటుంది అని వరం ఇచ్చాడు. ఆమె పేరు తాటక. ఆమెకి యవ్వనం వచ్చాక సుందుడుకి ఇచ్చి

వివాహం చేశారు. వాళ్ళకి మారీచుడు జన్మించాడు. 1000 ఏనుగుల బలం ఉండడం వలన, గర్వంతో, అరణ్యంలో ఇష్టమొచ్చినట్టు తిరిగేవాళ్ళు. ఒకనాడు సుందుడు అగస్త్య మహర్షి మీద దాడికి దిగాడు. ఆయనకి ఆగ్రహం వచ్చి సుందుడిని సంహరించారు. ఇది గమనించిన తాటక తన కుమారుడితో కలిసి అగస్త్య మహర్షి మీదకి వచ్చింది, అప్పుడాయన తాటకని, 'నీకు వికృతరూపంవచ్చుగాక' అని, మారీచుడిని ఇవ్వాల్టినుంచి రాక్షసుడివి అవుతావని శపించారు. ఆ తాటక ఈ రెండు నగరాల్లో సంచరిస్తుంది, ఆమె నరమాంస భక్షణకి అలవాటుపడింది, అందుకే ఈ నగరాలలోని జనాలు ఊరు వదిలి వెళ్ళిపోయారు.

**న హి తే స్త్రీ వధ కృతే ఘృణా కార్యా నరోత్తమ,**
**చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం రాజ సూనునా**
**నృశంశం అనృశంసం వా ప్రజా రక్షణ కారణాత్,**
**పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సదా**
**రాజ్య భార నియుక్తానామ్ ఏష ధర్మః సనాతనః.**
**అధర్మ్యం జహి కాకుత్స్థ ధర్మో హి అస్యాం న విద్యతే**

కావున రామా! స్త్రీని చంపుటట్లు అను సందేహము వలదు. నాలుగు వర్ణముల (ప్రజలందరిని) మేలుచేకూర్చుట రాజకుమారుడిగా నీ కర్తవ్యము. ధర్మ పరిరక్షకుడైన ప్రభువు ప్రజల హితము కొరకై చేయు కార్యము క్రూరమైనదా! కాదా! అని చూడరాదు. అది పాపకృత్యమైనను, దోషయుక్తమైనను అవశ్యము ఆచరింపవలసినదియే. ఈమె కృత్యములో 'ధర్మమూ' అను మాటకు చోటులేదు కావున తక్షణమే సంహరింపుము. రామ-వసిష్ఠ సంవాదము చివర తాను అయోధ్యా ప్రజలకు ఇచ్చిన ప్రతిజ్ఞ అయిన గురువాక్యము మీరరాదు అన్న విషయము గుర్తుకు తెచ్చుకొని ...

**పితు ర్వచన నిర్దేశాత్ పితు ర్వచన గౌరవాత్,**
**వచనం కౌశిక స్య ఇతి కర్తవ్యమ్ అవిశఙ్కయా**
**గో బ్రాహ్మణ హితార్థాయ దేశ స్య అస్య సుఖాయ చ**
**తవ చైవ అప్రమేయ స్య వచనం కర్తుమ్ ఉద్యతః**

"మా తండ్రిగారు మీరు ఏది చెయ్యమంటే అది చెయ్యమన్నారు, గురువుగారైన మీరు చెప్పారు కనుక లోకాన్ని రక్షించడం కోసం, బ్రాహ్మణులను, గోవులను, ఇక్కడ ఉంటున్న అన్ని ప్రాణులను కాపాడడం కోసం సుక్షత్రియుడనైన నేను తాటకని తప్పక సంహరిస్తాను" అన్నాడు. పైన తెల్పిన విషయమును బట్టి స్త్రీ వధ అధర్మము అయినా దేశ హితార్ధము ధర్మముగా చెప్పబడినది.

**1.4.2 తాటక వధ యందలి యోగ రహస్యము**

ఈ కద యందలి రహస్యమును చూద్దాము.

మనః, నియోగము అను శబ్దముల నుండి వచ్చినది మన్నియోగము. మనస్సుపై సంయమమును ఉంచి, మనస్సు నందలి చపలత్వమును శాంతింప చేయవలెను. ఈ నియోగ సాధనే "మన్నియోగ రాజ్యము". ఈ సాధనలో సాధకుడు పూర్వ సంస్కారములను ఎదుర్కొనాలి. వాటిని నష్ట పరచడము సాధకుని కర్తవ్యము. చెడు ప్రవృత్తుల సమాహారమే తాటక వధ.

**తతః తౌ అశ్మ వర్షేణ కీర్యమాణౌ సమంతతః,**
**దృష్ట్వా గాధి సుతః శ్రీమాన్ ఇదం వచన మఃబ్రవీత్**
**అలం తే ఘృణయా రామ పాపా ఏషా దుష్ట చారిణీ,**
**యజ్ఞ విఘ్న కరీ యక్షీ పురా వర్ధతి మాయయా**

అన్నివైపులా నుండి కురియుచున్న రాళ్లవానలో చిక్కుకొని యున్న రామలక్ష్మణులను చూచి శక్తివంతుడైన విశ్వామిత్రుడు, రామా! ఇంతవరకు ఆమెపై చూపిన కనికరము చాలు. ఈ యక్షిణి కటిక దుర్మార్గురాలు. యజ్ఞములను నష్టపరుచునది. తన మాయ చేత ఇంకను బలపడును అనెను. ఈ కర్మను

విశ్వామిత్రుడు **"అలం"** అనగా శ్రేష్ఠమని పేర్కొనెను. తాటక యొక్క వాస్తవ రూపమును సంత్ కబీరుదాస్ దోహాలో ....

**जिन खोजा तिन पाइया, गहरे पानी पैठ, मैं बपुरा बूडन डरा, रहा किनारे बैठ।**

తటాకము అనగా సరోవరం. తత్వము అనగా తీరము. తాటక అనగా ఆ జలాశయ తీరమున కూర్చొని సాగర జ్ఞానమంతయు ప్రాప్టించుకొన్నాము అనుకోవడము. కేవలము అహంకార వృత్తి సంసార సాగరము లో మునిగి ఈ ప్రకృతి యందు దాగి ఉన్న ఆత్మరూప అవస్థను తెలుసుకొనలేక సాగర తీరముననే కూర్చొని ఆత్మజ్ఞానమునకై ప్రయత్నించడము. పైపై విషయములను తెలుసుకొని సర్వము తెలియుననుకోవడము తాటక వృత్తి. ఈ తాటక వృత్తి రాముని ఆత్మ సాధనా రూప యజ్ఞమునకు ఆటంకము. ఈ సాధనలో సాధకుడు పూర్వ సంస్కారములను ఎదుర్కొనాలి అనుటకు ఉదాహరణగా యోగా వాసిష్ఠములోని ముముక్షు వ్యవహార ప్రకారణములో వసిష్ఠుడు ఈ విధముగా శ్రీరామునికి బోధిస్తాడు.

**యధా యధా ప్రయత్న స్స్యాత్, భవేదాసు ఫలం తదా,**

**ఇతి పౌరుషమేవ ఆస్థి దైవం ఆస్తు తదేవ చ.**

**కశ్చిన్మామ్ ప్రేరయత్యేవం ఇత్యనర్ధ కుకల్పనే,**

**యఃస్థితో దృష్ట్వా ముస్ృముజ్య నత్యాజ్యో సౌ దూరతో దమః.**

**ధైవనెత్తు అభ్యుక్తోహం తత్కారో మిదృశం స్థితం,**

**సమాశ్వాసాన వాగేషా న దైవం పరమార్ధతః.**

చేసే ప్రయత్నమును బట్టి ఫలితము ఉంటుంది. అదృష్టము (దైవము) అనునది కూడ పురుషాకారమును అనుసరించే ఉంటుంది. ఎవ్వరైతే ఎదురుగా కనబడుతున్న పురుష ప్రయత్నమును, వాని ప్రయోజనములు గుర్తించక కుకల్పనలు గావించు చున్నారో అట్టివారిని దూరంగా త్యజించడము మేలు. ఎవరు దైవముచేత ప్రేపరేపింపబడి పనులు చేస్తున్నారు అనుకొంటూ తమను

ఓదార్చుకోవడం మాత్రమే జరుగుచున్నది. కానీ మా దృష్టిలో "దైవము" అనునది లేనేలేదు. ప్రయత్న బలము చేతనే మహాత్ములు కార్యములను సాధించు కొన్నారు. ఈ సభకు విచ్చేసిన విశ్వామిత్రుడు తన పౌరుషంతోనే బ్రహ్మర్షి కాగలిగాడు. రామా, రెండు రకాల పూర్వ వాసనలు, అంటే, శుభ, అశుభ వాసనలు వుండవచ్చు. నీవు శుభ వాసనలతో ప్రేరేపించి నట్లైతే ఇప్పుడు చేసే శుభ పౌరుషం వాటికి తోడై ముక్తిని పొందుతావు. అలాకాక, అశుభ వాసనలు (కర్మలు) బలంగా ఉంటే, ప్రయత్నించి వాటిని జయించాలి. పూర్వ వాసనల తో నిమిత్తం లేకుండా, ఇప్పటి నుంచే శుభ కర్మలు మాత్రమే చేసి, శుభ వాసనలు మాత్రమే స్థిర పరచుకో. అభ్యాసం వలనే వాసనలు బలపడు తున్నాయి అనునది స్పష్టమే కదా! ఆత్మ జ్ఞానం కలిగితే నీ మనో వ్యాధులు అన్నీ నశిస్తాయి. అప్పుడు ఆ శుభ వాసనలను అనుసరించట కూడా వదలి సత్స్వరూపం లో నిలిచి వుండు అని చెప్తారు.

## 1.5 చక్రములు

### 1.5.1 చక్ర రహస్యములు

మరునాడు తెల్లవారగానే శ్రీరామునిపై ప్రీతితో, తాటక వధ కావించాడన్న సంతోషములో, దేవతల కోరికపై విశ్వామిత్రుడు, శ్రీరామునికి అనేకమైన యోగచక్రములను, అస్త్రములను ఇస్తాడు. వాటి విషయమై పరిశీలన చేద్దాము. **"గయాన్ త్రాయతే ఇతి గాయత్రీ"** అని ఆదిశంకరులవారు తనభాష్యములో వివరించారు. 'గయలు' అనగా ప్రాణములు అని అర్థము. 'త్రాయతే' అనగా రక్షించడం. కనుక ప్రాణములను రక్షించే మంత్రం గాయత్రీ మంత్రం. వాల్మీకి మహర్షి ప్రతి వేయి శ్లోకాలకు మొదట ఒక్కొక్క గాయత్రి మంత్రాక్షరమును చేర్చి 24 అక్షరములతో 24,000 శ్లోకాలతో శ్రీ మద్రామాయణమును రచించినారు. అట్టి గాయత్రీ మంత్ర సృష్టికర్త విశ్వామిత్రుడు. అహం అనగా నేను. ఈ అహం పశుపక్ష్యాదులలోను, మనుష్యులలోను, చివరికి సృష్టి, స్థితి లయకారులైన బ్రహ్మ,

విష్ణు మహేశ్వరులలోను కలదు. ఎందుకనగా ఈ అహం లేకుండా కార్యములు జరుగవు. అహం అనుదానికి సృష్టిలోని ప్రతి వస్తువు చేతనా చేతన రూప శక్తి అని అర్ధము. ఈ అహము ఒక శక్తి. ఏబది వర్ణములలో మొదటిది **అ** కారము. చివరిది **హ** కారము. ఈ రెండిటిని కలిపి బిందువును కలపిన **అహం** అయినది. అకారము శివుడు (ప్రకాశము). హకారము శక్తి (విమర్శము) ఇది తనంతట తాను ప్రకాశించి ఇతరులను ప్రకాశింప చేయును. ఇది సృష్ట్యున్ముఖమైనప్పుడు విమర్శ రూపమగును. ఆ ఆది శక్తియే పరహంత. ఆ పరహంతయే ఈ విశ్వము. అట్టి శక్తియే వివర్తోపాదానము. ఈ శబ్ద ప్రపంచమునకు పరావాక్కే ఉపాదానము. అది సూక్ష్మాతి సూక్షము.

**న గాయత్ర్యాః పరః మంత్రః న మాతు పరా దేవతా**

విశ్వామిత్రుడు శ్రీరామునితో అట్టి శక్తి ఉపాసనను చక్ర, అస్త్రముల ద్వారా అభ్యాసము చేయించు చున్నాడు.

**తాని దివ్యాని భద్రం తే దదామ్యఽస్త్రాణి సర్వశః,**
**దణ్ణ చక్రం మహ ద్దివ్యం తవ దాస్యామి రాఘువ**
**ధర్మచక్రం తతో వీర కాల చక్రం తథైవ చ,**
**విష్ణు చక్రం తథా అత్యుగ్రమ్ ఐన్ద్రం చక్రం తథైవ చ**

శ్రీరామునకు దండచక్రము, ధర్మచక్రము, కాలచక్రము, విష్ణు చక్రము, ఇంద్రచక్రము అనుగ్రహిస్తారు.

యోగ మార్గముందు ఉత్కృష్ట స్థితి పొందవలెనన్న ఎన్నో విధములైన యోగ చక్రముల అభ్యాసము చేయవలెను. ఈ శిక్షణను వసిష్ఠ మహర్షి యోగ వాసిష్ఠములో చెప్పిన దానికి అనుబంధముగా విశ్వామిత్రుడు తగిన శిక్షణను ఇచ్చిరి. వాల్మీకి మహర్షి ఈ యోగచక్రముల రహస్యములన్నింటిని రామాయణములో పొందుపరిచారు. వాటిలోనివే దండచక్రము, ధర్మచక్రము,

కాలచక్రము, విష్ణు చక్రము, ఇంద్రచక్రము. దండ చక్రమనగా నియంత్రణకు చెందిన చక్రము, వ్యక్తి యొక్క పిండ రచన, తత్సంబంధమైన శక్తి కేంద్రము ధర్మ చక్రము, కాలగతి, తత్సంబంధమైన కూట శాస్త్రమును తెలిపేదే కాలచక్రము, విశ్వసృష్టికి ఆవశ్యకమైన దివ్య ప్రదిక్షణ గతి తెలిపేదే విష్ణు చక్రము, దివ్య యోగ చక్ర జ్ఞానమే ఇంద్ర చక్రము. ఈ దివ్య చక్ర జ్ఞానమును గురుముఖతః అభ్యాసము ద్వారా ప్రాప్తించుకొనవలెను. పై చెప్పబడిన చక్ర విషయాలను పరిశీలిద్దాము.

**1.5.2 దండ చక్రము:**

దండ అనగా నియంత్రణ. ప్రకృతి యందలి కార్యకలాపము తనదైన నియమము, నియంత్రణలో నడుస్తూ ఉండును. అటువంటి నియమ బద్ధమైన అవస్థనే దండపాణి అని యముడు అని కాలము అని అనెదరు. ఈ ద్రుష్టి గోచరమైన జగత్తును భగవంతుడు తన మాయ ద్వారా సృజించి సంహారము చేయుచుండును. (వసిష్ఠ మహర్షి యోగ వాసిష్ఠము లో జగత్తు గురించి వివరించుతూ.... నానా భేదాలతో లోచే ఈ జగత్తు స్వప్నం వంటిది. కల జగత్తు లో కనపడే వస్తువులు ఏవి నిజం కానట్లే దృశ్య ప్రపంచము ఉండటం చేతనే బంధం కలుగుతుంది. దృశ్యం నశిస్తే బంధం కూడా నశిస్తుంది. స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తంతా ప్రళయం లో విలీనమై పోయినపుడు మిగిలి ఉండేదే "సత్". దానికి నామరూపాలు లేవు. అది వెలుగు, చీకటి ఏది కాదు. దీనినే ఋతం, ఆత్మ, పరబ్రహ్మం, సత్యము మొ|| పేర్లు కల్పించారు. అలా "జీవభావాన్ని", "జీవత్మాన్ని" పొందిన పరమాత్మ"మనస్సు" గా మారుతుంది. అలా సంకల్ప వికల్పాల ద్వారా "ప్రపంచము" అనే ఇంద్రజాలం విస్తరిస్తుంది. ఎండమావిలోని అలలు సత్యము కాకపోయినా సత్యము గా గోచరించే విధముగా ఈ జగత్తు కనబడుతుంది. ఈ జగత్తుకే "అవిద్య", "బంధం", "మోహము", "మహత్తు", "తమస్సు" మొ. పేర్లు పెట్టారు.) ఈ సృష్టి యందు మృత్యువు కూడా ఒక భాగమే. అయితే ధీరపురుషుడు ఎప్పుడు దుఃఖము చెందడు.

యోగా వాసిష్ఠములోని శుక్రోపాఖ్యానములో కాల స్వరూపమును వివరించుతూ ..... కాలుడు నియమ పాలకుడు. కల్పాంత కాల మహానలములు కూడా కాలుని దహింపజాలదు, కాలుడు ఎన్నో లోకాలను భక్షించెను. రుద్రకోటులను, విష్ణు బృందములను మ్రింగెను. కాలునికి అసాధ్యమైనది లేదు. కాలుడు భోక్త, మిగిలిన వారందరు కాలునికి భోజ్య పదార్థములు. కల్పాంతమున విధికిని కూడా మృత్యువు సంభవించును. పరమేశ్వరి 'నియతిని' మాత్రమే పాలించేవాడు.

లలిత సహస్ర నామావళిలో దండ చక్రము యొక్క వివరణ ఈయబడినది.

**27. కిరిచక్ర రథారూఢ దండనాథా పురస్కృత**

**జ్వాలా మాళినికాక్షిప్త వహ్ని ప్రాకార మధ్యగా**

ఇక్కడ దండనాథ అనగా వారాహి. ఆమెయే లలితా దేవి నియమించిన కాలస్వరూపిణి. మనము ఒకసారి దేవీభాగవతమును పరిశీలించినట్లయితే అనేకమైన బ్రహ్మాండాలు నుంచి అనేక మంది రుద్రులు, విష్ణువులు, బ్రహ్మలు ఇంకా అనేకమైన దేవతా ఇత్యాది వారు ఆమె దర్శనార్థమై వచ్చినారు అని గ్రహించవచ్చు. శ్రీ సామవేదం షణ్ముఖ శర్మ గారు లలితా సహస్ర భాష్యములో చాలా వివరంగా చెప్పినారు. యోగ వాసిష్ఠములోని లీలోపాఖ్యానములో అతివాహిక (సూక్ష్మ) శరీరంతో, నిద్ర పోయినవాడు ఒక స్వప్నము నుండిమరొక స్వప్నము లోకి వెళ్లినట్లు, లీలా (సరస్వతీదేవి భక్తురాలు) సరస్వతులిద్దరు సమస్తబ్రహ్మాండాలను చూచారు అని మహర్షి చెప్తారు. సృష్టి, స్థితి, లయ కారిణి ఆ పరమేశ్వరియే. అంతయు ఆ పరమేశ్వరి నియతి ప్రకారమే నడచునని వసిష్ఠుల వారు చెప్పియున్నారు.

**స్వయంఊర్ధ్వంప్రాయాత్యగ్నిహి స్వయామ్యాంతిప్యాంస్యధః,**

**భోక్తారంభోజనంయాతి సృష్టించాప్యంతకః స్వయమ్.**

అగ్ని సహజంగానే ఊర్ధ్వముఖంగా జ్వలిస్తుంది. నీరు పల్లము వైపు ప్రవహిస్తుంది. భోక్త వద్దకు భోజనం వచ్చి చేరుతుంది. కాలుడు కూడా సృష్టి వద్దకు స్వయముగా వచ్చి చేరుకొన్నాడు. ఈ విధముగా శ్రీరాముడు వసిష్ఠుడు బోధించిన దానికి అనుసంధానంగా విశ్వామిత్రుడు అనుగ్రహించిన దండ చక్రమును స్వీకరించి ప్రకృతి యొక్క నియమమును అవగాహన చేసుకొన్నాడు.

**1.5.3 ధర్మ చక్రము:**

జీవులకు వాటి వాటి స్వభావమును బట్టి ఏ రకమైన ధారణ కలిగియున్నదో అదే ధర్మము. ప్రాప్తించిన అవస్థ నుండి తనకు తానుగా ప్రగతి నొందుచు నారాయణుడిగా పరిణామము చెందుటయే ధర్మము. ధర్మము యొక్క పరిభాషను చెపుతూ ... **ధారణాత్ ధర్మం ఇత్యాహు ధర్మో ధారయతే ప్రజా!** ప్రాప్తించిన పరిస్థితులను అనుసరించి దిశాగమనము చేయుటయే ధర్మము. ధర్మము అనగా మానవత్వాన్ని రక్షించే గుణము. హిందూ దేశానికి ధర్మక్షేత్రమని పేరు. సనాతన ధర్మం ప్రకారం " ఏ ప్రవర్తనా నియమావళి, మూల సూత్రాలు, మరియ ఏ న్యాయము చేత వ్యక్తి గత, సామాజిక, మతపర జీవితం సజావుగా నడపబడుతుందో, ఏ కారణము చే సర్వ జీవజాలం, ప్రకృతి లోని ప్రతి పదార్థం, శక్తి ఒక దానితో నొకటి అనుసంధానించబడి మనుగడ సాదిస్తాయో, ఏ కారణము చే ఈ ప్రపంచము, బ్రహ్మాండ మండలం తమ ఆస్తిత్వాన్ని నిలుపుకుంటున్నాయో, అట్టి దానిని ధర్మము గా నిర్వచించారు. ధర్మానికి వేదాలు ప్రమాణాలు. మానవులు తమకు కలిగిన సత్సంకల్పాలను ఇతరులకు నష్టము కలిగించకుండా నెరవేర్చుకొనడమే ధర్మము యొక్క ముఖ్య లక్షణమని చెప్పవచ్చును. భూమి మీద సకల మానవులలోను కొందరు ఉత్తములుగా నుండి తోటి మానవులలో పూజింపబడితే దైవ సమానులుగా భావించబడడానికి వారు ఆచరిస్తున్న ధర్మ గుణమే ప్రధాన కారణము. శాంతి, దయ, అహింస, సత్యము, అస్తేయము, ఉపకారము, సానుభూతి, శౌచము మొదలగు సుగుణము లన్నీ ధర్మమునకు

అవయవాలై ఉన్నాయి. యోగ వ్యవస్థలో ధర్మం నిజమైనది; ధర్మం యోగాలో భాగమని పతంజలి సూచిస్తున్నాడు. ధర్మం కంటే ఉన్నతమైనది మరేమీ లేదు. ధర్మం ద్వారా బలహీనుడు రాజు కంటే బలంగా ఉంటాడు. నిజమే ధర్మం అంటే సత్యం (సత్య); అందువల్ల ఒక వ్యక్తి సత్యాన్ని మాట్లాడినప్పుడు, "అతను ధర్మం మాట్లాడుతాడు" అని చెప్తారు; ఆయన ధర్మం మాట్లాడతాడు "ఆయన నిజం మాట్లాడుతాడు!" రెండూ ఒకటే. —బృహదారణ్యక ఉపనిషత్తు, 1.4.xiv.

యోగా వాసిష్ఠములో వసిష్ఠముని వివరించుతూ ఈ సంసార దుఃఖాన్ని పోగొట్టడానికి తపస్సు, ధర్మము, దానము, సత్యము, తీర్థములు బ్రహ్మ సృష్టించాడు అని చెప్తారు. వసిష్ఠ మహర్షి, విశ్వామిత్ర మహర్షి చెప్పిన ఈ ధర్మసూక్ష్మములను శ్రీరాముడు అనుసరించాడు అని వాల్మీకి రామాయణము ద్వారా మనకు తెలియు చున్నది. లలితా సహస్ర నామములో .... **ధర్మాధర్మవివర్జితా... (శ్లోకము 62 ), ధర్మాధారా..(శ్లోకము 165 ), ధర్మిణీ ధర్మవర్ధినీ...(శ్లోకము 176 )** (అనగా ధర్మము, అధర్మములు లేక జగత్తులో అబేధమును పొందినది, ధర్మము నిలబడుటకు ఆధారమైనది, ధర్మమే స్వభావముగా కలది) అని చెప్పబడినది. విశ్వామిత్రుడు శ్రీరామునికి ధర్మస్వరూపిణి ఆ గాయత్రీమాత ఉపాసన చేయించుచున్నాడు,

**1.5.4 కాలచక్రము:**

గతివలనే కాలము తెలియును. లేనిచో కాలమనెడి విషయము తెలియదు. కాలము యొక్క రహస్య జ్ఞానము సాధారణ బుద్ధికి అందదు. అందుచే వైదిక పరంపరలో భగవానుని కాలునిగా వర్ణించారు.

తులసీదాసు తన రామాయణములో లక్ష్మణుడిని కాల స్వరూపుడిగా అభివర్ణించారు. పాల సముద్రంలో శ్రీ మహావిష్ణువు శయనించే శేషతల్పమే ఆదిశేషుడు. సర్పాలకు ఆద్యుడు, రారాజు. ఈతని అంశలోనే రామాయణంలో

లక్ష్మణుడు జన్మించాడు. భగవానుడు యోగ నిద్రలో ఉన్నా ఆదిశేషుడు మెలుకువగానే ఉంటాడు. ఇక్కడ తెలియవలసిన విషయమేమనగా కాలము విశ్రాంతి నొందదు. అరణ్యవాసములో లక్ష్మణుడు నిదుర పోకుండా సీతారాముల రక్షణలో ఉన్నట్లు రామాయణము ద్వారా మనకు అవగతము అవుతుంది.
యోగా వాసిష్ఠములోని శుక్రోపాఖ్యానములో కాలుని విశ్వరూపాన్ని తెలియ చేస్తారు. ఇంకను దాశురోపాఖ్యానము, భుశుండోపాఖ్యానములో కాలమును గురించి వివరణ ఈయబడినది.
ఈ జ్ఞానానికి అనుసంధానముగా విశ్వామిత్రుడు శ్రీరామునికి కాలచక్ర జ్ఞానమును ప్రసాదించెను.

### 1.5.5 విష్ణు చక్రము:

'విష్ణు' అనగా అస్థిత్వముల పాలన, పోషణ, చేయు రక్షణ శక్తి. ఉత్పత్తి, స్థితి, లయములు విశ్వమునందలి అవస్థలు. "స్థితి" అవస్థనే "విష్ణు" అంటారు. ప్రతి అవస్థ స్థిరముగా ఉండుటకు అందు అంతర్గతముగా ఉన్న గతి కారణము. దానినే ప్రదక్షిణ గతి అనెదరు. ఈ ప్రదక్షిణ గతి వస్తు రూప ధారణ చేయును. అందుచేతనే విష్ణువు చేతి యందున్న చక్రము (సుదర్శనం) సవ్య గతిన తిరుగు చుండును. విశ్వము యొక్క సవ్యమైన ప్రదిక్షణ గతి విశ్వమునకు రక్ష. మనము గమనించితే ఈ విశ్వములో అణువు మొదలు అన్ని గోళములు సూర్య మండలము మరియు జ్యోతిష్య చక్రము సవ్య దిశలోనే తిరుగుచుండెను. ధ్రువ మండలము చుట్టూ తిరిగే జ్యోతిష్య చక్ర భ్రమణమును దానికి రక్షగా తిరిగే సుదర్శన చక్ర భ్రమణమును భాగవతములో గమనించవచ్చు. ఇక్కడ గమనించినట్లయితే అణువు మొదలు బ్రహ్మాండాలు సమస్తము, గ్రహ మండలము, సూర్యుడు, సప్తర్షి మండలము చివరకు రుద్రుడు, విష్ణువు కూడా ఒక శక్తి ప్రధానంగా చేసుకొని ప్రదక్షిణ గతి చేయుచుండును ఎందుకనగా రుద్రుడు, విష్ణువు కూడా ఒక గోళాకార జ్యోతి స్వరూపమే అని గ్రహించాలి. అట్టి శక్తికి దగ్గరగా జరిగినప్పుడు ఆయా

గ్రహములు/మండలముల ప్రభావము/శక్తి అధికముగా ఉండును. అలానే దూరముగా జరిగినప్పుడు ప్రభావము/శక్తి తక్కువగా ఉండును. చతుర్యుగాలు, వాటి కాలప్రమాణము, ఆయా యుగాలలో ఉండే ధర్మము ఆయా గ్రహములు/మండలములు ఆ పరాశక్తి యొక్క సమీప స్థితిని బట్టి యుంటాయి, ఇదియే కాలస్వరూపము అని గ్రహించాలి. (Scientific research shows that atoms including planets etc. does not rotate in perfect circle) ఈ విధముగా అంతర్లీనంగా బ్రహ్మాండములలో ఒకదానికి ఒకటి ప్రదక్షిణ గతి చేసుకొంటూ, **(యానికానిచ పాపాని.......)** సమస్త బ్రహ్మాండాలు ఒక శక్తి కేంద్రముగా ప్రదక్షిణ చేయుచుండును. ఆ శక్తియే లలితా పరమేశ్వరి గా గ్రహించగలరు. (పరస్పరాకర్షణ వలన ఈ సమస్త బ్రహ్మాండములు స్థిరముగా ఉండును. ఇదియే ప్రక్రుతి, పురుషుల తత్వము. విత్తు ముందా చెట్టు ముందా చెప్పడం కష్టం. అలానే ఏది దేనికి ఆధారమో చెప్పడం కష్టం). అట్టి పూర్తి ప్రదక్షణ గతి ఎన్ని కోట్ల కోట్ల జన్మలకైనా సాధ్యము కాదు. దహించి వేయబడిన శరీరము నూరు కోట్ల జన్మలకైనను మరల కనిపించదు అని శివ గీతలో పరమేశ్వరుడు చెప్పి ఉన్నాడు. కావుననే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు కూడా మరల అట్టి రామావతారమును పొందలేరు.

ఉదాహరణకు జ్యోతిషశాస్త్రము పైన అవగాహన ఉన్న ఎవరైనా పరిశీలించి నట్లయితే ... భూమి పైన ఉండి గ్రహాలను పరిశీలించినప్పుడు కొన్ని గ్రహాలకు ప్రత్యేకమైన గతులు (చలనాలు) ఉన్నట్లు తెలుస్తుంది. కొన్ని గ్రహాలైన బుధుడు, శుక్రుడు, కుజుడు, గురువు, శని, రవి, చంద్ర గ్రహాలకు ఋజుగతి మాత్రమే ఉంటుంది. రాహు, కేతువులు ఎప్పుడూ వక్రగతిలోనే ఉంటాయి. ప్రతి గ్రహం సూర్యుని చుట్టూ వాటి వాటి కక్ష్యల్లో తిరుగుతుంటాయి. భూమి కూడా తన కక్ష్యలో సూర్యుని చుట్టూ తిరుగుతుంటుంది. కాబట్టి వాస్తవంలో ఏ గ్రహానికి వక్రగతి

గాని, ఇతర గతులు గాని ఉండవు. కానీ భూమి మీద ఉన్న పరిశీలకుడు ఒక గ్రహాన్ని పరిశీలిస్తున్నప్పుడు ఒకొక్కసారి ఆ గ్రహం ముందుకు వెళ్ళినట్లు, ఒకొక్కసారి వెనుకకు వెళ్ళినట్లు, ఒకొక్కసారి కదలకుండా ఉన్నట్లు కనిపిస్తుంది. ఒక గ్రహం ముందుకు వెళ్ళినట్లు కనపడే స్థితిని ఋజుగతి అంటారు. ఒక గ్రహం వెనుకకు వెళ్ళినట్లు కనపడే స్థితిని వక్రగతి అంటారు. ఒక గ్రహం వక్రగతిలో ఉన్నదంటే అది భూమికంటే వెనుక ప్రయాణిస్తుందన్న మాట. అంటే ఆ గ్రహము యొక్క పరిభ్రమణ వేగము భూమి కన్నా తక్కువ అన్న మాట. అలానే ఋజుగతిలో ఉన్న గ్రహాల పరిభ్రమణ వేగము భూమి కన్నా ఎక్కువ. ఉదాహరణకు మనము రైల్లో గాని, బస్సులో గాని ప్రయాణించుచు నిశ్చలముగా బయిట కనబడే వాహనాలు, చెట్లు ఇత్యాదిగా గమనించినట్లయితే, రైలు, బస్సు కన్నా వేగముగా ప్రయాణించే వాహనాలు మనకంటే ముందుగా ప్రయాణిస్తున్నట్లు, తక్కువ వేగముతో ప్రయాణించేవి గాని, స్థిరముగా ఉన్న చెట్లు మొదలైనవి వెనుకకు వెళుతున్నట్లు భ్రమ కలుగుట సహజమే కదా! కావున ప్రతి అవస్థ స్థిరముగా ఉండుటకు అందు అంతర్గతముగా ఉన్న సవ్య ప్రదిక్షణ గతియే కారణము.

ఇక్కడ ఇంకొక విషయము గమనించాలి. బంట్రోతు permission లేకుండా ఎలా కలెక్టర్ దర్శనము సాధ్యము కాదో అలానే ముందుగా మన ప్రత్యక్ష దేవతా స్వరూపులైన మాత, పితరులు, గురువులు, గ్రామ దేవతలు, కుల దేవతలు, సూర్య చంద్రుల ఉపాసన/పూజ తర్వాత క్రమముగా ప్రధాన దేవతల పూజ చేయాలి. అప్పుడు మాత్రమే సంపూర్ణ ఫలము లభిస్తుంది.

అపసవ్య గతి వినాశకారి. హఠయోగ అభ్యాసమునందు యోగసాధకుడు తన శరీరము నుండి బయటకు వచ్చి మరల క్షేమముగా శరీరము నందు ప్రవేశించును. శరీరము నుండి జీవాత్మ బయిటకు రావడమనగా మృత్యువులో సమానము. శరీరము నుండి జీవాత్మ బయిటకు వచ్చునప్పుడు శ్వాస-నిశ్వాస సమాప్తమై

హృదయగతి ఆగిపోవును. సూక్ష్మ శరీరము తనదైన విశిష్ట సాధన ద్వారా బయిటకు పోవును. అటువంటప్పుడు దివ్య చక్షువులు పనిచేయును. అదే విధముగా దివ్య శ్రోత్రములు, దివ్య స్పర్శ, దివ్య తన్మాత్రల అనుభూతి కల్గును. ఊర్ధ్వగమనములో సాధకుడు తన దివ్య చక్షువుల ద్వారా తన అస్థిత్వమునకు ఎదురుగా ఒక దివ్య చక్రమును అపసవ్యగతిలో తిరుగుచుండ దర్శించును. జీవాత్మ తిరిగి శరీరములో ప్రవేశించినప్పుడు ఆ దివ్య చక్రము సవ్యమైన ప్రదిక్షిణ పద్ధతిలో ఉండును. ఆ తర్వాత హృదయ స్పందన, రక్త ప్రసరణము ప్రారంభమగును. యోగా వాసిష్ఠములోని ఉద్దాలకోపాఖ్యానములో ఏ విధముగా ఉద్దాలకుడు సమాధి స్థితిలోకి వెళ్లి మరల మరల బాహ్యప్రపంచములోకి వస్తాడు అని వివరింపబడినది. అలాగే వీతహవ్యోపాఖ్యానమున సంగత్యాగము, ప్రాణనిరోధము, సమాధి ద్వారా వీతహవ్యుడు 300 సంవత్సరాలు ఒక అర్ధ ముహూర్తములాగా గడిపి తిరిగి భౌతిక దేహము పునరాశ్రయము చేసిన విషయము చెప్పబడినది. ఇంకా శిఖధ్వజోపాఖ్యానములో ప్రాణ నిరోధము గురించి వివరింపబడినది. వసిష్ఠుడు చెప్పిన జ్ఞానానికి అనుసంధానంగా విశ్వామిత్రుడు విష్ణు చక్ర అభ్యాసము చేయిస్తారు.

### 1.5.6 ఇంద్ర చక్రము:

ఇంద్రుడు అనగా శరీరము నందున్న ఇంద్రియములకు స్వామి. అదే జీవాత్మ. మన శరీరములో ఏడు యోగచక్రములు కలవు. వాటినే సప్తపాతాళములని, సాగరములని, స్వర్గ లోకములని, లేదా సప్త లోకములని, మరియు సప్తర్షులని చెప్పెదరు. సప్త స్వరములు మరియు సప్త వర్ణములని కూడా తెలియును. చక్రము అంటే నాడి కూటమి అని గ్రహించాలి.

సృష్టిలో బ్రహ్మాండము ఏ సిద్ధాంతముపై నిర్మించబడెనో అట్టి సిద్ధాంతము పైననే పిండాండము (మానవ శరీరము) కూడ నిర్మించ బడెనని చెప్పుదురు.

బ్రహ్మాండములోని చంద్ర స్థానము నుండి అమృతము వర్షించు రీతి పిండాండము చంద్ర స్థానమైన శిరో భాగము నుండి అమృతము వర్షించునని యోగ సిద్ధాంతము. చంద్రుని నుండి కురిసిన అమృతము జీవులకు సస్యములను పోషించు రీతి శరీరము లోని చంద్ర స్థానము నుండి వచ్చిన అమృతము శరీరమున ఇంద్రియములను పోషించు చున్నది. అటులనే బ్రహ్మాండమున సూర్యుడు అగ్ని స్థానమై సృష్టికి ఉష్ణమును ప్రసాదించు నట్లు శరీరమున మణి పూరైక చక్రము (నాభి) నుండి జఠరాగ్నిని సృష్ఠించి ఆహారమును పచనము చేసి జీర్ణము చేయుట, రక్త ప్రసరణ, వాయు సంచారము వంటి ఉష్టము చేయు కార్యములను నిర్వర్తించును. శరీరమున వున్న ముఖ్యమయిన సుషుమ్న నాడి మెదడు నుండు వెన్నెముక మధ్య నున్న రంధ్రములో వ్రేలాడి వెన్నెముక చివరి భాగము వరకు వచ్చి యున్నది. ఈ వెన్నెముక పూసల వంటి 33 (ముప్పది మూడు) ఎముకలు ఒక దానిపై ఒకటి అమర్చబడి మెడ నుండి చివర వరకు ఒక గొట్టము వలె తిన్నని రంధ్రముగా ఏర్పడినది. ఈ రంధ్రముననే వెను బాము ప్రేలాడు చున్నది. ఈ వెను బాము (దీనినే మజ్జాతంతువులతో/నాడిసమూహములతో నిండి ఉన్న మేరుదండము అని రామాయణములో దండకారణ్యము అని అందురు) మధ్యలో సూక్ష్మ నాడి యగు బ్రహ్మ నాడి వున్నది. మెదడు నుండి స్థూల శరీరములకు సంబంధించిన నాడులు వెను బాములోనికి వచ్చి ఇరు ప్రక్కల నుండి శరీర భాగముల లోనికి విస్తరించి ప్రసరించు చున్నవి. కంద స్థానమని చెప్పబడిన సూక్ష్మ నాడి మండల కేంద్రము నుండి సూక్ష్మ నాడులు శరీర మంతటను వ్యాపించు చున్నవి. ఈ నాడులు సుషుమ్న నాడిని ఒక్కొక్క చోట కలిసి కేంద్రములు ఏర్పర్చు చున్నది. ఈ కేంద్రములే షట్చక్రములు. ఇటులనే స్థూల దేహమున నున్న నాడులు కూడ ఒకొక్కచోట కలియు చున్నవి. ఈ స్థూల నాడి కేంద్రములకు, సూక్ష్మ నాడీ కేంద్రములకు సన్నిహితమైన సంబంధము కలిగి యున్నది. **సూక్ష్మ శరీరమున వున్న ఈ నాడీ కేంద్రములను మూలాధారము,**

**స్వాధిష్ఠానము, మణి పూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, సహస్త్రారములని ఏడు కేంద్రములు చక్రములని పిలువ బడు చున్నవి.** సూక్ష్మ నాడీ మండలమున జరుగు సర్వ వ్యాపారములు స్థూల శరీరమునకు సూక్ష్మ శరీర మునకు గల సంబంధము నీరు, ఆవిరికి ఉన్న సంబంధము వంటిది. సూక్ష్మ శరీరమున వున్న ఏడు చక్రములు యోగ శాస్త్రమున అతి ప్రాముఖ్యములైనవి. అన్ని చక్రములకు పైనున్న ఏడవ చక్రమైన సహస్రారము పరమేశ్వరికి నిలయమని చెప్పబడినది. ఈ విషయము నిరూపించుటకే శ్రీ వేంకటేశ్వర స్వామి ఏడు కొండలపై నెలకొని ఉన్నారు. ఏడు కొండల వాడని శ్రీ వేంకటేశ్వర స్వామిని భక్తులెల్లరు కొలుచు చున్నారు. ఈ చక్రముల స్థానములు శరీరమున వున్న నెలవులను మరి కొన్ని వివరణములను తెలిసికొందము.

### 1.5.6.1 మానవ శరీర నిర్మాణము

చక్ర రహస్యములను గురించి తెలుసుకొనే ముందు స్థూలంగా మానవ శరీర నిర్మాణము గురించి ఒకింత తెలిసికొనవలసి యున్నది. పర బ్రహ్మ సృష్టి కర్త. సృష్టిని ప్రారంభించుటకు ముందుగా ఆకాశమును సృజియించెను. దాని నుండి వృధ్వి, వాయువు, అగ్ని, జలము ఉద్బవించినవని శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ ఐదును పంచ భూతములుగా చెప్పబడినవి. ఇవి ప్రకృతికి మూల పదార్థములు. జడ స్వభావము కల్గినది. ప్రకృతియందు పంచ భూతములు వివిధ నిష్పత్తులలో సంయోగము పొంది శరీరముల వంటి వివిధ పదార్థములు నిర్మాణము కాగా ఆ శరీరములకు ప్రాణ శక్తి శరీరముల నుండు నిర్గమించగానే ఆ శరీరము నియమము తప్పక విపంచికృతమై తమ తమ నిష్పత్తుల ప్రకారము ఆయా భూతముల యందు చేరు చున్నవి. కల్పాంతమున పంచ భూతములో యందలి నాల్గు భూతములు ఐదవది యగు ఆకాశమున లయమగు చున్నది. విశ్వ మందలి సమస్త శక్తులు, జలశక్తి, వాయు శక్తి, అయస్కాంత శక్తి, ఉష్ణ శక్తి

మొదలుగా గల సకల శక్తులు **ప్రణవ శక్తి (అదియే పరానాదము గా గ్రహించవచ్చు)** యందు లయమగు చున్నవి. ఈ ప్రణవ శక్తి నాలుగు భూతములను ధరించిన ఆకాశమున లయ మంది. మరల సృష్టి ప్రారంభమున పర బ్రహ్మము కు ప్రాణ శక్తి ని ఇచ్చి సృష్టిని కొనసాగించును. ఈ విధముగా ప్రతీ కల్పమందును ఒక నియమిత మార్గములో స్సృష్టి జరిగి దానిని పోషించి లయము చేయును. మన స్థూల నేత్రములకగపడని స్థూల దేహములకు వెనుక సూక్ష్మ శరీరము అనునది ఒకటి కలదు. భౌతిక శరీరమున చర్మము, మాంసము, ఎముకలు, మజ్జ, నరములు, గోళ్ళు, వెంట్రుకలు ఇత్యాది భాగములు కాన వచ్చు చున్నవి. సూక్ష్మ శరీరమున 72000 (డెబ్బది రెండు వేలు) నాడులు శరీరమంతటను వాయు ప్రసరణకు అనువగు నాడులు వ్యాపించి ఉన్నవి. ఇందు అంతఃకరణము లనబడు మనస్సు, బుద్ధి, అహంకారము చిత్తము అను స్థూల నేత్రమునకు కన పడనివి ఉన్నవి. ఈ సూక్ష్మశరీరమున వున్న నాడులలో ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తి జిహ్వ, కుహు, సరస్వతి, అలంబుష అనునవి ముఖ్యమైనవి. ఈ నాడులన్నియు కంతము అను స్థానమునుండి శరీర మంతటను వ్యాపించినవి. కందము నాభికిని, లింగ స్థానమునకు మధ్య పొత్తి కడుపు నందు ఉన్నది. ఈ నాడులలో ఇడ, పింగళ, సుషుమ్న అను మూడు నాడులు యోగ విధ్యలలో ఆతి ప్రాముఖ్యమైనవి. ఈ యోగ నాడుల ఉనికిని గురించి నాడీ విజ్ఞానము నందు ఈ క్రింది విధముగా చెప్పబడినది.

**శ్లో|| కంఠ మద్వే స్థితానాడి ల్సుషుమ్నేతి ప్రకీర్తితాః**
**తిష్టంతి పరిత స్సర్వా చక్రేశ్మినాడి కాస్సతః ||**

తా|| శరీరమునందలి మూలాధార చక్రమునకు మీదుగను నాభి స్థానము (మణిపూరక చక్రము) నకు మధ్యగను ఉన్న కంద స్థానమందు సుషమ్న అను నాటి యునది. ఇడ, పింగళాది నాడులు ఈ సుషమ్నను చుట్టి యున్నవి.

**శ్లో||సార్థత్రి కోల్యా నాడ్యాహి సూల సూక్ష్మేశ్చ దేహినాం**

**నాభి కందని బద్ధా స్థాస్థిర్య గూర్ధ్వ మధస్థతా||**

తా|| శరీరము స్థూల, సూక్ష్మము లలో మూడున్నర కోట్ల నాడులు ఉన్నవి. ఆ నాడులు మూలాధారము నాశ్రయించి కొన్ని ఊర్ధ్వముగాను, కొన్ని అధోముఖముగాను కొన్ని ప్రక్కలకు ప్రసరించి యున్నవి.

**శ్లో|| ద్వి సప్త సహస్త్రాణిస్స ర్వాయ గోచరా**

**కర్మ మార్గేణ సుషిరా తిర్యంచ సుషిరాత్మికా||**

తా|| పై నాడులలో (72000) డెబ్బది రెండు వేల నాడులు వాయు సంచారమునకు యోగ్యమయినవి. ఆ నాడులు వాయు మార్గమున పునరావృత్తి ప్రాపక కర్మ రూప చిద్ర విశిష్టంబి తిర్వగ్గతరంధ్ర ప్రధాన భూతంబుగా నుండును.

**శ్లో|| దే హీధనున్యో ధన్యస్థా పంచేంద్రియ గుణావహా**

**నాభి కంద స్థితౌస్తాస్తు నాభీ చక్రే ప్రదేష్టితా||**

తా|| శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధ, గ్రాహ్యకములగు పంచేంద్రియముల యందున్న నాడులు శ్రేష్ఠములు. ఆ ఐదు నాడులు మూలాధారము నాశ్రయించి నాభి చక్రమున ప్రవేశించి యున్నది.

**శ్లో|| ఆపాద ప్రభృతి గాశ్రమ శేల్ష మాసా**

**మాంస్తకాద పేచ ల్నాభి పుర స్థితేన**

**ఏ తస్భృ దంగ ఇవ చర్మచక్వ్ ఏవ బద్ధం**

**కాయం వృణా మిహ సిరా శత సప్తకేన||**

తా: మూలాధారము నాశ్రయించి పాదము మొదలు శిరః పర్యంతము వ్యాపించిన (700) ఏడు వందల నాడులు మనుష్య దేహమున మృదంగము చర్మముచే కప్పబడి నట్లు బందించు చున్నవి.

**శ్లో: ఇడా పింగళా చైవ సుషుమ్నాచ సరస్వతీ,**

**వారుణీ చైవ పూషాచ హస్తి జిహ్వా య్శ స్వినీ**

**విశ్వాదరి కూహూచైవ శంఖిణీచ పయస్విని**

**అలంబుషా గాంధారీ ముఖ్యాశ్చై తాశ్చ కుర్ధశా:||**

తా: పై నాడులలో ఇడా, పింగళ, సుషుమ్న, సరస్వతి, వారుణి, పూష, హస్తి జిహ్వ, యశస్విని, విశ్వోదరి, కుహు, సంఖిని, పయస్విని, ఆలంబష, గాంధారి అనునవి 14 ముఖ్య నాడులు. ఈ పదునాలుగు నాడులను ప్రాణవాహికలై జీర్ణ కోశమున ప్రతిష్టితములైనవి.

**శ్లో: తత్ర ప్రధాన నాద్యాన్తు దశవాయు ప్రవాహికా:**

తా: పదునారు నాడులలో (ఇడ మొదలు చారణి (గాంధారి) ప్రాణవాహికలై నందున అవి  ప్రధానములు.

**శ్లో: ఇడా పింగళా యాశ్త్రైవ సుషుమ్నా చౌర్ధ్వగామినీ**

**గాంధారీ, హస్తి జిహ్వాచ ప్రసార గమ నేన్దిగా:**

**అలంబుషా యశ స్వినా్య దక్షిణాంగే సమంవి తా**

**కుహూశ్చ శంఖినీ చైవ వా మంగే చావలంబి తా**

**ఏతేషు, దశ నాడేషు నానా కార్య ప్రసూతికా:||**

తా: ఇడా, పింగళ, సుషమ్న యను మూడు నాడులు ఊర్ధ్వ గాములు. గాంధారి, హస్తి జిహ్వ చేతులు మొదలగు నవి చాచుటకు ముడుచుటకు ఉపయోగ పడును. ఆలంబుష, హస్తి జిహ్వ అను రెండు నాడులు దక్షిన భాగమున (కుడి ప్రక్క) ను, కుహూ, గాంధారి అని రెండు నాడులు వామాంగమమునను పది నాడులలో మధ్య నున్న పూషయను నాడి (ప్రసూతికా నాడి) సమస్త కార్యములు చేయు చుండును.

ఇడ యనగా చంద్ర వామ నాడి. పింగళ మనగా సూర్య నాడి యనియు అందురు. శ్వాస క్రియ జరుపు ముక్కున నున్న ఎడమ రంధ్రమును ఇడానాడి యనియు కుడి రంధ్రమును పింగళా నాడి యనియు అందురు. మరియు కుడి  నాడిని యమున అనియు ఎడమ నాడిని గంగ యని కూడ అందురు. ఈ ఇడా, పింగళుల

మధ్య వెన్నెముక లో నున్న మజ్జ యందలి సన్నని రంధ్రమున సుషుమ్న యను నాడి యున్నది. దీనిని బ్రహ్మ నాడి యనియు సరస్వతి యని కూడ అందురు. వెన్నును బ్రహ్మ దండి అందురు. భారత దేశమున అతి పవిత్రముగా నెంచ బడు గంగ, యమున, సరస్వతి నదులు మన దేహమున ఉన్న ఇడ (గంగ) పింగళ (యమున) సుషుమ్న (సరస్వతి) నదులకు ప్రతీకలు. సరస్వతీ నది సుషుమ్న నాడి వలెనే పైకి కనబడక అంతర్వాహిని యని చెప్పబడుచున్నది.
ఇక్కడ షట్చక్రములు, ఆపైన సహస్రారము గురించి వివరణ తెలుసుకొందాము.

**1.5.6.2. మూలాధార చక్రము (త్రైలోక్య మోహన చక్రము):**

గుద స్థానమునకు ముందుగా కొంచెము పై భాగమున ఈ చక్రము ఉండును. ఇది నాల్గు దళములు గల పద్మము. **వం, శం, షం, సం** అను నాలుగు బీజాక్షరములు ఇందు ఉత్పన్నమయినవి. ఇది పృధ్వీ (భూమి) తత్వము గలది. ఆకారమున చతురస్త్రముగా నుండును. వాసనతో కూడిన పశుపు రంగుగా నుండును. ఈ చక్రమునకు ఆధి దేవత విఘ్నేశ్వరుడు. దేవత **ఢాకిని**, భీజాక్షరము **"లం"** ఇందు బ్రహ్మ గ్రంధి అను నాడి కేంద్రము యున్నది. మూలాధారమునందు ధ్యానము చేసినచో కుండలిని జాగృతమగుట సులభమగును. మూలాధారము కుండలిని switch స్థానము. ఈ మూలాధారమే మొదటి ఇంద్ర చక్రము. యోగ శాస్త్రము ప్రకారము గణపతి మూలాధారస్థితుడు. షట్చక్రములలో అన్నిటికన్నా క్రింద ఉండి అన్నిటికి ఆధారమైనదే మూలాధారం (త్వం మూలాధార స్థితోసి నిత్యమ్! అని "గణపతి అధర్వ శీర్షం " లోని వాక్యము) షట్చక్రములకు అది దేవత అయిన మహాశక్తికి ద్వారపాలకుడు. లలిత సహస్ర నామములో మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంధి విభేధిని అని వస్తుంది. దేవి ఈ మూలాధారం లో కాల సర్పం గా కుండలినిలో నిండుగా చుట్టుకొని ఉంటుంది లౌకిక అలౌకిక సుఖాల అనుమానం తొలగిపోయినప్పుడు ఈ కుండలిని నిద్ర తొలగి పోతుంది. ఒక సారి కుండలిని

మేలుకొంటే సాధకుడి కల చెదిరిపోతుంది. అప్పుడు తన నిజ స్వరూపాన్ని సాధకుడు గుర్తిస్తాడు. దీన్ని యోగ శాస్త్రం లో ''ముడి విడిపోవటం" అంటారు .సాధకుడి ధ్యానం మూలాధారం నుండి పైకి లేచినప్పుడు ఈ ముడి అంటే గ్రంధి విడిపోతుంది. సాధనా మార్గం లో అనేక గ్రంధులున్నాయి. మూలాధారానికి పైన ఉన్న గ్రంధులలో మొదటిది బ్రహ్మ గ్రంధి. బ్రహ్మ సమస్త ప్రపంచాన్ని సృష్టి చేస్తాడు. మూలాధారం చేసే పని కూడా ఇదే. దీని రహస్యం తెలుసుకొన్న సాధకుడు తనకు తెలిసినదంతా ఒక స్వప్నం గా తెలుసుకొంటాడు. దీనితో కల చెదిరి పోతుంది. మరొకటి మొదలవుతుంది. ఇక్కడి నుండి చాలా దూరం వెళ్ళాల్సి వస్తుంది. దూర ప్రయానికి ఇది మొదటి మజిలీ మాత్రమే. ఈ గ్రంధి విప్పించే మాత 'బ్రహ్మ గ్రంధి విభేదిని'అయింది. మూలాధారచక్ర అధిష్టాన దేవత **"సిద్ధవిద్యాదేవి"** సాకిణీ రూపములో ఉంటుంది. (నవదుర్గలలో మొదటి అవతారమైన శైలపుత్రి). మనలోని భౌతిక శక్తిని నియంత్రించేది మూలాధార చక్రము. ఇది షట్చక్రాలలో మొదటిది. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనబడే ఐదు తన్మాత్రలు ఈ మూలాధారం వద్ద పనిచేస్తాయి. గర్భస్థ శిశువుకి ఐదవ మాసములో చర్మం ఏర్పడి పంచ జ్ఞానేంద్రియ జ్ఞానము కలుగుతుంది. ఈమె ఆస్థి సంస్థిత అనగా ఎముకలను అంటిపెట్టుకుని ఉంటుంది. మన శరీరములోని మూలాధార చక్రము, శ్రీచక్రము లోని త్రైలోక్య మోహన చక్రానికి ప్రతీక. దీంట్లో మూడు భూపురాలు ఉంటాయి. అవి మూడు లోకాలకు ప్రతీక. **అవియే గాయత్రి వ్యాధృతులు అయిన భూః, భుః, సువః.** సౌందర్య లహరి లో శ్రీ శంకర భగవత్పాదులు ఈ మూలాధార చక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు

**తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా**
**నవాత్మాన మన్యే నవరస-మహాతాండవ-నటమ్, || 41 ||**

ఓ భగవతీ! మూలాధార చక్రము నందు మిక్కిలి ఆసక్తురాలై సమయ అను పేరు గల (స్త్రీ కర్తృకమైన స్త్రీ నృత్యము లాస్యము అని చెప్పబడును) శక్తితో కూడి తాండవ నృత్యము (పురుషుడు చేయు నృత్యమును తాండవ మని చెప్పబడుతున్నది) ఆనంద భైరవుని తలచు చున్నాను.

### 1.5.6.3 స్వాధిష్ఠాన (సర్వాశపరిపూరక) చక్రము

ఇది ఆరు దళములు గల పద్మము. ఈ ఆరు దళముల నుండి, **బం, భం, మం, యం, లం వం** అను ఆరు అక్షరములు (శబ్దములు) ఉద్భవించినవి. జల స్థానము. ఇది నెల బాలుని చందమున చల్లని వర్ణముతో నుండును. ఇది రస తత్వము గలది. ఈ చక్రమునకు అది దేవత బ్రహ్మ, దేవత రాకిని. **"వం"** అను బీజాక్షరము ఇందున కల్గినది. (నవదుర్గలలో రెండవ అవతారమైన బ్రహ్మచారిణి) అలోపతి వైద్య శాస్త్రమున దీనిని "ప్రోస్టేట ప్లెక్సస్" అనబడినది. బొడ్డు దిగువ భాగాన ఉండే నారింజ రంగు చక్రమే స్వాధిష్ఠానం. ఇది భావోద్వేగాల కేంద్రం. మంచి చెడులను భరించే శక్తితో బాటు ఇంద్రియాలనూ ఇది ప్రభావితం చేస్తుంది. ఆనందమయ జీవితాన్ని కోరే ప్రతి వ్యక్తీ ఈ చక్ర గతిని గాడిలో పెట్టుకోవాలి. దీని పనితీరు దెబ్బతింటే ఆ ప్రభావం మనసు మీద పడి మనిషి వ్యసనాల పాలవుతాడు. నిజ జీవితంలో కోల్పోయే ఆనందాన్ని వ్యసనాల ద్వారా పొందేందుకు ప్రయత్నిస్తూ ఊహా జగతిలో ఉండిపోతాడు. ఈ చక్రం పనితీరు బాగుండాలంటే బొడ్డు కింద భాగంలో నారింజ రంగును ఊహించుకొని 'ఆరోగ్యాన్ని, ఆనందాన్ని పంచే స్థితిని ఆహ్వానిస్తాను. వాటిని ఆసాంతం అనుభవిస్తాను' అని పదే పదే మనసులో అనుకోవాలి.

శంకర భగవత్పాదులు ఈ స్వాధిష్ఠాన చక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు.

**తవ స్వాధిష్ఠానే హుతవహ-మధిష్ఠాయ నిరతం**
**తమీడే సంవర్తం జనని మహతీం తాం చ సమయామ్**
**యదాలోకే లోకాన్ దహతి మహసి క్రోధ-కలితే**
**దయార్ద్రా యా దృష్టిః శిశిర-ముపచారం రచయతి || 39 ||**

జగన్మాతా! నీ స్వాధిష్టాన చక్రము నందలి అగ్నితత్వమును ఆశ్రయించి అగ్ని రూపమున, సంవర్తాగ్ని రూపమున వెలుగొందు చున్న పరమేశ్వర, పరమేశ్వరిని స్తుతించెదను. స్వాధిష్టానము అగ్నితత్వమునకు ఉత్పత్తి స్థానము. అందు ఉత్పన్నమైన అగ్ని సంవర్తాగ్ని.

**1.5.6.4 నాభి (మణిపూరక లేదా సర్వ సంక్షోభణ) చక్రము:**

ఈ యోగ చక్రము సాధించుట ద్వారా సాధకునకు తన జడ శరీరము యొక్క పూర్ణ జ్ఞానము ప్రాప్తమగును. అంతేగాక సాధకుని శరీరము గురుత్వాకర్షణ శక్తి నియమములను దాటి భూమిపై ఎత్తులో తేలియాడును. మరింత సాధన తర్వాత ఆకాశగమనము చేయగల్గును. పూర్తి జీవితము సాధన చేసినచో ఒకటి రెండు సిద్ధులు ప్రాప్తించ వచ్చును. అట్లా అనేక జన్మల తరబడి సాధన చేయవలెను. అతీంద్రియ శక్తులు ప్రాప్తమైనను ఆత్మజ్ఞానము కలుగదు. సిద్ధుల వెనుక పడినచో సాధకుడు అధఃపతనమగును. లలిత సహస్ర నామాలలో **''మణిపూరాంత రుదితా ,విష్ణు గ్రంధి విభేదినీ''** అని చెప్పారు మూలా దారం నుండి మణి పూరకం వరకు చేరినప్పుడు రెండవ' గ్రంధి ''విష్ణు గ్రంధి'' వస్తుంది. దేవి కృప వలన ఇది విడిపోతుంది. బ్రహ్మ గ్రంధి విడిపోయినప్పుడు సాధకుడి క్షుద్రత్వం పూర్తిగా అర్ధమైపోతుంది. విష్ణుగ్రంది విడిపోయినప్పుడు మనసుకు ఆవరించిన మాయ పొర తొలగి పోతుంది. అప్పుడు సాధకుడు అశరీరి, అమనస్కుడు అవుతాడు. శరీరానికి మనసుకు అతీతం గా సాధకుడిని తీసుకొని వెళ్ళే పరమేశ్వరి ఇక్కడే మణిపూరక చక్రం లో విరాజమానమై ఉంటుంది. (నవదుర్గలలో మూడవ అవతారమైన చంద్రఘంట) ఈ గ్రంధి. ఈ చక్రం భౌతికం గా కనిపించేవికావు.

పరమాత్మ పావన భావం తో తనువు పులకిస్తుంది. కన్నుల నుండి ఆనంద బాష్పాలు రాలుతాయి. శరీర మధ్య భాగం అంతా చెమట తో నిండిపోతుంది. మనస్సులో ఒక్క సారిగా ప్రసన్నత, ప్రఫుల్లతా భావం వ్యాపిస్తుంది. ఇప్పుడు కుండలిని మేలుకోన్నదని తెలుసు. ఆధ్యాత్మిక సుఖం అతీంద్రియం అని అవగతమవుతుంది. ఇది పది దళములు గల జలతత్త్వం కలది. అధి దేవత లాకిని. బొడ్డునకు మూలంలో వెన్నెముకలో విలసిల్లే ఈ చక్రం మనలో 4,536 నాడులలో అనుసంధానింపబడి వుంటుంది. ఈ చక్రమందు ఉద్భవించే శక్తి మనం తీసుకునే ఆహారాన్ని జీర్ణం చేసి సారాన్ని శరీరంనకు అందిస్తుంది. ఈ చక్రం నకు పంచకోశాలలో ప్రాణామయకోశంతో సంబంధం. శారీరకవ్యవస్థలోని జీర్ణవ్యవస్థతో సంబంధం. జ్ఞానేంద్రియం నాలుక. పుట్టుట, జీవించుట, మరణించుట అను మూడు బిందువులతో కూడిన త్రికోణమే జీవసృష్టి. అట్లే మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరకం అను మూడు కేంద్రాలతో ఒక త్రికోణం ఏర్పడుచున్నది. ఈ త్రికోణమే భౌతికసృష్టికాధారం. ఈ మూడు చక్రాలు భౌతిక జీవితం సజావుగా సాగడానికి సహకరిస్తాయి. ఈ చక్రం శక్తివంతంగా లేకపోతే - అవయవములయందు నీరు చేరుట, నోటికి సంబందినవ్యాధులుకు కారణమౌతుంది. నియమాలు లేని ఆహారపు అలవాట్లువలన జీర్ణశక్తి మందగించి అజీర్తి, గాస్ట్రిక్ సమస్యలు కల్గుతాయి. ఉదరకోశ వ్యాధులు, గుండె బలహీనత, నిద్రలేమి, తలబరువు, కాలేయవ్యాధులు, అతిమూత్రవ్యాధి, రక్తక్షీణత, నేత్రవ్యాధులు కల్గుతాయి. ఈ చక్ర మానసిక స్వభావం - మూసుకుపోవడం వలన కీర్తికండూతి, పెత్తనం చెలాయించాలనే అహం, అసూయ, అసహనం, దుడుకుతనం, క్రూరత్వం, కటుత్వం, స్వలాభపరులు, స్వార్ధపరులు. తన గురించి తాను తక్కువగా ఆలోచిస్తూ కుంగిపోవడం. తెరుచుకుంటే లక్ష్యసాధన, ఆశయసిద్ధి, వ్యవహార దక్షత, ఉత్సాహం, ధనాపేక్ష, తన్ను తాను గౌరవించుకోవడం, ఆత్మవిశ్వాసం

కల్గివుండడం, జీవితంలో అన్నింటా ముందడుగు. ఇక్కడే మనిషికి ఆలోచన ఏర్పడుతుంది. అనుమానాల్ని నివృత్తి చేసుకుంటూ, చక్కగా ఆలోచిస్తూ, అన్నింటినీ అవగాహనతో విశ్లేషించుకుంటూ, విశ్వాస, వివేక జ్ఞానంలను అలవర్చుకుంటూ ముందుకు సాగాలి. మనలో విశ్వాసం, అవిశ్వాసం, నమ్మకం, అపనమ్మకం రెండూ ఏర్పడేది దీనివలనే.

శంకర భగవత్పాదులు ఈ మణిపూరక చక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు.

**తటిత్వంతం శక్త్యా తిమిర-పరిపంథి-స్ఫురణయా**
**స్ఫుర-న్నా నరత్నాభరణ-పరిణద్ధేంద్ర-ధనుషమ్**
**తవ శ్యామం మేఘం కమపి మణిపూరైక-శరణం**
**నిషేవే వర్షంతం-హరమిహిర-తప్తం త్రిభువనమ్ || 40 ||**

మణిపూర చక్రము వసతిగా కలవాడును, అంబుద (మేఘము) స్వరూపమును ప్రకాశించు వాడు, అందు స్థిరమైన శక్తి రూపమునకు నమస్సులు.

**1.5.6.5 హృదయ చక్రము లేదా అనాహత చక్రము లేదా సర్వ సౌభాగ్యప్రద చక్రము:**

ఈ ఇంద్ర చక్రము హృదయము మధ్య స్థానము నందు ఉన్నది. హృదయ చక్ర సిద్ధి ప్రాప్తించుట వలన సాధకుడు హృదయగతిని కూడా బంధించగలడు. ఈ చక్రసిద్ధి వలన సూర్య నాదమును సూర్య కిరణముల ద్వారా వినవచ్చును. ఈ విధముగా అనేకమైన నాదములు వినగలడు. సాధకుడు ఈ విధమైన నాదసిద్ధి ప్రాప్తించుకొన్నప్పటికీ, ఆత్మ జ్ఞానప్రాప్తికై నాద బ్రహ్మమును ధాటి పోవాలి. హృదయ స్థానమునందున్నది. పండ్రెండు దళములు గలిగి హేమవర్ణము గల వాయుతత్వ కమలము.

**రాకిన్యాంబస్వరూపిణి అనాహతాబ్జనిలయ, శ్యామాభాయ, వదనద్వయ, దంష్ట్రోజ్జ్వలాయ, అక్షమాలాదిధరాయ, రుధిరసంస్థితాయ,**

**కాళరాత్ర్యాదిశక్త్యౌఘువృతాయ, స్నిగ్ధౌదనప్రియాయ, మహావీరేంద్రవరదాయ. (485 నుండి 493 వరకూ గల నామములు).** ప్రాణము, అపానము అనే వాయువులు నియంత్రించు రెండు ముఖములు కలది. శిశువు 2 వ మాసములో రెండవ రంధ్రము ఏర్పడుతుంది. రెండు కోరలతో ప్రకాశించునది. **'అ'** కారాది, **'క్ష'** కారము వరకూ గల అక్షరాలని మాలగా ధరించింది. నాలుగు చేతులలో అక్షమాల, శూలము, కపాలము, డమరుకము, దరించునది. అనాహత చక్రము హృదయమునకు సంబంధించినది, కావున ఆమె రక్త ధాతువుని ఆశ్రయించి ఉంటుంది. అనాహతమునకు 12 దళములు. వీటిని **'క'** కారమునుండి **'ఠ'** కారము వరకూ గల 12 అక్షరాలతో ప్రారంభమయే 12 దేవతలచే కొలవబడింది. నవదుర్గలలో నాలుగవ అవతారమైన కూష్మాండ. శంకర భగవత్పాదులు ఈ అనాహత చక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు.

**సమున్మీలత్ సంవిత్కమల-మకరందైక-రసికం**
**భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరమ్**
**యదాలాపా-దష్టాదశ-గుణిత-విద్యాపరిణతిః**
**యదాదత్తే దోషాద్ గుణ-మఖిల-మద్భ్యః పయ ఇవ || 38 ||**

సంవిత్కమల మనగా అనాహత చక్రము.

**1.5.6.6 కంఠ (విశుద్ధ లేదా సర్వార్ధ సాధక) చక్రము:**

ఇంతకు మునుపు చెప్పినట్లు ఇంద్రచక్ర సిద్ధి పొందినచో సాధకుడు అన్న జలముల ఆవశ్యకత లేకుండా గడప గల్గును. దీనినే బల, అతిబల విద్యలందురు. జాలంధర బంధమని అందురు. ఒక అవస్థలో శ్వాస తీసుకొనవలసిన అవసరము కూడా ఉండదు. అటువంటి అవస్థను కుంభకము అని అందురు. ఇది సిద్ధించినపుడు ఖేచరీముద్ర తనంతట తానే ప్రాప్తించును. ఇడ, పింగళ నాడుల నిరోధము వలన ప్రాణ వాయువు సుషుమ్న యందు చేరుచున్నది. ఆ విధముగా

సుషుమ్న యొక్క ఒక కొననుండి ప్రాణ వాయువు చేత నింపి, మరియొక కొనను నాలుక చేత బంధించ వలయును. అదియే **ఖేచరీ ముద్ర**[2] స్వభావము. అందున ప్రాణము లయము కాగా మనస్సు లయమగు చున్నది. అందుల కొరకు నాలుకను కొండ నాలుక ఆవలనున్న పాలకుహరమున ప్రవేశ పెట్ట వలయును. అపుడు దృష్టిని అజ్ఞా క్రమందు నిలిపి వుంచ వలయును. అటుల చేసిన దానిని **ఖేచరీ ముద్ర** అందురు. నాలుక కపాల కుహరమున ప్రవేశింప వలెనన్న అంత తేలిక పని కాదు. నాలుక క్రిందనున్న నరముల పట్టు సడల వలయును. మరియు నాలుక పొడవుగా సాగగల శక్తి పొంద వలయును. దాని కొరకు కొంత దోహద క్రియ చేయ వలయును. నాలుక ఆవుపాలు పిండునపుడు చనుకట్టూ పట్టుకొనునట్టుగా పట్టుకొని ఆ ప్రక్కకు, ఈ ప్రక్కకు, ముందునకు లాగుచు సాగ దీయ వలయును. మరియు వాడి యగు కత్తిని తీసుకొని నాలుక క్రింద దౌడను కలియు స్థానము ఒక వెంట్రుక వాసి ఛేదించ వలయును. ఆ చేదించ బడిన ప్రదేశమున వ్రణము కాక ఉండుటకు గాను కరక్కాయపొడిలో సైంధవలవణ చూర్ణమును చేర్చి అంటించ వలయును. అటుల ప్రతి వారము దినములకు ఒక పర్యాయము చేయ

---

[2] శృంగేరి శారదా పీఠమును అలంకరించిన పదవ పీఠాధిపతులైన శ్రీ విద్యాతీర్థుల వారు (1229-1333) లంబికా యోగమున (దీనినే ఖేచరీ ముద్ర అందురు) తపస్సమాధిలో నుండి చతుర్మూర్తి విద్యేశ్వరులుగా నుండి సంకల్పించు కొనిరి. వారు శిష్యులతో తాము పండ్రెండు సంవత్సరములు తపమాచరించిన తమ శరీరమిట్లే (శివలింగముగ) మార్పు చెందునని చెప్పి గుహలోకి పోయి తపస్సు చేసిరి. కానీ వారి శిష్యులు దిగులు చెంది మూడు సంవత్సరములలోనే గుహ ద్వారములను తెరిచి చూచిరి. అక్కడ వారి శరీరము కాకుండా శివలింగ రూపము మాత్రమే కనిపించింది. అక్కడ అప్పటి పీఠాధిపతులైన శ్రీ భారతి తీర్థ స్వాముల వారి ఆజ్ఞ ప్రకారము ఆ గుహను మూసివేసి దానిపై ఒక శివలింగము స్థాపించిరి. ఈ శివలింగము ఇప్పటికి శృంగేరి యందు పూజింపబడు చున్నది. ఇప్పటికి శ్రీ విద్యాతీర్థుల వారు సమాధి యందు ఉన్నారని భక్తుల భావన. (ఈ విషయములు **"తపశ్చక్రవర్తి"** అను శృంగేరి శారదా పీఠము వారి ప్రచురణలలో చూడవచ్చు).

వలయును. (ఇవి పూర్తిగా గురువు పర్యవేక్షణలో మాత్రమే చేయాలి) అట్లు ఆరు నెలలు చేసిన జిహ్వాను బంధించిన నరములు పట్లు విడిచి నాలుకను కపాల కుహరమును చేరు సామర్ధ్యమును కల్గించు చున్నది. కపాల కుహరముమందు ఇడ, పింగళ, సుషుమ్న అను నాడులు కలియు చోటున "వ్యోమచక్రము" న ప్రవేశ పెట్టి అరక్షణము అనగా 12 నిముషముల కాలము ఉంచ వలయును. ఇట్లు చేయుట వలన సాధకుడు చంద్ర స్థానము నుండి స్రవించు అమృతమును ఆస్వాదించి మృత్యువును జయించ గల్గునని ఋషుల చేత చెప్ప బడినది. దీనినే ఈ సందర్భముననే, గోమాంస భక్షణము, అమృత హరుణి సేవయు మానవుని పవిత్రము చేయునని చెప్పబడినది. ఈ వాక్యము నకు ఆవు మాంసము తిని, కల్లు త్రాగినయెడల మానవుడు పవిత్రమగునని బాహ్యముగ కనపట్టు చున్నది. గో శబ్ధమునకు కొండనాలుక యని అర్ధము. గోమాంస బక్షణ అనగా నాలుకలో కొండ నాలుకను తాకుట అమర వారుణ అనగా అమృతము. చంద్ర స్థానము నుండి నిత్యము అమృతము స్రరించునని గదా తెలుప బడినది. ఇది కంఠ స్థానమున ఉన్నదని తెలిసికొంటిమి కదా: కనుక కొండ నాలుకను నాలుకలో తాకి కంఠమున వున్న అమృతమును అనుభవించమని ఆర్ధము. అందు చేత విపరీతార్ధములకు ఇచట తావు లేదు.ఖేచరీముద్ర సిద్ధించిన యోగిని యోగ పరిభాషలో **"ఖేచర"** అనెదరు. కంఠ చక్ర సిద్ధి వలన సాధకుని స్వరము అతి మధురమగును. అట్టి మధురమైన స్వరముగల సాధకుని **"ఇక్షాకుడు, సుగ్రీవుడు"** గా రామాయణకారుడు పేరిడెను.

కంఠ స్థానమందున్నది. పదునారు దళములు గలిగి శ్వేత వర్ణము గల ఆకాశతత్వ కమలము.

**ఢాకినీశ్వరి: - (484) : (5 వ చక్రము) విశుద్ధి చక్ర అధిష్టానదేవత "ఢాకిని". (475 నుండి 483 వరకూ ఢాకిని దేవత లక్షణాలు వర్ణించబడినవి.)**

**ఆరక్తవర్ణాయ, త్రిలోచనాయ, ఖట్వాంగాది ప్రహరణాయ, వదనైకసమన్వితాయ, పాయసాన్నప్రియాయ, త్వక్ స్థాయ, పశులోకభయంకరాయ, అమృతాధి మహాశక్తిసంవృతాయ. (8 నామములు)** (నవదుర్గలలో ఐదవ అవతారమైన స్కందమాత).

డాకినీ దేవత బీజాక్షరాలు, కీలక, న్యాస మంత్రాలు అన్నీ **"ఢ"** కార సంభంధమైనవి. డాకినీ వర్ణము ఎఱుపు. ఈమె ఎఱ్ఱని ఎఱుపు కాదు. తెలుపు కలసిన ఎరుపు. జీవి పిండ దశలో **"శుక్త+రక్త"** సమ్మేళనంతో బిందురూపముగా ఉండును. పదిహేను రోజుల పిదప బుడగ రూపము చెంది, నెలాఖరుకి గట్టిపడి, 45 రోజులకి పిండాకృతి పొందుతుంది. ఈ పిండ స్థితి డాకినీ స్థితి. ఈమె త్రిలోచన – భూత, భవిష్యత్, వర్తమానాలు చూడగలది.

శంకర భగవత్పాదులు ఈ విశుద్ధ చక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు.

**విశుద్ధౌ తే శుద్ధస్ఫటిక విశదం వ్యోమ-జనకం**
**శివం సేవే దేవీమపి శివసమాన-వ్యవస్తితామ్**
**యయోః కాంత్యా యాంత్యాః శశికిరణ్-సారూప్యసరణే**
**విధూతాంత-ర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతీ || 37 ||**

విశుద్ధి చక్ర పూజ యందు సూర్యచంద్రులను నిరోధించుట వలన ఇళా, పింగళ లను నాడుల ద్వారా ప్రాణాయామము చేయుట వలన అనగా ఉచ్వాస నిశ్వాసములను నిరోధించుట వలన షోడశారమును పొందిన శ్రీత్రిపుర సుందరి అట్టి కళలకు కూడా ప్రకాశము కలుగుచున్నదని భావము.

**1.5.6.7 భ్రూమధ్య చక్రము (ఆజ్ఞాచక్రము):**

భ్రూమధ్య చక్ర సిద్ధి ప్రాప్తించినచో సాధకునికి విశ్వము నందలి జ్ఞానము కల్గును. జన్మ మృత్యు సమయములందు జీవాత్మ ఈ ద్వారము నుండే ప్రవేశించడము, బయిటకు వెళ్ళడము జరుగును. ఈ స్థానమునందు ఏకాగ్రతతో ధ్యానము

చేసినచో ఆజ్ఞాచక్రము జాగృతమై పూర్వ, భవిష్యత్ జన్మల జ్ఞానము కల్గును. ఇందలి యోగనాడిని "ప్రాణవాహ" నాడి అందురు. ఈ నాడి నియంత్రణ జరిగినచో యోగి తన జీవాత్మను శరీరము వెలుపలికి తీసుకొని వచ్చి పరకాయ ప్రవేశము కూడా చేయగల్గును. మూలాధారము నుండి భ్రూమధ్యమము వరకు ఉన్నటువంటి అతి ముఖ్యమైనది సుషుమ్నానాడి. సుషుమ్న యందు స్థిరమైన యోగి జీవన జ్ఞానమును ప్రాప్తించుకొని ముక్తుడగును.

భ్రూ (కనుబొమల) మధ్యమందున్నది. రెండు వర్ణములతో గూడిన రెండు దళములు కలిగిన కమలము. హాకినీరూపధారిణి (527):- ( 6 నామములు) (6 వ చక్రము) 521 నుండి 526 వరకూ గల నామములు ఈమెను వివరిస్తాయి. **ఆజ్ఞాచక్రాబ్జనిలయా, శుక్లవర్ణా, షడాననా, మజ్జాసంస్థాయ, హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా, హరిద్రాన్నైకరసికా.** ఆజ్ఞా చక్రము భ్రూ మధ్యలో అనగా రెండు కనుబొమ్మలు కలిసే ప్రాంతములో ఉంటుంది. వివేక సూర్యుని ఉదయం జరిగే ప్రదేశము. దీనికి అధిష్టానదేవత **హాకిణీ.** (నవదుర్గలలో ఆరవ అవతారమైన కాత్యాయని). ఈమె తెలుపు రంగులో ఉంటుంది. ఈమె త్రికాలజ్ఞాని. ఈ దేవతకి ఆరు ముఖములు. ఆరు కృతికలు, కుమారస్వామి ఆరు ముఖములు ఈమె రూపములే. ఆజ్ఞాచక్రం మనస్సుకి స్థానం. గర్భస్థ శిశువు ఆరవ మాసములో పంచేద్రియాలతో బాటు మనస్సు కూడా ఏర్పడుతుంది. ఈమె ఎములకలోని మజ్జ అనగా మూలగను ఆశ్రయించి ఉంటుంది. ఇది రెండు దళముల పద్మము. బీజాక్షరములు **‘హ’ ‘క్ష’** . 'హంసవతి'; ‘క్షమావతీ; అనే దేవతలు.

శంకర భగవత్పాదులు ఈ ఆజ్ఞాచక్రము గురించి సౌందర్య లహరిలో ఇలా చెప్పారు.

**తవాజ్ఞచక్రస్థం తపన-శశి కోటి-ద్యుతిధరం**

**పరం శంభు వందే పరిమిలిత-పార్శ్వం పరచితా**

**యమారాధ్యన్ భక్త్యా రవి శశి శుచీనా-మవిషయే**

**నిరాలోకే ఽలోకే నివసతి హి భాలోక-భువనే || 36 ||**

ఇక్కడ తవాజ్ఞచక్రస్థం చెప్పుటచే సాధకుని భ్రూమధ్య భాగమునుపొందియున్న శ్రీచక్ర అంతర్గతమైన శివ చక్ర చతుష్టయము చెప్పబడుచున్నది. ఇక్కడ స్వాధిష్టాన చక్ర అగ్ర భాగమునందు అగ్ని మండలము, అనాహత చక్రము నందు సూర్య మండలము, ఆజ్ఞాచక్రము మీది భాగము నందు చంద్ర మండలము ఉన్నవి.

### 1.5.6.8 సహస్రార చక్రము:

షట్చక్రముల తర్వాత ఇది చిట్టచివరి ఇంద్రచక్రము. తల యందు కొంచెము ముందు భాగమున (మాడు) నందు ఈ సహస్రార చక్రము కలదు. ఆత్మ జ్ఞానమునకు ఈ సహస్రార చక్రముయే స్థానము. ఇందు మగ్నుడైన యోగి జన్మ మృత్యు ముసలితనమునకు అతీతుడు. అంతేగాక రోజుల తరబడి దేహభావమును సమాధి స్థితి యందు ఉంచగలడు. పరమ శాంతికి ఇదియే స్థానము. బ్రహ్మ రంధ్రమునకు అధోముఖముగ సహస్ర దళములతో వికసించియున్న పద్మము. సహస్రార కమల కర్ణిక యందు ప్రకృతి పురుషుల సమైక్య స్థితి యగు పరబిందువు చుట్టును మాయ గలదు. ఆత్మజ్ఞానమును సాధించిన పరమ హంసలు మాత్రమే పొందగలిగిన స్థానమిది. దీనిని శైవులు శివస్థానమనియు, వైష్ణవులు పరమ పురుష స్థానమనియు, ఇతరులు హరిహర స్థానమనియు, దేవీభక్తులు దేవీస్థానమనియు చెప్పుదురు. ఈ స్థానము నెరిగిన నరునకు పునర్జన్మ లేదు. **యాకిన్యంబస్వరూపిణి:-** (534) (6 నామములు) (7 వ చక్రము). 528 నుండి 533 వరకూ నామములు ఈమెను తెలెయ చేస్తాయి. **(సహస్త్రదళ పద్మస్థ, స్వర్ణవర్ణోపశోభిత, సర్వాయుధధర, శుక్లసంస్థితా, సర్వతోముఖ, సర్వోదనపీతిచిత్తాయ).** శిరస్సు మధ్యభాగములో సహస్త్రాకార చక్రము ఉంటుంది. ఇది వేయి దళములు కలది. యశస్వనీ దేవత ఈ చక్ర అధిష్టానదేవత. ఈ 7వ మాసములోనే గర్భస్థ శిశువులో జీవుడు ప్రవేశించేది. ఇందు విశ్వంలోని సకల వర్ణములు, రంగులు, అక్షరములు, విద్యలు, ధ్వనులు,

బీజాక్షరములు ఉంటాయి. యశస్విని దేవతకు లెక్కలేనన్ని చేతులు, అన్ని చేతులలో సకల ఆయుధములు ధరించునది. ఈమె సృష్టికి ఆధారభూతమైన శుక్ర ధాతువుని ఆశ్రయించునది. ఈమె సర్వతోముఖ అభివృద్ధి చేయునది. ఇంతవరకు **'స్మరణ'** యందు వివరించిన ఆరు చక్రాలను **షట్చక్రములుగా** పేర్కొంటారు. ఏడవది **సహస్రారంగా** వర్ణిస్తారు. ఇందు మొదటి ఆరింటి యందును ప్రజ్ఞ మేల్కొని పరిపూర్ణత చెంది, ఏడవది యగు సహస్రారమందు లయము చెందుటయే యోగం. ఇదియే మోక్షం. ఇదియే నిర్వాణం. ఇదియే అద్వైతస్థితి. ఆజ్ఞా విశుద్ధి చక్రములు సత్వగుణమును, అనాహతం మణిపూరక చక్రములు రజోగుణమును, స్వాధిష్టానం, మూలాధార చక్రములు తమోగుణమును వ్యక్తం చేయును. తమోగుణం దేహధాతువుల నిర్మాణమునకు, వానియందలి రసాయనిక మార్పులకు ఆధిపత్యం వహించడమే కాకుండా భౌతికదేహ నిర్మాణం కూడా దీని ప్రవృత్తియే. రజస్సు వలన శరీరం లోని వివిధ అవయములు పనిచేయుచున్నవి. ఇక సత్వం వలన గ్రహణశక్తి, వివేకం, విచక్షణ, విమర్శన మున్నగు లక్షణములు మేల్కొనును. ఈ మూడును మూడు లోకములుగా అంటే, భూలోకం (తమస్సు), భువర్లోకం (రజస్సు), సువర్లోకం (సత్వం) లుగా మనదేహంనందును, సౌరమండలం నందును ఏర్పడుచున్నవి. ఈ కమలం వేయిదళాలతో వికసించి యుంటుంది. అధిదేవత యాకిని. అకారాది క్షకారంత వర్ణమాల యోగినీగణం చేత సేవించబడుచున్నది. ఈమెకు సర్వాన్నం ప్రీతి. మస్తిష్కం పైన బ్రహ్మరంధ్రం క్రిందిభాగమున విలసిల్లే ఈ చక్రం విశ్వాత్మ నివాసస్థానం. పరమాత్మ స్థానం. ఇది మానసికంగా సంపూర్ణ ఆధ్యాత్మిక చక్రం. ఆత్మసాక్షాత్కారానికి దోహదం చేసే చక్రం. ఆత్మశక్తి అలరారే సుందర సుదర్శన చక్రం. విశ్వచైతన్యం వ్యక్తిచైతన్యంగా పరిఢవిల్లే కమలం ఈ సహస్రారం. పరిపూర్ణ జ్ఞానానికి ప్రతీక. ఆనందమయకోశంతో సంబంధం. ఈ చక్రం శక్తివంతంగా లేకపోతే -

షట్చక్రాలు బలహీనపడతాయి. గ్రహణశక్తి లోపిస్తుంది. భూత వర్తమానాలోనికి పయనిస్తూ అలసిపోతుంటారు. కష్టదుఃఖాలు పొందుతుంటారు. పునర్జన్మలు తప్పవు. ఈ చక్ర మానసిక స్వభావం - **ఈ చక్రం జాగృతయితే సాధకుడు అమరుడౌతాడు. పరమాత్మగా వ్యక్తమౌతాడు. తనకు తాను తెలుసుకుంటాడు. శ్రీరాముడు కూడా ఇలాంటి చక్ర జ్ఞానము, అభ్యాసము వలన పరమాత్మగా వ్యక్తమైనాడు.** ఇది ఈశ్వరీయత స్థితి. ఈశ్వరత్వం పొందుతారు. ఈ చక్రమును శుద్ధిచేసుకోవాలంటే - తలపు, మాట, చేత యోగ్యంగా వుండాలి. క్రమశిక్షణ, ఆచరణ, విశ్వాసం కలిగియుండాలి. ధ్యానం, బ్రహ్మతత్త్వ జ్ఞానం, స్థితప్రజ్ఞ (గతాన్ని తలవక, భవిష్యత్తు ఊహించక, వర్తమానంలో వర్తించడం అంటే ఏ క్షణానికి ఆ క్షణంలో జీవించడం) ప్రశాంత వాతావరణం ఏర్పరచుకోవడం చేయాలి. ఇక ఈ చక్రంనకు అధిపతి గ్రహం **'సూర్యుడు'**. (నవదుర్గలలో ఏడవ అవతారమైన కాళరాత్రి). ఋజువర్తన, నాయకత్వలక్షణాలు, అందర్నీ ఆకట్టుకునే ఆకర్షణీయశక్తి, సునిశితమైన చూపులు, విశాలమైన నుదురు, ఎందులోనూ ఓటమిని పొందని, మాటపడని తత్త్వం, విభిన్నమైన ఆలోచనావిధానంతో విజయమును సాధించే కార్యదక్షత సూర్యుని లక్షణాలు. సాధన ద్వారా ఈ లక్షణాలను పెంపొందించుకుంటే సహస్రారం శక్తివంతమై, తద్వారా ఈ చక్రంతో అనుసంధానింపబడియున్న షట్చక్రాలు శక్తిసామర్థ్యాలు కలిగియుండి మన జీవితములు ఆనంద నందనవనములు అవుతాయి. ప్రతీరోజూ సూర్యోదయ సమయానికి స్నానపానాదులు ముగించుకొని సూర్యునికి ఎదురుగా కూర్చొని, సూర్యోపాసన చెయ్యాలి. అంటే సూర్యకిరణాలు తాకిడిని అనుభవిస్తూ, సూర్యభగవానుని శక్తి మన సహస్రారం గుండా అన్నిచక్రాలయందు నిబిడీకృతమవుతున్నట్లు భావిస్తూ, ప్రశాంతచిత్తంతో కాసేపు ధ్యానించాలి. క్రమం తప్పని ఈ ఆచరణ వలన సూర్యభగవానుని శక్తి, గాయత్రి శక్తి మనకు లభించి తేజోమూర్తులవుతాం. కుండలినీశక్తి స్థూల శరీరం నుండి ప్రజ్ఞామయ శరీరం వరకు

వ్యాపించియున్నది. ఈ శక్తిని చైతన్యవంతం చేయాలి. ఆయా చక్ర దేవతలను ప్రార్థించాలి. {ప్రార్థన అంటే దైవస్మరణ మాత్రమే కాదు, మన మనస్సును ఇహం నుండి పరం వైపు త్రిప్పడానికే అన్న నిజాన్ని అర్ధంచేసుకొని, దేహమే దేవాలయమని, అంతరాన్నే అంతర్యామి కొలువై వున్నాడని గ్రహించి అందుకు తగ్గ ప్రార్థన చేయాలి}. ప్రకృతి సహజంగానే ప్రతీ మనిషికి కొంతశక్తిని ఇస్తుంది.. కొన్ని అవకాశాలు కల్పిస్తుంది. వచ్చిన అవకాశాలను అందుకుని, వున్నశక్తిని ఉపయోగించుకుంటూ ఆత్మశక్తిని పెంపొందించుకోగలగాలి. ఈ విధమైన సాధనే ఆధ్యాత్మిక ఉన్నతికి మార్గం సుగమం చేస్తుంది. ఈ సాధన వలన ఆలోచనల్లో స్పష్టత, నడవడికలో సరళత, దృక్పదంలో విశాలత, అందర్నీ ప్రేమించగల సౌశీల్యత, ఆదరించగల సేవాతత్పరత, అన్ని పరిస్థితులలోనూ సంయమనం, స్థితప్రజ్ఞత అలవడతాయి. నేను అనెడి అహం నశిస్తుంది. **'నేను' అనెడి సంకుచిత స్వాభిమానమదృశ్యమైనచో అనంతమగు 'అహంబ్రహ్మాస్మి' అనెడి ఉత్తమస్థితి తనంతటదియే సాక్షాత్కారమగును. అప్పుడు ఆనందం ఓ స్రవంతిలా ప్రవహిస్తుంది.** సహజత్వానికి దగ్గరగా ఉండటమే. ఈవిధంగా సరైనరీతిలో సప్త చక్రాలను సాధన చేస్తే, సంసారంలో తిరిగి జన్మింపరు. మనలో వున్న సప్త చక్రాలను చైతన్యవంతం చేసే సాధనలో స్థూలంనుండి ప్రజ్ఞామయం వరకు పయనించి 'అహం బ్రహ్మాస్మి' అన్న స్థితిని పొందడమే జీవన పరమావధి. ఈ చక్ర జ్ఞానములను విశ్వామిత్రుడు శ్రీరామునికి అభ్యాసము చేయించెను.

### 1.5.6.9 యోగ వాసిష్ఠములో చక్ర రహస్యములు

యోగావాసిష్ఠము ఉపశమన ప్రకరణములో వసిష్ఠ మహర్షి రామునికి ఆయా యోగసిద్ధుల గురించి వివరణ ఇచ్చెను. అవి పరిశీలిద్దాము.

ఈ దేహములో అనేక నాడీ సమూహాలు ఉన్నాయి. అట్టి 72000 దాకా ఉండే నాడీ సమూహాలలో నిరంతరము వాయువు ప్రవహిస్తూ ఉంటుంది. అట్టి

వాయువునే ప్రాణము అంటాము. అది శరీరంలో ఊర్ధ్వ-అధో గమనాలు చేస్తూ ఉంటుంది. ప్రాణ చలనముచే జనించునట్టి జ్ఞానవృత్తే **చిత్తము**, దానినే **సంవిత్తు** అంటారు. ప్రాణములు స్పందించుట చేతనే జ్ఞాన వృత్తుల స్పందనము కలుగుచున్నది. జ్ఞాన వృత్తులు చిదాభాసుని (reflection of absolute self) ఉనికితో ఉంటున్నాయి. **జ్ఞాన వృత్తుల స్పందము చేత విషయానుభవము, దృశ్య జగత్తు యొక్క వాస్తవ రూపము కనబడుతున్నది.** ప్రాణవాయువు మొదట నాసికా ద్వారా ప్రవేశిస్తుంది. అట్టి ప్రాణవాయువును నిరోధించుటయే **ప్రాణాయామము** అని అంటారు. అట్టి నిరోధము అనే యోగములోని వివిధ మార్గములను ఏమనగా - **అనేకాగ్రత నుండి ఏకాగ్రత, ప్రాణాయామం, ప్రణవోచ్చారణ. ఇంకా వివిధ యోగాభ్యాసములు ఏమనగా.... పూరకము, కుంభము, రేచకము, తాలుపు-ఘంటికల యోగ ముద్ర, పరధ్యానం, ఖేచరీ ముద్ర, బ్రహ్మరంధ్ర లయ ముద్ర, భ్రూ ముద్ర, గురు అనుగ్రహం-ఈశ్వరానుగ్రహం, ధ్యానము.** ఇట్టి, ఆయా ఉపాయములచే, అభ్యాసములచే ప్రాణము నియమించబడగా చిన్మాత్ర స్వభావుడగు ఆ పరమాత్మ సాధకుని స్వాత్మ స్వరూపమే అని తెలియును. సమస్త ప్రాణులలో హృదయము రెండు విభాగములు కలిగియున్నది. అవి-ఈ జడ శరీరము యొక్క ఒక అవయవమైన **త్యాజ్య (భౌతిక) హృదయము** ఇంకొకటి ఎరుక, జ్ఞానము కలిగిన **గ్రాహ్య (అభౌతిక) హృదయము** భ్రూమధ్యము నుండి, నాసికా ప్రదేశము నుండి, కంఠ ప్రదేశము నుండి 12 అంగుళముల వరకు గల ప్రదేశములో చిత్తమును స్థిరము చేయడం అనే అభ్యాసము చేత మనస్సు యొక్క పరిపరివిధత్వం ఉపశమిస్తుంది. ప్రాణముల నిరంతర సంచలనం శమిస్తుంది. అట్లాగే నాలుక యొక్క చివరి భాగంతో దవడ నందు వ్రేలాడే కొండనాలుకను పలుమార్లు స్పృశించడం అభ్యసించడం (ఖేచరీ ముద్ర) చేత కూడా ప్రాణ సంచలనంపై సాధకునికి ఆధీనత్వము లభిస్తుంది. అయితే ఆయా

యోగాభ్యాసాలన్నీ అఖండ-అప్రమేయానుభూతి అను రూపం గల మోక్ష స్థితిని కలుగజేస్తున్నాయి. అయితే వీటిని గురుముఖతః ఎరిగి అభ్యసించవలసినది. యోగ సాధన ద్వారా సాధకుడు మోక్ష ప్రాప్తి, ఆత్మ జ్ఞానం కావాలంటే, ముందుగా గురు అనుగ్రహం తో మనస్సును నిర్మలంగా చేసుకొని లక్ష్య సాధన తో సుఖాసీనుడై ధ్యానం చేయాలి. అలాంటి సందర్భంలో సాధకునికి నిద్ర ఆవరిస్తుంది, అనేకమైన శారీరిక రుగ్మతలు వస్తాయి, మనస్సు చంచలం అవుతుంది, ఇలా అనేక విఘ్నాలు వస్తాయి. ఈ విషయాలు ఉపోద్ఘాతము, సమాధి పాదములో వివరించడమైనది. అయినా సాధకుడు పట్టుదలతో నిశ్చలంగా కూర్చొని practice చేస్తూ.... ఉంటే ఎదో ఒక రోజున మనస్సు మీద నియంత్రణ వస్తుంది. పూర్వ జన్మ సంస్కారాన్ని బట్టి లక్ష్యము సిద్ధిస్తుంది. వశిష్ఠ మహర్షి కూడా ఇదే విషయము శ్రీరామునికి బోధిస్తూ పురుష ప్రయత్నము చేయమంటారు. అంతేకాని అంతా దైవము అని పురుష ప్రయత్నము మానవద్దు అంటారు. భుశుండోపాఖ్యానములో, భుశుండుడు నిరంతరం శ్వాస గమనాన్ని పరిశీలించుతూ చిరంజీవి అయ్యారు, ఇంకా ధ్యానంలో భ్రుకుటి యందు సూర్యచంద్రులు,ఇష్ఠ దేవతలను భావించుకొని వాటిని సాక్షాత్కరించుకోవచ్చు. యోగ సాధనలో ఇది అనుభవమే. సాధనలోని తీవ్రత వలన అవి చాలా సమయం మనఃఫలకం మీద ఉండును. భగవాన్ రమణులు చెపుతూ... అన్నింటికీ మూలమైన ఒక చైతన్య శక్తి ఉన్నది, దానినే **"స్వస్ఫురణ"** అంటారు. **ఆ శక్తిని పట్టుకుంటే కాని అభాసగుణాలు అన్ని పోయి సత్యం గోచరించును. అందుకు సాధన కావాలి. ధ్యానము అంటే బ్రహ్మము. మనఃకల్పితాలైన దోషాలు తోసివేసేందుకు ఎదో ఒక నిష్ఠ ఏర్పరుచుకొని ధ్యానము చేయాలి. అలా చేయగా చేయగా ఆయా దోషాలు పోయి ధ్యానమే మిగులుతుంది. తపస్సు అన్నా అదే. అదియే స్వస్వరూపము, ఆత్మ, బ్రహ్మము అన్నీ.** ఏ మహామతి అయితే ఈ సర్వ

సీమములకు ఆవల ఉన్నట్టి ఆ బ్రహ్మ పదమును అవలంభించి ఉంటాడో ... ధీరుడు, బ్రహ్మజ్ఞుడు అగు అతనిని జీవన్ముక్తుడు అని పిలుస్తున్నాము. ఇంకా శిఖిధ్వజోపాఖ్యానములో... పుర్యష్టకము, జీవునికి, ప్రాణం అనే పేరు గల కుండలిని ఆధారంగా ఉంది. పూరకం అనే అభ్యాసం చేత, శరీరం యొక్క స్థిరత్వం, గురుత్వం లభిస్తుంది. శరీరాన్ని మూలాధారం నుండి బ్రహ్మ రంధ్రం వరకు తిన్నగా నిలిపి ప్రాణవాయువుని పైకి ఆకర్షించి, కుండలినీ సంవిత్తుని పైకి పంపితే, దీర్ఘత్వాన్ని పొందిన కుండలిని, నాడులన్నిటిని తనతో తీసుకొని పైకి పోతుంది. ఇదే యోగి యొక్క ఆకాశగమనం. ఇక, రేచక ప్రాణాయామ ప్రయోగం చేత కుండలినీశక్తి సుషుమ్నా నాడిలో ప్రాణవాయు ప్రవాహం చేత శిరస్సు యొక్క ఇరుకవాటాల సంధిరూపమైన కవాటానికి 12 అంగుళాల దూరంలో ఉన్న షోడశాంతం అనే స్థానంలో ముహూర్తకాలం ఉంటె అప్పుడు ఆకాశంలో సంచరించే సిద్ధుల దర్శనము అవుతుంది. రేచకాభ్యాసం చేత ముఖానికి 12 అంగుళాల వెలుపల స్థానంలో ప్రాణవాయువుని చిరకాలం ఉంచడం చేత, యోగి మరొక శరీరంలో ప్రవేశించ గలుగు తాడు. దీనినే పరకాయప్రవేశం అంటారు. నక్షత్రం వంటి ఆకారం కలది, హృదయ కమలంలో బంగారు తుమ్మెద లాగ ఉండేది, యోగుల చేత ఉపాసింపబడేది అయిన ఆ తేజం దేహం అంతటా సంచరిస్తూ ఉంటుంది. ఆ ప్రకాశాన్ని చిద్రూపంగా ధ్యానిస్తే సర్వ పదార్థ దర్శనం అనే సిద్ధి కలుగుతుంది. అప్పుడు యోగి లక్ష యోజనాల దూరంలో ఉన్న వస్తువును కూడా చూడగలుగుతారు. హృదయ కమలం మీద ఉండే అగ్నికణం శరీర ధాతువులను ద్రవింప జేసి, దేహం నుండి వేరై సూక్ష్మ రూపంలో ఉంటుంది. అప్పుడు కుండలిని శక్తి ఈ సూక్ష్మ దేహాన్ని ఎక్కడికైనా తీసుకెళ్ల గలుగుతుంది. అందువలనే అది ఏ రూప భావన చేస్తే అదే రూపాన్ని పొందుతుంది. దానినే కామరూపధారణ అంటారు. (ప్రాణాయామము లో అనేక రకాలు ఉన్నాయి. వాటిలో ఒకటి **"మూర్ఛ ప్రాణాయామము"**. గుదము నుంచి అన్ని నవనాడులను బంధించి,

సాధకుడు నాసిక ద్వారా వాయువును స్వీకరించి అట్టి వాయువును శరీరములో మూర్ఛ వచ్చునంతవరకు బంధించుట. దీనివలన వాయువు శరీరము లోని 72000 నాడుల ద్వారా వ్యాప్తి చెంది, ఉత్తేజ పరచుట ద్వారా సాధకుడు పూర్తి ఆరోగ్యంతో ఉండగలడు.) ఇది యోగం చేత అణిమా సిద్ధుల్ని పొందే విధానం. ఇక జ్ఞానం చేత వాటిని సాధించే విధం ఏమనగా ..... ఏకం, శుద్ధం, సూక్ష్మం కంటే సూక్ష్మం, శాంతం అయిన చిన్మాత్ర వస్తువే ఉంది. చైతన్యము అధ్యాస చేత సంకల్పము వైపుకి తిరిగినప్పుడు, అది కలుషితమై జీవుడు అనే పేరుతో చెప్పబడును. జ్ఞానం వలన ఈ మొహం సన్నగిల్లును. ఆత్మజ్ఞానులు, సత్య సంకల్పులు అయిన మహాత్ములు తమను ఏ విధంగా భావించుకొంటే ఆ విధంగా తమను తాము కాంచుకోగలరు. అయితే తత్వజ్ఞాని ఈ అల్ప సిద్ధుల్ని అధికంగా తలచక నిరతిశయానంద రూపమైన తన ఆత్మనే అధికంగా తలుస్తాడు. ఈ విధమైన ఈ చక్రజ్ఞానమును విశ్వామిత్రుడు శ్రీరామునితో సాధన (అభ్యాసము) చేయించెను.

### 1.6 అస్త్రములు:

యోగచక్ర అభ్యాసమైన తర్వాత విశ్వామిత్రుడు, శ్రీరామునికి అస్త్ర అభ్యాసము చేయించెను. తాటక వృత్తి (అహంకార వృత్తి) ని సంహరించి, చక్ర జ్ఞానము అభ్యాసము అయిన తర్వాతనే ఈ దివ్య అస్త్రముల సాధన సాధ్యము. అస్త్రముల మూల ఆశయము జగత్సంహారము కాదు. '**అస్**' అనగా ఉండుట. '**త్ర**' అనగా రక్షణ. రెండింటిని కలిపినచో ప్రాప్తించిన అవస్థను రక్షణ చేసుకొనుట అని అర్ధము.

**వజ్రమ్ అస్త్రం నర శ్రేష్ఠ శైవం శూల వరం తథా,**
**అస్త్రం బ్రహ్మశిర శ్చైవ ఐషీకమ్ అపి రాఘువ**
**దదామి తే మహా బాహో బ్రాహ్మమ్ అస్త్రమ్ అనుత్తమమ్**
**గదే ద్వే చైవ కాకుత్స్థ మోదకీ శిఖరీ ఉభే**

ప్రదీప్తే నర శార్దూల ప్రయచ్ఛామి నృపాఽఽత్మజ
ధర్మ పాశమ్ అహం రామ కాల పాశం తథైవ చ,
పాశమ్ వారుణం అస్త్రం చ దదామి అహమ్ అనుత్తమమ్
అశనీ ద్వే ప్రయచ్ఛామి శుష్కార్ద్రే రఘు నన్దన,
దదామి చ అస్త్రం పైనాకమ్ అస్త్రం నారాయణం తథా
ఆగ్నేయమ్ అస్త్ర దయితం శిఖరం నామ నామతః,
వాయవ్యం ప్రథమం నామ దదామి తవ రాఘవ
అస్త్రం హయ శిరో నామ క్రౌఞ్చమ్ అస్త్రం తథైవ చ
శక్తి ద్వయం చ కాకుత్స్థ దదామి తవ చాఽనఘ
కఙ్కాలం ముసలం ఘోరం కాపాలమ్ అథ కఙ్కణమ్
వధాఽర్థం రాక్షసా యాని దదామి ఏతాని సర్వశః
వైద్యాధరం మహాఽస్త్రం చ నన్దనం నామ నామతః
అసి రత్నం మహా బాహో దదామి నృవరాత్మజ
గాన్ధర్వమ్ అస్త్రం దయితం మానవం నామ నామతః
ప్రస్వాపన ప్రశమనే దద్మి సౌరం చ రాఘవ
దర్పణం శోషణం చైవ సంతాపన విలాపనే
మదనం చైవ దుర్ధర్షం కన్దర్ప దయితం తథా
పైశాచమ్ అస్త్రం దయితం మోహనం నామ నామతః
ప్రతీచ్ఛ నర శార్దూల రాజ పుత్ర మహాయశః
తామసం నర శార్దూల సౌమనం చ మహా బల
సంవర్తం చైవ దుర్ధర్షం మౌసలం చ నృపాత్మజ
సత్యమ్ అస్త్రం మహా బాహో తథా మాయాధరం పరమ్
ఘోరం తేజః ప్రభం నామ పర తేజోऽపకర్షణమ్
సౌమ్యాఽస్త్రం శిశిరం నామ త్వష్టు రఽస్త్రం సుదామనమ్

**దారుణం చ భగస్యాఽపి శితేషుమ్ అథ మానవమ్**

ఈ అస్త్రముల అభ్యాసమును గూర్చి పరిశీలిద్దాము.

**బ్రహ్మ శిరాస్త్రము:** బ్రహ్మావస్థను చేరుటకు తగిన ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక సాధన.

**పైనాక మస్త్రము: 'పినాక'** అనగా **'శివ'** లేదా కళ్యాణదాయకము. అటువంటి కళ్యాణ కారక అవస్థయందు ఉండగలిగే సాధనావస్థ.

**నారాయణాస్త్రము: 'నారా'** అనగా **'జలము'**. నారాయణము అనగా జలము నందు వశించెడి దివ్య అవస్థ. అటువంటి దివ్య అవస్థను రక్షణ చేయు అభ్యాసము.

**ఆగ్నేయాస్త్రము:** జలతత్వము పైన తెజస్తత్వము. ఈ తేజస్తత్వ అనుభూతి జలతత్వము కంటెను కఠినమైనది. తేజస్తత్వములోని సాధకుని కుశలముగా రక్షణ చేసే అభ్యాసము.

**వాయువ్యాస్త్రము:** ఈ వాయుతత్వ గతి ప్రకాశం గతి కన్న ఎంతో తేజోవంతమైనది.

**శిఖరాస్త్రము:** శిఖరము అనగా అగ్రము. సర్వోచ్చమమైన బ్రహ్మావస్థ యందుండుటకు తగిన రక్షించే సాధన.

**హయశిరాస్త్రము: 'హయ'** అనగా అశ్వము. యోగార్థములో **'కుంభక'** అందురు. కేవలం కుంభకములో ఎక్కువ కాలము ఉండు రక్షణ అవస్థ.

**మోహనాస్త్రము:** కుండలిని జాగృతమగుట వలన సాధకుని శరీరము, స్వభావము ఆకర్షణలో కూడినదియై ఉండును. అదే మోహనమైనది. ఈ అవస్థను రక్షించగలిగిన అవస్థ.

**సోమాస్త్రము:** సోముడు అనగా చంద్రుడు. లేదా అపతత్త్వము. అపతత్త్వ సాధకుడు తన శిరస్సు నందు ఎల్లప్పుడూ చంద్రుని చూచును.

ఈ ప్రకారముగా విశ్వామిత్రుడు శ్రీరామునికి అనేక దివ్య రూప సాధనా అస్త్రముల యందు శిక్షణ ఇచ్చినాడు. ఏ అవస్థను అయినా ప్రాప్తించుకోవడానికి ఆయా అవస్థలతో ఐక్యం కావాలి. రాక్షసులు అనగా వేరే ఎక్కడో లేరు. మనస్సు, సంకల్పంలో ఉన్నటువంటి చెడు వృత్తులే రాక్షసులు అని సామవేదం షణ్ముఖ శర్మ గారు తమ లలితా సహస్ర భాష్యములో చెప్పారు. ఈ విధముగా విశ్వామిత్రుడు ఈ రాక్షస వృత్తులను శ్రీరాముని అభ్యాసము తో సంహరింపచేసినాడు.

**1.7.1 సిద్ధాశ్రమము:**

అస్త్రముల ఉపదేశము అయిన తర్వాత విశ్వామిత్రుడు రామలక్ష్మణులను సిద్ధాశ్రమమునకు తీసుకొని వెళతాడు. శ్రీరాముని సందేహానికి సమాధానముగా విశ్వామిత్రుడు సిద్ధాశ్రమము యొక్క విశేషాలను వివరించుచున్నాడు.

**ఇహ రామ మహా బాహో విష్ణుః దేవవర ప్రభుః**
**వర్షాణి సుబహూని ఇహ తథా యుగ శాతాని చ**
**తపశ్చరణ యోగాఽర్థం ఉవాస సుమహాతపాః**
**ఏష పూర్వ ఆశ్రమో రామ వామన స్య మహాత్మనః**
**సిద్ధాఽఽశ్రమ ఇతి ఖ్యాతః సిద్ధో హి అత్ర మహాతపాః**
**ఏతస్మిన్ ఏవ కాలే తు రాజా వైరోచనిర్ బలిః**
**నిర్జిత్య దైవత గణాన్ స ఇంద్రాన్ స మరు ద్గణాన్**
**కారయా మాస తత్ రాజ్యం త్రిషు లోకేషు విశ్రుతః**
**యజ్ఞం చకార సుమహాన్ అసురేన్ద్రో మహా బలః**
**బలే స్తు యజమాన స్య దేవాః స అగ్ని పురోగమాః**
**సమాగమ్య స్వయం చైవ విష్ణుమ్ ఊచుః ఇహాఽఽశ్రమే**
**బలిః వైరోచనిః విష్ణో యజతే యజ్ఞమ్ ఉత్తమమ్**
**అసమాప్తే క్రతౌ తస్మిన్ స్వ కార్యమ్ అభిపద్యతామ్**

యే చ ఏనమ్ అభివర్తన్తే యాచితార ఇత స్తతః
యత్ చ యత్ర యథావత్ చ సర్వం తేభ్యః ప్రయచ్ఛతి
స త్వం సుర హితార్థాయ మాయా యోగమ్ ఉపాశ్రితః
వామనత్వం గతో విష్ణో కురు కల్యాణమ్ ఉత్తమమ్
ఏతస్మిన్ అంతరే రామ కాశ్యపో అగ్ని సమ ప్రభః
అదిత్యా సహితో రామ దీప్యమాన ఇవ ఓజసా
దేవి సహాయో భగవాన్ దివ్యం వర్ష సహస్రకం
వ్రతం సమాప్య వరదం తుష్టావ మధుసూదనం
తపోమయం తపోరాశిం తపోమూర్తిం తపాత్మకం
తపసా త్వామ్ సుతప్తేన పశ్యామి పురుషోత్తమం
శరీరే తవ పశ్యామి జగత్ సర్వ మిదం ప్రభో
త్వం అనాదిః అనిర్దేశ్యః త్వామ్ అహం శరణం గతః
తమ్ ఉవాచ హరిః ప్రీతః కాశ్యపం ధూత కల్మషం
వరం వరయ భద్రం తే వరాఽర్హోఽసి మతం మమ
తత్ శృత్వా వచనం తస్య మరీచో కాశ్యపోఽబ్రవీత్
అదిత్యా దేవతానామ్ చ మమ చ ఏవ అనుయాచతః
వర వరద సుప్రీతో దాతు మఽర్హసి సువ్రత
పుత్రత్వం గచ్ఛ భగవన్ అదిత్యా మమ చాఽనఘ
భ్రాతా భవ యవీయాన్ త్వం శక్ర స్య అసుర సూదన
శోకాఽఽర్తానాం తు దేవానాం సాహాయ్యం కర్తు మర్హసి
అయం సిద్ధాఽఽశ్రమో నామ ప్రసాదాత్ తే భవిష్యతి
సిద్ధే కర్మణి దేవేశ ఉత్తిష్ఠ భగవన్ ఇతః
అథ విష్ణుర్ మహాతేజా అదిత్యాం సమజాయత

**వామనం రూపమ్ ఆస్థాయ వైరోచనిమ్ ఉపాగమత్**
**త్రీన్ పాదాన్ అథ భిక్షిత్వా ప్రతిగృహ్యా చ మానదః**
**ఆక్రమ్య లోకాన్ లోకాఽఽత్మా సర్వ భూత హితే రతః**
**మహేన్ద్రాయ పునః ప్రాదాత్ నియమ్య బలిమ్ ఓజసా**
**త్రైలోక్యం స మహా తేజా శ్చక్రే శక్ర వశం పునః**
**తేన ఏష పూర్వమ్ ఆక్రాన్త ఆశ్రమః శ్రమ నాశనః**
**మయాఽపి భక్త్యా తస్య ఏవ వామన స్య ఉపభుజ్యతే**
**ఏనమ్ ఆశ్రమమ్ ఆయాన్తి రాక్షసా విఘ్న కారిణః**
**అత్ర తే పురుష వ్యాఘ్ర హన్తవ్యా దుష్ట చారిణః**
**అద్య గచ్ఛామహే రామ సిద్ధాశ్రమమ్ అనుత్తమమ్**
**తత్ ఆశ్రమ పదం తాత తవాఽపి తత్ యథా మమ**
**ఇతి ఉక్త్వా పరమ ప్రీతో గృహ్యా రామం సలక్ష్మణం**
**ప్రవిశన్ ఆశ్రమ పదం వ్యరోచత మహా ముని:**
**శశీవ గత నీహారః పునర్వసు సమన్వితః**
**తం దృష్ట్వా మునయః సర్వే సిద్ధాశ్రమ నివాసినః**
**ఉత్పత్యోత్పత్య సహసా విశ్వామిత్రమ్ అపూజయన్**

"ఒకప్పుడు విరోచనుడి కుమారుడైన బలి చక్రవర్తి తన ప్రరాక్రంతో ఇంద్రుడిని నిర్బంధించాడు. అప్పుడు శ్రీమహా విష్ణువు వామన మూర్తిగా వచ్చి బలిని పాతాళానికి పంపారు. ఆ వామన మూర్తి తపస్సు చేసిన ఆశ్రమమే ఈ ఆశ్రమం, దీనిని సిద్ధాశ్రమం అంటారు. ఇక్కడే కశ్యప ప్రజాపతి తపస్సు చేశారు, ఇక్కడే విష్ణువు ఇంద్రుడికి తమ్ముడిగా, ఉపేంద్రుడిగా పుట్టారు. నేను యాగం చేస్తున్నది కూడా ఈ ఆశ్రమంలోనే " అని చెప్పి అందరూ ఆ ఆశ్రమంలోకి వెళ్లారు.

### 1.7.2 సిద్ధాశ్రమము యొక్క యోగ రహస్యము

శరీరముతో జీవుడు సిద్ధిని పొందుటకు ప్రయత్నించవలెను. సిద్ధి అనగా అవిద్య[3] తొలగి కామము (కోరిక), కర్మ అంతమొందుట. సిద్ధిని కలిగించెడి ఆశ్రమము సిద్ధాశ్రమము. ఆశ్రమము అనగా శ్రమలను తొలగించునది. కర్మలే సిద్ధికి విఘ్నములు. అవిద్య, ప్రకృతి అనునవి జీవుని జ్ఞానమును ఆవరించును. దానిచే కామము అనగా కోరికలు కలుగును. కోరికలచే కర్మ చేయుచుండును. అనాదిగా జీవునకు అవిద్యా సంబంధము, కర్మ సంబంధము ఏర్పడి ఉన్నవి.

యోగ వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి శ్రీరామునికి బోధించుతూ .... నియతి (An arrangement of cause and effect), పురుషాకారము (That which results because of efforts) ఈ రెండూ పురుషప్రయత్నము మీదనే ఆధారపడి అనుసరించి ఉన్నాయి. కేవలము కర్మలను త్యజించినంతమాత్రాన ఏఒక్కరికి నైష్కర్మ సిద్ధి (కర్మరాహిత్య స్థితి) ప్రాప్తించదు. మనస్సును ఇచ్ఛారహితము చేసినపుడే అది లభిస్తుంది. **"మనస్సు"** శాస్త్ర ద్రుష్టిచేత చూడబడుచు, బుద్ధి చేత అనుభవించబడుచు ఆత్మపరిత్యాగ మొనర్చి పరమగు సిద్ధిని అనగా కైవల్యమును పొందవలెను. అఖండము, నిర్మలం, నిత్యము అగు ఆత్మను భావన చేయడం చేతనే **"ఆత్మసిద్ధి"** అనే ఐశ్వర్యము పొంది జీవుడు భవ్య జీవుడు

---

[3] Avidya is similar to the concept of maya, the difference being that maya is universal illusion, while avidya is individual ignorance or delusion. In the Yoga Sutras, Patanjali describes the five kleshas (obstacles) that block the spiritual path. Avidya is the first of the kleshas listed because it is the basis for the others. By destroying avidya, the other kleshas are no longer an issue. Avidya obscures the higher Self by firmly establishing our life habits and preventing change.
To overcome avidya, the Yoga Sutras suggest these methods:
1. Yogic asanas and breathing exercises.
2. Self-examination through meditation.
3. Spiritual detachment from and observation of one's actions.

కాగలడు. జ్ఞానప్రాప్తికై ప్రహ్లాదుడు తనంతనే సిద్ధి పొందెను. ఉద్దాలకుడు చిరకాలం అభ్యాసము చేస్తూ సమాధిలో ఆత్మానందాన్ని, చిద్రూపాన్ని పొంది, పరమాత్మ యొక్క సత్తాసామాన్య రూపాన్ని పొంది మహాసిద్ధిని పొందాడు. పుణ్యాతిశయము వలన విషయ సుఖము కూడా చిత్త శాంతికి, సిద్ధి పొందడానికి ఉపయోగ పడుతుంది అని బలి ఉపాఖ్యానములో చెప్పారు.

### 1.8 కుశ వంశం

మరునాడు పూర్వాహ్నమందు చేయ వలసిన పనులను శ్రీరాముడు పూర్తి చేసుకొని విశ్వామిత్రుడికి వినయపూర్వకంగా నమస్కరించి ....

**ఇమౌ స్మ ముని శార్దూల కింకరౌ సముపస్థితౌ**

**ఆజ్ఞాపయ యథేష్టం వై శాసనం కరవావ కిమ్**

యోగ వసిష్ఠములోని శుక వృత్తాంతములో గురు బోధన, అనుగ్రహము లేకుండా శుకుడికి ఆత్మానుభవము పరిపక్వ దశకు రాలేదనే విషయము జ్ఞప్తికి తెచ్చుకొని విశ్వామిత్రునితో, మహర్షి! మేము మీ ఆజ్ఞలను నెరవేర్చు సేవకులము. ఇచట నిలిచి ఉన్నాము. మీ ఇష్టము వచ్చినట్లు ఆజ్ఞాపించండి. మీ శాసనాన్ని శిరసావహిస్తాము అని చెప్తారు. విశ్వామిత్రుడు శ్రీరామునితో, మిథిలా నగరంలో జనక మహారాజు ఒక గొప్ప యాగం చేస్తున్నారు, కావున మీరు కూడా నాతో ఆ నగరానికి రండి, అక్కడ చూడవలసినవి రెండు ఉన్నాయి అని విశ్వామిత్రుడు రాముడితో చెప్పాడు. అందరూ ఆ మిథిలా నగరానికి బయలుదేరారు.

అలా వాళ్ళు ప్రయాణిస్తూ శోణానది ఉన్న ప్రాంతానికి చేరుకున్నారు, ఆ ప్రాంతం ఫలాలు, పుష్పాలతో చాలా శోభాయమానంగా కనబడింది. ఈ ప్రాంతం ఇంత ఆనందంగా, అందంగా ఉండడానికి కారణమేంటని రాముడు అడగగా విశ్వామిత్రుడు ఇలా చెప్పాడు " పూర్వకాలంలో బ్రహ్మ కుమారుడైన కుశుడు రాజ్యపాలన చేసేవాడు. కుశుడి రెండవ కుమారుడైన కుశనాభుడికి 100 మంది కుమార్తెలు కలిగారు. వాయువు వారితో నన్ను పెళ్లి చేసుకోండి, నన్ను

పెళ్ళిచేసుకుంటే మీరు కూడా నిత్య యవ్వనంలో ఉంటారు అని ప్రలోభ పెట్టాలని ప్రయత్నించాడు. వెంటనే ఆ 100 కన్యలు ఏక కంఠంతో ...

**పితా హి ప్రభుః అస్మాకం దైవతం పరమం హి సః**
**యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి**

మాకు పెళ్ళంటూ జరిగితే, అది ధర్మాత్ముడైన మా తండ్రిగారు ఎవరిని చూపించి చేసుకోమంటే వాళ్లనే చేసుకుంటాము కాని మా అంతట మేము నిర్ణయించుకోము, ఈ దేశంలో ఏ స్త్రీ తన తండ్రిని కాదని సొంతంగా తన భర్తని నిర్ణయించుకునే రోజు రాకూడదు అని ఆ కన్యలందరూ ఏక కంఠంతో చెప్పారు. వారి మాటలకు ఆగ్రహించిన వాయుదేవుడు ఆ నూరుగురు కన్యల శరీరములలోకి ప్రవేశించి వారి అవయవము లందు సంకోచత్వం కల్పించాడు, దానివల్ల వారందరూ అవయవముల పటుత్వం కోల్పోయారు. తరవాత ఆ కన్యలందరూ కుశనాభుడి దెగ్గరికి వెళ్లి జరిగినది చెప్పారు. అప్పుడు ఆ కుశనాభుడు తన కుమార్తెలను చూసి, అమ్మా! మీకు ఈ స్థితి కల్పించిన ఆ వాయుదేవుడిని మీరు శపించలేదు, ఓర్పు వహించారు, నాకు చాలా సంతోషంగా ఉందమ్మా అని.....

**యాదృశే: వః క్షమా పుత్ర్యః సర్వాసామ్ అవిశేషతః**
**క్షమా దానం క్షమా యజ్ఞః క్షమా సత్యం చ పుత్రికాః**
**క్షమా యశః క్షమా ధర్మః క్షమాయాం విష్ఠితం జగత్**
**విసృజ్య కన్యాః కాకుత్స్థ రాజా త్రిదశ విక్రమః**

స్త్రీకి ఉండవలసిన ఆభరణం ఓర్పు. నూరుగురు కలిసి ఒకేసారి అంత ఓర్పు పట్టారు, మీలో ఒక్కరికి కూడా కోపం రాలేదు, అందం అంటే ఇది. ఓర్పె దానం, అన్నిటికన్నా గొప్ప కీర్తి ఓర్పె, ఓర్పుకి మించిన యజ్ఞం లేదు, ఓర్పుని మించిన సత్యం లేదు, ఓర్పుని మించిన ధర్మం లేదు, ఆ ఓర్పు వల్లనే ఈ భూమి నిలబడుతోంది" అని చెప్పాడు.

**ఈ కథ ద్వారా శ్రీరామునికి పితృవాక్య పాలన, ఓర్పు, క్షమ, లోక ధర్మము విషయమై తన మనోనిశ్చయము మరింకా దృఢపడింది.** కుశనాభుడు తన నూరుగురు కుమార్తెలని ఆ బ్రహ్మదత్తుడు అను రాజుతో ఇచ్చి వివాహం జరిపించాడు. బ్రహ్మదత్తుడితో వివాహం అవుతుంటే ఒక్కొక్కరి అంగవైకల్యం పోయి, వాళ్ళు మళ్ళీ పూర్వ సౌందర్యాన్ని పొందారు. ఈ వృత్తాంత్తం విన్నాక అందరూ ముందుకి బయలుదేరారు. కుశనాభుడికి కుమారులు లేరు. కుమారులు కలగడం కోసం పుత్రకామేష్టి యాగం ప్రారంభించాడు, తత్ఫలితంగా గాధి అనే కుమారుడు జన్మించాడు. నేను ఆ గాధి యొక్క కుమారుడినే
రామా! అని విశ్వామిత్రుడు రాముడితో చెప్పాడు. **నేను కుశ వంశంలో జన్మించాను కాబట్టి నన్ను కౌశికుడు అని అంటారు.** శ్రీరాముని కోరికపై కథా సందర్భమున విశ్వామిత్రుడు గంగావతారాణమును ఇట్లు వివరించెను.

**1.9 గంగావతారాణము-భగీరథుని ఆత్మ శోధనము**

రామా! మీ వంశమునకు చెందిన అయోధ్యాధిపతి **"సగరుడు"** అనే ఒక గొప్ప ధర్మాత్ముడు కలడు. అతనికి ఒక భార్య ద్వారా అసమంజసుడు, వేరొక భార్య ద్వారా అరువది వేల మంది బలవంతులైన కుమారులు కలిగిరి. అసమంజసునికి అంశుమంతుడు అనే కుమారుడు కల్గెను. ఒకనాడు సగరునకు యజ్ఞము చేయవలెనని సంకల్పించి ఆరంభించెను. యజ్ఞాశ్వమును ఇంద్రుడు అపహరించి పాతాళమున కపిల రూపమున తపస్సు చేసుకొంటున్న వాసుదేవుని ఆశ్రమమున వదలి పోయెను. సగరుని అరువది వేల మంది బలవంతులైన కుమారులు భూమిని మొత్తము త్రవ్వి పాతాళమున కపిలముని ఆశ్రమములో యజ్ఞాశ్వమును చూసి ఈయనే మన గుర్రాన్ని దొంగాలించాడని ఆ సగరులు భావించి ఆయనని కొట్టడానికి పరుగుతీసారు. వెంటనే ఆ కపిల మహర్షి ఒక 'హుం'కారం చేసేసరికి ఈ 60,000 మంది సగరులు నేల మీద బూడిద్దై పడ్డారు. ఎంతకాలమైన సగరులు రాకపోయేసరికి, ఆ సగరుడు అంశుమంతుడిని పిలిచి

వెతకమన్నాడు. అంశుమంతుడు తన పినతండ్రులు తవ్విన మార్గం ద్వారా ప్రయాణించి కపిల మహర్షి ఆశ్రమం చేరుకున్నాడు. అక్కడున్న తన పినతండ్రుల భస్మాన్ని చూసి బాధపడ్డాడు. వాళ్ళకి ఉత్తర క్రియలు జరగలేదు కనుక నీళ్ళు తీసుకువద్దామని బయలుదేరగా, ఆ సగరుల మేనమామ అయిన గరుత్మంతుడు ప్రత్యక్షమై, ఈ భూమిలోని ఏ జలంతో జలతర్పణ ఇచ్చినా నీ పినతండ్రులు స్వర్గానికి వెళ్ళరు, వాళ్ళు స్వర్గానికి వెళ్ళాలంటే కేవలం స్వర్గలోకంలో ప్రవహించే గంగా జలాలతో తర్పణ ఇవ్వాలి. కాబట్టి గంగని భూమి మీదకి తీసుకొచ్చే ప్రయత్నం చెయ్యి అని చెప్పాడు. సరే అని ఆ యాగాశ్వాన్ని తీసుకెళ్ళి యాగం పూర్తి చేశారు. తన కుమారులు కపిల మహర్షి ఆగ్రహానికి బూడిదయ్యారని విని సగరుడు చాలా బాధ పడ్డాడు. తరవాత ఆయన ఒక 30,000 వేల సంవత్సరాలు జీవించి శరీరం వదిలాడు, ఆయన తరవాత అంశుమంతుడు రాజయ్యాడు, ఆయన 32,000 సంవత్సరాలు తపస్సు చేశాడు, అలా తపస్సులోనే శరీరం వదిలేశాడు. ఆయన తరవాత వచ్చిన దిలీపుడు 30,000 సంవత్సరాలు రాజ్యం చేశాడు కాని గంగని తీసుకురాలేకపోయాడు. దిలీపుడి తరవాత వచ్చిన భగీరథుడు రాజ్యాన్ని మంత్రులకి అప్పజెప్పి, గోకర్ణ క్షేత్రంలో 1000 సంవత్సరాలు తపస్సు చేయగా, ఆయనకి బ్రహ్మదేవుడు దర్శనం ఇచ్చాడు. అప్పుడు భగీరథుడు "నాకు కుమారులు లేరు, కాబట్టి మా వంశం ఆగకుండా ఉండడానికి నాకు కుమారులు కలిగేలా వరమివ్వు అన్నాడు, అలాగే మా పితృదేవతలు స్వర్గానికి వెళ్ళడం కోసం సుర గంగని భూమి మీదకి పంపించు" అన్నాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు "నీ మొదటి కోరికని నేను తీరుస్తాను, కాని గంగని భూమి మీదకి వదిలితే, దాన్ని పట్టగలిగేవాడు ఎవడూ లేడు, కేవలం శివుడు తప్ప. కావున నీవు శివుని గూర్చి తపస్సు చెయ్యి, ఆయన ఒప్పుకుంటే అప్పుడు గంగని

వదులుతాను" అని అన్నాడు. తర్వాత భగీరధుడు ఒక సంవత్సరము బొటని వ్రేలుతో నిలబడి తీవ్రమైన తపస్సు చేయగా శంకరుడు ప్రత్యక్షమై గంగను భరింపగలను అని చెప్పెను. అప్పుడు గంగ తన తీవ్రమగు రూపమును, వేగమును స్వీకరించి ఆకాశము నుండి శివుని శిరస్సు పైన పడబోతు, తన వేగముతో శివుని కూడా పాతాళమునకు గొనిపోదును అని ఆలోచించగా, ఆ విషయము గ్రహించిన శివుడు, గంగను తన జటాజూటమున బంధించెను. ఇంతకీ గంగ బయిటకు రాకపోయేసరికి, భగీరధుడు మరల శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు కరుణించి గంగను వదిలెను. **అలా వెలుపలికి వచ్చిన గంగ హ్లాదిని, పాదని, నళిని అను పేర్లతో తూర్పు వైపు, సుచక్షువు, సీత, సింధువు అను పేర్లతో పడమటి వైపు ప్రవహించెను. ఎడవ ప్రవాహము భగీరథుని వెంట భూమిపై ప్రవహించెను. దీనినే భాగీరధి అంటారు.** ఈ విధముగా పాతాళమునకు ప్రవహించే కార్యక్రమములో గంగ జహ్ను ముని ఆశ్రమమును ముంచెత్తెను. అందుకు ముని కోపించి గంగను మొత్తము పానము చేసెను. భగీరధుడు ప్రార్ధన చేయగా అందుకు సంతసించి తన చెవి ద్వారా వదిలెను. అందుచే గంగ **జాహ్నవి** గా కూడా పేరు గాంచెను. తర్వాత గంగ పాతాళమునకు ఏగి ఆయా భస్మ రాశులపై ప్రవహించగా వారందరు తరింపబడినారు. కావున రామా! **భగీరథ అకుంఠిత ప్రయత్నముచే గంగ స్వర్గ, మర్త్య, పాతాళములు ప్రవహించి "త్రిపద" గా అయ్యినది.**

యోగా వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి శ్రీరామునికి భగీరధోపాఖ్యానము చెపుతూ...., రామా! నీ వలెనే భగీరధునికి కూడా యవ్వన దశలోనే సంసారము గూర్చిన విచారంతో వైరాగ్య భావము ఏర్పడింది. అంత భగీరధుడు తన గురువైన త్రితలుని మార్గము ఉపదేశించమని కోరగా త్రితలుడు భగీరధునితో ... రాజా! అహంభావం నశించి రాగద్వేషాలు పోగొట్టుకొంటే సంసార వ్యాధికి జ్ఞానమైన ఔషదం లభించగలదు. సర్వసాధనల ఫలం అనహంకారము. రాజా! ఈ

అహంభావంను తొలగించే మార్గం చెపుతాను విను. పురుష ప్రయత్నం తో ఈ భోగవాసనలను చింతించడం మాను. నీవు ఈ రాజోపచారాలైన ఛత్రచామరాది చిహ్నాలను వదులు. దీనాతిదీనుడవై, రాజ్యలక్ష్మిని శత్రువుకు అర్పించి, శరీరాభిమానాన్ని పారద్రోలి, వారి వద్దనే బిక్ష మెత్తగలిగితే, నీ అభిమానం నశించి పోతుంది. గురువు అయిన నన్ను కూడా త్యజించు. నీకిక సంసార బ్రాంతి కలగటానికి ఇసుమంత అయిన అవకాశం ఉండదు అని చెప్తాడు. రామా! భగీరథుడు గురువు చెప్పినదంతా బోధ పరుచుకొని సర్వత్యాగం సిద్ధించడం కోసము అగ్నిష్టోమం నుండి విశ్వజిద్యాగం వరకు గల అన్ని యాగాలు చేశాడు. యజ్ఞం ముగియగానే అతను పాత్ర, అపాత్ర అని విచారణ చేయకుండా బ్రాహ్మణులకు, ప్రజలకు గోవులు, గుర్రాలు, ఏనుగులు, బంగారం మొదలగు సమస్తమూ మూడు రోజుల్లో దానంచేసి కేవలం కట్టుబట్టలతో మిగిలాడు. అంతటితో ఆగక తన రాజ్యాన్ని శత్రు రాజుకి త్రుణంలా ఇచ్చేశాడు. శత్రువు ఆ రాజ్యాన్ని ఆక్రమించుకోగానే కౌపీనాన్ని మాత్రమే వెంటతీసుకొని రాజ్యం వదలి, తనను ఎవరూ గుర్తించని దూరదేశాలకు వెళ్ళాడు. ఈ విధంగా కొంతకాలానికి వాసనలన్నీ తొలగి, శాంతిని, ఆత్మవిశ్రాంతిని పొందాడు. పిదప అతను భూమండలం అంతా నిరభిమానంగా తిరుగుతూ, ఒక మారు పూర్వ రాజ్యానికి వచ్చి జనావాసాల వద్ద బిక్ష యాచించాడు. అతణ్ణి గుర్తించిన ప్రజలు ఖేద చిత్తులైనా, శత్రురాజు తిరిగి రాజ్యాన్ని తీసుకోమని కోరినా భోజనాన్ని తప్ప మిగిలావేవి స్వీకరించకుండా కొన్ని దినాలు ఉండి మరో తావుకు పోయాడు. భగీరథుడు ఈ విధంగా శాంత మనస్కుడై, కొంతకాలానికి గురువు తో కలిసి ప్రారబ్ధకర్మవలన ఈ శరీరం లభించింది. అది క్షీణించే వరకు ఇది ఉండుగాక! అనే మనోనిశ్చయంతో అనాసక్తి తో జీవించేవారు. కొంతకాలానికి భగీరథుడు గురువు వద్ద సెలవు తీసుకుని తిరిగి దేశ సంచారము చేయసాగాడు. అప్పుడు ఒకానొక

రాజ్యం చేరగా, ఆ దేశపు రాజు మరణించాడు. అంత ఆ దేశపు ప్రజలు భగీరథుడుని ప్రార్థించి తమ రాజుగా చేసి కొన్నారు. కొంతకాలానికి తాను త్యజించిన దేశపు రాజు కూడా మరణించగా ప్రజల కోరికపై ఆరాజ్యానికి కూడ రాజై, సప్తసాగరవలయితమైన భూమండలానికి చక్రవర్తి అయ్యాడు.

**వసిష్ఠ, విశ్వామిత్రులు చెప్పిన ఆయా గంగావతారణము మొదలుగా గల కథల ద్వారా ఎంతటి వారైనా గంగ లాగ అహంకరించకూడదని, తన వంశజులైన సగర పుత్రులైన అరువది వేలమంది లాగ విచక్షణ కోల్పోనగూడదని (కపిల మునిని అనుమానించడము ద్వారా), జహ్ను ముని కథ ద్వారా ఎవరిని తక్కువగా అంచనా వేయకూడతగదని, భగీరధునిలాగ అహంకారము త్యజించవలెనని, కార్యము సానూకూలమై ఫలప్రదమయ్యే వరకు చేపట్టిన దీక్ష వదల కూడదని శ్రీరాముడు గ్రహించి ప్రజలకు మార్గ దర్శన మయ్యెను**

**1.10.1 అహల్యా శాపవిమోచనం**

అలా కధలు చెప్పుకొంటూ మిథిలా నగరమునకు వెళ్లుచుండగా నిర్జనంగా ఒక ఆశ్రమము కనబడింది. అప్పుడు రాముడు ఈ ఆశ్రమం ఎవరిదని అడుగగా, విశ్వామిత్రుడు ఇలా చెప్పెను......

**గౌతమస్య నరశ్రేష్ఠ పూర్వం ఆసీత్ మహాత్మనః**

**ఆశ్రమో దివ్య సంకాశః సురైః అపి సుపూజితః**

ఈ ఆశ్రమం గౌతమ మహర్షిది, ఆ గౌతముడు తన భార్య అయిన అహల్యతో కలిసి తాపసిగా ఇక్కడ ధార్మికమైన జీవనం గడిపేవారు. అహల్య బ్రహ్మదేవుడి మానస పుత్రిక, అద్భుతమైన సౌందర్యం కలిగినది. ఇంద్రుడికి అహల్య మీద కోరిక ఉన్నది. ఒకరోజు ఉదయాన్నే గౌతమ మహర్షి సంధ్యావందనాది క్రతువులు నదిలో చేసుకునే సమయంలో, ఆయన ఇంటి వద్ద లేని సమయంలో, గౌతమ మహర్షి

వేషంలో ఇంద్రుడు ఆయన ఇంటిలోకి ప్రవేశించాడు. ఇంటిలోకి ప్రవేశించి నేను నీ సంగమాన్ని కోరుకుంటున్నాను అని అహల్యతో అన్నాడు.

**ముని వేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన**

**మతిం చకార దుర్మేధా దేవ రాజ కుతూహలాత్**

అహల్యకి వచ్చింది గౌతముడు కాదు ఇంద్రుడని తెలుసు, కాని ఆమె కన్యత్వంలో ఉండగా ఆమెకి ఇంద్రుడి మీద మనసులో కోరిక ఉండేది, అందువలన ఇంద్రుడితో సంగమించింది. అహల్య ఇంద్రుడితో ఇలా అనింది  నేను నీతో సంగమించి చాలా ఆనందం పొందాను, కృతార్థురాలినయ్యాను, నువ్వు ఇక్కడినుంచి తొందరగా వెళ్ళిపో. నిన్ను నువ్వు గౌతముడి నుండి రక్షించుకో అని చెప్పింది. అప్పుడు ఇంద్రుడు ఒక నవ్వు నవ్వి, నేను చాలా ఆనందంపొందాను, ఎలా వచ్చానో అలానే వెళ్ళిపోతాను అని చెప్పి ఆశ్రమం బయటకి రాగానే......

**గౌతమం స దదర్శ అథ ప్రవిశంతం మహామునిం**

**దేవ దానవ దుర్ధర్షం తపో బల సమన్వితం**

దేవతలని, దానవులని నిగ్రహించగలిగే, శాసించగలిగే అపారమైన తపఃశక్తి ఉన్న గౌతమ మహర్షి బయటకి వస్తున్న ఇంద్రుడిని చూశారు. ఇంద్రుడి ముఖం మాడిపోయింది. అప్పుడు గౌతమ మహర్షి ఇంద్రుడితో ఇలా అన్నారు  నా రూపం ధరించి నువ్వు చెయ్యరాని పాపం చేశావు. స్త్రీల మీద నీకు ఇంత కామం ఉండడానికి కారణం నువ్వు పురుషుడవన్న అహంకారం, కావున పురుషత్వానికి చిహ్నములైన నీ అండములు నేల జారి పడిపోవు గాక అని ఇంద్రుడిని శపించారు.

**పేతతుః వృషణౌ భూమౌ సహస్రాక్షస్య తత్ క్షణాత్**

**అహల్య వైపు చూసి గౌతముడు ఇలా అన్నాడు**

**ఇహ వర్ష సహస్రాణి బహూని త్వం నివశిష్యసి**

**వాయు భక్షా నిరాఽఽహారా తప్యన్తీ భస్మ శాయినీ**

**అదృశ్యా సర్వ భూతానామ్ ఆశ్రమేऽస్మిన్ నివత్స్యసి**
**యదా తు ఏతత్ వనం ఘోరం రామో దశరథాऽऽత్మజః**
**ఆగమిష్యతి దుర్ధర్షః తదా పూతా భవిష్యసి**
**తస్య ఆతిథ్యేన దుర్వృత్తే లోభ మోహ వివర్జితా**
**మత్సకాశే ముదా యుక్తా స్వం వపుః ధారయిష్యసి**
**ఏవమ్ ఉక్త్వా మహాతేజా గౌతమో దుష్ట చారిణీమ్**

నువ్వు ఇక్కడ కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేస్తూ పడుండు, ఆహారం తీసుకోకు, గాలిని భక్షించు. నీ మీద బూడిద కప్పబడుతుంది, కావున నువ్వు ఎవరికీ కనబడవు. కొంతకాలానికి ఈ ఆశ్రమానికి రామచంద్రుడు వస్తాడు. ఆయన ఈ ఆశ్రమ ప్రవేశం చెయ్యగానే నీకు శాపవిమోచనం కలుగుతుంది. నీకు శాపవిమోచనం కలగగానే నువ్వు నా పత్ని స్థానాన్ని పొందుతావు. అప్పటిదాకా నేను హిమవత్ పర్వత ప్రాంతంలో ఉంటాను అని అహల్యతో చెప్పి వెళ్ళిపోయాడు.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో కలిసి ఆ ఆశ్రమంలోకి ప్రవేశించాడు. రాముడు ఆ ఆశ్రమం లోకి వెళ్ళగానే, ఇన్ని వేల సంవత్సరాల నుండి శాపగ్రస్తురాలైన అహల్య దుర్నిరీక్షమైన తేజస్సుతో పైకి లేచింది. ఆవిడని చూడగానే రాముడు ఆమె కాళ్ళకి నమస్కారం చేశాడు. గౌతమ మహర్షి చెప్పిన విషయం గుర్తుకు వచ్చి, వచ్చిన వాడు రాముడని గ్రహించిన అహల్య రాముడికి నమస్కారం చేసింది. వాళ్ళకి భోజనం పెట్టింది. అప్పుడు అక్కడికి వచ్చిన గౌతమ మహర్షి అహల్యతో కలిసి తపస్సు చేసుకోడానికి వెళ్ళిపోయాడు.

### 1.10.2 అహల్యా శాపవిమోచనం లోని యోగ రహస్యము

ఈ కథ యందు రామాయణకారుడు అహల్యను **దేవరూపిణి** గా వర్ణించాడు. వాల్మీకి మహర్షి, ఈ కథ యందు జన్మించినపుడున్న తన సంస్కారములను బట్టి జీవాత్మ ఏ గుణ స్వభావములతో కాలము గడుపుచుండునో అటువంటి

సంస్కారయుక్తమైన శరీరము నందే అట్టి జీవాత్మ ప్రకృతి మాధ్యమముతో ముందుకు సాగుచూ ఉండును. (ఉదాహరణకు అహల్య ఇతఃపూర్వమే ఇంద్రుని ఇష్టపడెను. కారణాంతరముల వలన గౌతముని పెళ్లి చేసుకొనెను.) గీతలో ఈ విధముగా చెప్పబడినది.

**మమై వాంశో జీవలోకే జీవభూతః సనాతనః**

**మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతి స్థాని కర్షతిహి 15 .7**

మృత్యువు తర్వాత జీవాత్మ తన పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, బుద్ధులను తీసుకొనిపోవును. జన్మించినప్పుడు మరల తన గుణ, కర్మ స్వభావములను అనుసరించి సారూప్యమైన శరీరమును గ్రహించి ప్రకృతి మాధ్యమముగా ఈ భూమిపైకి రావడము జరుగును. శరీరము యొక్క ప్రగతి సాధ్యము కానిదే జీవాత్మ ప్రగతి కూడా సాధ్యము కాదు. అందుచే శరీర పరిణామము జీవాత్మను బట్టియే జరుగు చుండును. కానీ ప్రకృతి (శరీరము) పురుషుల మధ్య సంఘర్షణ జరుగుచునే ఉండును. గీతలో ఈ సంఘర్షణ గురించి వివరించుతూ...

**యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః**

**ఇంద్రియాణి ప్రమాదీని హరన్తి ప్రసభం మనః 2 .60**

ఉన్నతి సాధించే సమయములో జీవాత్మ ఒక ప్రత్యేకమైన విపత్తును ఎదుర్కొనవలసి వచ్చును. అట్టి వ్యక్తి యొక్క ఇంద్రియములు ఉన్నతమైన కార్య వ్యవహారములు సమతుల్యత చేయడానికా అన్నట్లుగా అతనిని క్రిందకు లాగుచుండును. ఇదియే ప్రకృతి, పురుషుల ద్వంద్వము. సంస్కారములను బట్టి మనస్సు కోరుకొను వాటికి తదనుగుణంగా ఇంద్రియములు ప్రవర్తించు చుండును. ఇంద్రియములు, జిహ్వా ఆహారంపై దృష్టితో మనస్సును చంచల పరచును. గీతలో చూద్దాము.

**విషయా వినివర్తన్తే నిరాహారస్యదేహినః**
**రసావర్జం రసోప్యస్య పరాందృష్ట్వానివర్తతే**

గౌతముని జీవాత్మ బ్రహ్మ కర్మ కొరకై జ్ఞాన గంగ యొక్క తీరమునకు వెళ్ళును. గౌతముడనగా ఇంద్రియములను తన వశములో ఉంచుకొని ఉత్కృష్టమైన అవస్థకు తీసుకొని వెళ్లెడి సాధకుడు. సాధకుని జీవాత్మ ధ్యానములో నిమగ్నమై బ్రహ్మమును తెలుసుకొనగోరుటయే జ్ఞాన గంగాతీరమునకు బ్రహ్మకర్మకై వెళ్ళుట. కాని ఆ జీవాత్మ యొక్క కాయము అంతగా ఉన్నత సంస్కారయుక్తము కానందున అటువంటి నిమ్న సంస్కారయుతమైన (అహల్య) శరీరము తన ఇంద్రియములను భోగసుఖములకే వినియోగించును. ఇంద్రియ భోగ ప్రవృత్తియే ఇంద్రుడు. ఇంద్రునితో రమించుట అనగా శరీరము (అహల్య) ఇంద్రియ భోగ ప్రవృతి కోరుకొనుటయే. గౌతముని కథ అంతయు సాధనా రహస్యము. ఉచ్ఛ సంస్కార విచారణ ద్వారా అహల్య సుహల్య గా మారును. అప్పుడే సాధకుని ఘోర తపస్సు - ఉచ్ఛ సంస్కారము ద్వారా ఆత్మానంద రూప రామ దర్శనము జరుగును. గౌతముని శాప కారణంగా అహల్య తపస్సు వలన సుహల్యగా మారును. ప్రప్రథముగా అటువంటి సుహల్యకు రాముడు వందనము చేయును. సుహల్య కృప పొందువరకు రాముడు మిథిలా నగరమునకు పోయి సీతా స్వయంవరం నందు పాణిగ్రహమునకు అర్హుడు కాడు.

యోగా వాసిష్ఠములోని అర్జునోపాఖ్యానములో వసిష్ఠ మహర్షి భవిష్యత్ దర్శనము చేసి భగవద్గీతలోని (పై చెప్పుకొన్న) విషయాలు వివరిస్తారు.

### 1.11.1 శివ ధనుర్భంగము

తర్వాత విశ్వామిత్రుడు రామలక్ష్మణులను తీసుకొని మిథిలా నగరమునకు చేరతాడు. విశ్వామిత్రుడు తమ నగరానికి వచ్చిన విషయము తెలుసుకొని జనక మహారాజు అతని మంత్రి శతానందునితో కలసి విశ్వామిత్రునికి అర్ఘ్య పాద్యాదులు ఇచ్చి సంతోషముతో రామలక్ష్మణులను గురించి వివరణ అడుగుతారు.

శతానందుడు అహల్యా గౌతముల పుత్రుడు. తన తల్లి శాప విమోచనము అయ్యినందుకు సంతోషించి, శ్రీరామునితో విశ్వామిత్రుని కథను వివరించుతాడు.
జనక మహారాజుగారి ఆహ్వానం మేరకు విశ్వామిత్రుడు రామలక్ష్మణ సమేతంగా రాజసభకి చేరుకున్నారు. అప్పుడు విశ్వామిత్రుడు జనకుడితో ఇలా అంటాడు...... వీళ్ళ ఇద్దరికీ నీ దగ్గరున్న శివ ధనుస్సుని చూపిద్దామని తీసుకొచ్చాను, నువ్వు ఒకసారి ఆ శివ ధనుస్సుని చూపిస్తే వీళ్ళు చూసి సంతోషించి తిరుగు ప్రయాణం చేస్తారు అని అన్నాడు అప్పుడు జనకుడు, శివ ధనుస్సు గురించి వివరించుతూ ....
పూర్వం దక్ష ప్రజాపతి శివుడికి హవిస్సులు ఇవ్వని యాగం ప్రారంభించాడు. అందుకు కినుక వహించి దక్షుని కుమార్తె అయిన సతీదేవి (పార్వతీదేవి) యోగాగ్నిలో శరీరాన్ని వదిలింది. ఆగ్రహించిన శివుడు ధనుస్సు పట్టుకున్నాడు, ఆ ధనుస్సుని జనక మహారాజు వంశంలో పుట్టిన దేవరాతుడు అనే రాజు దగ్గర న్యాసంగా (అంటే కొంతకాలం ఉంచారు) ఉంచారు. ఆ విధంగా ఈ అద్భుతమైన శివ అధనస్సు మా ఇంట కొలువై ఉన్నది. నేను ఒకప్పుడు యజ్ఞం చేద్దామని భూమిని దున్నుతున్నాను. అలా దున్నుతున్నప్పుడు నాగటి చాలుకి తగిలి ఒక బాలిక తనంత తానుగా పైకి లేచింది. **నాగటి చాలుకి తగిలి పైకి వచ్చింది కనుక, అలాగే భూమికి ఉన్నంత ఓర్పు ఉన్నది కనుక ఆమెని సీత అని పిలిచాము. (జనకుని కూతురు కనుక జానకి, మిథిలా నగరంలో పుట్టింది కనుక మైథిలి, దేహం మీద భ్రాంతిలేని విదేహ వంశంలో పుట్టింది కనుక వైదేహి అని సీతమ్మకి పేర్లు). ఆమె అయోనిజ,** ఒక స్త్రీ కడుపులో గర్భవాసం చేసి పైకి వచ్చినది కాదు. ఆమె అద్భుతమైన సౌందర్యరాశి. నేను ఆమెని వీర్య శుల్కగా (అంటే పరాక్రమము చేత గెలుచుకోబడవలసినది) ప్రకటించి, శివ ధనుస్సుని ఎక్కుపెట్టిన వాడికి ఇస్తాను అన్నాను. అలా ఎందరో రాజులు వచ్చారు శివ

ధనుస్సుని ఎక్కుపెట్టడానికి, కొంతమంది ఆ ధనుస్సుని చూడగానే పడిపోయారు, ఎవరూ కనీసం దాన్ని కదపలేకపోయారు. వచ్చిన వాళ్ళందరూ భగ్నహృదయాలతో వెనుదిరిగేవాళ్ళు. "ఒకవేళ ఈ రాముడు శివ ధనుస్సుని ఎక్కుపెట్టగలిగితే, నేను నా కూతురు సీతని కన్యాదానం చేసి ఇస్తాను" అన్నాడు.

**సా సీతా ఇతి మూలప్రకృతి, రూపత్వాత్ సా సీతా ప్రకృతి స్మృతా, ప్రణవ ప్రకృతి రూపత్వాత్సా సీతా ప్రకృతి రుచ్యతే**

**శ్రీరామ సాన్నిధ్యవశా జ్జగదానందకారిణి, ఉత్పత్తిస్థితి సంహారకారిణి సర్వ దేహినాం సీతా భగవతి జ్ఞేయా మూలప్రకృతి సంగ్నితా (సీతోపనిషత్)**

మూలప్రకృతి రూపిణి, ప్రణవ ప్రకృతి రూపిణి అయి ఉండుటచే సీత ప్రకృతి అని చెప్పబడినది. శ్రీరాముని సాన్నిధ్యవశముచే జగత్తునకు ఆనందమును గొల్పునదియు, జగత్తు యొక్క సృష్టి స్థితి సంహార కారిణియు, సమస్త ప్రాణుల యందును అధివసించునదియు అయిన భగవతియగు సీత మూల ప్రకృతి అని చెప్పబడినది.

ఆ శివ ధనుస్సుని తెప్పిస్తే మా పిల్లలు ఒకసారి చూస్తారు అని విశ్వామిత్రుడు అన్నాడు. అప్పుడా ఎనిమిది చక్రాలు కలిగిన మంజూషని లాక్కొని వచ్చారు. ఒక మనిషి అసలు ఈ ధనుస్సుని పైకి ఎత్తి, వింటినారిని లాగి కట్టడం జరుగుతుందా, సరే ఏదో అడిగారు కాబట్టి ఆ ధనుస్సుని తీసుకొచ్చాము చూడండి, అని జనకుడు అన్నాడు. అప్పుడు విశ్వామిత్రుడు ఆ ధనుస్సుని ఒకసారి చూడమని రాముడితో చెప్పాడు. అప్పుడు రాముడు ఆ మంజూషని తెరువగా అందులో పాము పడుకున్నట్టు ఆ ధనుస్సు ఉంది. క్షత్రియుడైన రాముడు ఆ ధనుస్సుని తేలికగా, కష్టం లేకుండా పైకి ఎత్తి, నారి కడదామని లాగేసరికి, వంగిన ఆ ధనుస్సు మధ్యలో "ఫడేల్" అని గట్టి శబ్దంతో విరిగిపోయింది. పిడుగులు పడే శబ్దంతో ఆ శివ ధనుస్సు విరిగేసరికి రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు, జనకుడు తప్ప

అక్కడున్న మిగతా వారందరూ మూర్ఛపోయారు. అందుకు సంతసించి ఈ వార్తను విశ్వామిత్రుని అనుమతితో దశరధ మహారాజుకు సందేశము పంపించారు.

**1.11.2 శివధనుర్భంగము లోని యోగ రహస్యము**

కోదండధారి అయిన రాముని గురి ఎప్పుడు తప్పదు. కారణమేమన బ్రహ్మము యందే లక్ష్యము నుంచి బాణమును సంధించును. **ప్రణవోధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే** ప్రణవ సాధనయే ధనుస్సు. జీవాత్మయే బాణము. ఈ బాణము యొక్క లక్ష్యము బ్రహ్మము. పై ఉపనిషద్ వాక్యము రామాయణ జన్మమునకు నాంది. రామరూప జీవాత్మ జీవితమంతయు ధనుస్సు శరములతోనే నడచినది. రాముని వివాహము ధనుస్సు ఆధారంగానే నిశ్చితమైనది. స్వయంవరమనగా స్వయముగా వధువు వరుని ఎంచుకోవడము. కానీ సీతా స్వయంవరమునకు, పూర్వమే నిర్ణయింపబడిన షరతు వలన సీతకు స్వయముగా అధికారము ఈయబడలేదు. ఆధ్యాత్మిక దృష్టితో చూచినచో సీతారాముల వివాహము స్వయంవరమే. షరతు ప్రకారము ఎటువంటి కుసంస్కారులైనను బలవంతులైనచో శివ ధనస్సును ఎక్కుపెట్టి సీతను చేపట్ట వచ్చును. ఇక్కడే ఆధ్యాత్మిక ద్రుష్టి అవసరము. మేరుదండ రూప శివ ధనస్సును సాధనాల ద్వారా నియంత్రణలోకి తెచ్చుకొని పరిణామము చెందిన సాధనారూప కాయవృత్తి అయిన సీతను ప్రాప్తించుకోవాలి. ఇటువంటి సుసంస్కార కాయమును బలవంతులైనంత మాత్రాన రాక్షస ప్రవృత్తి గల వ్యక్తులు ప్రాప్తించుకొనలేరు. ప్రాప్తించుకొనగల సాధకుడు రాముడు ఒక్కడే. ఆధ్యాత్మిక సాధన లేకుండా ఆత్మానందుడైన రామునికి కూడా ఉత్కృష్ట కాయవృత్తి రూపము ప్రాప్తించదు. గుణ స్వభావము సంస్కారమును బట్టి కాయము ప్రాప్తించును.

## 1.12 జనకుడు

శివ ధనుర్భంగము మరియు అట్టి నిర్ణయింపబడిన షరతు తెలుసుకొన్న వెంటనే దశరథుడు తన గురువులతో, పురోహితులతో సమావేశమై జనకుడి నడువడి ఎటువంటిది అని అడిగాడు. అప్పుడు వాళ్ళు, "మహానుభావ దశరథ! విదేహ వంశంలో పుట్టిన జనకుడంటే సామాన్యుడు కాడు, శరీరం మీద భ్రాంతి లేనివాడు, భగవంతుడిని నమ్మినవాడు, అపారమైన జ్ఞానమున్నవాడు. తప్పకుండా మనం ఆ సంబంధం చేసుకోవచ్చు" అన్నారు.

మిథిలా నగర రాజైన జనకుని కథ అద్భుతమైనది. (సందర్భముగా తరువాత కదాంశము అవగాహనకు జనకుని కథ వివరించడము అయినది. ఈ కథ భాగవతము నందు వివరించడము అయినది) నిమి చక్రవర్తి గొప్ప ధర్మ పరాయణుడు. గురువు అయిన వశిష్ఠుడు నిమిని ఒక యజ్ఞము చేయమని, ఆ యజ్ఞమును సరి అయిన సమయములో పూర్తి గావింపుమని చెప్పగా, నిమి అన్ని ఏర్పాట్లను చేసెను. కానీ వశిష్ఠుల వారు సమయము అయినప్పటికీ రాలేదు. సమయ పాలన పాటించుటకై చక్రవర్తి యజ్ఞము పూర్తి చేసి తదనంతరము ఏమియు గ్రహించకుండ వశిష్ఠుల రాకకై ఎదురు చూడగా, వశిష్టులవారు ఆలస్యముగా వచ్చి యజ్ఞము పూర్తి అయినందుకు కోపించి మరణశాపము ఇచ్చారు. తన దోషము లేకపోయినా శాపమిచ్చినందుకు ప్రతిగా నిమి చక్రవర్తి కూడా వశిష్టులవారికి సమానమైన మరణ శాపము ఇచ్చారు. రాజు, గురువు లేనిదే రాజ్యమెలా! అని యోచించి ఋషిమునులు ఇద్దరినీ జీవితులను చేయాలి అనే సంకల్పంతో మొదలు వశిష్ఠులవారిని జీవింప చేసిరి. కానీ నిమి జీవాత్మ శరీరములో ప్రవేశించమని ఆహ్వానింపగా రాదాయె! గోలోక, పాతాళలోక, భూలోక, భువర్లోకము లన్నియు వెదికినను నిమి జీవాత్మ కనబడదాయె! చివరకు స్వర్గ లోకము నందు చిదానంద రూపముగా ఉండెను. భూలోకము నందు తన శరీరము నందు ప్రవేశించుటకు నిరాకరించెను. రాజు లేనప్పుడు రాజ్యమును

పాలించేదెవ్వరు? అన్య జీవాత్మను నిమి శరీరములో ప్రవేశింప చేయాలి. గుణ, కర్మ, స్వభావుములతో సుయోగ్యమైన జీవాత్మకై అన్వేషణ ప్రారంభమయ్యెను. సమన్వయముతో కూడిన సజాతీయ జీవాత్మ తప్ప ఇతర జీవాత్మ ప్రవేశము సరికాదు. ఒక జీవాత్మ యుగముల తరబడి సరి అయిన శరీరము దొరకక ఈ విశ్వాంతరాళము నందు సంచరించు చుండెను. దేహము లభించ నందున విదేహి అనబడెడు ఆ జీవాత్మ కు అనుగుణముగా నిమి శరీరము నందలి కోశికల పునర్నిర్మాణము గావింపబడెను. నిమి జీవాత్మ కానందున విదేహి జీవాత్మ జననమైనందున ఈ కొత్త జీవాత్మతో కూడిన వ్యక్తికి జనకుడు అని పేరు పెట్టబడెను.

యోగా వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి జనక మహారాజుకు కొంచెము జ్ఞానము కలవాడైనా ఆకాశము నుండి ఫలము పడినట్లు జ్ఞానం ప్రాప్తి రూపమైనది. అట్టి పురాతనమైన జనక వృత్తాంతము చెపుతూ ..... జనకుడు ఉద్యానవనంలో విహరించుచుండగా అక్కడ ఏకాంతవాసులైన సిద్ధులు అద్రుశ్యాకారంలో ఉండి, తమలో తాము, ఆత్మజ్ఞాన సమర్ధకాలైన కొన్ని గీతాలని చెప్పుకొంటున్నారు. అది విన్న జనకుడు మనోవిచారణ చేసి శాస్త్రంలో విధించిన కర్మలను చేసినందువల్ల ఆ మాలిన్యం అంటదు అని ఆలోచించి తన దైనందిన కర్మల్ని చేయడానికి ఉపక్రమించాడు. **నియతిని తప్పని సూర్యుని లాగా, విషయ సుఖాల్లో ఆసక్తి లేకుండా, రాజ్యపాలన లోని అనర్థాలకు విషాదం పొందకుండా జీవన్ముక్తుడిలా ఉండేవాడు. అలాగే శుకుడు జన్మతః జ్ఞాని అయినా అతనికి సరి అయిన మార్గోపదేశము చేసి శుకునికి గురువు అయినారు.**

### 1.13 సీతారాముల కళ్యాణము

మరుసటి రోజున దశరథ మహారాజు తన పరివారంతో ఆ మిథిలా నగరాన్ని చేరుకోగానే, జనకుడు వాళ్ళని సాదరంగా ఆహ్వానించి.....నా కూతురైన

సీతమ్మని వీర్య శుల్కగా ప్రకటించి, శివ ధనుస్సుని ఎక్కుపెట్టినవాడికి ఇస్తానన్నాను, నీ కుమారుడైన రామచంద్రమూర్తి శివధనుర్భంగం చేశాడు, అందువలన నా కుమార్తెని నీ కుమారుడైన రాముడికి ఇవ్వాలి అని అనుకుంటున్నాను, కావున నన్ను అనుగ్రహించి నా కుమార్తెని మీ కోడలిగా స్వీకరించు అన్నాడు. మరుసటి రోజు ఉదయాన్నే దశరథుడు జనక మహారాజుతో మహానుభావుడైన విశ్వామిత్రుడి అనుమతితో నాకు ఎంతో కాలం పురోహితుడిగా ఉంటున్న, మా వంశాభివృధిని కోరుకునే వశిష్ఠ మహర్షి మా వంశం గురించి చెప్తారు అన్నారు. వసిష్ఠ మహర్షి దశరధ మహారాజు వంశమును వివరించుతూ......మొదట బ్రహ్మగారు జన్మించారు, ఆ బ్రహ్మ నుండి మరీచి జన్మించాడు, మరీచికి కాశ్యపుడు, ఆయనకి సూర్యుడు, సూర్యుడికి మనువు, మనువుకి ఇక్ష్వాకు, ఇక్ష్వాకుకి కుక్షి, కుక్షికి వికుక్షి, వికుక్షికి బాణుడు, బాణుడికి అనరణ్యుడు, అనరణ్యుడికి పృథువ, పృథువకి త్రిశంకువు, త్రిశంకువుకి ధుంధుమారుడు, ధుంధుమారుడికి మాంధాత, మాంధాతకి సుసంధి, సుసంధికి ధ్రువసంధి మరియు ప్రసేనజిత్ అని ఇద్దరు కుమారులు, పెద్దవాడైన ధ్రువసంధికి భరతుడు, భరతుడికి అసితుడు, అసితుడికి సగరుడు, సగరుడికి అసమంజసుడు, అసమంజసుడికి అంశుమంతుడు, అంశుమంతుడికి దిలీపుడు, దిలీపుడికి భగీరథుడు, భగీరథుడికి కాకుత్సుడు, కాకుత్సుడికి రఘువు, రఘువుకి ప్రవృద్ధుడు (కల్మషపాదుడు), ప్రవృద్ధుడికి శంఖణుడు, శంఖణుడికి సుదర్శనుడు, సుదర్శనుడికి అగ్నివర్ణుడు, అగ్నివర్ణుడికి శీఘ్రగుడు, శీఘ్రగుడికి మరువు, మరువుకి ప్రశుశ్రుకుడు, ప్రశుశ్రుకుడికి అంబరీషుడు, అంబరీషుడికి నహుషుడు, నహుషుడికి యయాతి, యయాతికి నాభాగుడు, నాభాగుడికి అజుడు, అజుడికి దశరథుడు, దశరథుడికి రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. ఇది దశరథుడి వంశం, ఈ వంశంలోని రాజులు ఎన్నో వేల వేల సంవత్సరాలు రాజ్యపాలన చేసి, యాగాలు చేసి స్వర్గానికి వెళ్ళారు" అని చెప్పాడు.

ఇదంతా విన్న జనకుడు ఎంతో సంతోషించి. తన వంశం గురించి చెప్పడం ప్రారంభించాడు " మా వంశంలో మొదటివాడు నిమి చక్రవర్తి, నిమికి మిథి (ఈయన నిర్మించినదే మిథిలా నగరం), మిథికి ఉదావసువు, ఉదావసువుకి నందివర్ధనుడు, నందివర్ధనుడికి సుకేతు, సుకేతుకిదేవరాతుడు, దేవరాతుడికి బృహద్రథుడు, బృహద్రథుడికి శూరుడు, మహావీరుడు అని ఇద్దరు కుమారులు, మహావీరుడికి సుధృతి, సుధృతికి ధృష్టకేతువు, ధృష్టకేతువుకి హర్యశ్వుడు, హర్యశ్వుడికి మరుడు, మరుడికి ప్రతీంధకుడు, ప్రతీంధకుడికి కీర్తిరథుడు, కీర్తిరథుడికి దేవమీఢ, దేవమీఢకి విబుధుడు, విబుధుడికి మహీధ్రకుడు, మహీధ్రకుడికి కీర్తిరాతుడు, కీర్తిరాతుడికి మహారోముడు, మహారోముడికి స్వర్ణరోముడు, స్వర్ణరోముడికి హ్రస్వరోముడు, హ్రస్వరోముడికి జనకుడు మరియు కుశధ్వజుడు, జనకుడికి సీతమ్మ అయోనిజగా లభించింది, తరవాత ఊర్మిళ పుట్టింది" అని చెప్పుకున్నాడు. తర్వాత ఒక శుభముహూర్తాన సీతా రాముల వివాహము వైభవోపేతముగా జరిగింది. అప్పుడు జనకుడు రామునితో, రామా! మాది విదేహ వంశం, మాకు దేహమునందు భ్రాంతి ఉండదు, నా కూతురిని అలా పెంచాను. ఆమె నిన్ను నీడలా అనుగమిస్తుంది, అని చెప్తాడు.

సీతారాముల కళ్యాణము ప్రకృతి ద్వారా తనంతట తానే నియమబద్ధముగా జరుగును. అందుచేతనే రాముడు దశరథుని అనుమతి లేనిదే తన వివాహము విశ్వామిత్రుని అనుమతితో నిశ్చితము చేసుకొనును. తరువాతనే దశరథుని పిలిచెను. రామునితో సహా లక్ష్మణుడికి ఊర్మిళతోను, భరతుడికి మాండవితోను, శత్రుఘ్నుడికి శృతకీర్తితోను వివాహం జరిపించారు. ఉచ్ఛభావనల సుసంస్కారముల మిళనము ఊర్మిళ, మంచి జ్ఞానమునే సదా శ్రవణము చేయునది శ్రుతకీర్తి, ప్రాప్తించిన జ్ఞానమును కుశలతతో ఆచరించడమే మాండవి అను పదమునకు అర్ధము. ఈ విధముగా తన నలుగురు పుత్రులు,

కోడళ్ళు, ముప్పురు మరియు మూడు వందల ఏబది రాణులతో కలసి దశరథుడు అయోధ్యకు తిరిగి వెళ్లెను. ఇందు ఉన్న అనేక సాధనావస్థలు గ్రహించాలి.

**1.14 శ్రీరాముని వంశ విచారణ:**

ముఖ్యముగా మూడు వంశములు శ్రీరామునికి చెందినవిగా అంగీకరింపబడినవి. **మొదటిది ఇక్ష్వాకు వంశము.** అంతఃకరణ శుద్ధమైన కారణముగా మధురమైన వాక్కును పొందిన సాధకుడు **'ఇక్షాకు'** అనెదరు. **ఇక్షు+వాక్కు=ఇక్ష్వాకు.** సంస్కృత శబ్దమునకు **'ఉ'** కారమును చేర్చి ఇక్ష్వాకు అయి ఇదే వంశ నామముగా అయినది. (యోగా వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి ఇక్ష్వాకుకు కల్గిన ఆత్మజ్ఞానమును వివరించుతూ.... చాలా కాలము రాజ్య పాలన చేసిన తర్వాత ఇక్ష్వాకు **'నేనెవరు?'** అనే సందేహ నివృత్తికై తన తండ్రి అయిన మనువును ప్రశ్నించగా మనువు చెపుతూ.... **'సంకల్పం పరోబంధః తదభావో విముక్తతః'** సంకల్పమే బంధము, సంకల్పములు లేకుండుట మోక్షము. ఈ సమస్త ప్రపంచము అజము-శాంతము-అంతము-ధ్రువము-అవ్యయము-నిత్య సిద్ధము అయినట్టి పరమార్ధ చిద్రూపము గా చూస్తూవుండు, యథాసుఖంగా ఉండు అని చెప్తాడు. తద్వారా రామునికి ఉపదేశము చేస్తాడు). **రెండవది కాకుస్థ వంశము కాకు అనగా స్వర జ్ఞానము. కాకుస్థ అనగా స్వర జ్ఞానంమును గ్రహించిన సాధకుడు.** శరీరమునకు ఎడమ వైపున ఉండు నాడి చంద్ర నాడి (ఇడ నాడి) కుడి వైపున ఉన్నది సూర్య నాడి (పింగళ నాడి). ఈ రెంటి నడుమన ఉన్నది సుషుమ్న నాడి. ఈ మూడును అతి ముఖ్యమైన యోగ నాడులు. ఈ మూడు యోగ నాడుల సమస్త జ్ఞానమును ఎరిగిన వాడే కాకుస్థుడు పై మూడు నాడుల సంయమము వలన సాధకుడు అమితమైన దివ్య శక్తులు, సిద్ధులు పొందగలరు. **మూడవది రఘుకులము. 'ర' అనగా అగ్నిబీజము. 'అఘ' అనగా పాపము. పాపమును అగ్నిలో దహించువాడు 'రఘు'. ఇతడే పాపరహిత సాధకుడు.**

**ఇట్టి దివ్య శక్తి యుత శ్రేష్ఠ సాధకుడే మూడు వంశముల వంశజుడైన శ్రీరాముడు** ఇంకనూ...

**రామ ఎవ పరంబ్రహ్మ రామ ఎవ పరం తపః**

**రామ ఎవ పరం తత్వం శ్రీరామో బ్రహ్మతారకమ్**

**రామ మంత్రం యో జపేత్ స రామో భవతీతి రామేనోక్తా**

**..... రామో రమంతే యత్ర యోగినః......**

**సచ్చిదానంద రూపాస్య పరమాత్మార్థ ఉచ్యతే**

**(రామరహస్యోపనిషత్)**

**1.15 పరశురాముని గర్వభంగము**

అందరూ అయోధ్య తిరిగి వచ్చు సమయమున పరశురాముడు తటస్థపడెను. ఆ పరశురాముడే పృథ్విని 21 పర్యాయములు నిక్షత్రియము గావించెను. సాధారణముగా ఒక్క పర్యాయము నిక్షత్రియము గావించినచో పృథ్విపై క్షత్రియులు ఉండరాదు. దీని భావము పరశురాముడు బయిట ఉన్న క్షత్రియులను సంహరించడము గాదు. తనయందున్న క్షాత్ర వృత్తులను రూపుమాపెను. **పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ తన్మాత్రలు, పంచ భూతములు మరియు వీటన్నిటికి రాజైన మనస్సు మొత్తము ఇరువది ఒకటి.** ఈ ఇరువది ఒకటి తత్వముల యందున్న క్షాత్ర వృత్తిని సంహరించి బుద్ధి రూప గణేశునకు అర్పించెను. క్షాత్ర వృత్తి ఆధ్యాత్మిక మార్గమునకు అడ్డువచ్చు కువృత్తులు. మహాపరాక్రమశాలి, బ్రహ్మజ్ఞానమును ఎరిగిన పరశురాము డు శివధనస్సును ఎవ్వరు ఎక్కు పెట్టలేరనే గర్వము. ఎంతటి వారైనా తపస్సు, బ్రహ్మజ్ఞానం కలిగిన అహంకారం కూడదు. విశ్వామిత్రుడు కూడా అహంకారం వలన వేల ఏండ్లు సాధన చేయవలసి వచ్చింది. శ్రీరాముడు నిరహంకారి. అయితే శ్రీరాముడు ధనుస్సు ఎక్కు పెట్టక మునుపే

మూడు ముక్కలు అయినది. పరశురాముడు శ్రీరాముని పరీక్షించే నెపముతో విష్ణు ధనస్సును ఇచ్చి అది ఎక్కు పెట్టినట్లయితే ద్వంద యుద్ధమునకు పిలుస్తాడు. అప్పుడు రాముడు క్రుద్ధుడై ఆ విష్ణుచాపమును స్వీకరించి ఎక్కుపెట్టి

**బ్రాహ్మణో అస్మ ఇతి పూజ్యా ా మే విశ్వామిత్ర కృతేనచ**

**తస్మాత్ శక్తో న తే  రామ మోక్తుం ప్రాణ హరమ్ శరం**

**ఇమాం వా త్వత్ గతిమ్ రామ తపోబల సమార్జితాన్**

**లోకాం అప్రతిమాన్ వాపి హనిష్యామి యత్ ఇచ్ఛసి**

**నహి అయం వైష్ణవో దివ్య శరః పుర పురం జయః**

**మోఘ పతతి వీర్యేణ బాల దర్ప వినాశనః**

పరశురామా! నువ్వు బ్రాహ్మణుడివి మరియు నా గురువైన విశ్వామిత్రుడికి నీకు చుట్టరికం ఉండడం చేత నేను నిన్ను సంహరించను. కాని ఒకసారి బాణం సంధించిన తరువాత విడిచిపెట్టకుండా ఉండను అని, పరశురాముడు తపస్సు చేసి సంపాదించుకున్న లోకాలని రాముడు కొట్టేసాడు.

శ్రీరాముడు తన జీవనంలో బ్రాహ్మణుల పైన అబలలు పైన శస్త్రములు వేయననే నియమమునకు కట్టు బడినాడు. అయినను తాటక, కుంభకర్ణుడు, రావణుడు మొదలగు స్త్రీ మరియు బ్రాహ్మణులను సంహరించాడు. (కదా సందర్భములో ఆయా విషయాలు చర్చించుకొందాము) సాధనలో ప్రాప్తించిన కొన్ని వృత్తులు ఎంత ఉత్కృష్టమైనను బ్రహ్మ జ్ఞానమును అందించేవిగా కనబడినను నిజమైన సాధకుడైన రామునకు తన ఉచ్చ సాధనలో అడ్డు వచ్చే అట్టి స్త్రీ మరియు బ్రాహ్మణులను సంహరించాలి. జాతి వలన బ్రాహ్మణులమని భావించే నీచ వృత్తులను రాముడు సంహరించినట్లుగా ప్రతి సాధకుడు తన యందున్న రాక్షస వృత్తులను సంహరించ వలెను.

ప్రత్యక్ష జీవనమందు ప్రాప్తించుకొనవలసిన ఆధ్యాత్మిక ఇతిహాస ప్రయత్నమే రామాయణ కద. ప్రపంచమందున్న ఏ దేశము, వంశము, ధర్మకల్పన వారైనను రామాయణము సర్వులకు ఆదర్శ ప్రాయము.
విష్ణు ధనస్సును ఎక్కుపెట్టి రాముడు అయోధ్యకు ఏగెను. వృత్తుల మధ్య యుద్ధము లేనటువంటి కాయమే అయోధ్య.

**బాలకాండ సమాప్తము**

**శ్రీరామ జయరామ జయజయ రామ**

# 2. అయోధ్య కాండ

## 2.1 ఉపోద్ఘాతము

శ్రీరామాయణంలో బాలకాండ యజ్ఞ ప్రధానమైనది. అయోధ్యా కాండ ధర్మ ప్రధానమైనది. వేదములో చెప్పిన సుఖానికి సాధనము ధర్మము. అభ్యుదయమని, నిశ్రేయసమని సుఖము రెండు విధములు. జన్మ జన్మాంతరాళములో లభించే సుఖాన్ని అభ్యుదయమని అని, ఆత్మ నందు సంతుష్టుడై, మరల శరీరాన్ని పొందకుండా ఉండుటయే నిశ్రేయసము. మానవుడు ఈ లోకంలో, ఈ సమాజములో తన చుట్టూ ఉన్న వారితో ప్రవర్తించే విధానము తెలిసి, వారికి సుఖము కలిగే విధముగా తాను ప్రవర్తించి, తాను సుఖము పొందడానికి చేయవలసినది సామాన్య ధర్మము. మానవుడు జన్మించినది ధర్మాలను ఆచరిస్తూ మనసులో రాగద్వేషాలు తగ్గి ఆత్మజ్ఞానము కలిగి ఉండుటయే స్వస్వరూపజ్ఞానము. దీనినే విశేష ధర్మము అందురు. ఇట్టి ధర్మాన్ని బోధించునదియే శ్రీరామాయణము. రామాయణములో శ్రీరాముడు ఆత్మ అయితే మిగిలిన పాత్రలన్నీ వాని శరీరము వంటివి. అన్నింటికీ ఆత్మ అయిన శ్రీరామునితో సంబంధము ఉండును. రామాయణములో ఆత్మ అయిన శ్రీరామునితో సీత, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులకు, వానరులకు, రాక్షసులకు, స్త్రీలకు, పురుషులకు, చేతనములకు, అచేతనములకు, మానవులకు, తిర్యక్కులకు, దేవతలకు, స్థావరములకు సమానముగా ఉన్నది. ఇది రామాయణ రహస్యము. ఇది విశ్వ రహస్యము.

యోగా వాసిష్ఠములో చెప్పినట్లు "దృశ్యం అసత్యం" అనే బుద్ధి కలిగితే, దృశ్యాన్ని తీసివేయడం కష్టం కాదు. మాయ వలన ఈ ప్రపంచం కనబడుతుంది. పరమార్థ దృష్టిలో అంతా శూన్యమే. మాయ కూడా వాస్తవం కాదు. చైతన్యము తన స్పందన చేత ఆకాశ రూపమైన జగత్తు కల్పిస్తున్నది. ఆకాశము నుండి వాయువు,

క్రమంగా అగ్ని, జలము, భూమి ఇలా ఒకదాని నుండి ఒకటి ఉత్పన్నం అవుతున్నాయి. చైతన్యము విషయముల వైపు ఉన్ముఖం ఆగుటయే సంకల్పము యొక్క అంకురము. ఆ సంకల్పాంకురము విషయ రూప జగత్తును భావన చేస్తోంది. సంకల్పము తప్ప వేరుగా ఈ ప్రపంచంలో దుఃఖ సుఖము లంటు ఎవరికీ ఏవి లేవు. ఇట్టి జ్ఞానమే **"శ్రీరామతత్వము".** చైతన్యము గల ఆత్మ స్వరూపము **"సీత"**. పై నుండి చూస్తే కనబడదు. దున్నితే బయలు పడుతువుంది. కర్మ క్షేత్రమైన శరీరాన్ని జ్ఞానంతో దున్నితే ఆత్మ గోచరిస్తుంది. నియమించిన పనులు తాను చేయుచు వాని ఫలితముచే కలిగెడి అతిశయమును వానికే అర్పించుటయే భార్య లక్షణము. ఇదియే ఆత్మ లక్షణము. ఎప్పుడును కలసియే ఉండును. కానీ ఒకప్పుడు కోరకూడని కోరిక కోరుటచే బంధనమున పడును. కానీ అనుగ్రహముచే మరల కలియును. ఇదియే ఆత్మ స్వరూపము. అదియే సీతమ్మ స్వరూపము. ఆత్మ పరమాత్మల సంబంధమే సీతారాముల సంబంధము.

తన అంతరంగము నందున్న తాటక వృత్తిని వధియించి సర్వ విద్యలను, శాస్త్రములను అభ్యాసము చేసి శ్రీరాముడు భగవంతుడు అయ్యెను. ఆ పుణ్య కర్మ ద్వారా జీవాత్మ యందలి అజ్ఞాన అహల్యా వృత్తిని ముక్తి గావించి శ్రీరాముడు మిధిలను చేరెను. కఠోర యోగ సాధనల ద్వారా పొందిన సామర్ధ్యము వలన మేరుదండ రూప శివధనుర్భంగము చేసి జనక మహారాజు యొక్క భూ పుత్రి అయిన సీతను (పరిణామ కాయమును) ప్రాప్తించు కొనెను. ఇప్పుడు శ్రీరాముని పిండకాయము (సుసంస్కారయుత మనసేంద్రియ శరీర సమూహము) సీతను (ఉత్తమ సంస్కారము, సాధనలో ప్రాప్తించు సాత్విక అనుభూతులు) పరిణయ మాడెను. జనక మహారాజు (దేహ భావన లేనటువంటి/దేహాభిమానము లేనటువంటి) యొక్క భూపుత్రిక (జడ దేహ భావమునకు అతీతమైనది) అయిన

సీత/వైదేహి/జానకి ని ప్రాప్టించుకొని శ్రీరాముడు సుసంస్కారయుత మనసేంద్రియ శరీరముగా మారెను. జనకుడనగా ఈ మిధ్యా సంసార రూప మిధిలకు రాజు. శ్రీరాముని సోదరులైన లక్ష్మణుడు తన ధ్యేయము నందు ఎల్లప్పుడూ నిశ్చలముగా ఉండువాడు. **"కాలో అశ్వో వహతి సప్తరశ్మిః అజరోభూరి దేవతాః, తమరోహంతి కవయో విపశ్చితస్తస్య చక్రాభువనాని విశ్వం".** (కాలసూక్తం – అధర్వ వేద: 19,53,54). ఏడు కిరణాలు, వెయ్యి కళ్ళు ఉండి వృద్ధాప్యం లేనిది, శక్తి మంతమైనది కాలం. గుర్రాలు రథాన్ని లాగినట్లు సృష్టిని ముందుకు నడిపిస్తున్నది కాలం. వేయి పడగలు కలిగిన ఆదిశేషుడే భూభారాన్ని తొలగించడానికి లక్ష్మణుడుగా అవతరించాడని గోస్వామి తులసీదా సు తన "రామచరిత మానస్" లో వివరించాడు. శేష అన్న పదానికి మిగిలింది అనే అర్ధం కూడా ఉంది. కనుక ఆదిలోను (సృష్టి లేనప్పుడు) ఆయనే కాలరూపంలో మిగిలి ఉంటాడు. సృష్టి అంతమైన తరువాత కూడ ఆయనే మిగిలి ఉంటాడు. సృష్టికి ముందు శ్రీ మహావిష్ణువు లక్ష్మీ సమేతంగా యోగనిద్రలో ఉండగా ఆదిశేషుడు మాత్రమే మేల్కొని ఉన్నాడట. రామయణంలో లక్ష్మణుడు నిద్రించినట్టు ఎక్కడా కనిపించదు. తనకు నియమించిన కార్యములు అమితమైన భక్తితో చేయుచు జ్ఞానము నందు ఎల్లప్పుడూ రమించువాడు భరతుడు. శత్రువులైన దుర్వృత్తులను నశింపచేయువాడు శత్రుఘ్నుడు. ఇక తల్లుల విషయానికి వస్తే ..... కుశల బుద్ధి గలది కౌసల్య, కాయభావమునకు అతీతురాలు కైకేయి, అందరియందు మిత్రభావముతో ఉండెడిది సుమిత్ర. దసేంద్రియములకు (పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు) అధిపతి దశరధుడు. వీరందరూ ఇక్ష్వాకు కులస్థులు కాకుస్థ వంశీయులు, రఘుకుల భూషణులు. ఇక్ష్వాకులనగా అందరితో మధురమైన భాషణము చేయువారు. సర్వ యోగ విద్యా రహస్యములను ఎరిగిన వారు కాకుస్థ వంశీయులు, తమ వచనముపై ధృడ చిత్తము కలవారు రఘుకుల భూషణులు.

**2.2 శ్రీరాముడు-జీవన్ముక్తుడు**

ఇక కదా విషయానికి వస్తే.....

**కౌసల్యా శుశుభే తేన పుత్రేణాఽమిత తేజసా**
**యధా వరేణ దేవానామ్ అదితి: వజ్ర పాణినా**
**స హి రూపోపపన్న శ్చ వీర్యవాన్ అనసూయక:**
**భూమౌ అనుపమ: సూను: గుణైః దశరథోపమ:**
**స చ నిత్యం ప్రశాన్తాఽఽత్మా మృదుపూర్వం తు భాషతే**
**ఉచ్యమానోఽపి పరుషం న ఉత్తరం ప్రతిపద్యతే**
**కథంచిత్ ఉపకారేణ కృతేన ఏకేన తుష్యతి**
**న స్మరతి అపకారాణాం శతమఽపి ఆత్మవత్ తయా**
**శీల వృద్ధై: జ్ఞాన వృద్ధై: వయో వృద్ధై శ్చ సజ్జనై:**
**కథయన్ ఆస్త వై నిత్యమ్ అస్త్ర యోగ అన్తరే ష్వఽపి**
**బుద్ధిమాన్ మధురా భాషీ పూర్వ భాషీ ప్రియం వద:**
**వీర్యవాన్ న చ వీర్యేణ మహతా స్వేన విస్మిత:**
**న చాఽఽనృత కథో విద్వాన్ వృద్ధానాం ప్రతిపూజక:**
**అనురక్త: ప్రజాభి శ్చ ప్రజా శ్చాఽప్యనురంజతే**
**సానుక్రోశో జిత క్రోధో బ్రాహ్మణ ప్రతిపూజక:**
**దీనాఽనుకంపీ ధర్మజ్ఞో నిత్యం ప్రగ్రహవాన్ శుచి:**
**కులోచిత మతి: క్షాత్రం ధర్మం స్వం బహు మన్యతే**
**మన్యతే పరయా కీర్త్యా మహత్ స్వర్గ ఫలం తత:**
**న అశ్రేయసి రతో విద్వాన్ న విరుద్ధ కథా రుచి**
**ఉత్తరోత్తర యుక్తౌ చ వక్తా వాచస్పతి ర్యథా**
**అరోగ స్తరుణో వాగ్మీ వపుష్మాన్ దేశ కాల విత్**

లోకే పురుష సారజ్ఞ స్సాధు రేకో వినిర్మిత
స తు శ్రేష్టై ర్గుణై ర్యుక్త: ప్రజానాం పార్థివాఽఽత్మజ:
బహిశ్చర ఇవ ప్రాణో బభూవ గుణత: ప్రియ:
సమ్యగ్విద్యా వ్రత స్నాతో యధావత్ స అంగ వేద విత్
ఇషు అస్త్రే చ పితు శ్శ్రేష్ఠో బభూవ భరతాఽగ్రజ:
కల్యాణాఽభిజనః సాధు: అదీనః సత్యావాగ్ ఋజుః
వృద్ధై: అభివినీత శ్చ ద్విజై: ధర్మాఽర్థ దర్శిభిః
ధర్మాఽర్థ  కామ తత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్
లౌకికే సమయాఽఽచారే కృత కల్పో విశారదః
నిభృత స్సంవృతాకారో గుప్త మంత్ర స్సహాయవాన్
అమోఘ క్రోధ హర్ష శ్చ త్యాగ సంయమ కాలవిత్
దృఢ భక్తి స్థిర ప్రజ్ఞో న అసద్గ్రాహీ న దుర్వచా
నిస్తంద్రి: అప్రమత్త శ్చ స్వదోష పర దోషవిత్
శాస్త్రజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ పురుషాఽన్తర కోవిదః
యః ప్రగ్రహాఽనుగ్రహయో: యథా న్యాయం విచక్షణః
సత్సంగ్రహ ప్రగ్రహణే స్థానవిత్ నిగ్రహస్య చ
ఆయ కర్మణి ఉపాయజ్ఞః సందృష్ట వ్యయ కర్మవిత్
శ్రైష్ఠ్యం శాస్త్ర సమూహేషు ప్రాప్తో వ్యామిశ్రకేష్వఽపి
అర్థ ధర్మౌ చ సంగృహ్య సుఖ తన్త్రో న చాఽలసః
వైహారికాణాం శిల్పానాం విజ్ఞాతాఽర్థ విభాగవిత్
ఆరోహే వినయే చైవ యుక్తో వారణ వాజినామ్
ధనుర్వేదవిదాం శ్రేష్ఠో లోకేఽతిరథ సమ్మతః
అభియాతా ప్రహర్తా చ సేనా నయ విశారదః
అప్రధృష్య శ్చ సంగ్రామే క్రుద్ధై: అపి సురా సురైః

**అనసూయో జిత క్రోధో న దృప్తో న చ మత్సరీ**
**న చ అవమన్తా భూతానాం న చ కాల వశాఽనుగః**
**ఏవం శ్రేష్ఠై: గుణై: యుక్తః ప్రజానాం పార్థివాఽఽత్మజః**
**సమ్మత స్త్రిషు లోకేషు వసుధాయాః క్షమా గుణైః**
**బుద్ధ్యా బృహస్పతే స్తుల్యో వీర్యేణాఽపి శచీ పతేః**
**తథా సర్వ ప్రజా కాన్తైః ప్రీతి సంజననైః పితుః**
**గుణై: విరురుచే రామో దీప్తః సూర్య ఇవాంశుభిః**
**తమ్ ఏవం వృత్త సంపన్నమ్ అప్రధృష్య పరాక్రమమ్**
**లోక పాలోపమం నాథమ్ అకామయత మేదినీ**
**వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః**
**ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి**

రాముడికి ఉన్న గుణముల చేత, దశరథుడికి రాముడంటే కొంచెం ప్రేమ ఎక్కువ. రాముడికి ఉన్న గొప్ప గుణాలు ఏంటంటే భగవానుని యొక్క సౌశీల్యము, వాత్సల్యముచే వామనుడుగా జన్మించుటచే అదితి ఎట్లు ప్రకాశించినదో అదే విధముగా కౌసల్య భగవానుని పుత్రునిగా పొంది ప్రకాశించు చున్నది. శ్రీరాముడు సౌందర్యరాశి. రూపమేగాక గుణములచే కూడా గొప్పవాడు. దశరథునితో అన్ని విధముల సమానుడు. పరాక్రమము, ధైర్యము గలవాడు, అసూయలేనివాడు. తానేమియు మార్పు చెందక ఇతరులలో మానసికమైన ధైర్యము తొలగునట్లు చేయగల వీర్యము గలవాడు. ఒకరిలో నున్న గుణములను చూచి ఆ గుణములను దోషములుగా మలచి చెప్పునట్లు చేసేది దుష్ట గుణము అసూయ. అట్టి అసూయ లేనివాడు. శ్రీరాముడు నిత్యము ప్రశాంతమగు మనస్సు గలవాడు. అతని మనసులో ఎన్నడును కామముగాని (కోరిక), క్రోధముగాని, లోభముగాని లేవు. అందుచే నిశ్చలముగా ఉండును. ఎప్పుడు ఎదుటి వారి మనస్సు

నొప్పించకుండా సుకుమారంగా, మధురముగా మాటలాడెడివాడు. పరుషముగా మాటాడినవారికి సమాధానము చెప్పెడివాడు కాడు. ఎవరైనా కొంచెము ఉపకారము చేసినచో అట్టిది శాశ్వతముగా గుర్తుంచుకొని పొంగిపోయెడివాడు. వృద్ధులలతో, జ్ఞానులలతో సహవాసము చేయుటలో ఆసక్తి చూపి మంచి నడవడి సూక్ష్మ మైన విషయాలు తెలుసుకొనును. భగవంతుని గూర్చి, ఆత్మ స్వరూపమును గూర్చి తెలుసుకొంటూ లోకమునకు హితమైన మాటలు, మాత్రమే పలుకును. రాముడు ప్రశస్తుడు. లోకులందరు ఎట్లు సుఖముగా ఉండునని సర్వదా ఆలోచించేవాడు. బుద్ధిమంతుడు, మధురభాషి, ప్రియంవధుడు, వీర్యము కలవాడు, నిగర్వి, దయ, శరణాగత రక్షణము, ధర్మము ఆచరించుటలో పూనిక గల్గి సత్పురుషులను రక్షించి, దుష్టులను, అధర్మవర్తనను నిగ్రహించేవాడు. మనుష్యమాత్రునకు ఎట్టి దుఃఖము కలిగినను, అట్టి ఆపద తనకు ఆపాదించుకొని అధికమైన దుఃఖము కల్గి ఉండును. ఏ విధమైన అభ్యుదయము జరిగినచో తండ్రి వలెనె ఆనందించును. ఈ విధముగా వాల్మీకి మహర్షి, నారదముని కి శ్రీరాముడు పదహారు ఉత్తమ గుణములైన "గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞతా భావం కలవాడు, సత్యావాక్యుడు, దృఢవ్రతుడు, చారిత్రము కలవాడు, సర్వ భూత హితకరుడు, విద్వాంసుడు, సమర్ధుడు, ప్రియదర్శనుడు, ఆత్మవంతుడు, జితక్రోధుడు, ద్యుతిమంతుడు, అసూయారహితుడు, అవసరమైనప్పుడు మాత్రమే కోపం తెచ్చుకో గలిగే వాడు తో విరాజిల్లాడు అని చెప్తాడు.

శ్రీరామునికి ఈ పదహారు గుణములు అలవాడుటకు ముఖ్య కారణము వసిష్ఠ మహర్షి చెప్పిన వసిష్ఠ-రామ సంవాద రూపమైన యోగా వాసిష్ఠము అనుడములో సందేహము లేదు. దానికి తోడు శ్రీరాముని శిష్య ప్రజ్ఞయే కారణము. ఉదాహరణకు వసిష్ఠ మహర్షి శ్రీరామునికి జీవన్ముక్తుల విషయము వివరించుతూ ... లోకవ్యవహారంలో శాస్త్ర విధిని అనుసరిస్తూ ఈ విశ్వాన్ని ఆకాశము లాగ,

శూన్యంగా చూసేవాడు, లోకవ్యవహారాలు చేస్తూ కూడా జ్ఞానంలోనే నిలకడ కలిగి ఉండేవాడు, సుఖం కలగినప్పుడు ముఖం విప్పారకుండా, దుఃఖం కలగినపుడు ముడుచుకోకుండా ఎప్పుడూ ఒకే విధంగా ఉండేవాడు, మేల్కొనినప్పుడు కూడా గాఢ నిద్రలో ఉన్నవానివలె ఉండేవాడు, నిద్రలో కూడ తన స్వరూపాన్ని మరవని వాడు, ఎవరి చిత్తం లో వాసనలు నశించి, బయిటకు రాగ ద్వేష భయాలను నటిస్తూ ఉన్నా అంతరంగంలో అకాశం లాగ స్వచ్ఛమై ఉండేవాడు, లోకాన్ని భయ పెట్టని వాడు, లోకంవల్ల భయ పడని వాడు, సుఖదుఃఖాల నుండి విముక్తుడైనటువంటివాడు జీవన్ముక్తుడు అని చెప్తారు. అలాగే శ్రీరాముడు కూడా తన శిష్య ప్రజ్ఞతో ఆయా విషయాలు శ్రవణ మాత్రం చేతనే అవగాహన చేసుకొని, నిరంతర అభ్యాసముతో జీవన్ముక్తుడు కాగలిగాడు..

**2.3 శ్రీరాముడు-పట్టాభిషేక ప్రయత్నము-దశరథుడి రాజధర్మ బోధన**

ఇటువంటి సద్గుణవంతుడైన శ్రీరామునికి యువరాజ్య పట్టాభిషేకము చేయవలెనని దశరధ మహారాజు తలంచి, ప్రజల అభిప్రాయము కోరగా అందుకు ఏకగ్రీవంగా అంగీకరించారు.

అందుకు అంగీకరించిన దశరథుడు

**చైత్రః శ్రీమాన్ అయం మాసః పుణ్యః పుష్పిత కాననః**

**యౌవ రాజ్యాయ రామ స్య సర్వ మేవ ఉప కల్ప్యతామ్**

ఈ చైత్ర మాసంలో పుష్యమి నక్షత్రంతో చంద్రుడు కలిసి ఉన్నప్పుడు రాముడికి పట్టాభిషేకం చేస్తానని ప్రకటించాడు. తరువాత సుమంత్రుడిని పిలిచి రాముడిని తీసుకురమ్మన్నాడు, వశిష్ఠుడిని పిలిచి పట్టాభిషేకానికి ఏర్పాట్లు చెయ్యమన్నాడు. తరువాత దశరథుడు రాముడిని పిలిచి నీకు పుష్యమి నక్షత్రంలో పట్టాభిషేకం చేస్తాను, కావున ఈ రోజుకి వెళ్ళి ఉపవాసం (ఉపవాసం అంటే, కడుపు నిండా తినేస్తే కన్ను మలుగుతుంది కాబట్టి, కన్ను

మలిగిపోనంత సాత్విక ఆహారం, శరీరం నిలబడడానికి కావలసినంత తిని, ఆ ఓపికతో భగవతారాధన చెయ్యడం ఉపవాసం, అన్నం తినడం మానెయ్యడం ఉపవాసం కాదు) చెయ్యి అన్నాడు. సీతమ్మతో కలిసి దేవతలని ప్రార్థించి, దర్భల(గడ్డి) మీద పడుకో. అయోధ్యా నగరమంతా చాలా సంతోషంగా ఉన్నది. అందరూ వెళ్ళిపోయాక దశరథుడు కూడా వెళ్ళిపోయాడు. ముగ్ధమనోహరమైన రాముని దశరథుడు మేడపై నుండి చూచుచునే నిలిచి ఉండెను. ఎంతసేపు చూచినను అతనికి తృప్తి కలుగలేదు.

**చన్ద్రకాన్తాఽననం రామమ్ అతీవ ప్రియ దర్శనమ్**

**రూపౌదార్య గుణైః పుంసాం దృష్టి చిత్తాఽపహారిణమ్**

**ఘర్మాఽభితప్తాః పర్జన్యం హ్లాదయన్తమ్ ఇవ ప్రజాః**

**న తతర్ప సమాయాన్తం పశ్యమానో నరాఽధిపః**

శ్రీరాముడు చంద్రుని వలె మనోహరమైన ముఖ సౌందర్యము గలవాడు. చూడ ముచ్చటైన అంద చందములు గలవాడు. రూప సౌభాగ్యము చేతను ఔదార్యాది గుణములను బట్టియు సర్వ ప్రాణుల దృష్టిని ఆకర్షించుతూ వారి చిత్తములను అపహరించువాడు. ఎండ బాధకు గురైన వారికి మేఘము వలె ప్రజలకు ఆహ్లాదమును గూర్చు వాడు. అట్టి శ్రీరాముని దశరథ మహారాజు ఎంత చూచినను తనివి తీరడము లేదు.

అట్టి రాముడు తండ్రి వద్దకు వచ్చి.... అంజలి ఘటించి .....

**స ప్రాఞ్జలి రభిప్రేత్య ప్రణతః పితురన్తికే**

**నామ స్వం శ్రావయన్ రామో వవన్దే చరణౌ పితుః**

'రామవర్మనైన నేను మీకు నమస్కరించుచున్నాను' అని పాదాభి వందనము చేసెను. అప్పుడు దశరథుడు యువరాజ పట్టాభిషేక యుక్తుడవుతున్న కుమారునికి కొన్ని హిత వచనములు చెప్పెను.

**భూయో వినయమ్ ఆస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః**

**కామ క్రోధ సముత్థాని త్యజేథా వ్యసనాని చ**
**పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా**
**అమాత్య ప్రభృతీః సర్వాః ప్రకృతీ శ్చాఽనురఞ్జయ**
**కోష్ఠా గారాఽఽయుధా గారై: కృత్వా సన్నిచయాన్ బహూన్**
**తుష్టాఽనురక్త ప్రకృతి: యః పాలయతి మేదినీమ్**
**తస్య నన్దన్తి మిత్రాణి లబ్ధ్వా అమృతమ్ ఇవాఽమరాః**
**తస్మాత్ త్వ మఽపి ఆత్మానం నియమ్య ఏవం సమాచర**

రామా! ఇంకను వినయవంతుడువు కమ్ము; ఎల్లప్పుడూ జితేంద్రియుడవై మెలుగుము. నువ్వు రాజువయ్యాక రెండు వ్యసనాలు వస్తాయి, అవి మనన్ని నాశనం చేస్తాయి, కావున వాటిని దగ్గరకు రానీకుండా చూసుకో, ఆ రెండు వ్యసనాలే కామము మరియు క్రోధము. కామము వలన నిష్కారణంగా వేటాడాలన్న బుద్ధి పుడుతుంది, జూదమాడదామన్న బుద్ధి పుడుతుంది, పగటి పూట నిద్రపోవాలన్న అలవాటు వస్తుంది, పరదూషణములని వేరొకరి దగ్గర కూర్చుని వినాలనిపిస్తుంది, పగటి పూట అని చూడకుండా స్త్రీతో సంభోగిద్దామనిపిస్తుంది, మద్యం తాగాలనిపిస్తుంది, పగటి పూట నృత్యము చూడాలనిపిస్తుంది, గీతములను విందామనిపిస్తుంది. అలాగే క్రోధము వలన చాడీలు చెప్పాలనిపిస్తుంది, సత్పురుషులని నిర్బంధించాలనిపిస్తుంది, కపటముగా వేరొకరిని చంపాలనిపిస్తుంది, ఇతరులు వృద్ధిలోకి వస్తే ఓర్వలేనితనం వస్తుంది, ఇతరులలోని గుణాలని దోషాలుగా చెప్పాలనిపిస్తుంది, ఇతరుల ధనాన్ని అపహరించాలనిపిస్తుంది, అవతలివారి మనస్సు బాధ పడేటట్టు మాట్లాడాలనిపిస్తుంది, చేతిలో ఒక ఆయుధం పట్టుకొని అవతలవాడిని నిష్కారణంగా శిక్షించాలనిపిస్తుంది. పరోక్షంగా (గూఢచారుల ద్వారా) నీ రాజ్య విశేషాలను, ఇతర రాజ్య విశేషాలను తెలుసుకొని తగిన విధముగా

వ్యవహరింపుము. అట్లే ప్రత్యక్షంగా (స్వయముగా) ప్రజలనుండి, తదితరుల నుండి వాస్తవములను ఎరిగి రాజ్య పాలన చేయుము. అమాత్యులను, సేనాపతులను, పుర రక్షకులను, పురవాసులు, జానపదులు మున్నగు ప్రజలందరినీ రంజింప చేయుచు పరిపాలించుము. కోష్టాగారములను, కోశాగారములను, ఆయుధాగారములను ధన ధాన్యములతోను, వివిధ ఆయుధములతోను నింపి, సామంతులు మొదలగు సప్త ప్రకృతులకు (రాజు, అమాత్యులు, దుర్గములోనున్న పురము, దేశము, ధనాగారము, సేనాబలము, మిత్రులు. ఈ ఏడు విధములైన వాటిని సప్త ప్రకృతులు అందురు. రాజ్యమునకు ఈ సప్త అంగములు ప్రాణతుల్యములు) అనురాగమును పంచి ఇచ్చు, రాజును చూసి సామంతాదులు అమృతమును పొందిన అమరులవలె సంతోషింతురు. కావున నీవు మనోనిగ్రహముతో ఇంతవరకు తెలిపిన విధముగా పాలింపుము.

శ్రీరాముడు ఆయా రాజధర్మములను వినయముతో, శ్రద్ధగా విని మనసులో స్థిర పరచుకొనెను.

### 2.4.1 మంథర ఉపదేశము -కైకేయి వరములు

రామ పట్టాభిషేక వార్తతో అందరూ ఇలా సంతోషంగా ఉన్న సమయంలో, కుబ్జ(గూని) అయిన మంథర (పుట్టినప్పటి నుంచి కైకేయకి దాసిగా ఉన్నది) చంద్రబింబంలా అందంగా ఉన్న రాజప్రాసాదం పైకి మంథర ఎక్కింది. ఆనందంగా ఉన్న ఆ దేశ ప్రజలని చూసిన మంథర భరించ లేకపోయింది. అప్పుడే అటుగా వెళుతున్న కౌసల్య యొక్క దాసిని చూసిన మంథర ఆమెతో "ఓ దాయాధి! రామజనని ఏదైనా ఒక మనోరథ సిద్ధికై పరమ సంతోషముతో జనులకు దాన ధర్మాలు చేయుచున్నదా? ప్రజలు ఎందుకు పొంగి పోవుచున్నారు? అని అడిగింది. అప్పుడా కౌసల్య దాసి .... "కౌసల్యాదేవి కుమారుడైన రాముడికి పట్టాభిషేకం జరగబోతోంది, అందుకని కోసల దేశ ప్రజలు ఉత్సవాలు చేసుకుంటున్నారు చూశావా" అనింది. వెంటనే మంథర కోపము, అసూయతో

కైకేయి దగ్గరకి వెళ్ళి హంసతూలికాతల్పం మీద విశ్రాంతి తీసుకుంటున్న కైకేయితో మంథర ఇలా చెప్పడం ప్రారంభించింది.........

**అక్షేమం సుమహత్ దేవి ప్రవృత్తం త్వ ద్వినాశనమ్**

**రామం దశరథో రాజా యౌవ రాజ్యేఽభిషేక్ష్యతి**

**సాఽస్మ్యఽగాధే భయే మగ్నా దుఃఖ శోక సమన్వితా**

**దహ్యా మానాఽనలే నేవ త్వత్ హితార్థమ్ ఇహాఽఽగతా**

"నీకు మహావిపత్తు వచ్చి పడబోతున్నది కైకా, రాముడికి యువరాజ పట్టాభిషేకం జరుగులోంది. ఈ విషయము తెలియగానే భరతునికి బదులు రామునికి పట్టాభిషేకము జరుగుచున్నందుకు మహాదుఃఖమునకు, భయమునకు లోనై అగ్నిలో దహింపబడుచున్న దానివలె విలవిలలాడుచు నీ హితమును గోరి ఇటు వచ్చితిని. పిచ్చిదానా చూశావా, కొద్ది కాలంలో కౌసల్య రాజమాత అవుతుంది. " నీకు అర్ధం కావడం లేదు, ఒకసారి రాముడికి దశరథ మహారాజు యువరాజ పట్టాభిషేకం చేశాక, ఇక జన్మలో భరతుడు రాజు కాలేడు. తదనంతరం రాముడి పుత్రులు పరిపాలిస్తారు. నీ కొడుకు ఒక్కనాటికి రాజు కాలేడు. రాముడు రోజూ పితృసేవ, పితృసేవ అని దశరథుడి చుట్టూ తిరిగి పట్టాభిషేకం పొందుతున్నాడు. రాముడికి లక్ష్మణుడితో సమస్యలు ఉండవు, కావున భరతుడిని అయోధ్యకి రాకముందే మట్టుపెట్టేస్తాడు. అందుకని కైకా నా మాట విని నీ కొడుకుని అయోధ్యకి రానివ్వమాకు. అటునుంచి అటు అరణ్యాలకి పారిపొమ్మని చెప్పు. ఒకసారి రాముడికి పట్టాభిషేకం అయితే ప్రజలకి ఆయన మీద ఉన్న నమ్మకం ఇంకా పెరుగుతుంది. ఇంక రాజ్యంలో తనకి శత్రువర్గం అనేది లేకుండా చేసుకుంటాడు.

**ప్రాప్తాం సుమహతీం ప్రీతిం ప్రతీతాం తాం హతద్విషం**

**ఉపస్థాస్యసి కౌసల్యాం దాసీవత్త్వం కృతాఞ్జలిః**

“నువ్వు దశరథుడికి భార్యగా కాదు కౌసల్యకి దాసిగా బతకాలి”. అని మంథర కైకేయతో అనింది. మంథర చెప్పిన ఈ మాటలు విన్న కైకేయ మనసులో ఆలోచన ప్రవేశించింది. ఆమె వెంటనే మంథరతో......" నేనూ నా కొడుకు ఈ ఉపద్రవం నుంచి బయటపడాలంటే ఏమి చెయ్యమంటావు " అని అడిగింది. అప్పుడు మంథర ఏమి చెప్పిందంటే.......**అద్య రామమితః క్షిప్రం వనం ప్రస్థాపయామ్యహం | యౌవరాజ్యే చ భరతం క్షిప్రమేవాభిషేచయే.** ఏ రాముడు తన గుణములు చేత, పితృవాక్య పరిపాలన చేత, తండ్రిని సేవించడం చేత రాజ్యాన్ని పొందుతున్నాడో, ఆ రాముడిని పధ్నాలుగు సంవత్సరాలు జటలు కట్టుకొని, నారచీరలు కట్టుకొని దండకారణ్యానికి పంపాలి. నీ కొడుకుకి అదే ముహూర్తానికి పట్టాభిషేకం చేయించాలి. రాముడు పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యాలకి వెళ్ళడం వల్ల నీ కొడుకు సింహాసనం మీద కూర్చొని ప్రజలందరిలోను మంచి మద్దతు సంపాదిస్తాడు. నీ కొడుకు ప్రజల గుండెల్లో బాగా పాతుకుపోతాడు. తరువాత రాముడు తిరిగొచ్చినా తనకి ఎదురు తిరగకుండా తప్పిస్తాడు. కాబట్టి రాముడిని పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యాలకి పంపడం, నీ కొడుక్కి పట్టాభిషేకం చేయడం, దశరథుడు పూర్వము నీ కొసగిన రెండు వరాలను అడుగు అని చెప్పింది.నువ్వు అడిగితే ధర్మానికి కట్టుబడే దశరథుడు మాట తప్పడు. అని చెప్పింది. ఈ మాటలు విన్న కైకేయ పెట్టుకున్న ఆభరణాలు, కట్టుకున్న పట్టుచీర అవతల పారేసి, ఒక ముతక వస్త్రం కట్టుకొని కోపగృహంలో నేల మీద పడుకున్నది. అటుపక్క దశరథుడు పట్టాభిషేకానికి చెయ్యవలసిన పనులని పురమాయిస్తూ తనకి అత్యంత ప్రియమైన కైకేయకి స్వయంగా తానే ఈ శుభవార్త చెప్పాలని కైకేయ మందిరానికి వచ్చాడు. కైకేయ కోపగృహంలో నేలమీద పడిఉండడం చూసి తట్టుకోలేకపోయాడు. అప్పుడు దశరథుడు కైకేయతో నీ కోపకారణము ఏమిటో తెలియ చేయి. రాముడి మీద ప్రమాణము చేసి నీ కోరిక

ఎటువంటిది అయినా తీరుస్తాను అని అన్నాడు. అప్పుడు కైక పూర్వము తనకిచ్చిన రెండువరాలను గుర్తు చేస్తూ ....

**అభిషేక సమారమ్భో రాఘవ స్యోపకల్పితం**

**అనే నైవాఽభిషేకేణ భరతో మేఽభిషిచ్యతామ్**

**యో ద్వితీయో వరో దేవ దత్త: ప్రీతేన మే త్వయా**

**తదా దైవాఽసురే యుద్ధే తస్య కాలోఽయ మాగత:**

**నవ పంచ చ వర్షాణి దణ్డకాఽరణ్యమ్ ఆశ్రితః**

**చీరాఽజిన జటా ధారీ రామో భవతు తాపసః**

**భరతో భజతామ్ అద్య యౌవ రాజ్యమ్ అకణ్టకమ్**

**ఏష మే పరమ: కామో దత్త మేవ వరం వృణే**

**అద్య చైవ హి పశ్యేయం ప్రయాన్తం రాఘవం వనం**

రాముడిని పధ్నాలుగు సంవత్సరాలు జటలు కట్టుకొని, నారచీరలు కట్టుకొని దండకారణ్యానికి పంపాలి. భరతుడికి అదే ముహూర్తానికి పట్టాభిషేకం చేయించాలి అని అడిగింది. అప్పటిదాకా ఎంతో సంతోషంగా ఉన్న దశరథుడు ఈ మాట వినగానే స్పృహ కోల్పోయి ఉన్న చోటనే కూలబడ్డాడు.

### 2.4.2 మంథర యొక్క యోగ రహస్యము

మంథర యొక్క యోగ రహస్యమును పరిశీలిద్దాము. తన ఆలోచనలను మంథనము చేసి ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక స్థాయికి తీసికొని పోవు సాధకుని శుద్ధ బుద్ధి, దాసి వలె తత్పరమైన బుద్ధి. మనస్సు నందలి వివిధ స్థితులను మంథనము చేసి సాధకుని ఆధ్యాత్మిక సేవకై ఎల్లప్పుడూ దాసి మాదిరీగ తత్పరతతో కార్యమును గావించుటయే మంథర వృత్తి. విధేహి వృత్తి రూప కైకేయికి శుద్ధమైన సలహాను ఇచ్చి ఆమె యొక్క ఆధ్యాత్మిక పతనమును వారించుటకై మంథర అంతరంగము సేవా తత్పరతతో ప్రయత్నించును. ఆలోచనలను వడగట్టి

అందలి సద్విచారములతో శ్రేష్ఠమైన కర్తవ్యమును నెరవేర్చుటయే మంథర కార్యము. సామాన్య జనులు అందరు రాముని పట్టాభిషిక్తుని గావించాలని కోరితే, మంథర మాత్రము రాముని ధీరుడైన తపస్వినిగా చేయుటకై దండకారణ్యము పంప వలెనని కోరుకొనెను. దుష్టురాలని సమాజము నిందించిన కైకేయి రామ వృత్తిని ముందుకు తీసికొని పోయే తల్లి. ఆలాగుననే సాధకుని యొక్క వైరాగ్య వృత్తిని సదా జాగృత పరచుటకై ఉపయోగపడు వివేక వివేక బుద్ధి మంథర. మంథర వృత్తిని మనము ఉపేక్షిస్తూ ఉంటాము. దాసిగా చూపి రామాయణకారుడు తన మహోన్నతమును చాటినాడు. దాసిని సామాన్యముగా ఉపేక్షిస్తూ ఉంటాము. అయితే దాసి అయినను సాధకునికి శుద్ధమైన, సుయోగ్యమైన ఆధ్యాత్మిక ఉపదేశమును ఈయగలదు. అటువంటి అమృత తత్వమును దాసి ద్వారా మనకు వాల్మీకి మహర్షి అందించినారు. **"బలాదపి సుగ్రాహ్యమ్"** (మంచి సలహాను బలవంతముగా అయినను గ్రహించవలెను). కౌసల్య, దశరథుల ఉపదేశము ఎటువంటిది అయినను రాముడు విదేహ వృత్తి రూప తల్లి అయిన కైకేయి ఆజ్ఞనే పాలించును. (కథా సందర్భమున కైకేయి పాత్ర గురించి విశ్లేషణ చేసుకొందాము). దీని వెనుక పాత్రధారి మంథరయే. రామాయణము నందలి శ్రేష్ఠమైన పాత్ర "మంథర". రాముని వనవాసములోనే మంథర పాత్ర సమాప్తము అవుతుంది.

## 2.5 సత్య-ధర్మముల స్వరూపము

సత్యము, ధర్మము అనునవి రెండును విడువక కలసి ఉండెడివి. సత్యము ఎల్లప్పుడును మారకుండా ఉండును. ధర్మము దేశకాల పరిస్థితులను బట్టి, వర్ణాశ్రమ ధర్మాలను బట్టి, లింగ భేదమును బట్టి, చేయుచున్న వృత్తిని బట్టి మారుచుండును. ఉదాహరణకు స్త్రీ ధర్మమునకు -పురుష ధర్మమునకు, రాజ ధర్మమునకు - సేవక ధర్మమునకు, గురు ధర్మమునకు - శిష్య ధర్మమునకు ......

ధర్మము మారుచుండును. **"సత్యం వద ధర్మం చర"**. [4]ఒకానొక సమయములో ప్రహ్లాదుని కుమారుడైన విరోచనుడు, అంగీరసుని కుమారుడైన సుధర్ముడు ఒక వాదనలో పోటీపడ్డారు. గెలుపొందినవానికి ఓడిపోయినవాడు తన ప్రాణాన్ని అర్పించాలి అన్న షరతు విధించుకున్నారు. పోటీలో జయాపజయములను నిర్ణయించడానికి న్యాయ నిర్ణేతగా ఒక సమర్థుడైన వ్యక్తి కావలిసి వచ్చింది. అతడు ఎట్టి సంకుచిత భావములు లేనివాడై వుండాలి. తన పర భేదభావములను పాటించనివాడై వుండాలి. అందరూ ప్రహ్లాదుని న్యాయనిర్ణేతగా వుండమని ప్రార్థించారు. ప్రహ్లాదుడు ఒప్పుకున్నాడు. పోటీ ప్రారంభమైంది. ప్రహ్లాదుడు అన్నింటిని శ్రద్ధగా, శాంతంగా గమనిస్తున్నాడు. చివరకు విరోచనుడు ఓడినట్లు, సుధర్ముడు గెలిచినట్లు నిర్ణయించాడు. సుధర్ముడు పట్టలేని ఆనందముతో ప్రహ్లాదునికి నమస్కరిస్తూ "మీరు పుణ్యపురుషులు. జగతి యందు పుణ్యపురుషులే లేకున్న జగములెట్లు వెలుగు!" వాదనలో ఓడినవాడు గెలిచినవాడికి ప్రాణములివ్వాలని తెలిసి కూడా సత్యాన్ని పాటించి మీ కుమారుని ఓటమిని మీరు అంగీకరించారు. **"సత్యాన్నాస్తి పరో ధర్మ:"** అన్న శృతి వాక్యమును అక్షరాలా పాటించారు. మీరు ఇట్టి సత్యవాక్య పరిపాలకులు గనుక, మీ కుమారుని ప్రాణములను నేను తీసుకోను. "మీ సత్యమే మీ కుమారుని రక్షించింది" అన్నాడు. విరోచనుడు స్వాభావికముగా దుర్మార్గుడు. ప్రహ్లాదుని భక్తి ప్రపత్తులు, దర్మ నిరతి అతనిలో లేవు. ప్రహ్లాదుని మనవడు బలిచక్రవర్తి. అతనికి తాతయైన ప్రహ్లాదుని సద్గుణములు పుట్టికతోనే అబ్బినాయి. విరోచనుడు ప్రహ్లాదుని తండ్రియైన హిరణ్యకశిపునివలె దురాలోచనలతో దుష్క్రియలతో కాలం గడిపేవాడు. కాని ప్రహ్లాదుని సత్యసంధత, నీతి నిజాయతీలవలన విరోచనుడు

[4] Source: http://sreesathyasai.weebly.com/31283108314931193074-31253110-31113120314931183074-30983120.html

రక్షింపబడినాడు. కనుక సత్యమును అందరూ పాటించవలసినదే. మానవుడు సత్యనిష్ఠుడైతే అదియే ధర్మమును కాపాడుతుంది.

రఘుకుల వంశజుడైన దశరధునికి సత్యము, రాజధర్మము రెండును ఆచరింపవలసినదే. [5]దశరధుడు కైకేయిని వివాహమాడినప్పుడు ఆమె కుమారునికి రాజ్యము ఇత్తునని ప్రతిజ్ఞ చేసినాడు. ధర్మాత్ముడు, గుణవంతుడు, ప్రజల మన్నన పొందిన వాడు, జేష్టుడు అయిన రామునికి యువరాజ్య పట్టాభిషేకము చేయుట రాజ ధర్మము, ప్రజాభీష్టము కానీ సత్యము కాదు, ప్రతిజ్ఞా భంగము. ఈ విషయము దశరధునికి తెలియును. అందుకని దశరధుడు భరతుడు మరియు అతనిని అమితంగా ప్రేమించే శత్రుఘ్నుడు నగరములో లేని సమయము చూసి రామునికి యువరాజ్య పట్టాభిషేక ప్రయత్నాలు చేసినాడు. ఈ విధమైన దశరధ ప్రయత్నములో ప్రతిజ్ఞా భంగమగును. సత్యవాక్పరిపాలన, రాజధర్మము (ప్రజాభీష్టము) మధ్య తలెత్తిన ఘర్షణలో దశరధుడు రాజధర్మమునకే మొగ్గుచూపి సత్యవాక్పరిపాలన కాదనుకొన్నాడు. అందుకనే రామపట్టాభిషేక వార్త కేకయ దేశ రాజునకు మరియు జనక మహారాజునకు కబురు పంపలేదు. సమయము లేదని చెప్పవచ్చునని అనుకొన్నాడు. మనుమనికి రాజ్యము ఇత్తునని దశరధుడు చేసిన ప్రతిజ్ఞ కేకయ రాజునకు గుర్తుండును. అడుగునేమోనని భయపడినాడు. సత్యమును పాటించుటకు ఇష్టము లేక ధర్మమును దానికి తోడుగా నిలిపి సత్యమును ప్రక్కకు తొలగించాడు. అలానే సత్య ధర్మములను సమదృష్టితో చూచే జీవన్ముక్తుడైన జనక మహారాజు దృష్టిలో చులకన కాకూడదని జనకమహారాజునకు సందేశము పంపలేదు. రామపట్టాభిషేకమునకు అందరూ అంగీకరించినా, దీక్ష స్వీకరింపచేసినా

---

[5] Source : శ్రీమద్రామాయణము, అయోధ్య కాండ, ప్రధమ భాగము - తత్వదీపిక by శ్రీభాష్యం అప్పలాచార్యులు

పట్టాభిషేకము కాలేదు. కారణము విడదీయరాని సత్యధర్మములను విడదీయవలెనని, ధర్మముచే త్రోసి పుచ్చవచ్చునని ప్రయత్నించాడు. తాను ఆడిన మాటకు మార్పులేక కట్టుబడి పాలించుట సత్యసంధత. సత్యవాక్పరిపాలనము శ్రీరాముని మంచితనమును గూర్చి దశరధుడు కైకేయికి చెపుతూ....

**"సత్యం, దానం తపస్త్యాగో మిత్రతా శౌచ మార్జవం, విద్యాచ గురుశుశ్రూసా ధ్రువాణ్యే థాని ర్తాఘువే"**

సత్యము, దానము, తపస్సు, త్యాగము, మిత్రత్వము, శౌచము, ఋజువర్తనము, విద్య, గురుశుశ్రూష అనునవి రాముని యందు ఎల్లవేళలా ఉండే గుణములు. అయితే సత్యవాక్పరిపాలనచే మిగిలిన ఎనిమిది గుణములు తామంతా తామే సిద్ధించును. దశరధుడు సత్యమును పాటించలేదు.

**2.6 కైకేయి వరముల యొక్క అంతరంగము**

సర్వ విద్యలను, శాస్త్రములను గురుకులంలో నేర్చుకొని, కులగురువు అయిన వసిష్ఠుని వద్ద ఆత్మజ్ఞానమును, సర్వ యోగ రహస్యములను పంచతంత్రములోని కధల మాదిరిగా ఆకళింపు చేసుకొని విశ్వామిత్రుని వద్ద ఆయా యోగరహస్యములను అభ్యాసము చేసి, శ్రీరాముడు పరిపూర్ణ పురుషుడయ్యెను. ఇచ్చట కైకేయి కోరిన వరముల యొక్క అంతరంగమును పరిశీలన చేద్దాము.

1. వచనముపై ధృఢ చిత్తము కలిగిన రఘుకులమునకు మచ్చ రాకూడదు.
2. సత్య ధర్మములను సమ దృష్టిలో చూడవలెను. ధర్మాచరణము వలన సత్య నిష్ఠ భంగమైనచో ధర్మమును వదిలి వేయుటలో దోషము లేదు.
3. దశేంద్రియములకు అధిపతి అయినను దశరధుడు మనస్సును నియంత్రణ చేసుకొనలేక నా పుత్రుడు, నా పుత్రుడు అని తలచుతూ దుఃఖితుడు అవుతున్నాడు. (వసిష్ఠ మహర్షి యోగ వాసిష్ఠములోని శుక్రోపాఖ్యానములో,

భృగు మహర్షి పుత్రుడైన శుక్రాచార్యుడు తన పూర్వ జన్మలో పుత్రునిపై మొహంతో అతనికి ధనము, దీర్ఘాయువు, గుణం కలుగవలెనని నిరంతరము తలపోయుచు తపఃపరాన్ముఖుడై క్షీణత చెంది మృత్యు ముఖుడయ్యెనని చెప్పెను.) అటువంటి దశరధుని ఉద్ధరించవలెను.

4. త్రేతాయుగ ధర్మం ప్రకారం 14 సంవత్సరాలు రాజ్యానికి దూరమైన వ్యక్తి తిరిగి రాజు కాలేడు, అందుకని కైక రాముడిని 14 సంవత్సరాలు అరణ్యావాసానికి వెళ్ళమనింది. కాని కైకేయి 14 అనకుండా 9+5 (నవ పంచ చ వర్షాణి) అన్నది. కైకేయ అలా అనడం వల్ల రాముడు పదునాలుగు సంవత్సరములు తపస్సు చేయుచు ధీర పురుషునిగా మారవలెను. జ్యోతిష్య శాస్త్రములో జాతక చక్రము నందు నవ పంచమ యోగము ఒక పూర్ణమైన యోగముగా అంగీకరింపబడినది. అటువంటి యోగము పట్టిన వ్యక్తి గొప్ప భాగ్యశాలి మరియు పూర్ణ పురుషుడు అగును. ఆధ్యాత్మిక మార్గము నందు ఆత్మ జ్ఞానము ప్రాప్తించుట కంటే నవ పంచమ యోగమింకేమి కావలయును? ఈ సిద్ధి కొరకై అటువంటి వ్యక్తి సామాజికంగా ఎటువంటి కష్టనష్టములు, అన్యాయములు, ఆటంకములు ఎదురైనను తన ధ్యేయమును చేరుటకై అన్నియు ఓరిమితో వహించును. ఈ నవ-పంచమ (9 +5) యోగము ద్వారా కైకేయి రాముని ధీర పురుషునిగా మార్చుటకు ప్రయత్నించును. వసిష్ఠ ముని ద్వారా పూర్తి ఆత్మ జ్ఞానమును సముపార్జించుకున్న శ్రీరాముని కంటే గొప్ప ఆత్మ జ్ఞాన సంపన్నుడు కైకేయికి ఎవ్వరు కానరాలేదు. వైదిక జీవనము నందు తపస్సు చేసుకొని ఆత్మ జ్ఞానము పొందువాడు ఉత్తమ పురుషుడు. **"రామోభవతు తాపసః"**. అయోధ్యలో సింహాసనము అధిరోహించినచో వసిష్ఠ మునీంద్రుని వద్ద నేర్చుకొన్న ఆత్మ జ్ఞానము రాముడు అభ్యాసము చేయలేడు.

5. [6]అరణ్యమేదయినా పోవాలన్నచో రాముడు ఏదో ఒక అరణ్యమునకు పోవచ్చును. కానీ కైకేయి దండకారణ్యమని ప్రత్యేకముగా నియోగించును. ఈ కథను పరిశీలించినట్లయితే ......ఇక్ష్వాకు మహారాజునకు నూర్గురు పుత్రులు. ఆఖరి కుమారుడు దండకుడు, గొప్ప ఉద్ధండుడు, క్రూరుడు, ఋషులను హింసించువాడు. ఇక్ష్వాకు మహారాజు దండకుని బుద్ధిని మార్చలేక రాజ్య బహిష్కరణ చేసి రాక్షసులతో నిండి ఉన్న దక్షిణారణ్యమునకు పంపెను. అప్పటి నుంచి దండకుడు ఆ అరణ్యములో ఎంతో క్రూరతతో మెలుగు చుండగా శుక్రాచార్యుని కుమార్తె అయిన "అరజ" (అర్జా) ను బలాత్కరించబోగా శుక్రాచార్యుడు గమనించి శపించెను. తత్ఫలితముగా దండకారణ్యము మరింత భీభత్సవముగా మారి మానవ నివాసమునకు కష్టమయ్యెను. అయినను ఋషిమునులు కొంతమంది పోవడము, చంపబడడము జరుగుచునే ఉండెను. ఈ దండకారణ్య కథలో ఒక రహస్యము దాగి ఉన్నది. దండకారణ్యమనగా మేరు దండము. అరణ్యము లతలు, వృక్షములు, పొదలు మున్నగు వాటితో ఏ విధముగా దట్టముగా ఉండునో అదే విధముగా మేరు దండము మజ్జాతంతువులతో (నాడీసమూహముతో) నిండి ఉండును. సాధనాకాలములో అనేకమైన ఈ నాడులలో విశేషమైన మార్పు జరిగి సాధకుని మనస్సు, శరీరము సుదృఢమై పరిశుద్ధమగును. సాధనలో ప్రతి సాధకుడు ఈ మేరు దండము నందలి మజ్జాతంతు రూప అరణ్యము నందు నివసించవలసినదియే. కొంతమంది సాధకులు ఈ దండకారణ్యము నందు వసించుట వలన వాని యందలి దుర్గుణ రూప రాక్షసుల బలము బయటకు వచ్చి తద్వారా మరణింతురు. అనగా సాధనలో పూర్తిగా సఫలము కాలేరు. అయినను అనేక మంది సాధకులు సాధనా రూప దండకారణ్యము నందు తపస్సు చేయుచునే ఉందురు. వాస్తవమున

[6] Source : రామాయణము - యోగరహస్యము by యోగేశ్వర్ మనోహర్ హర్ కరే (కాకాజి)

రాక్షసులతో కూడి ఉన్న అరణ్యమునకు ఋషిమునులు ఎవరు తెలిసి అక్కడ నివసించుటకు పోరు. దుర్గుణ రూప రాక్షసులున్నను తన మేరు దండ రూప దండకారణ్యమున సాధన చేయనిదే ప్రగతి సాధ్యము కాదు. ఇక్కడ రాక్షసులనగా సాధకుని యందు ఉన్న కుసంస్కారములే. మేరు దండ సాధనలో సాధకుని పూర్వ వృత్తులు ఒక్క సారిగ పైకుబుకును. అందువలననే దండక రాక్షసుడు ఉద్దండకుడని చెప్పబడినది. శుక్రాచార్యుని సుందర పుత్రి అయిన "అరజ" ను బలాత్కరించడమనగా సాధనలో సాధకుని ఉద్దండ వృత్తి అపరిపూర్ణమైన (సాధనకు తట్టుకోలేని) శరీరమును బలవంతము చేయుట. బలవంతమైన తీవ్రమైన సాధనను అపరిపూర్ణమైన శరీరముపై కొనసాగించియున్నచో సాధకుని మజ్జావస్థ దెబ్బతిని శరీరము నందు ప్రకంపనలు ఇంకను అనేకమైన విచిత్ర అనుభవములు కలుగును. అప్పుడు శరీరము తట్టుకొనలేదు. శుక్రాచార్యుడనగా సాధనా శక్తి (శుక్ర-శక్తి). అటువంటి శక్తియే వివిధ అనుభూతులకు కారణమగును. దండకుని ఉద్రేక వృత్తి శుక్రాచార్యుని శాపమనుట ఇదియే. ఆసన ప్రాణాయామముల ద్వారా శరీరము తగు విధముగా రూపొందవలెను. అటువంటి శరీరముతో సాధన చేసినచో సాధకుడు ఉద్రేకములు లేకుండా తట్టుకొన గల్గును. దశరధుడు ఇటువంటి తీవ్రమైన సాధన చేయలేడు. రాముడనగా ఆనందము. అట్టి రాముడు అయోధ్య యందు సుఖజీవనము చేయుట దశరధుని మనోభిప్రాయము. కైకేయి రాముని తీవ్రమైన సాధనకు ప్రయత్నించుటయే వరముల యొక్క అంతరంగము.

### 2.7.1 కైకేయి వరములకు శ్రీరాముని అంగీకారము

మరునాడు సుమంత్రుడు మహారాజు దర్శనార్ధమై కైకేయి గృహమునకు రాగా కైకేయి సుమంత్రునితో "సుమంత్ర! రాముడికి పట్టాభిషేకం అన్న సంతోషంలో మహారాజుకు రాత్రి నిద్ర పట్టలేదు, ఇప్పుడే నిద్ర పట్టింది. నువ్వు గబగబా వెళ్ళి రాజు పిలుస్తున్నాడని చెప్పి రాముడిని తీసుకురా" అనింది. సుమంత్రుడు కైకేయి

చెప్పిన రాజాజ్ఞను శ్రీరామునికి నివేదించగా శ్రీరాముడు వేగముగా కైకేయి అంతఃపురమునకు వచ్చి మహారాజు కైకేయితో ఆసనముపైన కూర్చొని దిగులుగా, దీనంగా, వాడిన ముఖంతో ఉండుట గమనించెను. అప్పుడు తండ్రి, కైకేయి పాదములకు నమస్కరించి తండ్రి యొక్క విచారమునకు గల కారణము తెలుసుకొనగోరెను. **"యతో మూలం నరః పశ్యేత్ ప్రాదుర్భావమిహాత్మనః, కథం తస్మిన్ నవర్తేత ప్రత్యక్షే సతిధైవతే"** ఈ శరీరములో ఉండుటకు కారణమైనవాడు తండ్రి. భగవానుడు సృష్టించినాడని అందురు గాని అతడు ప్రత్యక్షంగా కానరాడు. కాపాడడు. సృష్టించి, రక్షించే ప్రత్యక్ష దైవము తండ్రియే. రాముడు ఇలా అనగానే కైకేయి తన రెండు వరములు, అందుకు మహారాజు సంశయమునకు కారణం వివరించింది. శ్రీరాముడు ఎటువంటి మనో వికారము లేకుండా రాజాజ్ఞను అంగీకరించినవాడై కైకేయితో ఏ మాత్రము చలించకుండా ఇట్లు చెప్పుచున్నాడు.

**తత్ అప్రియమ్ అమిత్రఘ్నో వచనం మరణోపమమ్**
**శ్రుత్వా న వివ్యథే రామః కైకేయీం చేదమ్ అబ్రవీత్**
**ఏవమ్ అస్తు గమిష్యామి వనం వస్తుమ్ అహం త్వితః**
**జటాఽజిన ధరో రాజ్ఞః ప్రతిజ్ఞామ్ అనుపాలయన్**
**ఇదం తు జ్ఞాతుమ్ ఇచ్ఛామి కిమఽర్థం మాం మహీపతిః**
**నాఽభినన్దతి దుర్ధర్షో యథా పురమ్ అరిందమః**
**మన్యు ర్నచ త్వయా కార్యో దేవి బ్రూహి తవాఽగ్రతః**
**యాస్యామి భవ సుప్రీతా వనం చీర జటా ధరః**
**హితేన గురుణా పిత్రా కృతజ్ఞేన నృపేణ చ**
**నియుజ్యమానో విస్రబ్ధః కిం న కుర్యా మఽహం ప్రియమ్**
**అళీకం మానసం త్వేకం హృదయం దహతీవ మే**

**స్వయం యన్మాఽఽహ మాం రాజా భరత స్యాఽభిషేచనమ్**
**అహం హి సీతాం రాజ్యం చ ప్రాణాన్ ఇష్టాన్ ధనాని చ**
**హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయ అప్రచోదితః**

అప్పుడు రాముడు "తండ్రి అడగడం నేను పాటించక పోవడమా, తప్పకుండా పాటిస్తాను. నేను పధ్నాలుగు సంవత్సరాలు అడవులకి వెళ్ళడానికి, భరతుడికి పట్టాభిషేకం చెయ్యడానికి తండ్రి ఇంత బెంగ పెట్టుకోవాలా, భరతుడికి కావాలంటే రాజ్యం ఏమిటి, సీతని ఇస్తాను, నా ప్రాణాలు ఇస్తాను, ధనమంతా ఇస్తాను. భరతుడికి యువరాజు కావాలన్న కోరిక ఉందని నాకు తెలియక నేను యువరాజు పట్టాభిషేకానికి సిద్ధపడ్డాను. తమ్ముడికి పట్టాభిషేకం అవుతున్నందుకు చాలా సంతోషంగా ఉందమ్మా. తప్పకుండా తమ్ముడికి పట్టాభిషేకం చేసెయ్యండి. ఈ విషయం చెప్పడానికి తండ్రి అంత బాధ పడ్డారని తెలిసి నేను బాధ పడుతున్నాను. ఆయన నన్ను అగ్నిలో దూకమన్నా దూకేస్తాను." అన్నాడు.

**న అహమ్ అర్థపరో దేవి లోకమ్ ఆవస్తుమ్ ఉత్సహే**
**విద్ధి మామ్ ఋషిభి స్తుల్యం కేవలం ధర్మమ్ ఆస్థితమ్**
**యత్ అత్ర భవతః కించి చ్ఛక్యం కర్తుం ప్రియం మయా**
**ప్రాణాన్ అపి పరిత్యజ్య సర్వథా కృతమ్ ఏవ తత్**
**న హ్యతో ధర్మ చరణం కించిత్ అస్తి మహత్తరమ్**
**యథా పితరి శుశ్రూషా తస్య వా వచన క్రియా**
**అనుక్తోఽప్యఽత్ర భవతా భవత్యా వచనాత్ అహమ్**
**వనే వత్స్యామి విజనే వర్షాణి ఇహ చతుర్దశ**
**న నూనం మయి కైకేయి కించిత్ ఆశంససే గుణమ్**
**యత్  రాజానమ్ అవోచః త్వం మమేశ్వరతరా సతీ**
**యావన్ మాతరమ్ ఆపృచ్ఛే సీతాం చ అనునయా మ్యఽహమ్**
**తతోఽద్యైవ గమిష్యామి దణ్డకానాం మహద్వనమ్**

"అమ్మా! రాముడు ధనం కోసం, రాజ్యం కోసం ప్రాకులాడేవాడు కాదు, నేను ఋషి లాంటివాడిని, నాకు పితృవాక్య పరిపాలనం తప్ప ఇంకేమి వద్దు. అయినా నువ్వు నన్ను పిలిచి వెళ్ళిపోమంటే వెళ్ళి పోయేవాడిని కదా, ఇంత చిన్న విషయానికి రెండు వరాలు అడిగావ! మీరు బెంగ పెట్టుకోకండి, నేను ఇప్పుడే వెళ్ళిపోతున్నాను. కాని ఒక్కసారి నాన్నగారి పాదాలకి, మీ పాదాలకి నమస్కారం చేసి వెళ్ళిపోతాను" అన్నాడు. కౌసల్యా మాత వద్ద సెలవు తీసుకొని సీతను అనునయించి వెళ్లెదను. నాకు ఈ మాత్రము గడువు ఈయవలసినదిగా ప్రార్ధన. పట్టాభిషేకము సమయములోను, వనవాస వార్తా సమయములోను అనగా సుఖ దుఃఖములలో శ్రీరాముని ముఖములో ఎటువంటి తేడా లేకుండా యోగిలాగా, సత్యవాది, శ్రీమంతుడు అయినటువంటి శ్రీరాముడు తల్లి అయిన కౌసల్య అనుమతికై వచ్చి వనవాసమునకు అనుమతిని కోరెను.

### 2.7.2 కైకేయి వరముల లోని శ్రీరాముని ఆదర్శము

కైకేయికి ఇచ్చిన వచనములు పాలించుట దశరథ వృత్తికి సాధ్యము కాదు. సామాజిక న్యాయమును అనుసరించి మరియు రఘుకుల వంశజులుఇచ్చిన వచనములను పాలించకపోవుట ఉచితమైన విషయము కాదు. రాముడు పితృదేవుని మంచి కొరకై అయన ఇచ్చిన వచనములను పాటించి స్వయముగా వనవాసమునకు ఉద్యుక్తుడు అయ్యెను. వైదిక పరంపర యందు వ్యక్తిగత స్వార్ధము కన్నా సమాజ శ్రేయస్సు, విలువలకి అధిక ప్రాముఖ్యము ఈయబడినది. ఒకరి త్యాగమయి జీవనము వలన సమాజము ఆదర్శవంతముగా నిలబడినచో, సుఖపడినచో సమాజమునకు ఆ వ్యక్తి హోమము కావలసినదియే. శ్రీరాముడు సామాజిక న్యాయమునకై తన జీవితమంతయు త్యాగము చేసినారు. రామాయణమును పఠించువారు, వినువారు రాముని దివ్య ఆదర్శనమును గ్రహించి తన జీవనమునందు కార్యాన్వితము చేయవలసి యున్నది. రాముని

వనవాసమునకు పంపు సమయమున దశరథుడు మూర్చితుడు అయ్యెనని వర్ణింపబడెను. రాముడే ఆ సమస్యకు సమాధానము కనుగొనెదనని నిర్ణయము తీసుకొనలేని దశరథుడు తలంచును. తాను వనవాసమునకు పోయినచో దశరథునికి మృత్యువు సంభవించునని రామునికి తెలియును. అయితే సమాజ ధారణ కొరకై కర్తవ్య పాలన చుక్కాని వంటిది. తాను పూర్ణ పురుషునిగా మారుట అనెడి కైకేయి భావనను రాముడు గౌరవించి పాలించును.

దశరథుడు రాముని వనవాసమునకు ఎంతయో శోకగ్రస్థ మయ్యెను. విహ్వలుడై దశరథుడు అనుచున్నాడు.

**అహం రాఘువ కైకేయ్యా వరదా నేన మోహితః**

**అయోధ్యాయా స్త్వ మేవాద్య భవరాజా నిగృహ్యామామ్**

ఓ రామా! కైకేయకి ఇచ్చిన వరముల ద్వారా నేను మోహమును పొందియుంటిని. నన్ను బంధించి నీవు స్వయముగా అయోధ్యకు రాజువు కమ్ము. రాముడు ఏ విధముగా వినక పోవు సరికి దశరథుడు సుమంత్రుని ఇచ్చి రామలక్ష్మణులను సాగనంపును. (కావున రామ వనవాసానికి దశరథుని అంగీకారము ఉన్నది).

## 2.8 కౌసల్య పరితాపము

మహాపురుషుడగు శ్రీరాముడు కైకేయి అంతఃపురమును వదలి సోదరుడగు లక్ష్మణునితో కూడి మనస్సును ఇంద్రియములను నిగ్రహించుకొని వనవాసమునకు తల్లియగు కౌసల్య అనుమతికై వచ్చి నమస్కారము చేసి తనకు నియమించిన ఆసనంపై కూర్చొండక నిలిచి ఇట్లనెను. అమ్మా! తండ్రి నాకు పదునాలుగు సంవత్సరములు వనవాసము, భరతునికి యువరాజ్య పట్టాభిషేకము అనుజ్ఞ ఇచ్చి యున్నారు. కావున నన్ను వనవాసమునకు అనుమతి ఈయవలసినదిగా ప్రార్ధన. అంత కౌసల్య దుఃఖి అయి రామునితో....

**ఏక ఏవ హి వంధ్యాయాః శోకో భవతి మానసః**

**అప్రజాస్మీతి సంతాపః నహన్యః పుత్ర విద్యతే**

**త్వయి సన్నిహితే ప్యేఽవమ్ అహం  ఆసం నిరాకృతా**

**కిం పునః  ప్రోషితే తాత ధృవం మరణం ఎవ మే**

బిడ్డలు లేని గొడ్రాలికి పిల్లలు లేరు అనే బాధ ఒక్కటే కానీ సంతానము కలిగి ఆ సంతానముచే సుఖము అనుభవింపక భాధపడెడి నా వంటి వాని దుఃఖమునకు అంతులేదు. నేను దశరథుడికి భార్యగా ఉన్నప్పుడు ఏ మంగళమైన ఆనందాన్ని పొందలేదు. ఎందుకంటే ఆయన కైకేయకి వశుడై ఉన్నాడు. కైకేయ మనస్సు నొచ్చుకుంటుందని ఒక జేష్ఠ భార్యకి ఇవ్వవలసిన మర్యాద నాకు ఇవ్వకుండా, కైకేయి యొక్క దాసీజనంతో సమానంగా చూశాడు.

**దశ సప్త చ వర్షాణి తన జాతస్య రాఘువ**

**అసితాని ప్రకాక్షంత్యా మయా దుఃఖ పరిక్షయం**

ఓ! రాఘువా! నీవు యువ రాజువి అయినచో నా కష్టములు అన్నియు కడతేరునని ఆశించి నీవు జన్మించినప్పటి (నీ ఉపనయనము జరిగినప్పటి ) నుండియు ఈ [7]పదిహేడు సంవత్సరములు నిరీక్షించు వచ్చితిని. ఇవ్వాళ నీకు యుక్త వయస్సులో పట్టాభిషేకం జరిగి యువరాజుగా నిలబడితే, నిన్ను చూసి, నీ పరిపాలన చూసి కనీసం రాజమాతగా ఆనందం అనుభవించచ్చు అని అనుకున్నాను. కాని ఇవ్వాళ నాకు ఆ ఆనందం కూడా లేకుండాపోయింది. ఊసర క్షేత్రంలో విత్తనం వేస్తే అవి మొలకెత్తకుండా ఎలా నిష్ప్రయోజనం అవుతాయో, అలా నేను చేసిన వ్రతాలు, పూజలు నిష్ప్రయోజనం అయ్యాయని

[7] బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులకు ఉపనయనము రెండవ జన్మ. విశ్వామిత్రుడు దశరథుని కడకు వచ్చు నాటికి శ్రీరాముని వయస్సు పదునారు సంవత్సరములు. క్షత్రియునకు శిశువు తల్లి కడుపున పడినది మొదలు పదునొకండవ సంవత్సరమున ఉపనయనము చేయవలెనని శాస్త్రోక్తి. అనగా ఆయనకు ఉపనయనానంతరము పదిహేడు సంవత్సరములకు యువ రాజ్య పట్టాభిషేకము చేయవలెనని కౌసల్య మాటలైన దశ సప్త చ వర్షాణి తన జాతస్య రాఘువ అన్నది. అంటే శ్రీరాముని వయస్సు 27 సంవత్సరములుగా గమనించవచ్చు.

అనుకుంటున్నాను రామ! దైవానుగ్రహము నా మీద లేదు. నువ్వు వెళ్ళిపోతే నన్ను ఇక్కడ చూసుకునే వాళ్ళు ఎవరున్నారు. నువ్వు వెళ్ళిపోయాక నేను ఈ రాజ్యంలో ఎవరిని చూసుకొని బతకాలి, అందుకని నేను మరణిస్తాను" అని కౌసల్య అనింది.

## 2.9 లక్ష్మణుడి నిర్వేదము

ఇప్పటిదాకా ఈ మాటలన్నీ వింటున్న లక్ష్మణుడు ఆగ్రహంతో "అన్నయ్యా! నాన్నగారికి వృద్ధాప్యము వచ్చింది కాని కామం తీరలేదు, విషయసుఖాలకి లొంగి కైకేయతో హాయిగా కాలం గడుపుతున్నాడు. ఏ అపరాధం చెయ్యని నిన్ను అడవులకు పంపిస్తున్నారు. నువ్వేమో ధర్మము, పితృవాక్య పరిపాలన అని వెళ్ళిపోతున్నావు. అమ్మ ఇక్కడ ఇంత బాధపడులోంది. చేతకానివాడిలా నువ్వు వెళ్ళిపోవడం ఎందుకు, నువ్వు ఒకసారి "ఊ" అను, నేను నా అస్త్ర-శస్త్రాల చేత ఈ అయోధ్యలోని వారిని ఏనుగుల తొండాలని పర్వతాల్ని పడేసినట్టు పడేస్తాను, భరతుడి పేరు చెప్పిన వాడిని, భరతుడు రాజుగా కావాలన్న వాళ్ళని ఒక బాణంతో కొన్ని వందల మందిని చంపేస్తాను. ఇంతటి ధర్మాత్ముడైన కొడుకిని అడవులకు పంపిస్తున్న ఆ దశరథుడిని బంధించి కారాగృహంలో తోసేస్తాను, లేకపోతే చంపేస్తాను. నిన్ను రక్షించుకోలేకపోతే నీ పక్కన నేను ఉండి ఎందుకు, కావున నాకు అనుమతి ప్రసాదించు" అని అన్నాడు

**ప్రోత్సాహితో యం కైకేయ్యా స దుష్టో యది న పితా**
**అమిత్రభూతో నిస్సంగం వధ్యతాం భాద్యతామపి**
**గురోరప్యవ లిప్తస్య కార్యాకార్య మజానతః**
**ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనం**

కైకేయి ప్రేరణ కారణంగా మన తండ్రి దుష్టుడై మనకు శత్రువు అయినచో ఆయన పై మమకారము వీడి చంపుట కానీ బంధించుట కానీ చేయవలెను. తండ్రియే అయినను గర్వితుడై యుక్తాయుక్త విచక్షణను కోల్పోయి పెడదారి పట్టినప్పుడు

శాశించియే తీరవలెను. శ్రీరాముడు లక్ష్మణుని అనునయించుతూ (ఈ విషయము తరువాత విశ్లేషించుకొందాము) లక్ష్మణా! దైవ నిర్ణయము కాదనలేము కావున నిబ్బరము వహించమని చెప్తాడు. అందుకు లక్ష్మణుడు శ్రీరామునితో అన్నయ్యా! పౌరుషములేని వాని మాటలకు మల్లె మీ వంటి వారు అట్లు పలుకుట తగదు. బృహస్పతి తన శాస్త్రములో బుద్ధిలేనివారికి, పౌరుషము లేనివారికి బ్రతుకుటకు సాధనము దైవము అని చెప్పారు. కావున బలము లేని వారు స్వీకరించవలసినది దైవము. పౌరుషమును నమ్మిన వారి పనులు నెరవేరుట, దైవమును నమ్మిన వారి పనులు నెరవేరకపోవుట మనము చూస్తున్నాము. కావున దైవము శక్తి హీనము. ధర్మమును మిషగా పెట్టుకొని కొందరు జీవించుతూ, నటించుతూ, తమ దోషములను కప్పి పుచ్చు కొనుటకు ప్రయత్నము చేయుదురు. కానీ వారు నిఘూడముగా నీకు అపకారము చేయుచున్నారు అని తెలియుము.

**విక్లబో వీర్యహీనోయః సదైవ మనువర్తతే**
**వీరః సంభావితాత్మాయో న దైవ మనువర్తతే**
**దైవం పురుష కారేణ యస్సమర్ధ ప్రభాదితుం**
**న దైవేన విపన్నార్ధ పురుష సోవ సీదతి**
**న శోభార్దా విమౌ బాహూ న ధనుర్వభూషణాయమే**
**నా సిరాబంధనార్ధాయ నశరాస్తంభహేతవః**

పిరికివాడు, పౌరుషము లేనివాడు దైవమును అనుసరించి ఉండును. వీరులు, ధృడమైన మనోబలముగలవారు పౌరుషములో దైవ బలమును త్రోసి పుచ్చుదురు. నా బాహువులు అందముగా చూచుటకు కాదు. నా భుజమునకు తగుల్చుకొన్న ధనుస్సు ఆభరణము కాదు. వీరుడని చాటుటకు మొలకు కత్తి కట్టుకొనుటకు కాదు. బాణములు అమ్ముల పొదిలో కదలకుండా ఉండుటకు కాదు.

ఎవడు నీకు శత్రువో ఆ శత్రువును శిక్షించుటయే పై నాల్గింటి ప్రయోజనము. కావున అన్నా! ఆజ్ఞాపింపుము.
(ఈ విధముగా వసిష్ఠ మహర్షి చెప్పినట్లుగా పౌరుషమును మాత్రమే నమ్మమని చెప్తాడు.)

**2.10 శ్రీరాముడు కౌసల్యను ఊరడించుట మరియు కౌసల్య మంగళా శాసనములు**

సాధన యందు ప్రగతిని కోరి ముందుకు పోవువాడు ఆర్యుడు. ఆధ్యాత్మిక ఉన్నతిని కోరుకొనక ఆ దిశలో ముందుకు పోనివాడు అనార్యుడు. సుర-అసురులు, ఆర్య-అనార్యులు సాధకుల యందలి మంచి-చెడు వృత్తులు. ఈ విషయము తెలియక కొందరు ఆర్య, అనార్యులని కుతర్కము చేయు చుందురు. రామాయణ మహాగ్రంథము నందలి యోగ రహస్యము సమాజము ముందునకు రావలసిన ఆవశ్యకత ఎంతైనా కలదు.
విలపించుచున్న తల్లియగు కౌసల్యతో ధర్మాత్ముడగు శ్రీరాముడు ధర్మబద్ధముగా ఇట్లు పలికెను.

**నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మామ**
**ప్రసాదయే త్వాం శిరసా గంతు మిచ్ఛా మ్యహం వనం**
**జామదగ్న్యేన రామేణ రేణుకా జననీ స్వయం**
**కృత్తా పరశునారణ్యే పితుర్వచన కారిణా**
**నాహం ధర్మ మపూర్వంతే ప్రతికూలం ప్రవర్తయే**
**పూర్వై రాయ మభిప్రేతో గతో మార్గోనుగమ్యతే**
**అనుమన్యస్య మాం దేవి గమిష్యంత మితో వనం**

అమ్మా! తండ్రి ఆజ్ఞను జవదాటుటకు నేను అశక్తుడను గావున నాకు వనవాసమునకు అనుమతి ఇవ్వుము. పూర్వము మన వంశమునకు చెందిన సగర పుత్రులు తండ్రి అనుమతిని అనుసరించి భూమిని త్రవ్వుచు మృత్యువు

పాలైనారు. నేను అనుసరించుచున్న ఈ పద్ధతి మన ప్రాచీనులు అందరూ ఆచరించారు కావున నేనును అనుసరించుచున్నాను. కావున అమ్మా! నాకు వనవాసమునకు అనుమతి ఇమ్ము. కౌసల్య తాను కూడా వనమునకు వచ్చెదనని అనగా శ్రీరాముడు అనునయముతో ధర్మబద్ధముగా ఇలా చెప్పు చున్నాడు.

**భర్తుః కిల పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః**
**స భవత్యా నకర్తవ్యో మనసాపి విగర్హితం**
**భర్తు శుశ్రూషయా నారీ లభతే స్వర్గముత్తమమ్**
**అపియా నిర్ణమస్కారా నివృత్తా దేవపూజనాత్**

స్త్రీ భర్తను వదలి పెట్టుట అనునది చాలా క్రూరమయినది. అట్టి తప్పు పని నీవు చేయుట తగదు. భర్తకు ప్రియమును కోరుచు, హితమును ఆచరించుచు సేవ చేయుటయే స్త్రీకి ఉత్తమమ ధర్మము. శ్రీరాముడు చివరగా వనవాసమునకే నిశ్చయించుకోవడముతో ... కౌసల్య ధైర్యము చిక్కబట్టుకొని రామునితో, రామా! సంతోషముగా వనమునకు ఏగుము. సన్మార్గమున ప్రవర్తించి శీఘ్రముగా మరలి రమ్ము. నీవు ధైర్యముతో, నియమములతో ఏ ధర్మమును పాలించుచున్నావో ఆ ధర్మము నిన్ను రక్షించుగాక. అని ఇంకను శ్రీరామునికి మంగళా శాసనములు పలుకుచున్నది. ఈ మంగళాశాసనములు ప్రయాణములో పిల్లలకు తల్లులు, దేవాలయములో దేవుడు ఊరేగింపు బయలుదేరు నప్పుడు ఈ శ్లోకములు చదువుట ఆచారము.

**యన్మంగళమ్ సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే**
**వృత్రనాశే సమ భవత్తత్తే భవతు మంగళమ్**
**యన్మంగళమ్ సువర్ణస్య వినతా కల్పయత్ పురా**
**అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్**

**అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్యాయత్**
**అదితిర్మంగళం ప్రాదాత్  తత్తే భవతు మంగళమ్**
**త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణోర మిత తేజసః**
**యదాసీన్మంగళమ్ రామ  తత్తే భవతు మంగళమ్**
**ఋతువస్సాగరా ద్వీపః వేదాల్లోకా దిశశ్చతే**
**మంగళాని మహాబాహో దిశంతు శుభమంగళం**

**2.11 శ్రీరాముడు లక్ష్మణుడికి హితబోధ చేయుట**

లక్ష్మణా! నీవు నా అభిప్రాయము తెలుసుకొనకుండా అమ్మకు దుఃఖము కలుగునట్లు మాట్లాడితివి. సత్యమునకు ఇంద్రియ నిగ్రహమునకు విరుద్ధముగా మాట్లాడితివి.

**ధర్మోహి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్**
**ధర్మ సంశ్రిత మేతచ్చ పితుర్వచన ముత్తమమ్**

లోకములో పురుషార్థములలో ధర్మము  ప్రధానమైనది. సత్యము ధర్మము నందే ఆధారపడి ఉన్నది. పితృవాక్య పాలన ధర్మమును సిద్ధింపచేయును. ధర్మమునకు విరుద్ధముగా వారిని బంధించి రాజ్యమును స్వీకరించుట దుష్టమైన మార్గము. అట్టి దానిని పెద్దలు హర్షించరు. ధర్మమునకు ఫలము సుఖము. అర్థము, కామము కూడ సుఖమును కల్గించును. కానీ అవి ధర్మమును అనుసరించినప్పుడే సుఖమునకు సాధనములు గాని లేనిచో అవి అల్పము, నశ్వరమగు సుఖము హానినే ఒసంగును. కావున ధర్మము ఒక్కటే మూడు పురుషార్థములైన ధర్మార్థకామములను ఒసగును.

**ధర్మార్థ కామాఖలు తాతలోకే సమీక్షితా ధర్మఫలోదయేషు**
**తేతత్ర సర్వేష్యు రసాన్నివిష్టా భార్యేవవశ్యా అభిమతానుసుపుత్రా**
**యస్మింస్తు సర్వేస్యు రసన్ని విష్టా ధర్మోయత స్స్యాత్తదుపక్రమేత**
**ద్వేషయో భవత్యర్థపరోహి లోకే కామాత్మతా ఖల్వపైన నాప్రశస్తా**

**సుఖదుఃఖే భయక్రోధౌ, లాభాలాభౌ భవాభవౌ**

**యచ్ఛకించిత్తథా భూతం, నను ధైవస్య కర్మ తత్**

**విమృజ్య భాష్పమ్ పరిసాంత్వ్య చాసకృత్, స లక్ష్మణం రాఘువ వంశవర్ధనః**

**ఉవాచ పిత్రో: వచనే వ్యవస్థితం, నిబోధ మామేవ హాయ్ సౌమ్య సత్పధః**

ఏ కర్మ ఆచరించినచో ధర్మార్ధకామములు లభించునో అట్టి కర్మను ఆచరించ వలెను. లక్ష్మణా! దశరథుడు మనకు శాసించెడి రాజు, హితమును కోరెడి తండ్రి కావున వారి ఆజ్ఞ శిరోధార్యము. సత్య వాక్యమును పాలించెడి తండ్రి మాటను నిలబెట్టే అవకాశము వచ్చినందుకు సంతోషింపుము. నా వనవాస కారణము తండ్రి, కైకేయి కారణము కాదు. ఇది అంతయు దైవ ప్రభావము, కాల ప్రభావము. సమస్త ప్రాణులకు కలిగే సుఖదుఃఖములకు శాంతి క్షోభములకు, లాభనష్టసములకు, ఉత్పత్తి వినాశనములకు కారణములన్నియు దైవ నిర్ణయములే. అందువలన నీవును నా వలననే పరితాపము చెందకుము. లక్ష్మణా! తండ్రిగారి మాటను పాలించుటయే నాకు అభిమతము, అదియే సత్యపథము, అదియే మంచి మార్గము. కావున నా స్వభావమును తెలుసుకొని ప్రవర్తింపుము.

ఇక్కడ గమనించినట్లయితే యోగవాసిష్ఠములో వసిష్ఠ మహర్షి చెప్పిన దానికి విరుద్ధముగా పౌరుషము కన్నా దైవమునకే శ్రీరాముడు అధిక ప్రాధాన్యత ఇచ్చినాడా అనే సందేహము కలుగ గలదు. సత్య వాక్య పరిపాలన రఘువంశజుల నైజము. సత్యమును అనుసరించితే మిగిలినవి తమంతట తామే సిద్ధించును. హరిశ్చంద్రుడు సత్యము కోసము తన రాజ్యాన్ని, భార్యా పిల్లలను పోగొట్టుకున్నారు. అలా సత్యము కోసము నిలబడిన మహాపురుషులు ఎందరో ఉన్నారు. పౌరుషము (పురుష ప్రయత్నము) సత్యమును అనుసరించియే ఉండాలి. అలా లేనట్లయితే అది పశు బలము అవుతుంది కానీ సత్యముతో కూడిన పౌరుషము కాదు. పెద్దవాడు, రాజు, తండ్రి అయినటువంటి దశరథుని సత్య

వాక్య పాలన జరుగ వలసినదియే. లక్ష్మణుడు చెప్పినట్లు పౌరుషము అనే మిషతో సత్య వాక్య పాలనకు భంగము కలిగించ రాదు. ఇక్కడే శిష్య ప్రజ్ఞ తెలియు చున్నది. వసిష్ఠ మహర్షి చెప్పిన దైవము, సత్యము, పౌరుషము, ధర్మము మొదలుగాగల వాటికి మధ్య తారతమ్యము శ్రీరాముడికి అవగాహన అయినట్లుగా లక్ష్మణుడికి అవగాహన లేదు. కావుననే లక్ష్మణుడితో శ్రీరాముడు లక్ష్మణా! తండ్రిగారి మాటను పాలించుటయే నాకు అభిమతము, అదియే సత్యపథము, అదియే మంచి మార్గము. కావున నా స్వభావమును తెలుసుకొని ప్రవర్తింపుము అని నర్మగర్భంగా చెప్తాడు.

**2.12 శ్రీరాముడు సీతకు తన వనవాసము గురించి చెప్పుట**

ఆ విధముగా శ్రీరాముడు తల్లి కౌసల్య ఆశీస్సులు పొంది , ధర్మబద్ధమైన మార్గమును వీడని వాడై తన ధర్మ పత్ని అయిన సీతకు తన తండ్రి అయిన దశరథుని ఆనతి మేర వనవాసమునకు పోవుచున్నాను అని తెల్పి వనవాసమునకు వెళుతూ ఒకసారి చూచిపోదామని వచ్చాను అని చెప్తాడు. ఇంకా సీతకు చెప్తూ....

**భారతస్య సమీపే తు నాహం కథ్య: కదాచన**
**బుద్ధి యుక్తాహి పురుషా: న సహంతే పరస్త్వం**
**తస్మన్నతే గుణాః కథ్యా భరత స్యాగ్రతోమమ**
**విప్రియం నచ కర్తవ్యం భరతస్య కదాచన**
**సహిరాజా ప్రభుశ్చైవ దేశస్యచ  కులస్యచ**
**ఆరాధితాహి శీలేన ప్రయత్నైశ్చోప సేవితా**
**రాజానస్సంప్రసీదంతి ప్రకుప్యంతి విపర్యయే.**

సీతా! బుద్ధిమంతులగు పురుషులు ఒకరి స్తోత్రమును విని సహింపలేరు. కనుక నీవు భరతుని ఎదురుగా నా గుణములను ప్రశంసించరాదు.ఇప్పుడు దేశమునకు, కులమునకు ప్రభువు భరతుడు కాన అప్రీతి కలుగకుండ మెసలుకొమ్ము. రాజుల

మనోభావాలను గుర్తించి వారికి అనుకూలముగా ప్రవర్తించుతూ గౌరవంగా సేవించినట్లయితే వారు ప్రసన్నులై యుందురు.
ఈ విధముగా శ్రీరాముడు సీతమ్మ మనసులోని భావములను తెలిసికొనుటకు గంభీరంగా మాట్లాడినాడు.
అప్పుడు సీత రామునితో మీరు లేకుండా సుఖములే తప్ప దుఃఖములు లేని స్వర్గములో ఉన్నా నాకు రుచించదు.

**అహం గమిష్యామి వనం సుదుర్గమమ్**

**మృగాయుతం వానర వారణై ర్యుతం**

**వనే నివాత్స్యామి యథా పితురగృహే**

**తవైవ పాదా ఉపగృహ్య సంయతా**

వేలకొలది మృగములు వానరములు నిండిన వనమునకు నేను కూడా వచ్చెదను మీ పాదములు నాకు రక్ష.
అప్పుడు రాముడు సీతతో, సీతా! ధర్మమును మీరలేక నేను అరణ్యమునకు ఎగుచుఁ నీ అభిప్రాయమును తెలుసుకొనకుండా రమ్మనుట తగదని వలదంటిని. ఇప్పుడు నీ నిశ్చయము తెలిసినది కావున నాతో అరణ్యవాసమునకు రావలసినదని చెప్పెను.

### 2.13.1 రామ గుహుల కలయిక

ఆ విధముగా శ్రీరాముడు, సీతా, లక్ష్మణులతో కలసి కోసలరాజ్య సరిహద్దుకి చేరుకున్నారు. అక్కడికి వచ్చాక ఆ అయోధ్యా నగరానికి రథం దిగి ఒకసారి నమస్కారం చేసి ఇలా అన్నాడు....

**ఆపృచ్ఛే త్వాం పురీశ్రేష్ఠే కాకుత్స్థపరిపాలితే |**

**దైవతాని చ యాని త్వాం పాలయంత్యావసంతి చ ||**

"ఓ అయోధ్యా! పూర్వం మా కాకుత్స వంశంలోని ఎందరో రాజులు నిన్ను పరిపాలించారు. ఇటువంటి అయోధ్యా నగరాన్ని విడిచి, ధర్మానికి కట్టుబడి 14 సంవత్సరాలు అరణ్యాలకి వెళుతున్నాను. తిరిగి నేను ఈ అయోధ్య నగరంలో ప్రవేశించి, మా తల్లిదండ్రుల పాదములకు నమస్కరించే అదృష్టాన్ని నాకు ప్రసాదించు " అని వేడుకున్నాడు. తరువాత వాళ్ళు ఆ కోసల దేశ సరిహద్దుల్ని దాటి గంగా నదీ తీరాన్ని చేరుకున్నారు. అక్కడ ఒక ఇంగుదీ (గార) వృక్షం యొక్క నీడలో అందరూ కూర్చున్నారు.

**తత్ర రాజా గుహో నామ రామస్య ఆత్మ సమః సఖా**

**నిషాద జాత్యో బలవాన్ స్థపతిః చ ఇతి విశ్రుతః**

ఆ ప్రాంతాన్ని శృంగిబేరపురము అని పిలుస్తారు, ఆ ప్రాంతానికి నిషాదుడైన గుహుడు అధిపతి. అతడు శ్రీరామునికి భక్తుడు, ఆత్మీయుడు, మిత్రుడు. ( తమ ధర్మాన్ని పాటించే వాళ్ళందరూ రాముడికి ఆత్మతో సమానమైన స్నేహితులే). గుహుడు నిషాద జాతి వాడు, చతురంగ బల సంపన్నుడు. అతడు పరుగు పరుగున వచ్చి, రాముడిని గట్టిగా కౌగలించుకొని ఇలా అన్నాడు......"రామా! ఇది కూడా నీ రాజ్యమే, ఇది కూడా నీ అయోధ్య అనే అనుకో. నీకోసమని రకరకాల పదార్థాలు, అన్నరాసులు తీసుకొచ్చాను, తీసుకో రామా" అన్నాడు.

**గుహం ఏవ బ్రువాణం తం రాఘవః ప్రత్యువాచ హ**

**అర్చితాః చైవ హృష్టాః చ భవతా సర్వథా వయం**

**పద్భ్యాం అభిగమాచ్ చైవ స్నేహ సందర్శనేన చ**

అప్పుడు రాముడు గుహా! నీవు ఇంతదూరం వచ్చి స్నేహ సద్భావములను ప్రకటించితివి. నీవు చూపిన ప్రేమాభిమానాలు మాకు సకల సత్కార్యాలు. మేము ప్రసన్నులమైతిమి. ఆ రోజున గుర్రాలు సేద తీరాక, ఆ ఇంగుదీ వృక్షం కింద సీతారాములు పడుకున్నారు. మరునాడు ఉదయం గుహుడు తీసుకొచ్చిన పడవ

ఎక్కి సీతారామలక్ష్మణులు గంగని దాటడానికి సిద్ధపడుతున్నారు. అప్పుడు రాముడు గుహుడిని పిలిచి...

**నేదానీం గుహ యోగ్యోయం వాసోమే సుజానే వనే**
**అవశ్యం హ్యాశ్రమే వాసః కర్తవ్యస్థగతో విధి:**
**తత్ క్షీరం రాజ పుత్రాయ గుహః క్షిప్రం ఉపాహరత్**
**లక్ష్మణస్య ఆత్మనః చైవ రామః తేన అకరోజ్ జటాః**

"గుహా! జనసమ్మర్ధము గల ఈ ప్రదేశములో మా తండ్రి ఆజ్ఞను అనుసరించి నేను ఉండతగదు. ఇకనుంచి నేను ఒక తపస్వి ఎలా బతుకుతాడో అలా ఆశ్రమంలో బతకాలి. అందుకని నువ్వు నాకోసం మర్రి పాలు తీసుకురా" అన్నాడు. అప్పుడు రాముడు గుహుడిని ఆ మర్రిపాలని తన తల మీద, లక్ష్మణుడి తల మీద పొయ్యమన్నాడు. మర్రిపాలు పోశాక జిగురుతో ఉన్న ఆ జుట్టుని జటల కింద కట్టేసుకున్నాడు. అక్కడున్న వాళ్ళందరూ రాముడి యొక్క ధర్మనిష్ఠకి ఆశ్చర్యపోయారు. అప్పుడు రాముడు "నేను ఈ 14 సంవత్సరాలు నా క్షాత్ర ధర్మాన్ని పాటిస్తూ, బ్రహ్మచర్యంతో కూడిన అరణ్యవాసాన్ని చేస్తాను " అన్నాడు. తరువాత రాముడు లక్ష్మణుడిని పిలిచి "ముందు మీ వదినని పడవ ఎక్కించి నువ్వు ఎక్కు " అని చెప్పి, వాళ్ళు పడవ ఎక్కాక ఆయన కూడా పడవ ఎక్కాడు. అలా సీతారామలక్ష్మణులు గంగని దాటి ఆవలి ఒడ్డుకి వెళ్ళారు. అక్కడినుంచి అలా కొంత దూరం వెళ్ళాక చీకటి పడేసరికి వాళ్ళందరూ ఒక చెట్టు కింద విడిది చేశారు.

### 2.13.2 రామ గుహుల కలయిక యందలి యోగ రహస్యము

పై కథ యందలి యోగ రహస్యమును పరిశీలన చేద్దాము.

కోసల రాజ్యము అనగా సాధకుడు కుశలత పూర్వకముగా సాధన చేసే అవస్థ. సాధనా కాలములో పొందెడి మరింత ప్రగతిని శృంగిబేరపురము అనవచ్చు. అట్టి

రాజ్యమునకు అధికారి గుహుడు ఒక నిషాదుడు. నిషాదుడు అనగా రాత్రి యందు సాధన చేయుచు ప్రగతిని పెంచుకొనుచు సమాజమునకు మేలు చేయువాడు. గుహ అనగా పర్వత గుహ. సాధకుని యందలి సుషుమ్న నాడియే అట్టి గుహ. మేరుదండ శివ ధనస్సును సంయమనం చేసిన తర్వాత రాత్రి సమయపు సాధన రామ సాధకునికి అవసరమై యున్నది. సాధనా క్షేత్రము యొక్క పరావస్థ యందున్న మహా విశ్వమునకు ద్వారము సుషుమ్న. రాత్రి యందలి సాధన ద్వారా యోగులకు ఇది సిద్ధించును. ప్రపంచము అంతయు నిదురించు సమయమున యోగి తన సాధనలో యుండును. **యానిశా సర్వ భూతానాం, తస్యాం జాగర్తి సంయమీ** అనునది ఉపనిషత్ వాక్యము.

**2.14.1 చిత్రకూటమి**

అయోధ్యయే వైకుంఠము. అరణ్యమే సంసారము. మధ్యన ఉన్న గంగానదియే విరజా నది. వైకుంఠము నుండి భగవానుడు విరజను ధాటి సంసారములోకి వచ్చినట్లు శ్రీరాముడు అయోధ్యను వదలి గంగను దాటి సంసారము వంటి వనములో చేరినారు. ఇంక సీతను, మునిపుంగవులను, సాదు జనులను రక్షింప వలెను. సీతారామ లక్ష్మణులు ఆ రాత్రి ఆ చెట్టు కిందనే గడిపి మరునాడు ఉదయముననే గంగా యమునలు కలిసెడి త్రివేణి సంగమము (నేటి ప్రయాగ) కు చేరుకొన్నారు. అక్కడి సమీపముననే భరద్వాజాశ్రమము ఉంది. రాముడు, సీతా లక్ష్మణులతో భరద్వాజాశ్రమమునకు వెళ్లి వినయ పూర్వకముగా నమస్కరించి తమను తాము పరిచయము చేసుకొనెను. అప్పుడు మహర్షి శ్రీరాముని ఆశ్రమములోనే ఉండమని కోరగా అందుకు శ్రీరాముడు సున్నితముగా తిరస్కరించి మహర్షీ! మాకు ఏకాంతమగు ప్రదేశమున ఆశ్రమమును నిర్మించుకొని ఉండుటకు అనుగ్రహించి నిర్ణయము చేయవలసినదిగా కోరాడు. అందుకు మహర్షి సంతసించి చిత్రకూటమి అనువుగా ఉండునని చెప్పాడు. మరునాడు

ఉదయము సీతారామ లక్ష్మణులు చిత్రకూటమికి వెళ్లి అక్కడ ఒక పర్ణశాల ఏర్పరుచుకొని ఆనందముతో అచట విహరించు చుండిరి.
చిత్రకూటమిని గురించి తులసీదాసు ఈ విధముగా వచించెను. “चित्रकूट के घाट पर हुई संतन की भीड़, तुलसीदास चन्दन घिसे, तिलक देते रघुबीर.

**2.14.2 చిత్రకూటమి యొక్క యోగ రహస్యము**

వాల్మీకి భావన యందు చిత్రకూటమనగా సాధన యందు అనుభవమైన అవస్థ. సాధన చేయు కాలము నందు ఒక విధమైన "దృశ్యాను విద్ధ" అవస్థ యందుండి విభిన్న ప్రకారముల సజీవ ఆకారములను (చిత్రములను) సాధకుడు తన కనుల ముందు కాంచు చుండును. భావనా ప్రధాన సాధకుడు ఈ విధమైన భావ చిత్రములను తప్పక చూడును. కానీ వాటి యందున్న అంతరార్ధము బోధ పడదు. ఈ భావ చిత్రములు (కూట చిత్రములు) చాలా విలక్షణముగా ఉండును. ఈ కూట చిత్ర అవస్థయే చిత్రకూటము. (భ్రుకుటి యందు ఓంకారం గాని మరియేదైన ఇష్ట దేవతను ఊహించి సాధన చేయుచున్నప్పుడు సాధన స్థిరము అయ్యేంతవరకు అనేకమైన రంగుల ప్రపంచం కనపడుట మనకు అనుభవమే. అట్టి రంగుల ప్రపంచం నుంచి సాధకుడు బయిట పడాలి. శ్రీరాముడు ఇట్టి చిత్రకూట అవస్థ నుంచి సాధనలో ఇంకా ముందుకు వెళ్ళాల్సి ఉంటుంది. తరువాత కఠినమైన పంచప్రాణ సాధన అయిన పంచవటికి ప్రయాణం కావాల్సి ఉంది. ఈ విషయమై రాబోవు కథా సందర్భంలో విశ్లేషించుకొందాము.)

**2.15 భరతుని చిత్రకూట సందర్శన - అందలి యోగ రహస్యము**

మనలో రెండు సంపదలు ఉన్నాయి. ఒకటి దైవీ సంపద. రెండవది అసురీ సంపద. దైవీ సంపద అంతర్ముఖము చేయును. అసురీ సంపద బయటవైపు ప్రవర్తింప చేసి లోనున్న దానిని మరుగు పరచును. ఈ దైవీ సంపద పెరుగుట కొరకే ఉద్దేశింపబడినది మానవ శరీరము. ఇది సాధన క్షేత్రము. దీనితో దానిని (దైవీ సంపద ) సాధించకుండా పూర్వ వాసనా (గత జన్మ వాసనలు) బలము వలన

సర్వ ప్రపత్తులకు శరీరము మూలమని, శరీరము తాను అని, శరీరమునకు చెందినవి తనవని, తన కొరకని అభిమానించుటయే బంధము. మనలోని దైవీ సంపద పెరిగితే బంధముండదు. రామ రూప సాధకుడు వనమునకు పోయి తపస్సు ద్వారా ఆనందమును ప్రాప్తించుకొనవలెనని కోరుకొన్నందున శరీర భావముతో భోగముల ద్వారా ఆనందమును పొందవలెనన్న దశరథుని మరణము స్వాభావికము. రామా! రామా! అనుచు దశరథుడు మరణించెను. అయోధ్యకు రాజు లేరు. ఆ సందర్భమున రాజులేని కారణంగా కుల గురువైన వసిష్ఠ మహర్షి భరతుడు రాజు కావలెనని సలహా నిచ్చెను. భరతుడిని పిలిపించిరి. భరత, శత్రుఘ్నులు అయోధ్యకు ఏతెంచి అచ్చటి శోకావస్థను తిలకించిరి. కారణము తెలిసినవాడై భరతుడు తల్లి అయిన కైకేయిని ఎంతయో నిందించెను. రాజగుటకు ఇష్టపడలేదు. శత్రుఘ్నుడైతే క్రోధుడై మంధరను హింసించుటకు సిద్ధపడెను. అయితే భరతుడు వారించి ఆర్యజనులకు, స్త్రీ, బ్రాహ్మణులకు హింస తగదని దానిని రాముడు మెచ్చడని చెప్పి శాంతిప చేసెను. భరతుని ఆదర్శమెంతయో శ్రేష్ఠమైనది. లభించిన రాజ్యమును స్వీకరించుటకు సిద్ధపడడు. లోభముతో ఏదైనను జరుగును. కానీ వైరాగ్య వృత్తి రూప భరతుడు నైతిక విరుద్ధముగా రాజ్యమును స్వీకరించుటకు ఇష్టపడడు. మంధర, కైకేయిల ఉద్దేశ్యము మంచిదే. ద్వందము లేని అయోధ్యకు వైరాగ్య వృత్తిలో ఉన్న భరతుడు రాజు కావలెనని ప్రణాళికను వేసిరి. భరతుడు రాముని వెనుకకు పిలుచుటకై రాముడు పోయిన మార్గముననే వనమునకు పోయెను. రాముని రాజ్యమును అధిష్టించుటకు వైరాగ్య జ్ఞానరూపి అయిన భరతుడు ఇష్టపడడు. అది అన్యాయము, అధర్మముగా తోచెను. రాజ్యము ఆనంద రూప రామునిది కానీ వైరాగ్య రూప భరతునిది కాదు. అందుచేత రాముని రాజ్యమును రామునికి ఇచ్చుట కొరకు దండకారణ్యము లోని చిత్రకూటమికి చేరుకొనెను.

## 2.16 శ్రీరాముడు భరతునికి రాజనీతిని బోధించుట

నారచీరలు ధరించి జటాధారియై సాగిలపడి నమస్కరించుచు దీనావస్థలో ఉన్న భరతుని చూచి అతనిని కౌగలించుకొని కుశల ప్రశ్నల తర్వాత భరతుడు రాజ్యమును స్వీకరించి ఉండునని మిషతో శ్రీరాముడు ఇట్లు రాజనీతిని బోధించు చున్నాడు. (ఈ రాజనీతి చాలా ప్రసిద్ధము. ఇప్పటికి అనుచరణ యోగ్యమే).

- వైదిక కార్యములకు ఉపద్రష్ట అయిన పురోహితుని సరి అయిన వారిని నియమించావా! అట్టి వారి వలన యజ్ఞయాగాది క్రతువులు చెయ్యడం వలనే ఈశ్వరుడి కృప లభించి, వేళకి వర్షాలు పడతాయి.
- మంచి ధనుర్వేదాచార్యుడు, సకల నీతి శాస్త్రము (రాజనీతి కూడా) రాజ్య పాలనలో సహాయము చేయగల మంచి ఉపాధ్యాయుని నియమించావా!
- పరాక్రమములో, రాజ కార్య విచారణలో, నిర్వహణలో తన (రాజు) వలె అలోచించి, నెరవేర్చగల మరియు ఉత్తమ కులము నందు జన్మించిన, శీలవంతులైన మంత్రులను నియమించు కొన్నావా?
- రాజు ఎక్కువగా నిద్రకు లొంగకుండా రాజకార్యమును గోప్యముగా మంత్రులతో కూడి సమిష్టి నిర్ణయము అర్ధరాత్రి చేయ వలెను. చేసిన నిర్ణయము విలంబము లేకుండా వెంటనే చేయుట వలన కావలసిన ఫలితము సిద్ధించును. రాజకీయ నిర్ణయములు చేయునప్పుడు అందరిని చేర్చుకొనరాదు.
- మంత్రులకు ఉపధ పరీక్షలు నిర్వహిస్తున్నావా (ఉపధ పరీక్షలు అంటే రహస్య పరీక్షలు).
- సేవకులలో మూడు రకాల వారు గలరు. అట్టి సేవకులకు సరి అయిన పని అప్పచెప్తున్నావా?

- రాజు యొక్క తీర్పు విషయములో, వాటి అమలు విషయములో ప్రజల నుంచి వ్యతిరేకత రాకుండా చూచుకొనుచున్నావా? అట్టి వాటి విషయములో నీకు సరి అయిన సలహాలు నీ మంత్రుల నుంచి అందుతున్నావా?
- యజ్ఞము చేయించు బ్రాహ్మణులను, బలాత్కారముగా స్త్రీలను వశపరచుకొనుట (బలవంతముగా అనురక్తిని కలిగించుకొనుట కానీ రాక్షసంగా వశపరచుకొనుట కాదు) ఎలా సాధ్యము కాదో, అలాగే రాజు బలవంతము చేసి, అధిక పన్నులు వసూలు చేసి ప్రజలను తన వైపు త్రిప్పుకొనలేడు. వారిని రక్షించి, లాలించి తన వైపుకు త్రిప్పుకొనవలెను.
- సామ, దాన, భేద, దండోపాయములు ఉపయోగించి రాజును లొంగదీసుకోవలెనని ప్రయత్నించు వారి పట్ల జాగరూకతతో ఉండవలెను.
- రాజు పైన మంచి ప్రేమ గలవాడు, ధనాశ లేనివాడు, రాజ క్షేమము ప్రధానమని భావించే వైద్యుని నియమించుకొని అతనిని కనిపెట్టుకొని ఉండవలెను.
- చాడీలు చెప్పే వారిని చేరదీయ రాదు.
- ధనమునకు, స్త్రీకి, లొంగని పరిశుద్ధమైన స్వభావము గలవాడు, ప్రభువు నందు విస్వాసము గల సేనాపతిని నియమించుకోవాలి.
- సైనికులలో అత్యంత ప్రధానమైన వారు, బలశాలురు, ముఖ్యమైన వారికి సరి అయిన సమయములో సత్కరించు చున్నావా? అలాగే సైనికులకు ఈయవలసిన జీతభత్యాలు సరి అయిన సమయములో చెల్లింపులు చేస్తున్నావా?

- దూత (రాయబారి) లను స్వదేశీయులను, రాజ కార్యము నెరవేర్చుటలో సమర్థుని, సమయానుకూలంగా ప్రవర్తించుతూ రాజ సందేశమును నిర్భయముగా చెప్పు వారిని నియమించుకొన్నావా?
- గూఢచారులను దేశములోని రాజుల వద్ద, శత్రువుల వద్ద మొత్తము పదునెనిమిది స్థానములలో, నియమించిన చారులలో ఒకరికి ఒకరు తెల్వకుండా నియమించవలెను. ఆ పదునెనిమిది స్థానములు ..... స్వదేశము నందు, శత్రు రాజ్యము నందు ... మంత్రులు, పురోహితులు, యువరాజు, అర్థ సంచయ కర్త, కార్య నియోజకుడు, ప్రవివాకుడు, కారాగారాధిపతులు, సేనానాయకుడు, సేనాధ్యక్షుడు, కర్మాంథికుడు, సభ్యులు, ధర్మాధ్యక్షులు, దండపాలురు, దుర్గపాలురు, సూతులు, దౌవారికుడు, అంతర్వంశికుడు, రాష్ట్రాంతపాలురు. అయితే తన రాజ్యములో మంత్రుల వద్ద, పురోహితుల వద్ద, యువరాజు వద్ద చారులను నియమించకుండా రాజే స్వయముగా కనిపెట్టుచుండ వలెను.
- నాస్తికులను రాజు దగ్గరకు చేరనీయ రాదు.
- అయోధ్యా నగరము చాలా ప్రసిద్ధమైనది. అది శత్రు దుర్భేద్యము, మన రాజ్యములో అనేక రకములైన నాగరీకులు తమ తమ వ్యాపారములు నిర్భీతితో, న్యాయముగా చేసుకొనుచున్నారు. మంచి రాజుల పరిపాలన వలన ప్రజల ఆరోగ్యము ఎల్లప్పుడును ఉండును. ఎన్నో దేవాలయములు, చలివేంద్రములు, పెద్ద పెద్ద జలాశయములు కలవు. వర్తకులు బజారులో వర్తకము చేసుకొనుటకు వీలుగా అనేకమైన సంతలు కలవు. దేవమాత్రుకములగు (వర్షము పైన ఆధార పడెడి) భూములు గాకుండా నదీమాతృకములగు భూములే కలవు. కృషి, గోరక్ష

రాజ్యమునకు జీవనాడి. నీవు అలంటి వాటి విషయములో జాగరూకతతో ఉన్నావు కదా!

- ప్రతి రోజు ఉదయమున రాజు ప్రజలకు, సభ్యులకు, సామంతులకు కనపడినప్పుడు అలంకరించుకొని దర్శనము ఈయవలెను.
- అంతఃపుర స్త్రీలను భద్రముగా చూచుకొనుచున్నావా?
- ఖర్చు ఆదాయమునకు మించకుండా ధనాగారమును చూచుకొనవలెను.
- దండ శాస్త్రము బాగుగా ఎరిగిన వారిచే తగు జాగురూకతతో దండమును విధించవలెను.
- పూర్వాహ్నము నందు ధర్మమును, అపరాహ్నము నందు ధనార్జనను, సాయంకాలమున సుఖమును అనుభవించ వలెను.
- రాజ్య పాలన చేయు రాజు పదునాల్గింటిని వదల వలెను. అవి ఏమనగా ... నాస్తిక్యము, అనృతము, క్రోధము, ప్రమాదము, దీర్ఘ సూత్రత జ్ఞానము కలవారిని దర్శింపకుండుట, ఆలస్యము, పంచవృత్తిత, రాజ కార్యముల విషయములో మంత్రులతో సమిష్టి నిర్ణయము గాకుండా తానొక్కడే ఆలోచించుట, విషయముల యెడ అవగాహన లేని వారితో సమాలోచనలు చేయుట, నిశ్చయించిన పనులను వెంటనే ప్రారంభింపకుండుట, రహస్య విషయములను దాచలేక పోవుట, మంగళకరమైన ఆచారములు పాటింపకుండుట, పెక్కు మంది శత్రువులపై ఒకేసారి దండెత్తుట.

శ్రీరాముడు ఇంకను ఇలా బోధిస్తున్నాడు. ...

**దశపంచ చతుర్వర్గాన్ సప్తవర్గం చ తత్వతః**

**అష్టవర్గం త్రివర్గం చ విద్యాస్త్రిశ్చ రాఘువ**

**ఇంద్రియాణాం జయం బుధ్వా షాడ్గుణ్యామ్ దైవమానుషం**

**కృత్యం వింశతివర్గం చ తథా ప్రకృతిమండలం**
**యాత్రాదండవిదానం చ ద్వియోని సంధీవిగ్రహౌ**
**కచ్చి దేతాన్ మహాప్రాజ్ఞ యథాన రానుమన్యసే**

- దశ వర్గము (వేట, జూదము, పగటి పూట నిద్రించుట, ఇతరులను నిందించుట, స్త్రీ వ్యామోహము, మధ్య పానము, నృత్య, గీత, వాద్యముల యందు అమిత వ్యామోహము, వ్యర్ధముగా తిరుగుట-ఈ పదింటిని త్యజింపవలెను),
- పంచ వర్గము (వీటినే పంచ దుర్గములు అందురు. జల దుర్గము, పర్వత దుర్గము, వృక్ష దుర్గము, ఐరిణ దుర్గము లేదా చౌటి పర్రలతో కూడిన దుర్గము, దానవ దుర్గము లేదా ఎడారి దుర్గము-ప్రకృతి సిద్ధములైన ఈ దుర్గములను రాజు సమయోచితముగా ఉపయోగించుతూ ఆత్మ రక్షణ చేసుకొని వలెను.),
- చతుర్వర్గము/చతుర్విధ మిత్రులు (సామ, దాన, బేధ, దండోపాయములు/ రక్త సంబంధముతో ఏర్పడిన వారు, వివాహాది సంబంధముతో కలసిన వారు, వంశక్రమాగతముగా ఉండెడి వారు, ఆపదల (వ్యసనముల) నుండి రక్షించిన వారు-ఈ నాలుగు విధముల వారు చతుర్విధ మిత్రులు),
- సప్త వర్గము (రాజు, మంత్రి, రాష్ట్రము, దుర్గములు, ధనాగారము, చతుర్విధ సేనలు, మిత్రులు-రాజ్యమునకు ఇవి సప్తఅంగములు, పరస్పరోపకారములు),
- అష్టవర్గము (చాడీలు చెప్పుట, తొందరపాటు, ద్రోహ చింతన, ఈర్ష్య, అసూయ, మంచి గుణములను సైతము దోషములుగా చిత్రించుట,

కఠినముగా మాట్లాడుట, నిష్కారణముగా శిక్షించుట -ఇవి క్రోధము వలన కలుగును కావున త్యజింప వలెను),

- త్రివర్గము (ధర్మార్థకామములను 'త్రివర్గము' అందురు. ఈ మూడు పురుషార్థములను సాధింప వలెను. ఉత్సాహ శక్తి, ప్రభు శక్తి, మంత్ర శక్తి ఈ మూడింటిని తెలిసి యుండ వలెను. శత్రువుల యొక్క ఉనికి, వృద్ధి, క్షయము వీటిని గమనిం చు చుండ వలెను. అసాధ్యమైన కార్యములకు పూనుకొనుట, సాధ్యమైన కార్యముల విషయమున అవి తనకు అసాధ్యమని భ్రమ పడి వాటికి ప్రయత్నింపకుండుట, సాధ్యమైన కార్యములకు అకాలము యందు ప్రయత్నించుట- ఈ మూడును త్రివిధమైన కార్య వ్యసనములు - వీటిని పరిత్యజించి వలెను), మూడు విద్యలు (త్రయీ, వార్తా, దండనీతులు. ఋగ్యదుసామవేదములకు "త్రయి" అని వ్యవహార సిద్ధి, కృషి, గోరక్షాదులు వార్తలో అంతర్భాగములు, దండనీతి అనగా నీతి శాస్త్రము), బుద్ధి ద్వారా ఇంద్రియములను జయించుట,
- షాడ్గుణ్యము (శతృవునితో ఒడంబడిక చేసుకొనుట "సంధి", రిపు విరోధము "విగ్రహము", శతృవునిపై దండెత్తి వెళ్ళుట "యానము", అనుకూల కాలమునకై ఎదురుచూచుట "ఆసనము", బలవంతులు, బలహీనులు అను రెండు రకాలైన శత్రువులతో మాటలతో మంచిగా ఉండుట "ద్వైదీ భావము", బలవంతుని ఆశ్రయించుట "సమాశ్రయము", అనునవి "షాడ్గుణ్యము"),
- దైవీమానుష బాధలు (దైవిక బాధలు, మానుష బాధలు ఐదేసి విధములు. అగ్ని బాధ, వరదలు, వ్యాధులు, కరువుకాటకములు, మరణము - అనునవి ఐదు దైవిక బాధలు, అధికారులు, దొంగలు,

శత్రువులు, రాజునకు సన్నిహితులు, దురాశాపరుడైన రాజు - ఈ ఐదు విధములైన వారివలన వచ్చేది బాధలు మానుష బాధలు),

- రాజు ఆచరించవలసిన కృత్యములు (శత్రుపక్షము నందలి - వేతనములు దొరకని వారిని, అవమానింపబడిన అభిమాన వంతులను, ఆకారణముగా యజమాని కోపమునకు గురైన వారిని, బెదిరింపబడిన ధీరులను - ఈ నాల్గు విధములైన వారిని వారి అభిమతములను తీర్చుచు తన వైపునకు త్రిప్పుకొనుట "రాజకృత్యము"),
- వింశతి వర్గము (బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, బంధువులతో బహిష్కరింప బడిన వాడు, పిరికి వాడు, పిరికివాడైన జనులు కలవాడు, లోభి, దురాశాపరులకు ఆశ్రయమిచ్చు వాడు, మంత్రి, సేనాపతి మొదలగు వారిని సంతృప్తి పరచని వారు, విషయాసక్తుడు, చంచల చిత్తుల యొక్క సూచనలను గ్రహించువాడు, దేవార్తలను, బ్రాహ్మణులను నిందించు వాడు, దైవానుగ్రహమునకు దూరమైన వాడు, అదృష్టమును నమ్ముకొని పురుష ప్రయత్నము చేయని వాడు, దుర్భిక్ష పీడితుడు, చిక్కుల పాలైన సేన గల వాడు, స్వదేశమును వీడిన వాడు, పెక్కుమంది శత్రువులు గలవాడు, కాలము అనుకూలింపబడని వాడు, సత్య ధర్మములను పాటింపని వాడు - అను ఈ ఇరువది విధముల వారితో రాజు సంధి చేసుకొని రాదు),
- ప్రకృతి మండలం (అమాత్యులు, రాష్ట్రము, దుర్గము, కోశము, దండము - అను ఈ ఐదును ప్రకృతులు - తన రాజ్యమును విస్తరింప వలెననే కోరిక గల రాజు "విజిగీషువు". అతడును, అతని చుట్టును, పదునొకండుగురు రాజులు కలసి మండలము అని వ్యవహరింతురు. మధ్య విజిగీషువు, అతనికి ముందు భాగమున శత్రువు, మిత్రుడు, శత్రు

మిత్రుడు, మిత్రశత్రువు, శత్రుమిత్రమిత్రుడు - అను ఐదుగురును, వెనుక భాగమున "పార్ష్ణిగ్రాహుడు" (దాడి చేయబోతున్న రాజునకు వెనుక వైపు కాచుకొన్న శత్రువు), ఆక్రాదుడు, పార్ష్ణిగ్రాహాసారుడు, ఆక్రాందాసారుడు - అను నలుగురును, పార్శము నందు, మధ్యస్థుడు, వానికి వెలుపల ఉన్నవాడు ఉదాసీనుడు -- ఈ పన్నెండుగురు ద్వాదశ మండలము/ ప్రకృతి మండలం అందురు),

- యాత్ర (దండ యాత్రలు), దండ విధానము/వ్యూహ రచనలు (ఇవి సప్త వ్యూహములు, సప్త వర్గములు అందురు. అనగా గరుడ వ్యూహము, సూచీ వ్యూహము, వజ్ర వ్యూహము, శకట వ్యూహము, మకర వ్యూహము, దండ వ్యూహము, పద్మ వ్యూహము అని వ్యూహములు ఏడు విధములు), సంధి విగ్రహములు (ఇవి శత్రువులతో నడుచుకొను విషయములు) అను రెండు కారణములు. వీటన్నిటి పైన తగు శ్రద్ధ చూపుచున్నావా? వీటిలోని దోష వర్గములను త్యజించి గుణ వర్గములనే గ్రహించు చున్నావా.

**రామస్య వచనం ష్రుత్వా భరతహ్ ప్రత్యువాచ హ|**
**కిం మె ధర్మాద్విహీనస్య రాజధర్మహ్ కరిశ్యతి||**

రాముడి మాటలు విన్న భరతుడు " అన్నయ్యా! ధర్మమే లేని వానికి రాజ్యధర్మము ఎందుకు? నేను ధర్మ భ్రష్టుడిని. నేను రాజుని కాను, ఎప్పటికి రాజుని కాను. కాని అన్నయ్యా, మన వంశంలో ఉన్న సంప్రదాయం ప్రకారం, ఎవరు పెద్ద కొడుకుగా జన్మిస్తాడో, వాడు మాత్రమే పట్టాభిషేకం చేయించుకోవాలి. నాకు ఈ ధర్మం ఒక్కటే తెలుసు. నాకన్నా పెద్దవాడివి నువ్వు ఉండగా, నేను రాజధర్మాలు తెలుసుకోవలసిన అవసరం లేదు. అందుకని నేను ఎప్పుడు ఆ రాజధర్మాల్ని తెలుసుకోలేదు. నీ దగ్గరికి ఒకరు వచ్చి అడిగితేనే నువ్వు కాదనలేవు, అలాంటిది రాజ్యం అంతా వచ్చి నిన్ను అడుగులోంది పట్టాభిషేకం

చేసుకోమని, నువ్వు వాళ్ళ కోరిక తీర్చకుండా ఎలా ఉండగలవు. అందుకని తిరిగొచ్చి పట్టాభిషేకం చేసుకో. ఇవ్వాళ నాన్నగారు లేరు అన్నయ్యా, నువ్వు వెళ్ళిపోవడం చేత ఇంత ఉపద్రవం వచ్చింది " అన్నాడు.

**2.17 జాబాలి శ్రీరామునికి నాస్తిక వాదము వినిపించుట**

భరతుని వలనే స్పష్టమైన విచారశీలి అయిన వ్యక్తి జాబాలి. ఈ జాబాలిని దశరథుడు తన సభ యందు ఉంచుకొనెను. ఏ కల్పనలనైనను తన సమగ్రమైన వివేకములో విచారణ చేయనిదే జాబాలి విశ్వసించు వాడు కాదు. అతడు రాముని అయోధ్యకు రావలెనని, రాజ్య స్వీకారం చేయవలెనని కోరెను.

**రాజభోగాననుభవన్ మహోర్హాన్ పార్థివాత్మజ**
**విహోరత్వ మయోధ్యాయాం యథా శక్రఃస్త్రివిష్టపే**
**న తే కశ్చిదశరథః త్వం చ తస్య న కశ్చన**
**అన్యో రాజా త్వమన్యన్య స్తస్మాత్కురు యదుచ్యతే**
**బీజ మాత్రం పితా జంతోః శుక్లమ్ రుధిరమేవ చ**
**సంయుక్తమ్ ఋతుమన్మాత్రా పురుషస్యేహ జన్మ తత్**
**గతః స నృపతిస్తత్ర గంథాన్యం యత్ర తేన వై**
**ప్రవృత్తిరేషా మర్త్యానాం త్వం తు మిధ్యా విహన్యసే**
**అర్థ ధర్మ పరాయేయే తాంస్తాన్ శోచామి నేతరాన్**
**తెహిదుఃఖ మిహోప్రాప్య వినాశం ప్రేత్య బీజోరె**
**అష్టకాపితృదైవత్వం ఇత్యయం ప్రస్రుతో జనః**
**అంనాస్యోపద్రవం పశ్య మృతో హి కిమష్యతి**
**యది భుక్త మిహోస్యేన దేహ మన్యస్య గచ్ఛతి**
**దద్యాత్ ప్రవసతః శ్రాద్ధం న తత్ పథ్యశనం భవేత్**
**దాన సంవననా హేతే గ్రంథా మేథా విభికృతాః**

**యజస్వ దేహి దీక్షస్య తపః తప్యస్వ సంత్యజ**
**స నాస్తి పరమిత్యేవ కురు బుద్ధిం మహామతే**
**ప్రత్యక్షం యత్తదాతిష్ఠ పరోక్షం పృష్ఠతః కురు**
**స తాం బుద్ధిం పురస్కృత్య సర్వలోక నిదర్శనీమ్**
**రాజ్యం త్వం ప్రతి గృహ్ణీష్వ భారతేన ప్రసాదితః**

రాజభోగము లన్నియు ఈ పార్థివ దేహము చూచుకొనును. ఆత్మ ఈ భోగములకు వేరైనది కావున రామా! నీవు అయోధ్యకు రాజు వగుము. రాజ్య విషయములో నీకు దశరథునితో కానీ నీకు దశరథునితో కానీ సంబంధము లేదు కావున రాజ్యమోహము లేకుండా తటస్థ భావముతో కార్యభారమును గ్రహించుము. ప్రాణి పుట్టుటకు తండ్రి నిమిత్తమాత్రుడే. వాస్తవముగా ఋతుమతియైన స్త్రీ గర్భము నందు శుక్రశోణిత సంయోగము వలన శిశువు జన్మించును. దశరథ మహారాజు తాను చేరవలసిన చోటికే చేరినాడు. ప్రవృతి భావము చేతనే సర్వభూతములు నడచును. ప్రతి అస్థిత్వము తనదైన ధారణ మరియు స్వధర్మము కల్గి యుండి వాటికి అనుగుణముగానే ఈ విశ్వము నడచుచున్నది. ఈ సంసార చక్రమునకు తానే కర్తనని భావించి మానవుడు దుఃఖితుడు అయి వినాశనము నొందుచున్నాడు. ఈ లోకమున జనులు అష్టక శ్రాద్ధములను, ఆబ్దిక శ్రాద్ధములను నిర్వహించుచు ఆ అన్నము పితృదేవతలకు చెందునని నమ్ము చున్నారు. కానీ బాగుగా విచారించినచో ఈ అన్నము ఇచటనే నశించును కదా! మరి మృతులైన వారు ఎట్లు భుజింతురు? ఒకరు భుజించిన ఆహారము మరియొకరి శరీరమున చేరినచో దూర దేశములకు వెళ్ళిన వారికి శ్రాద్ధము పెట్ట వలెను. అప్పుడు వారికి దారి బత్తెములతో అవసరముండదు. పరలోకపు సంకల్పంతో వేరే కర్మను కాకుండా ఈ జన్మను సార్థకం చేసికొనుటకై సుయోగ్యమైన వ్యవహారంతో మనస్సు నందే తపస్సును చేయుము. శరీరమునకు కష్టమునిచ్చి ఆత్మాభిలాషను పెంచుట వ్యర్థమే! నీ జీవనము నందు ఏమి

యున్నదో అదియే స్వీకరింపుము. అటువంటి మార్గము ద్వారానే నీ జీవన స్థాయిని పెంపొందించుకొనుము. పరలోక కల్పనతో ఈ జీవనము నుండి పారిపోకుము. ఈ జీవన కర్తవ్యమును నిర్వహించుము. నీ సర్వ వ్యవహారములు శ్రద్ధానిష్ఠలతో చేయుము. రామా! ఇహ లోక సుఖములే వాస్తవములు. పరలోకము అనునది లేనేలేదు అనే సత్పురుషుల ప్రమాణమును అనుసరించుము.

జాబాలి వివేకముతో కూడిన ఈ తత్వ జ్ఞానము బుద్ధిమానులందరు అంగీకరించెదరు. ఈ తత్వ జ్ఞానము అనంతర కాలంలోని బౌద్ధమతముతో సరిపోలును. విరివిగా ప్రచారములో యున్న అట్టి బౌద్ధమును ఆది శంకరాచార్యులు నిర్ద్వందముగా ఖండించారు. జాబాలి వాల్మీకి చే ఉత్పన్నము చేయబడిన ఒక పాత్ర. జాబాలి ద్వారా అందించిన ఈ తత్వజ్ఞానము ప్రపంచమున విరివిగా ఉండెడిది. అట్టి తత్వజ్ఞానమును భగవానునిగా అంగీకరింపబడిన శ్రీరాముడు ఖండించుట ద్వారా నాస్తిక వాదమును వాల్మీకి స్వీకరించలేదని గ్రహించవచ్చు. వ్యక్తి జీవనము నందు తనదైన శ్రద్ధ (స్వధర్మము) ను ఒకసారి మరల్చినచో తన మార్గము అగమ్యమగును. స్వధర్మమును మరచిన సమాజము క్రమముగా విఘటనాత్మకమగును. పర సంప్రదాయము, సంస్కృతి, ఆచారములను అనుకరించుట వలన అట్టి దేశ సంస్కృతి చిన్నాభిన్నమై తన ఉనికిని కోల్పోవును. రామాయణము మనకు ఇట్టి విషయములో జాగ్రత్త బోధించినది.

ఇందుకు రాముడు జాబాలి మాటలకు రోషముతో ఆస్తికముగా, వాస్తవమైన సత్యమును సత్యమైన మాటలతో వివరించెను. అప్పుడు జాబాలి రామా! నేను నాస్తికుడను కాను. వేదము ప్రమాణము కాదని, ధర్మము లేదని, పునర్జన్మ, పరలోకము లేదని, నమ్మిన వాడను గాను. ఎట్లైనా నిన్ను మరల్చుటకు అవసరమేర్పడి అట్లు మాట్లాడినాను. అందుకు వసిష్ఠుడు కూడా రామా! జాబాలి

మిమ్ములను మరల్చ వలెనని మాట్లాడినాడు కాని అతను నాస్తికుడు కాదు. కాని ఇక్ష్వాకు వంశములో జ్యేష్ఠ పుత్రుడు రాజ్యమును స్వీకరించుట ధర్మము కాన దీనిని నీవు అతిక్రమించుట తగదు. అప్పుడు రాముడు - ఈ శరీరమునకు కారణమైన వాడు తండ్రి కావున అతని సత్యవాక్పరిపాలనము పాటించుట పుత్రునిగా నా కర్తవ్యము అని గంభీరంగా చెప్పినాడు. ఆ తరువాత భరతుని కోరిక మేరకు శ్రీరాముడు అతనికి తన పాదుకలు ఇవ్వగా ఆ పాదుకలను సింహాసనాధిష్ఠుని చేసి తాను యోగి వలె విరాగియై నందిగ్రామము నందుండి పరిపాలన కొనసాగించుచుండెను. అచట నుండి రాముడు వేరొక తావుకు జనెను.

**2.18 అయోధ్య కాండ సింహావలోకనం**

అయోధ్య కాండలో మానవుడు బాహ్యముగా సమాజమున తల్లి వద్ద, తండ్రి వద్ద, భార్య వద్ద, సోదరుల వద్ద, సవతి తల్లి వద్ద ఎట్లు ప్రవర్తించవలెనో ఆ ధర్మములను ఆచరణలో ప్రదర్శించెను. తండ్రి కుమారునిపైన ప్రేమతో సత్యమును అనుసరించుటకు ఎంతటి క్లేశమును అనుభవించెనో దానిని కుమారుడు ఏ విధముగా సత్య వ్రతమును పాలించినాడో చూపినది. సవతి సోదరులైన భరతుడు, లక్ష్మణుడు ఎటువంటి అసూయా ద్వేషములు లేక సత్య ధర్మములకు కట్టుబడినారో వివరించింది. అన్నదమ్ముల ఐకమత్యము, స్వార్ధరహితమగు పరార్ధ ప్రవృత్తి మనకు కనపడును. రాముడు **"సత్యాన్నాస్తి పరో ధర్మ:"** అన్న శృతి వాక్యమును అక్షరాలా పాటించాడు. అందరూ తనను నిరాకరించినను కైకేయి రాముని సత్యనిష్టుడిగా, నవ-పంచమ (9+5) యోగము ద్వారా ధీరపురుషునిగా మార్చుటకు ప్రయత్నించును. .రాముని తీవ్రమైన సాధనకు ప్రయత్నించును. సమాజ ధారణ కొరకై కర్తవ్య పాలన చుక్కాని వంటిది. తాను పూర్ణ పురుషునిగా మారుట అనెడి కైకేయి భావనను రాముడు గౌరవించి పాలించును. పౌరుషము, సత్యపాలనకు మధ్య అంతరమును శ్రీరాముడు లక్ష్మణునికి నిగూఢముగా తెలియ చేసినాడు. దశరథుని ద్వారా, శ్రీరాముని ద్వారా రాజనీతిని ఎలా

పాటించాలో వివరముగా చెప్పినారు. ఇట్టి శ్రీరాముని సత్య ధర్మ పరిపాలన, రాముని సోదరుల భ్రాతృ భక్తి మన దేశమునకు కాదు, యావత్ మానవ జాతికి ఆదర్శములు. గుహుని ప్రేమ విచిత్రము. హృదయ సంస్కారముచే నాగరికము కావలెనని నిరూపించాడు గుహుడు. భారతీయమైన యోగశక్తి, మంత్ర శక్తి వాటిచే కలిగెడు సిద్ధులు ఎట్లుండునో వాటిని ఎప్పుడు, ఏ విధంగా ఉపయోగించ వలెనో నిరూపించాడు భరద్వాజుడు. శ్రీరామ భరత సంవాదము ద్వారా సత్య ధర్మ పాలనము, రాజనీతి ఎంత కష్టమో మనకు తెలియు చున్నది. జాబాలి మాటల ద్వారా అందుకు శ్రీరాముని సమాధానము ద్వారా వ్యక్తి జీవనము నందు తనదైన శ్రద్ధ (స్వధర్మము) ను ఒకసారి మరల్చినచో తన మార్గము అగమ్యమగునని, స్వధర్మమును మరచిన సమాజము క్రమముగా విఘటనాత్మకమగునని, పర సంప్రదాయము, సంస్కృతి, ఆచారములను అనుకరించుట వలన అట్టి దేశ సంస్కృతి చిన్నాభిన్నమై తన ఉనికిని కోల్పోవునని రామాయణము మనకు ఇట్టి విషయములో జాగ్రత్త బోధించినది.

ఈ విధముగా అయోధ్యా కాండ మనము ప్రవర్తించు నియమావళిని, స్వార్ధ రహిత పదార్ధ వృత్తిని, ఆదర్శ దాంపత్యమును, ఉత్తమ మాతృత్వమును, ఉత్తమ స్త్రీత్వమును, మంత్రిని, ఆర్ష సంస్కృతి విశిష్టతను, వైదిక కర్మ ప్రాధాన్యమును, యోగ శక్తిని, భ్రాతృ ప్రేమను వివరముగా బోధించు చున్నది. అందుకే ఈ అయోధ్య కాండ ధర్మ ప్రధానమైన కాండ. మానవులకు జీవితమున పాటింపవలసిన స్వధర్మములను ఈ కాండ ప్రకాశింప చేయును.

**అయోధ్య కాండము సమాప్తము.**

**శ్రీరామ జయరామ జయజయ రామ**

# 3.0 అరణ్యకాండ

## 3.1.1 విరాధ సంహారము

చిత్రకూట పరిసరములను విడిచి సీతారామలక్ష్మణులు అత్రి మహర్షి వద్ద సెలవు తీసుకొని దట్టమైన కీకారణ్యము లోనికి పోయిరి. అడుగడుగునా అనేక మంది ఋషిమునుల ఆశ్రములు కాన వచ్చు చుండెను. అసుర భావముల రాక్షసుల ద్వారా అనేక మంది హింసించ బడుచున్నను, సంహరింప బడుచున్నను అనేక మంది సాధకులు సాధనారూప దండకారణ్యము నందు సాధన చేయుచునే ఉందురు. సాధన చేయనిదే అసుర వృత్తులు సంహరింపబడి ప్రగతి సాధ్యము కాదు. లోకములో స్వార్ధము, అహంకారము పెరిగి దేహాత్మాభిమానంతో శరీర పోషణకై లోకులను హింసించుతూ జీవించెడు అసుర స్వభావము పెరిగినప్పుడు క్రమబద్ధమైన జీవన విధానంతో, సత్యము, ధర్మము ఆలంబనగా మానవుడు పరబ్రహ్మముగా రూపాంతరము చెంది అట్టి అసుర భావాలను ఎదుర్కొనవచ్చునని శ్రీరాముని పాత్ర ద్వారా మనకు వాల్మీకి మహర్షి బోధించు చున్నాడు. ధార్మికులగు తపశ్శాలురు జీవకోటి రక్షణకై సంసారములో అసుర తత్వమును అంతమొందించుటకు ప్రయత్నము చేయుదురు. అట్టి ధర్మ స్వరూపుడే దైవీ భావములో కానవచ్చిన శ్రీరాముడు. చేసిన కర్మలకు దండముగ అనగా ఫలితముగా అనుభవించే సుఖదుఃఖములతో నిండినదియే సంసారము. అదియే దండకారణ్యము. అందు అసుర భావములు కలిగిన రాక్షసులు, సత్య ధర్మ స్వరూపులు అయిన ఋషులు ఉందురు. అట్టి దండకారణ్యము శ్రీరాముడు ప్రవేశించి అసుర భావములను అంతమొందించును. ఇదియే అరణ్య కాండ.

కొంత దూరము పోగానే వారికి ఒక భయంకరమైన విరాధుడు అను రాక్షసుడు కనపడెను. వాడు సీతారామలక్ష్మణులను చూసి....

**అధర్మ చారిణౌ పాపౌ కౌ యువాం ముని దూషకౌ**

**అహం వనం ఇదం దుర్గం విరాఘో నామ రాక్షసః**

**చరామి సాయుధో నిత్యం ఋషి మాంసాని భక్షయన్**

**ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి**

"మీరు అధర్ములు, పాపమైన జీవితం ఉన్న వాళ్ళు. ముని వేషాలు వేసుకొని భార్యతో ఎందుకు తిరుగుతున్నారు? అందుకే మీ భార్యని నేను తీసుకుపోతున్నాను. ఇకనుంచి ఈమె నాకు భార్యగా ఉంటుంది, అందుకని మీరు ఈ ప్రాంతాన్ని విడిచిపెట్టి వెళ్ళిపొండి. నన్ను విరాధుడు **(రాధ అంటే ఆనందం, విరాధ అంటే ఆనందానికి వ్యతిరేకం)** అంటారు, నేను ఈ అరణ్యంలో తిరుగుతూ ఉంటాను. నాకు ఋషుల మాంసం తినడం చాలా ఇష్టమైన పని" అన్నాడు. ఇంకా నేను గంధర్వుడను. నా స్వభావమును బట్టి నన్ను రాక్షసుడు అందురు. నాకు బ్రహ్మ వరము వలన ఎట్టి అస్త్ర శస్త్రములతోను నాకు చావు రాదు అని ఈ కన్యను నాకు వదిలి మీరు బ్రతికి పొండి అన్నాడు. అందుకు క్రోధముతో రామలక్ష్మణులు విరాధుని చేతులు ఖండించి భూమిలో పాతి పెట్టి సంహరించారు. తరువాత రామలక్ష్మణులు శరభంగ ముని ఆశ్రమానికి వెళ్ళారు.

### 3.1.2 విరాధ సంహారములోని యోగ రహస్యము

దండకారణ్యము సంసారము వంటిది. ఇందు తాపసులు, రాక్షసులు ఉందురు. రజోగుణ పూర్ణమగు మనస్సు శరీరములో ప్రవేశించగానే ఆత్మపై అధికారమును ప్రసరింప చేయును. అట్టి అసుర స్వభావంలో మొదటిది విరాధుడు. శరీరేంద్రియ మనస్సులలో రజోగుణము ఎక్కువగా ఉండినప్పుడు దేనిని లెక్క చేయకుండా అంతయు తానే నిర్వహించ గలను అనే మనఃస్థితి ఉండును. అదియే అహంకారం. అదియే విరాధ స్వభావము. దానితో జీవితము ప్రారంభ మగును. అట్టి దానినుంచి మానవుడు బయిట పడ వలెను. అప్రధృశ్యము అగు మనస్సే విరాధుడు. దీనిని జయించుట చాలా కష్టము. మనస్సును విషయములపై

ప్రసరింపకుండా నిరోధించ వలెను. దీనినే చిత్త వృత్తి నిరోధ మని అందురు. మనస్సులో కలిగిన రాజసతామస భావములను చిత్త వృత్తి నిరోధముచే తొలగించుకోవలెను.

యోగ విజ్ఞానము సనాతన వేదకాలము నుంచి అవిచ్ఛన్నంగా వస్తున్నది. అట్టి వేద విజ్ఞానాన్ని వసిష్ఠ మహర్షి కథల రూపములో శ్రీరాముడికి బోధించాడు. ఇదియే "యోగ వాసిష్ఠము". తరువాత దానిని పతంజలి మొదలగు వారు విపులీకరించారు. భారతీయ తత్వ శాస్త్రంలోని ఆరు దర్శనాలలో "యోగ" లేదా "యోగ దర్శనము" ఒకటి. ఈ యోగ దర్శనానికి ప్రామాణికంగా చెప్పబడే పతంజలి యోగసూత్రాల ప్రకారం "యోగం అంటే చిత్త వృత్తి నిరోధం". స్థిరంగా ఉండి సుఖాన్నిచ్చేది ఆసనం. అభ్యాస వైరాగ్యాల వలన చిత్త వృత్తులను నిరోధించడం సాధ్యమవుతుంది. ఇలా సాధించే ప్రక్రియను "పతంజలి అష్టాంగ యోగం' అంటారు. మనస్సు, బుద్ధి, అంతఃకరణముల సంగమమే చిత్తం అనబడును. చిత్తము వస్తువుల యొక్క ఆకారమును పొందుట వృత్తి అనబడును. శాంతము, మూఢము, ఘోరం అని చిత్తవృత్తులు మూడు రకములు. అభ్యాసము, వైరాగ్యము లేక విరక్తి లేక విముఖత ద్వారా చిత్తమును వృత్తి రూపముగా మారకుండా చెయ్యడమే యోగం. అభ్యాస వైరాగ్యముల ద్వారా మిగతా ఆలోచలన్నీ క్షీణించి చిత్తము తన తత్వముపై, తరువాత తనపై తదేక ధ్యాస కలిగి ఉండును. ఇదే ధ్యానం. ఎల్లవేళలా ధ్యానమొక్కటే మిగిలితే దానిని శుద్ధసాత్వీక పరిణామము లేక సంప్రజ్ఞాత సమాధి అంటారు. ఇక్కడ ధ్యేయ వస్తువు ఉన్నది ఉన్నట్లుగా తెలియబడును సాత్విక వృత్తి ధ్యేయాకారముగా ఉండుట వలన శాంతము ద్వారా రాజస, తామస వృత్తుల బాహ్య ప్రవృత్తులైన మూఢం, ఘోరం నిరోధించబడతాయి. ఏకతత్వమే ఆలంబనగా ఉండే సంప్రజ్ఞాతమును ఏకాగ్రత అనీ, అది సమాహితమైతే అది సమాధి అనీ అంటారు. ఏకాగ్రత అంటే

ఒకే దానిపై ధ్యాస లేక ధ్యానం. సమాహితము లేక సమాధి అంటే ధ్యేయం పై ధ్యానం అంటే చిత్తము యొక్క మూలముపై ధ్యానం చెయ్యడం. చిత్తం తనలోపల తానుండటం ఏకాగ్రత కుదిరి, బాహ్య దృష్టిని మరలించి తన తత్వంపై దృష్టిని నిలిపి తదేకంగా ఉంటేనే చిత్తం సమాహితమవుతుంది. సమాహితమైన చిత్త స్థితినే సమాధి అంటారు. సమాధిలో చిత్తము ఏకాగ్రమై పరమార్ధ తత్వాన్ని తెలియచేసి, అవిద్యను క్షీణింపచేసి, కర్మబంధమును శిథిలము చేసి, వృత్తిహీనతకు అభిముఖముగా చేయును. సంప్రజ్ఞాతను ధ్యేయాకార చిత్తస్థితి అంటారు. దీనిని కూడా నిరోధిస్తే వేయించిన విత్తనము వలె కార్యకారి కాక వాసనారహితమై సంస్కార మాత్రముగా వుండు చిత్తస్థితినే అసంప్రజ్ఞాత సమాధి అనబడును. వృత్తి నిరోధములలతో ఈ రెండు సమాధులను క్రమముగా సాధించడమే యోగం. యోగం కాక మిగిలిన అవస్థలు క్షిప్తము, మూఢము, విక్షిప్తం అని మూడు రకములు. మూఢము – తమోగుణముఅధికమై నిద్రావృత్తులలతో జడట వహించిన చిత్తమును మూఢము అంటారు. క్షిప్తము – రజోగుణం అధికమై బాహ్యావృత్తులలతో ప్రేరేపించబడి చంచలమైన మనస్సులో ఉండే చిత్తాన్ని క్షిప్తము అంటారు. విక్షిప్తావస్థ – సత్వ గుణము అధికమై జీవి మూల తత్వమునందు, ధ్యేయ వస్తువునందు అప్పుడప్పుడు ధ్యానం నిలిచి క్షిప్తావస్థలో ఎక్కువ సమయము గడిపే చిత్తాన్ని విక్షిప్తావస్థ అంటారు. చిత్తము త్రిగుణాత్మకము. ప్రకాశ స్వభావాన్ని సత్వగుణమనీ, ప్రవృత్తి స్వభావాన్ని రజోగుణమనీ, స్తితిశీలాన్ని తమోగుణమనీ అంటారు. సత్వగుణమంటే జ్ఞానము, శాంతము, ప్రేమ మొదలైనవి. ప్రవృత్తి అంటే ఇచ్ఛ, క్రియ, పరితాపము, శోకము మొదలగు రజోగుణములు. నిలకడ, గురుత్వము, దీనత మొదలైనవి తమోగుణాలు. ఈ మూడు గుణాలు ప్రతివ్యక్తిలోను వారి వ్యక్తిగత పరిణత ఆధారంగా వివిధ స్థాయిలలో ఉంటాయి. చిత్తము ప్రవృత్తి కలదైనప్పుడు జీవాత్మ ప్రకృతితో మమేకమై ఉంటుంది. వృత్తులు నిరోధించబడిన చిత్తము లేక జీవాత్మ తనలో

తాను తన మూలమైన, సకల జీవ నిర్జీవులకు మూలము, శక్తి పదార్థాల సంగమ రూపము ఐన ఆది స్థితిలో జాగృతంగా ఉంటుంది. ప్రకృతి కొన్ని మూలసూత్రాల ఆధారంగానే మార్పులు చెంది ఈ సృష్టికి కారణమైంది. కానీ మనిషి పరిణామంలో జాగృతి వివిధ స్థాయిలను దాటి స్థితి చైతన్యాల పూర్ణ జ్ఞానంతో జాగృతి కలిగిన, సృష్టి తత్వాన్ని తన అధీనంలో ఉంచుకోగలిగి, అష్ట ఐశ్వర్యాలను సాధించగల భగవత్స్వరూపమై వెలుగులోంది. **మానవుడే సాధనతో భగవంతుడవుతాడు. యద్భావం తద్భవతి అన్నట్లు తన దృష్టిని బట్టి మానవుడు తమోగుణాధికమైన పశువుగాను, రజోగుణాధికమైన మనిషిగానూ, సత్వ గుణాధికమైన దైవంగాను రూపొందుతాడు. అటువంటి ఉన్నతమైన మనుషులను గానీ, ఆత్మలను గానీ, గుణాలను తత్వాలను మనం దైవంగా చూస్తాము. యోగం ద్వారా చిత్త వృత్తిని నిరోధించినప్పుడు ద్రష్టగా ఉన్న జీవుడు తన మూల స్వరూపమైన పరమాత్మలో (జాగృతి కలిగి, సృష్టి స్థితి లయ కారకుడై) తానుంటాడు. క్రమశిక్షణ, ఆచారము, అభ్యాసము, జ్ఞానము, ధర్మ పాలన, పూజలు – మానవాతీత శక్తుల ఆరాధన, యోగము అన్నీ ఈ శాశ్వత తత్వాన్ని చేరడానికి .నిరంతరం ఆ ప్రయాణంలో మనిషికి అనేక చిత్త, దైవిక శక్తులు కలిగి మనుషులలో ఆదర్శ పురుషుడుగా/స్త్రీ గా పరిణామం చెంది ఆరాధనా స్థాయి కలిగిన వ్యక్తులుగా తమ జీవితంలోనూ , ఆ తరువాత గానీ పూజింపబడతారు. వారి పూజల ద్వారా కొన్ని ఫలితాలు కలిగి నమ్మకాలు పెరిగి సాధన తీవ్రతరమౌతుంది. అట్టి ఉత్తమ స్త్రీ పురుషులే "సీతారాములు."**

**3.2 రాక్షస బాధల నుండి రక్షించమని తాపసులు రాముని అర్థించుట**

విరాధుని (రాక్షస ప్రవృత్తి) వధ తర్వాత ఋషిమునులు (సాధకులు) దండకారణ్యము (మేరుదండము) నందు తమ సాధనను ఎంతో శ్రద్ధతో నిష్ఠతో

కొనసాగించెడివారు. ఈ దండకారణ్యము నందు అనేక మంది తమ తమ పద్ధతులు, సాంప్రదాయాల ద్వారా తపసును చేసుకొనెడి వారు. విశాల దృక్పథము గల వైదిక పరంపర అనేక మత సాంప్రదాయములను తనలో ఇముడ్చుకొన గలదు. వైదిక పరంపర అతి ఉత్కృష్టమైనది. అన్ని మార్గముల, నమ్మకముల వారు సఖ్యభావంతో ప్రేమాభిమానంతో అప్పటికి, ఇప్పటికి, ఎప్పటికి వ్యవహారము చేయుదురు. విరాధుడు చెప్పినట్లు సీతారామలక్ష్మణులు శరభంగుని ఆశ్రమానికి వెళ్లి ఆ ఋషికి నమస్కరించి ఈ అరణ్యమున నివసించుటకు సరి అయిన తావు చూప వలసినదిగా ప్రార్ధించారు. అప్పుడు శరభంగుడు శ్రీరామునికి సుతీక్షణుడు అను పరమ ధార్మికుడు, మహాతేజశ్శాలి, ఉన్నాడు. అతను నీకు శ్రేయస్సును కలిగించును గాన అతనిని కలవమని చెప్పి తన శరీరమును అగ్నిలో వ్రేల్చి, అగ్నికి ఆహుతి నొనర్చెను.

ఈ విధమైన అనేక సాధనా ప్రకారములు శరీరమును కష్టపెట్టి వాటి ద్వారా శరీర తత్వము కంటే ఉత్కృష్టమైన ఆత్మ తత్వమును పొందుటకై నిర్ధేశింపబడినవి. దండకారణ్య సాధన చేసి శ్రీరాముడు సంపూర్ణ యోగీశ్వరుడగును. ఈ సుతీక్షణుడి సోదరుడే అగస్త్యుడు.

శరభంగుని దేహ త్యాగము తర్వాత రాక్షసుల ప్రవృత్తి నుంచి తమను రక్షించ గలవాడు **(సరి అయిన సాధనా మార్గములో పెట్ట గలవాడు)** శ్రీరాముడే అని భావించి వైఖానసులు, వాలఖిల్యులు (భగవానుని నఖముల నుండి రోమముల నుండి జనించిన వారు), మరీచులు (ఆకాశమునకు ఎదురుగా నోరు తెరుచుకొని చంద్ర సూర్య కిరణములు పానము చేయువారు), సంప్రక్షాళులు (సంతతము శరీరము ప్రక్షాళనం చేసుకొనెడి వారు), వైఖానసులు (విఖనసముని సూత్రము ప్రకారము ప్రవర్తించు వారు), వాలఖిల్యులు (కొత్తగా లభింపగానే అంతకు ముందు ఉన్నవన్నియు పరిహరింపదును), అశ్మకుట్టులు (రాళ్లతో తమ శరీరమును కొట్టుకొను వారు, ఏ ఆహారము దొరకినను వాటిని రాళ్లతో

కొట్టుకొని భుజించెడి వారు), పత్రాహారులు (ఎండిన ఆకులని ఆహారముగా తీసుకొనేది వారు), దంతోలూఖలులు (ఈ పదార్థమును అయినను దంతములలతో వొలుచుకొని కొరికి భుజించెడి వారు), ఉన్మజ్జకులు (కంఠము వరకు నీటిలో ఉండి తపస్సు చేయువారు), గాత్రశయ్యులు (నేలపై ఏమియు ఆవరణ లేకుండా వట్టి నేలపై పరుండెడి వారు), ఆశయ్యులు (పరుండ కుండా నిలువుగా నిలచియే ఉందురు), అభ్రావకాశులు (గాలికి, ఎండకు, వర్షమునకు చలించకుండా ఆవరణ లేని ప్రదేశములో నిలిచి ఉందురు), సలిలాహారులు (నీరు మాత్రమే ఆహారముగా తీసుకొని జీవించేది వారు), వాయు భక్షకులు, ఆకాశనిలయులు (యోగశక్తిచే నేల తగలకుండా శరీరమును నిలుపు వారు, ఇంకను చెట్ల కొమ్మలపై నివసించేవారు), స్థండిల శాయులు (పైన ఆచ్ఛాదనము లేకుండా దర్భ, గడ్డి పరచుకొని నేలపై పరుండెడి వారు), వ్రతోపవాసులు (ఉపవాసము వ్రతము గా ఎట్టి ఆహారమును తీసుకొనకుండా ఉండెడి వారు), ఆర్ద్రపరవాసులు (ఎల్లప్పుడూ తడి వస్త్రమునే ధరించెడి వారు), సజపులు (ఎల్లప్పుడూ జపము చేయు చుండెడి వారు), తపోనిత్యులు (ఎల్లప్పుడూ వేదాధ్యయనము చేయువారు), పంచ తపోన్వితులు (సదా వేదపారాయణం, తపస్సు, అగ్నిహోత్రములతో గ్రీష్మ ఋతువులో సూర్యుని వైపు చూచుతూ తపస్సు చేయువారు), ధృఢయోగులు (ఎల్లప్పుడూ యమనియామాది అష్టాంగ యోగములు అభ్యసించు వారు), సమాధినిష్ఠులు (యోగముచే సమాధినిష్ఠులై ఉండువారు) ఈ విధమైన అనేకమైన తాపసులు శ్రీరాముని దర్శించిరి. వారందరు రామా! మా రక్షణము చేయవలసినదిగా కోరినారు. అప్పుడు రాముడు చక్రవర్తి కుమారుడునైన నాకు మీ రక్షణము చేయుట నా ధర్మము అని సుతీక్ష్ణుని ఆశ్రమమునకు వెళ్లెను.

## 3.3 శ్రీరాముడు సుతీక్ష్ణ మహర్షిని దర్శించుట

తరువాత రాముడు ఆ మహర్షులందరితో కలిసి సుతీక్ష్ణుడి ఆశ్రమానికి బయలుదేరారు. రాముడు సీతాలక్ష్మణసహితుడై మహర్షి ఆశ్రమము లోపలికి వెళ్లగా .... సుతీక్ష్ణ మహర్షి, రామా! తపస్సు చేత నేను గెలుచుకున్న లోకాలని ధారపోస్తాను సుఖంగా ఈ ఆశ్రమంలో ఉండు అన్నాడు. అప్పుడు రాముడు “మీరు సంపాదించుకున్న లోకములలో నేను విహరించడం కాదు, నా అంతట నేను కూడా తపస్సు చేసి సంపాదించుకుంటాను. అందుకని నేను తపస్సు చేసుకోవడానికి అనువైన స్థలాన్ని నాకు చూపించండి” అన్నాడు. "అయితే ఇక్కడ దగ్గరలో చాలా ఆశ్రమాలు ఉన్నాయి, నువ్వు వాటన్నిటిని చూసిరా. నువ్వు వాటిని చూసి వచ్చాక చెబుతాను." అని సుతీక్ష్ణుడు అన్నాడు. మరునాడు ఉదయం స్నానం చేసి, సంధ్యావందనం చేసి సుతీక్ష్ణుడి ఆశీర్వాదం తీసుకొని కోదండాలని ధరించిన రామలక్ష్మణులు, సీతమ్మతో కలిసి బయలుదేరారు.

## 3.4 సీతారామ సంవాదము

ఆ సమయంలో సీతమ్మ రాముడితో ఇలా అనింది. “మీరు ధర్మాచరణ కోసమని, తండ్రికి ఇచ్చిన మాట కోసమని అరణ్యానికి వచ్చి ఒక తాపసిలా జీవిస్తాను అన్నారు కదా. మనిషికి కామము చేత మూడు దుర్గుణములు కలుగుతాయి, అందులో మొదటిది అసత్యము, రెండవది పరస్త్రీ వాంఛ, మూడవది ఏంటంటే..... **తృతీయం యద్ ఇదం రౌద్రం పర ప్రాణ అభిహింసనం** ఏ కారణము లేకుండా, అవతలి వారితో వైరము లేకపోయినా వారిని హింసించాలన్న కోరిక పుట్టడం. మొదటి రెండు మీకు లేవని నాకు తెలుసు. కాని ఆ మూడవ దోషం ఇవ్వాళ మీయందు నాకు కనబడుతోంది. మీరు తాపసుల తో రాక్షసులని సంహరిస్తానని ప్రతిజ్ఞ చేశారు. కానీ తాపసిగా ఉన్న మీరు రాక్షసుల తో ప్రత్యక్ష వైరం లేకున్నా సంహరిస్తానని ఎలా ప్రతిజ్ఞ చేశారు. మిమల్ని ఎవరైనా ఆర్తితో రక్షించమని పిలిస్తే, వారిని మీరు రక్షించండి, తప్పులేదు. అంతేకాని, ఎక్కడో ఋషులని ఎవరో

రాక్షసులు ఇబ్బందిపెడుతున్నారని, రాక్షసులందరినీ చంపేస్తానని మీరు ప్రతిజ్ఞ చెయ్యడం నాకు నచ్చలేదు. నేను స్త్రీని కదా, ఒకవేళ నేను అనవసరంగా భయపడి చెప్పకూడని మాట మీకు చెప్పానేమో! మీ తమ్ముడితో ఆలోచించి, ఒక మంచి నిర్ణయానికి రండి." అని సీతమ్మ రాముడితో అనింది. సీతమ్మ పలికిన పలుకులకి రాముడు ఇలా సమాధానం చెప్పాడు "సీతా! రాక్షసులు తమని బాధపెడుతుంటే ఆ ఋషులు రక్షించమని ఆర్తితో శరణాగతి చేశారు. **తే చ ఆర్తా దణ్డకారణ్యే మునయః సంశిత వ్రతాః| మాం సీతే స్వయం ఆగమ్య శరణ్యాః శరణం గతాః||** సీతా! తాపసులు నన్ను శరణాగతి చేశారు. అప్పుడు నేను ప్రతిజ్ఞ చేశాను. అలా చెయ్యడం క్షాత్ర ధర్మమే. ఒకసారి నేను ఎవరినన్నా రక్షిస్తానని ప్రతిజ్ఞ చేస్తే, నా శరీరంలో ప్రాణాలు ఉన్నంత వరకు వాళ్ళని రక్షించి తీరుతాను. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడానికి అవసరమైతే నిన్ను విడిచిపెట్టేస్తాను, లక్ష్మణుడిని విడిచిపెట్టేస్తాను, ఇంకా అవసరమైతే నా శరీరాన్ని విడిచిపెట్టేస్తాను, అంతేకాని ఎట్టి పరిస్థితులలోను మాట తప్పను. ప్రతిజ్ఞ చేశాను కనుక రాక్షస సంహారం చేసి తీరుతాను సీతా " అని రాముడు అన్నాడు. ఈ మాటలు విన్న సీతమ్మ చాలా ఆనందపడింది.

### 3.5 మాణ్డకర్ణి ముని - యోగ రహస్యము

ముందు రాముడు, మధ్యలో సీతమ్మ, చివరన లక్ష్మణుడు నడుచుకుంటూ ఆ అరణ్యంలో వెళుతూ ఒక్కొక్క తాపస ఆశ్రమాన్ని చూస్తున్నారు. వాళ్ళతో పాటు కొంతమంది మునులు కూడా కలిసి వస్తున్నారు. అప్పుడు వాళ్ళకి ఒక చిత్రమైన పెద్ద సరస్సు కనబడింది. ఆ సరస్సులోనుంచి సంగీతం వినబడుతోంది, నృత్యం యొక్క ధ్వని వినబడుతోంది, పాటలు వినబడుతున్నాయి. ఆ సరస్సు నుండి వస్తున్న ఆ శబ్దములను విన్న రాముడు ఆశ్చర్యపోయి, తన పక్కన

ఉన్నటువంటి ధర్మభృత్ అనే మునిని పిలిచి "ఈ సరోవరం నుంచి ఇవన్నీ వినబడుతున్నాయి, ఏంటి సంగతి" అని అడిగారు.

**ఇదం పంచ అప్సరో నామ తటాకం సార్వ కాలికం|**
**నిర్మితం తపసా రామ మునినా మాణ్డకర్ణినా||**

అప్పుడా ధర్మభృత్ "ఈ సరోవరాన్ని మాణ్డకర్ణి అనే ఋషి తయారు చేశారు. ఆయన 10,000 సంవత్సరాలు వాయు భక్షకుడై తపస్సు చేశాడు. ఈయన తపస్సు చేత తమ స్థానాలని ఆక్రమిస్తాడేమో అని దిక్పాలకులు అనుకొని, ఆయన తపస్సుని భగ్నం చెయ్యడానికి అయిదుగురు అప్సరసలని పంపారు. అప్పుడా మాణ్డకర్ణి ముని ఆ అప్సరసలకి వశుడయ్యాడు. అప్పుడాయన ఒక పెద్ద సరోవరాన్ని నిర్మించి అందులో ఒక పెద్ద అంతఃపురాన్ని నిర్మించాడు. ఆ అంతఃపురం లోపల ఈయన అప్సరసలతో కలిసి క్రీడిస్తూ ఉంటాడు. తన తపఃశక్తితో యవ్వనాన్ని పొంది ఈ అయిదుగురితో రమిస్తూ ఉంటాడు. లోపల ఆ అప్సరసలు పాడుతున్న పాటలు, వాయిస్తున్న వాద్యముల యొక్క శబ్దములే మనకి ఇలా బయటకి వినబడుతున్నాయి రామ" అని అన్నాడు. ఇది విన్న రాముడు ఆశ్చర్యపోయి అక్కడినుంచి ముందుకి పయనమయ్యాడు. **(ఈ మాణ్డకర్ణి మహర్షి జీవితాన్ని తత్త్వపరంగా చూస్తే, మాణ్డకర్ణి మహర్షి దగ్గరికి వచ్చిన ఆ అయిదుగురు అప్సరసలు కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అనే జ్ఞానేంద్రియాలు. తన ఇంద్రియాలకి లొంగినవాడై, తను ఇప్పటిదాకా సంపాదించిన తపఃశక్తిని సుఖములు అనుభవించడం కోసం ఉపయోగించాడు. తన జీవితాన్ని వ్యర్థం చేసుకున్నాడు)**. ఆ విధముగా సీతారామలక్ష్మణులు తాపసులు ఆశ్రమాలలో 10 సంవత్సరాలు గడిపి సుతీక్ష్ణుడి ఆశ్రమానికి వెళ్ళి, “అగస్త్య మహర్షి ఆశ్రమం ఎక్కడుందో దయచేసి మీరు నాకు సెలవిస్తే ఆ ఆశ్రమాన్ని ఒకసారి సందర్శించాలని అనుకుంటున్నాను" అని అన్నాడు. అప్పుడా సుతీక్ష్ణుడు "రామ! నాకు చాలా సంతోషంగా ఉంది.

ఇక్కడినుంచి 4 యోజనముల దూరం దక్షిణంగా వెళితే అగస్త్య భ్రాత ఆశ్రమం కనబడుతుంది. నువ్వు తప్పకుండా ఆ ఆశ్రమాన్ని సందర్శించు" అన్నాడు.

### 3.6 అగస్త్య ముని ప్రభావము

అగస్త్య ముని ఆశ్రమానికి వెళుతూ శ్రీరాముడు ఆ ముని యొక్క ప్రభావమును లక్ష్మణునికి చెప్పుచున్నాడు........

పూర్వం ఇక్కడ ఇల్వలుడు, వాతాపి అనే ఇద్దరు రాక్షసులు ఉండేవారు. ఇల్వలుడు బ్రాహ్మణ రూపం దాల్చేవాడు, తన సోదరుడైన వాతాపిని శాకరూపమున మార్చి, శ్రాద్ధమునకు తగినట్లుగా కూరగా వండి విధివిధానంగా శ్రాద్ధ భోజనంలో ఆ కూరను వడ్డించే వాడు. భోజనము పూర్తి అయిన తర్వాత ఆ బ్రాహ్మణుడికి హస్తోదకం వేసి 'వాతాపి! రా........' అనేవాడు. అప్పుడా వాతాపి ఆ బ్రాహ్మణుడి శరీరాన్ని చీల్చుకొని బయటకి వచ్చేవాడు. అప్పుడు వాళ్ళిద్దరూ ఆ బ్రాహ్మణుడి శరీరాన్ని భుజించేవారు. ఇలా చాలా మందిని వారు సంహరించారు. ఒకనాడు అటుగా వెళుతున్న అగస్త్య మహర్షిని కూడా మిగతా బ్రాహ్మణుల్ని పిలిచినట్టు పిలిచారు. అగస్త్యడు త్రికాలవేది కనుక వీళ్ళు చేస్తున్న మోసాన్ని గ్రహించాడు. ఇల్వలుడు పిలిచేసరికి, అగస్త్య మహర్షి వాళ్ళ ఇంటికి వెళ్ళి భోజనం చేశాడు. భోజనం చేశాక తన కడుపు మీద చెయ్యి వేసి, 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అన్నారు. ఇది తెలియని ఇల్వలుడు హస్తోదకం పోసి 'వాతాపి! రా.....' అన్నాడు.

**కుతో నిష్క్రమితుం శక్తి: మయా జీర్ణ స్య రక్షసః**

**భ్రాతు స్తే మేష రూప స్య గతస్య యమ సాదనమ్**

"నీ తమ్ముడిని జీర్ణం చేసుకొని యమలోకానికి పంపించేసానురా" అని అగస్త్య మహర్షి ఇల్వలుడితో అన్నారు. ఆగ్రహించిన ఇల్వలుడు ఘోరమైన రూపాన్ని దాల్చి అగస్త్య మహర్షి మీద పడ్డాడు. అప్పుడు అగస్త్యుడు ఒక హుంకారం

చేసేసరికి ఆ ఇల్వాలుడు బూడిదై పడిపోయాడు. ఆ వాతాపిని, ఇల్వాలుడిని అగస్త్య మహర్షి సంహరించిన ప్రదేశమే ఈ అగస్త్య భ్రాత యొక్క ఆశ్రమం లక్ష్మణా" అని రాముడు అన్నాడు. ఇప్పటికి తల్లులు పిల్లలకు ఉగ్గు పట్టించినపుడు, ఆహారము ఇచ్చిన తర్వాత కడుపు మీద చేయి వేసి "జీర్ణం, జీర్ణం వాతాపి జీర్ణం" అని చెప్పుట గమనించవచ్చు.

**అగస్త్య ఇతి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా**
**ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాన్త శ్రమ అపహః**
**మార్గం నిరోద్ధుం నిరతో భాస్కర స్యాఽఽచలోత్తమః**
**సందేశం పాలయం స్తస్య విన్ధ్యః శైలో న వర్ధతే**

తన తపః ప్రభావముచే వింధ్య పర్వతమును స్థంబింప చేసినాడు కావున ఈయనకు అగస్త్య మహర్షి అని పేరు వచ్చినది. **("అగమ్ (పర్వతం) స్థంభయతీతి అగస్త్య")**. సూర్యుని మార్గమునకు (గమనమునకు) అడ్డు వచ్చుచున్న ఈ మహా పర్వతము అగస్త్యుని ఆదేశానుసారం పెరుగుట మానివేసింది. అట్టి ప్రభావశాలి అయిన అగస్త్య మహర్షి (వింధ్య పర్వతములకు దిగువన ఉన్న) ఆశ్రమము లోకి సీతారామలక్ష్మణులు వెళ్లి సాదర నమస్కారములు చేసిరి. అగస్త్యుడు స్త్రీల స్వభావమును వివరించుతూ .... స్త్రీల స్వభావము సృష్టి మొదలు ఎల్లకాలముల యందు ఒకే విధముగా ఉండును. ఎంత ప్రేమింతురో అంత తొందరగా వారి మనసు మారును. పరిస్థితులు అనుకూలముగా ఉన్నచో ఎక్కువగా ప్రేమింతురు. విషమము అయినచో ప్రియుని కూడా విడుతురు. మెరుపు లోని చాంచల్యము, శస్త్రము లోని తీక్షణత, వాయువు యొక్క, గరుడుని యొక్క వేగము స్త్రీలకూ ఉండును. కానీ సీత అందరి వాటి స్త్రీ కాదు. ఈమెకు ఇట్టి దోషములు లేవు.

**త ద్ధను స్తౌ చ తూణీరౌ శరం ఖడ్గం చ మానద**
**జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా**

మహర్షి రాముడికి విష్ణు ధనుస్సుని (పూర్వము ఈ వైష్ణవ ధనుస్సు పరశురాముని నుండి శ్రీరామునికి చేరెను. అతడు దీనిని వరుణునికి ఇచ్చెను. ఆ వరుణుడు దీనిని అగస్త్యునికి ఇచ్చెను. ఇప్పుడు మరల అగస్త్యుడు రామునకు ఇచ్చెను), బ్రహ్మగారు ఇచ్చిన సూర్య తేజస్సు కలిగిన బాణాన్ని, ఇంద్రుడు ఇచ్చిన రెండు అక్షయబాణ తూణీరములు, ఒక బ్రహ్మాండమైన పిడి కలిగిన ఖడ్గాన్ని ఇచ్చి, వీటి ద్వారా జయాన్ని పొందు అని ఆశీర్వదించారు. శ్రీరాముని కోరిక మేరకు మహర్షి .. "ఇక్కడికి దగ్గరిలో పంచవటి అనే గొప్ప వనం ఉంది, అక్కడ గోదావరి ప్రవహిస్తూ ఉంటుంది. కావున అక్కడ నువ్వు ఆశ్రమాన్ని నిర్మించుకో, అప్పుడు నీ కోరిక తీరుతుంది. నువ్వు సీతమ్మను భద్రంగా కాపాడుకో" అన్నారు. ఇక్కడ "సీతమ్మను భద్రంగా కాపాడుకో" అనడంలోనే మహర్షి రాబోవు సీతాపహరణమును సంకేతముగా సూచిస్తున్నారు.

స్పందన లేని శూన్య అవస్థకు "అగస్త్యుడు" అని పేరు. నిర్వికల్ప సమాధి అవస్థకు చేరిన తర్వాత ఈ శూన్య అవస్థ ప్రాప్తమగును. వృత్తి రహిత శూన్య అవస్థ యందు ఎల్లప్పుడును ఉండెడి ఉచ్చసాధకుని రామాయణకారుడు "అగస్త్యుడు" అని పేరిడెను. సంసారమును సాగరముతో పోల్చినారు. అలాంటి సాగరమును ఒకే ఆచమనముతో త్రాగినాడు. అటువంటి పరాక్రముడు, పురుషార్థి అయిన అగస్త్య మహర్షి. ఆశ్రమమున మూడు పగళ్లు, మూడు రాత్రులు శ్రీరాముడు ఉండెననగా రామసాధకుడు శూన్య నిర్వికల్ప అవస్థ యందు మూడు రోజులు ఉండెను. పంచ ప్రాణముల సాధనయే పంచవటి. (అగస్త్య ముని ప్రభావమును ఇంకను విస్తారముగా యుద్ధ కాండములో శ్రీరామునికి ఆదిత్య హృదయము చెప్పునప్పుడు వివరించడమైనది)

### 3.7 పంచవటి

పంచవటి అనగా సాధనా క్షేత్రము నందు అనుభవమును పొందెడు పంచ ప్రాణ సాధన. పంచవటి అనగా పంచ ప్రాణములైన ప్రాణ, వ్యాన, ఉదాన, అపాన, సమాన సాధన. హఠ యోగములో "ప్రాణ" సాధన యందు సాధకుడు తన ప్రాణమును శరీరము నుండి వెలుపలికి తేగలదు. దీనినే పరకాయ ప్రవేశము అందురు. "వ్యాన" సాధన యందు విశ్వము నందలి శక్తి సాధకుని యందు ప్రవేశించి అతని శక్తిని వృద్ధి చేయగలదు. "ఉదాన" సాధన వలన సాధకుడు నీటిపై నడవ గలడు, ఆకాశ గమనము చేయ గలడు. "అపాన" వాయు సాధన వలన ప్రాణగతి వెనుకకు ప్రయాణించి సాధకుడు గంటల తరబడి గాలి లేకుండా జీవించ గలడు. "సమాన" వాయు సాధన ద్వారా ప్రతి అణువు నందు పరమేశ్వరుని చూడగలడు. ఈ విధమైన పంచప్రాణ సాధనయే "పంచవటి". శివ గీత శరీర నిరూపణ యోగములో ఇట్టి మహా వాయువులు గురించి శివుడు శ్రీరామునికి ఈ విధముగా చెప్పెను. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు పంచ మహా వాయువులను, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజములను పంచోపవాయువులును మొత్తము కలిపి దశ వాయువులు ... మున్నగునవి వాయుతత్వము వలన లభించును. దశ వాయువులలో ప్రాణవాయువు ముఖ్య మైనది. అది నాభి నుండి కంఠము వరకు సంచారము చేయుచుండును. అపాన వాయువు గుదము, నడుము, పిక్కలు, నాభి, గజ్జలు, తొడలు మున్నగు స్థానములందు సంచారము చేయుచుండును.వ్యాన వాయువు కన్నులు, చెవులు, చీలమండలము, నాలుక ముక్కు మున్నగు స్థానములందు ఉండును. ఉదాన వాయువు కాళ్ళు చేతులు మున్నగు అవయవము లందు ఉండును. సమాన వాయువు అగ్ని తో కూడి శరీరమంతయు వ్యాపించి ఉండును. ఇది 72000 నాడుల యందు సంచరించు చుండును. సప్త ధాతువులందు నాగాధి పంచవాయువులు వ్యాపించి ఉండును. యోగ వాసిష్ఠములో వసిష్ఠ మహర్షి శ్రీరామునికి యోగము గురించి వివరించుతూ,

దేహములో అనేక నాడీ సమూహాలు ఉన్నాయి. అట్టి 72000 దాకా ఉండే నాడీ సమూహాలలో నిరంతరము వాయువు ప్రవహిస్తూ ఉంటుంది. అట్టి వాయువునే ప్రాణము అంటాము. అది శరీరంలో ఊర్ధ్వ-అధో గమనాలు చేస్తూ ఉంటుంది. ప్రాణ చలనముచే జనించునట్టి జ్ఞానవృత్తే చిత్తము, దానినే సంవిత్తు అంటారు. ప్రాణములు స్పంధించుట చేతనే జ్ఞాన వృత్తుల స్పందనము కలుగుచున్నది. జ్ఞాన వృత్తులు చిదాభాసుని (Reflection of Absolute Self) ఉనికితో ఉంటున్నాయి. జ్ఞాన వృత్తుల స్పందము చేత విషయానుభవము, దృశ్య జగత్తు యొక్క వాస్తవ రూపము కనబడుతున్నది అని చెప్తారు. ఈ యోగా వాసిష్ఠమును వాల్మీకి మహర్షి, భరద్వాజ మహర్షికి వివరించుతూ .. సాధకుడు శ్రద్ధావంతుడై మృదువైన ఆసనం ఆశ్రయించి ఇంద్రియములను జయిస్తూ మనస్సు ప్రసన్న మయ్యేంత వరకు ఓంకారము ను ఉచ్చరించాలి. అంతఃకరణ శుద్ధి కొరకు ప్రాణాయామము మొదలైనవి ఆచరించాలి అని చెప్తారు.

పంచవటి ప్రస్తుతము నాసిక్ ప్రాంతమందు ఉన్నట్లుగా కొందరి నమ్మకము. ఇక్కడ ఐదు వటవృక్షాలు ఉండుట వలన ఇది పంచవటిగా ప్రసిద్ధి చెందినది. అయితే కొంత శోధన చేసిన తర్వాత తెలియునది ఏమనగా ... శ్రీరాముడు దండకారణ్యములో ఉన్న సమయములో సీతాపహరణ తర్వాత కలత చెంది, దుఃఖించుతూ లక్ష్మణునితో కలసి ఘోర అరణ్యములు తిరుగుతూ కర్తవ్యము పాలుపోక ఉన్న స్థితిలో అగస్త్య మహాముని శ్రీరాముని సమీపించి మోహము వీడమని చెప్పి విరజా దీక్ష (పాశుపత. శివ దీక్ష) ఇచ్చెను. ఆ మహర్షి ఆనతిన శ్రీరాముడు రుద్రాక్షలు, త్రిపుండరములు ధరించి గోదావరి తీరమున రామగిరి యందు శివ లింగము ప్రతిష్టించి శివానుగ్రహము కొరకు చాతుర్మాస్య దీక్షలో తపస్సు చేసెను. అందుకు శివుడు సంతోషించి పార్వతి పరివార సమేతంగా దర్శనము ఇచ్చి గొప్ప ధనస్సును, అమ్ములపొదిని, పాశుపతాస్త్రమును

అనుగ్రహించి ఆశీర్వదించెను. సంశయాత్మ కలిగిన శ్రీరాముడు పరిపరి ప్రశ్నలు వేయగా శివుడు అతని మోహము పోగొట్టుటకు సమాధానాలు చెప్పెను. ఈ శ్రీరామ పరమేశ్వర సంవాదమే "శివ గీత". ఇది వ్యాస మహర్షి చేత వ్రాయబడిన పద్మ పురాణాంతర్గత ఉత్తర ఖండములోగల ఈ శివ గీత లో 779 శ్లోకాలు ఉన్నవి. శ్రీరాముడు శివుని కోసము తపస్సు చేసిన రామగిరి ప్రదేశము భద్రాచలమునకు 55 కి.మీ.దూరంలో కూనవరం దగ్గర రామగిరి కొండలలో గోదావరి నదీతీరంలో శివాలయము ప్రతిష్టించబడినది. ఇది భైరవ క్షేత్రంగా ఆరాధించబడుతున్నది. భద్రాచలం దగ్గర ఉన్నటువంటి పర్ణశాలయే పంచవటిగా మన తెలుగు ప్రజల ప్రగాఢ విశ్వాసము. సీతాపహరణము తర్వాత శోకతప్తుడైన రామునికి ఈ ప్రదేశము నందే పరమ శివును గురించి చాతుర్మాస్య దీక్షను తీసుకొనెను. అక్కడ నుంచి సీతాన్వేషణతో జటాయు మరణించిన ప్రదేశమునకు వెళ్లెను అదియే ఆంధ్ర ప్రదేశ్ అనంతపూర్ జిల్లాలోని లేపాక్షి (లే పక్షి అదియే కాలాంతరమున లేపాక్షిగా నామాంతరం చెందింది). అక్కడ నుంచి ఋష్యమూక పర్వతము నకు వెళ్లెను. అది ప్రస్తుతము కర్ణాటక లోని హంపి దగ్గర ఉన్నది. ఆయా ప్రదేశములన్నియు లేఖకుడు దర్శించియున్నాడు. ఇక్కడ ఇంకొక విషయము గమనించ వలసినది. సీతను అశోక వనములో పెట్టునప్పుడు, రావణుడు సీతకు పండ్రెడు మాసముల గడువు ఇచ్చినాడు (**శృణు మైథిలి, మాద్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని**). అక్కడ నుంచి గమనించితే శ్రీరాముడు నాలుగు నెలలు పరమ శివుడుని గురించి తపస్సు చేయుచు చాతుర్మాస్య దీక్షలో యున్నాడు. తరువాత వర్ష ఋతువు కారణంగా (మూడు నెలలు) సీతాన్వేషణకై సుగ్రీవాదులు ప్రయత్నము చేయలేదు. తరువాత సీతాన్వేషణకై ఒక నెల గడువు వానరులకు సుగ్రీవుడిచ్చెను. దక్షిణమునకు ఏగిన అంగదాదులు మరియొక మాసము అదనంగా తీసుకొనిరి. హనుమ సీతామాత దర్శనము చేసుకున్నప్పుడు, రావణుడు ఇచ్చిన గడువు రెండు నెలలే ఉంది అనును. ఇవి

మొత్తము 11 నెలలు అయినది. కావున భద్రాచలం వద్ద ఉన్న పంచవటీయే నిజమైన పంచవటి అని మదీయ ప్రగాఢ విశ్వాసము. (శబరి నదీరూపమున ప్రవహించెనని కొందరి అభిప్రాయము. కానీ రామాయణకారుడు ఇట్టి విషయము చెప్పలేదు గావున గమనించవలసినది). ఏదైనా ఎవరి విశ్వాశములు వారివి.

### 3.8 పంచవటి నివాసము, లక్ష్మణునికి జ్ఞాన బోధ

అచట గృధ్ర రాజైన "జటాయువు" శ్రీరాముని కలిసి అత్యంత మైత్రిని దృఢపరచు కొనెను. ఒకసారి శ్రీరాముడు సుఖాసీనుడై ఉన్న సమయమున జ్ఞాన వైరాగ్య మాయా స్వరూపములను, ఈశ్వరునికి జీవునకు గల బేధములను, మిమ్ములను సేవించు మార్గము ఉపదేశించ వలసినదిగా శ్రీరాముని, లక్ష్మణుడు కోరెను. అప్పుడు శ్రీరాముడు ఈ విధముగా వివరించెను[8].

లక్ష్మణా! మనస్సు, బుద్ధి, చిత్తములను స్థిరముగా ఉంచి వినుము. నేను, నాది, నీవు, నీది అను భావమే "మాయ". ఇదియే జీవులను తన వశము నందు ఉంచుకొనును. ఇంద్రియములు, ఇంద్రియ విషయములు, మనోగతులు - ఇవి అన్నియు "మాయా స్వరూపములే". ఈ మాయ రెండు విధములు. ఒకటి విద్య, మరియొకటి అవిద్య. వీటిలో అవిద్య దుష్టమైనది, మిక్కిలి దుఃఖ ప్రదమైనది. దీనికి వశమైన జీవుడు సంసార కూపమున పడును. రెండవది విద్య. ఇది త్రిగుణాత్మకమైనది. అందరిలో సమత్వ బుద్ధితో పరమాత్మ రూపమునే "జ్ఞానము" అనబడును. సకల సిద్ధులను, మూడు గుణములను గడ్డిపోచ వలె భావించు వాడే పరమ "విరాగి". జీవుడు ఈశ్వరాంశ, కనుక సచ్చిదానంద జ్ఞాన స్వరూపుడు. కానీ మాయాజానితమైన అవిద్య (అజ్ఞాన) ప్రభావమున జీవుడు తన స్వరూపమును గాని, ఈశ్వరుని మాయను గాని ఎరుంగ లేక యున్నాడు.

---

[8] ఈ కధాంశము శ్రీ తులసీదాసు విరచిత "శ్రీ రామచరిత మానసము" లోనిది. వాల్మీకి రామాయణములో లేదు. కావున గమనించ గలరు.

కావున వివిద లౌకిక కర్మాసక్తుడై జీవుడు బంధములో చిక్కు కొనుచున్నాడు. ఈ బంధముల చిజ్జడ గ్రంధి నుండి విముక్తుడై మోక్షమును పొందుటకు సర్వాతీతుడు, మాయా ప్రేరకుడైన పరమేశ్వరుని అనుగ్రహము ఆవశ్యకము. దీనికి భక్తియే సాధన మార్గము. ధర్మాచరణము వలన వైరాగ్యము, యోగాభ్యాసము వలన జ్ఞానము జనించును. జ్ఞానము వలన మోక్షము లభించును. ఈ విధముగా వేదములలో చెప్పబడినది. సోదరా! నా హృదయమును త్వరగా ద్రవింప చేయునది భక్తి. ఇదియే నా భక్తులకు పరమానందమును పంచి ఇచ్చును. ఈ భక్తి స్వతంత్రమైనది. దీనికి ఇతర సాధనములు అవసరము లేదు. జ్ఞానవిజ్ఞానములు దీనికి అధీనములు. ఇది సర్వ సుఖములకు మూలము. సజ్జన సాంగత్యము వలననే ఇది లభించును. ఇప్పుడు భక్తి సాధన రీతులను సవిస్తరంగా వివరించెదను. మొదట పూర్తి భక్తి శ్రద్ధలు కలిగి ఉండవలెను. వేదోక్తముగా విధులను నిర్వర్తించవలెను. తత్ప్రభావము వలన విషయవాంఛలపై విరక్తి ఏర్పడును. విరక్తి వలన నా ధర్మము (పూజ) నందు అనురాగము కల్గును. అప్పుడు శ్రవణాది నవవిధ భక్తి మార్గముల యందు మనస్సు దృఢమై ఉండును. మనస్సు నా లీలలు యందు అనన్య ప్రేమతో నిమగ్నమగును. అట్టి నా భక్తులకు సజ్జన పాదపద్మములపై అత్యంత ప్రేమ యుండును. అతడు త్రికరణ శుద్ధి కలిగి నియమ పూర్వకముగా నన్ను భజించు చుండును. నన్నే గురువు, తల్లి, తండ్రి, సోదరుడు, పతి, దైవము అని భావించుతూ సేవించు చుండును. నా గుణములు కీర్తించు చున్నప్పుడు అతడు పులకిత గాత్రుడగును. అతని కంఠము గద్గదమగును. నేత్రములు నుండి ప్రేమాశ్రువులు ప్రవహించు చుండును. అతని యందు కామము, మదము, దంభము మొదలుగునవి ఏ మాత్రము ఉండవు. అట్టి అనన్య భక్తునకు నేను సర్వదా వశుడనై ఉందును.

**దో-బచన కర్మ మన మోరి గతి, భజను కరహి ని:కామ|**

**తిన్హ కే హృదయ కమల మహు, కరఉ సదా బిశ్రామ|| (దో|| 16 )**

మనోవాక్కర్మల యందు సర్వదా నన్నే స్మరించుతూ నిష్కాముడై నన్ను భజించు వాని హృదయమే నా నివాస స్థానము.
యోగవాసిష్ఠములో వసిష్ఠుడు శ్రీరామునికి అవిద్య, బంధ మోహములు, మోక్షము మున్నగు వాటి గురించి వివరించెను. అవి ... ఎల్లపుడు ఉండునది బ్రహ్మతత్వమే అని, అస్థిరమైన మనస్సు, అవిద్యచే ఈ ప్రపంచము సత్యముగా తోచుటయే బంధమని కానీ నిజముగా ఆత్మ శుద్ధ మైనది అని పూర్వ కర్మలు లేని వానిని మృత్యువు కూడా ఏమిచేయలేదని ఆకాశజో పాఖ్యానమున వివరింపబడినది. పరమాత్మ యొక్క మాయాశక్తి అయిన మనస్సే జగమును సృజించు చున్నది కానీ వాస్తవంగా ఈ జగత్తంతా మాయ అని లీలోపాఖ్యానమున వివరింపబడినది. బ్రహ్మమే సత్యము, జీవుడు ఆ పరబ్రహ్మమే ఇరువురికి భేదము లేదు. మనస్సు నందు జనించిన సంకల్ప వికల్పాలే ప్రపంచముగా తోచును. కావున అట్టి మనస్సును నిగ్రహించి పరమాత్మ జ్ఞానం వలన ముక్తిని పొందాలి అని పరమాత్మ వస్తువు ఒక్కటే సత్యమని కర్కటోపాఖ్యానమున వివరించారు. జగద్రూపముగా ఉన్న మాయాస్వరూపాన్ని దాశురోపాఖ్యానములో వివరించారు. ఉపశమ ప్రకరణము నందు మనస్సు ఎలా శాంతి పొందుతుందో దానికి ఉపాయాలు ఏమిటో వివరించారు. చిత్తాన్ని జయించనంత వరకు మాయ తొలగదు అని గాధి ఉపాఖ్యానములో చెప్పారు. చిత్త విశ్రాంతి కోసము సంగాన్ని త్యజించాలని, ప్రాణ నిరోధము చేయాలి అని వీతహవ్యోపాఖ్యానములో తెలియ చేసారు.
ఈ విధముగా జ్ఞాన వైరాగ్య గుణ నీతి చర్చలతో కొంత కాలము గడచెను.

### 3.9 శూర్పణఖ శృంగభంగము

జ్ఞాన వైరాగ్య గుణ నీతి చర్చలతో ఆనందముగా కాలము గడుపుతున్న సమయములో రావణుని సోదరి అయిన శూర్పణఖ రామలక్ష్మణులను చూచి కామాతుర అయ్యినది. ధర్మజ్ఞాన హీనులైన, కామాంధలైన స్త్రీలు సుందర

పురుషుడిని చూడగానే అతడు సోదరుడు, తండ్రి, పుత్రుడు అను వివక్షతను కోల్పోయి మనోవైకల్యము పొందుదురు. ఆమె సుందర రూపమును దాల్చి రాముని తనను పెండ్లియాడుమని, శ్రీరామునితో ఉన్న స్త్రీని (సీతను) వదలమని కోరెను. అందుకు శ్రీరాముడు తిరస్కరింపగా సీతపై దాడికి దిగెను. శ్రీరాముని సూచనపై లక్ష్మణుడు శూర్పణఖను విరూపను గావించెను. పరాభవం పాలైన శూర్పణఖ తన సోదరులైన ఖర దూషణాదులను ఆశ్రయించెను. (ఖర దూషణ త్రిశురులు పూర్వజన్మలో యాజ్ఞవల్క్య శిష్యులు. వారు పరమశివుని ఆగ్రహమునకు గురై రాక్షసులుగా జన్మించిరి. శ్రీరాముని చేతిలో హతమైన తర్వాత వారికి శాపవిముక్తి కల్గినది).

**3.10.1 ఖరదూషణాదుల వధ**

ఖరదూషణాదులు పదునాలుగువేల సైన్యము, మంత్రులతో ప్రాతఃకాల బాలసూర్యుని ఒంటరిగా చూచి మందేహాది రాక్షసులు[9] చుట్టుముట్టినట్లు వారు శ్రీరాముని చుట్టుముట్టిరి. అప్పుడు శ్రీరాముని రూపము పినాకము పట్టిన ప్రళయకాల రుద్రుని వలె ఉన్నదని వాల్మీకి వర్ణించెను.

**రూపం అప్రతిమం తస్య రామస్య అక్లిష్ట కర్మణః**

---

[9] మందేహాది రాక్షసులు సూర్యుని బాధించు చుందురు. సంధ్యోపాసన చేయువారు తమ సంధ్యావందన కార్యక్రమము నందు సూర్యునకు మూడు పర్యాయములు అర్ఘ్యమును సమర్పించుదురు. ఆ అర్ఘ్యములు బ్రహ్మాస్త్ర, బ్రహ్మదండాస్త్ర, బ్రహ్మశిరోనామకాస్త్రములై ఆ మందేహాది రాక్షసులను పారద్రోలును. ఆ విధముగా సూర్యునికి రాక్షస బాధ తొలగును. కనుక ఈ అర్ఘ్య ప్రధాన ప్రభావమును గ్రహించి, సంధ్యోపాసకులు తమ సంధ్యావందనమును విధిగా ఆచరింపవలెను. అర్ఘ్య ప్రధాన ప్రభావమును విస్మరించరాదు. దానిని ముఖ్య కర్తవ్యముగా భావించవలెను. లేనిచో సూర్యుని బాధ తమకు బాధాకరంగా మారును. ఇది సార్వకాలిక సత్యము. శ్లో|| తస్మాన్నోల్లంఘనం కార్యం, సంధ్యోపాసన కర్మణః| స హంతి సూర్యం సంధ్యాయాం, నో పాస్తిమ్ తు యః|| (విష్ణుపురాణం 2/8)

**బభూవ రూపం క్రుద్ధ స్య రుద్ర స్యేవ పినాకిన:**[10]
**అర్ధ అధిక ముహూర్తేన రామేణ నిశితైః శరైః**
**చతుర్ దశ సహస్రాణి రక్షాం కామ రూపిణాం**
**ఖర దూషణ ముఖ్యానాం నిహతాని మహామృధే**

రాముడు ఆ 14,000 మంది రాక్షసులని ఒక గంటా 12 నిమిషాల్లో సంహరించాడు. ఆయన తిరిగి వెనక్కి వస్తుంటే పైనుండి పుష్పవృష్టి కురిసింది. అక్కడున్న ఋషులందరూ ఎంతో సంతోషించారు. అప్పటిదాకా ఏమి జరుగుతోందో అని కంగారుపడుతూ చూస్తున్న సీతమ్మ ఒక్కసారి పరుగుపరుగున వచ్చి రాముడిని ముందునుంచి గట్టిగా కౌగలించుకుంది. పూర్ణచంద్రుడిలా వెలిగిపోతున్న ముఖంతో సీతమ్మ రాముడిని పక్కన నుంచి, వెనక నుంచి, మళ్ళీ మళ్ళీ కౌగలించుకుంది. అన్న య్య చేసిన శత్రు సంహారానికి లక్ష్మణుడు పొంగిపోయాడు. చంద్రుడివంటి ముఖంతో సీతమ్మ కౌగలించుకునేసరికి రాముడు తన కష్టాన్నంతా మరిచిపోయాడు. అప్పుడు వాళ్ళంతా ఆనందంగా పర్ణశాలలోకి వెళ్ళారు.

### 3.10.2 ఖరదూషణుల వధలోని యోగ రహస్యము

ఖరదూషణుల వధలోని అంతరార్ధమును గ్రహించుదాము. రామలక్ష్మణులనే ఇరువురు వ్యక్తులు వేల మంది రాక్షసులను ఒక గంటా 12 నిమిషాల్లో సంహరించ గలరా! సాధకుని జీవాత్మరూప రాముడు, వివేక రూప లక్ష్మణుడు బలగముగా యున్నచో అంతఃకరణము నందు యున్న వేలకొలది దుర్గుణ రూప రాక్షసులను

---

[10] స్కంద పురాణమున ఈ ఘట్టమున శ్రీరాముని రూపమును ఈవిధముగా వర్ణింప బడినది.

శ్లో|| శంఖం చక్రంచ శూలంచ పినాకం ఖేటమేవ చ| ఖట్వామ్ ఘంటాం చ డమరుమ్ బాణపాశాంకుశాం తథా|| చాపం వజ్రంచ ఖడ్గంచ పరశుమ్ త్రాసకారణం| జయ శ్రియంచ గంగాంచ దదృశు: సిద్ధచారణా||

సంహరించ వచ్చును. ఖర దూషణులు ఎవరు? "క్షర" ము నుండి "ఖర" శబ్దము ఉత్పన్నమయినది. సాధనలలో కలుగు అనుభవములలో మునిగి పోయినచో ఆధ్యాత్మిక ఉన్నతి కలుగదు. పాత అనుభవములు (ఖరము) వదలి వేసినచో సాధకునకు క్రొత్త అనుభవములు కల్గును. ప్రారంభ దశలో ఉన్న సాధకుడు ఆ అనుభవములు (క్షరము) వదిలి వేయుటకు ఇష్టపడడు. రామునిగా మారవలెనన్నచో తన యందున్న అనుభవములు వదలలేని గుణములను సంహరింపవలెను. అంతేకాకుండా లోకుల నుండి కలుగు దూషణములు కూడా వదిలి వేయాలి. సామాన్యముగా సాధకుడు దూషణములకు భయపడి తాను చేయు సాధనమును వదులును. దూషణములు వదిలి సాధనములో ముందుకు పోవాలి. రామలక్ష్మణులు ఈ విధముగా ఖరదూషణాదులను వారి సైన్యముతో సహా సంహరించిరి.

### 3.11.1 ఖరదూషణాదులు శ్రీరాముని చేతిలో హతులైన విషయము అకంపనుడు రావణునికి తెల్పుట

అకంపనుడు ఆ యుద్ధమును చూచి రాముని దివ్యత్వమును, పరాక్రమమును గుర్తించి అతనితో విరోధించుట రావణునికి హితము కాదు అని గుర్తించినాడు. శూర్పణఖ అహంకారగ్రస్త. కామప్రవృత్తియే కానీ వేరొకటి ఆమెకు తెలియదు. కావున ఆమె రావణుని కలసి తప్పుదారి పట్టించుటకు ముందే కలవవలెనని యోచించి ముందుగా రావణుని కలసినాడు. జనస్థానములోని ఖరదూషణాదులతో సహా సమస్త రాక్షసులు శ్రీరాముని చేతిలో నిహతులైనారు అని చెప్తాడు. శ్రీరాముడు అశేష బలపరాక్రములు గలవాడు, జయింప శక్యము కానివాడు అని చెప్పెను. అయితే మూర్ఖుడైన రావణుడు వినడని యోచించి లౌకిక దృష్టిలో శ్రీరాముని సంహరించుటకు ఉపాయమును తెలియచేయుచున్నాడు. రాముని యొక్క భార్య అయిన సీత జగత్తున ప్రసిద్ధురాలు, సౌందర్యవతి, స్త్రీలలో శ్రేష్ఠురాలు. రాముడు లేని సమయం చూసి సీతని అపహరించి తీసుకొచ్చి నీ భార్యని చేసుకో.

సీత పక్కన లేకపోతే రాముడు జీవించలేడు. సీతని పోగొట్టుకున్న రాముడు తనంతటతానుగా ప్రాణములను విడిచిపెడతాడు. అందుచేత నువ్వు ఈ కపటోపాయంతో రామవధకి పూనుకో " అన్నాడు.

### 3.11.2 అకంపనుడు - యోగ రహస్యము

యోగదృష్టితో అకంపనుడి వివరము తెలుసుకొందాము. "అకంపనము" అనగా కంపన రహితమైన శూన్య అవస్థ. అదే ఆత్మావస్థ. ఆత్మ రూపమును తెలుసుకొనగోరు సాధకుడు తన సీతావృత్తిని త్యజించి బ్రహ్మార్పణము గావింప వలెను. సీత వృత్తి బ్రహ్మ రూప రావణుని యందు లీనము కావాలి. అప్పుడే రామ రూప సాధకుడు బ్రహ్మ రూపముగా మారగలడు. కానీ మనస్సు తన పూర్వ సంస్కారములను త్యజించుటకు ఇష్టపడదు. అందుచే అటువంటి మనస్సును బ్రహ్మ వృత్తియే హరణము చేయ వలసి యున్నది. సీతారాముల మధ్య ఉన్న అవినాభావ సంబంధము పూర్వ సంస్కారములు వలన విడదీయరానిది. సాధకుని బ్రహ్మ వృత్తి అయిన రావణుడు ఆక్రమణ ద్వారా సీతా వృత్తిని అపహరించుటకై సంకల్పించెను. అయితే రాముడు పరాక్రమశాలి. సీతను విడువడు. సీత కూడా రాముని తప్ప అన్య ప్రవృత్తిని అంగీకరింపదు. "అకంపన" అనే శూన్య అవస్థ బ్రహ్మరూపమును (రావణుని) సీతావృత్తిని అపహరింపుమని ప్రోత్సహించెను. సీతావృత్తిని ఒక్కసారిగా బ్రహ్మరూపము గావించుట సాధ్యము కాదు కావున తగిన యోజన ప్రారంభమయ్యెను.

### 3.12 శూర్పణఖ రావణ దర్శనము, శ్రీరాముడు మాయ లేడిని సంహరించుట

అకంపనుడు చెప్పిన తర్వాత సీతాపహరణము నకు సహాయము చేయవలసినదిగా రావణుడు మారీచుని దగ్గరకు వెళ్లెను. మారీచుడు శ్రీరాముని పరాక్రమము గురించి వివరించి అతనితో సీతాపహరణము ద్వారా శత్రుత్వమును కొనితెచ్చుకోవద్దని సలహా ఇస్తాడు. అంత రావణుడు లంకకు మరలి వెళతాడు.

ఇంతలో శూర్పణఖ రావణుని రెచ్చగొట్టుచు విషయసుఖములో మునిగి సరి అయిన గూఢచారి వ్యవస్థ లేకుండా రాజ్యములోని తన ప్రజల రక్షణ చూడకుండా మునిగిపోయావని నిందించును. రావణుని వలెనే శూర్పణఖ మూర్ఖురాలు, దుష్టురాలు, కామాతుర. రావణుడు తన విషయమును పట్టించుకొనుటకై అతనిని రెచ్చగొట్టినది. రామలక్ష్మణులపై అతనిలో ద్వేషమును పెంచినది. సీతాపహరణమునకు ప్రోత్సహించింది. అంతటిలో ఆ రావణుడు సీతాపహరణకై నిశ్చయించుకొని మరల మారీచుని వద్దకు వెళ్లెను. అప్పుడు మారీచుడు సీతాపహరణ ప్రయత్నము మాని పరాక్రమము కలిగినచో రామునితో ఎదురుగా నిలిచి పోరుసల్పమని సలహా ఇచ్చెను. అందుకు రావణుడు క్రుద్ధుడై సహాయము చేయక పోయినచో తన చేతిలో మరణము సంభవించునని చెప్పెను. అందుకు మారీచుడు ధర్మాత్ముడైన రాముని చేతిలో మరణమే మేలు అని అలోచించి సహాయపడుటకు నిశ్చయించుకొనెను. మారీచుడు మాయ (బంగారు) లేడి రూపములో పంచవటి ప్రాంతములో తిరుగుతూ సీత దృష్టిని ఆకర్షించెను. సీత దానిని చూచి ముచ్చటపడి తెచ్చి ఇమ్మని రాముని కోరెను. ఆమె కోర్కెను తీర్చుటకై సీత రక్షణ భారమును లక్ష్మణునికి అప్పగించి లేడిని తీసుకొని వచ్చుటకై శ్రీరాముడు ఏగెను. ఆ లేడి శ్రీరాముని అరణ్యములో చాలా దూరము తీసుకొని వెళ్లెను. చివరికి శ్రీరాముడు ఆ లేడిని సంహరింపగా మారీచుడు తన రాక్ష రూపము ప్రకటించుతూ "హా లక్ష్మణా!, హా సీతా!" అని రాముని స్వరములో అనుచు ప్రాణములు వీడెను. అట్టి మారీచుని మాయా అక్రనాదము విన్న తర్వాత ఆందోళన చెంది రామునికి సహాయము చేయవలసినదిగా సీత, లక్ష్మణుని ఆదేశించెను. రామునికి ఎట్టి అపాయము కలుగదని ఇది రాక్షస మాయ అని లక్ష్మణుడు సీతను వదలి వెళ్ళుటకు సిద్ధపడడు. అప్పుడు సీత తీవ్ర శబ్దజాలమును లక్ష్మణునిపై ప్రయోగించెను.

**తమ్ ఉవాచ తత స్తత్ర కుపితా జనకాఽఽత్మజా**

**సౌమిత్రే మిత్ర రూపేణ భ్రాతు స్త్వమఽసి శత్రువత్**

**య స్త్వమ్ అస్యామ్ అవస్థాయాం భ్రాతరం నాఽభిపద్యసే**

**ఇచ్ఛసి త్వం వినశ్యన్తం రామం లక్ష్మణ మత్కృతే**

**లోభా న్మమ కృతే నూనం నాఽనుగచ్ఛసి రాఘవం**

**వ్యసనం తే ప్రియం మన్యే స్నేహో భ్రాతరి నాస్తి తే**

**తేన తిష్ఠసి విస్రబ్ధ స్తమ్ అపశ్యన్ మహా ద్యుతిమ్**

లక్ష్మణా! రాముని సహాయమునకై పోకుండా ఉండుటలోని నీ కుటిల ఆలోచన నాకు తెలిసినది అని పరుషముగా మాట్లాడును. అందుకు నిస్సహాయుడై లక్ష్మణుడు రాముని వద్దకు వెళతాడు. ఇందలి యోగ రహస్యమును పరిశీలిద్దాము.

### 3.13 మారీచ వధ లోని యోగ రహస్యము

మారీచుడు ఎవరో వాల్మీకి భావనలో చూచెదము.

**రకారాఽఽదీని నామాని రామ త్రస్త స్య రావణ**

**రత్నాని చ రథా శ్చైవ త్రాసం సంజనయన్తి మే**

**"ర"** శబ్దమును ఉచ్చరించిన మాత్రమునసే కష్టమును పొందువాడు మారీచుడు. **"రామ"** అను మంత్రము లో **"ర", అ, మ"** అనే అక్షరాలు ఉన్నాయి. **"ర"** అంటే అగ్ని, **"అ"** అంటే సూర్యుడు, **"రా"** అనగా జ్ఞానము, **"మ"** అంటే చంద్రుడు, మనస్సు. **"రామ"** అనే మంత్రములో లోకానికి మూలమైన మూడు శక్తులు ఉన్నాయి. అట్టి **"రామ"** శబ్దము లోని **"ర"** శబ్దము వినలేని వాడు మారీచుడు. జ్ఞానము అనగానే మనస్సు ఆందోళన చెందువాని భయముగా, మారీచ వృత్తిగా గమనించ వచ్చు. అట్టి వాడు మానసిక ఉన్నతికి అనర్హుడు. రావణ ప్రవృతిని ఇష్టపడును. సాధన చేయుట వలన మారీచుడు కొన్ని

సిద్ధులు పొందగలిగినా ఆత్మ జ్ఞానం పొందలేదు. మాయామోహితుడైన సాధకుడు ఈ సిద్ధులందు మోహితుడై ఆత్మ జ్ఞానము నుండి (జ్ఞాన మార్గము నుండి) మరలును.

యోగావాసిష్ఠములో వసిష్ఠ మహర్షి శ్రీరామునికి వివరించుతూ ....ఆత్మ జ్ఞానము గలవానికి సిద్ధుల యందు వాంఛ ఉండునేగాని, సంపూర్ణమైన ఆత్మ జ్ఞానికి ఇటువంటి ఇచ్ఛ ఉండదు. పుర్యష్టకము, జీవునికి, ప్రాణం అనే పేరు గల కుండలిని ఆధారంగా ఉంది. పూరకం అనే అభ్యాసం చేత, శరీరం యొక్క స్థిరత్వం, గురుత్వం లభిస్తుంది. శరీరాన్ని మూలాధారం నుండి బ్రహ్మ రంధ్రం వరకు తిన్నగా నిలిపి ప్రాణవాయువుని పైకి ఆకర్షించి, కుండలిని సంవిత్తుని పైకి పంపితే, దీర్ఘత్వాన్ని పొందిన కుండలిని, నాడులన్నిటిని తనలో తీసుకొని పైకి పోతుంది. ఇదే యోగి యొక్క ఆకాశగమనం. ఇక, రేచక ప్రాణాయామ ప్రయోగం చేత కుండలిని శక్తి సుషుమ్నా నాడిలో ప్రాణవాయు ప్రవాహం చేత శిరస్సు యొక్క ఇరుకవాటాల సంధిరూపమైన కవాటానికి 12 అంగుళాల దూరంలో ఉన్న షోడశాంతం అనే స్థానంలో ముహూర్తకాలం ఉంటె అప్పుడు ఆకాశంలో సంచరించే సిద్ధుల దర్శనము అవుతుంది. తత్వజ్ఞాని ఈ అల్ప సిద్ధుల్ని అధికంగా తలచక నిరతిశయానంద రూపమైన తన ఆత్మనే అధికంగా తలుస్తాడు. సిద్ధుల మాయలో పడి జ్ఞాన మార్గము నుండి తప్పిన వాడు "మారీచుడు". తమ సిద్ధులను ప్రజల ఎదుట ప్రదర్శించి బ్రహ్మ జ్ఞానులమని తమ నేర్పరితనంతో ప్రజలను మభ్య పెట్టే కుహనా స్వాములను చూస్తుంటాము. అట్టివారు "మారీచులు, అకర్షకులు, ఆకర్షకులు". సీత వంటి పతివ్రత కూడా మోహితురాలై బంగారు జింక (మాయావి మారీచుని) ప్రాప్తికై వివేకము కల్గిన రామలక్ష్మణ సాధకులను ఇబ్బందులలో పడవైచును. ధనము, సంపద, ఆకర్షణ, కీర్తి ఇత్యాది మాయల నుండి అతీతులుగా ఉండుట చాలా కష్టము. గీతలో ఈ విధముగా చెప్పబడినది. **"దైవి హ్యేషా గుణమయీ మమ మయా దురత్యయా!"**

(chapter -7 Verse 14) మాయ త్రిగుణాత్మకమైనది. అలౌకికమైనది. ఇది అధిగమించుటకు సాధ్యము కానిది. అటువంటి మాయలో పడి ఆత్మజ్ఞానము నుండి మారీచుని వలె వంచించబడుదురు. వైదేహి కూడా ఇటువంటి మాయలో పడి మోసపోవును. ఇట్టి మాయను శ్రీరాముడు గ్రహించును. కాని సీతావృత్తికి ఎంత చెప్పినను మోహము వలన వివేకమును కోల్పోయి తన కాయవృత్తి (సీతావృత్తి) అయిన రామసాధకుని కూడా బంధీ చేయును. **"యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః! ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః!"** (chapter 2 Verse 60) ఇంద్రియములు మహాశక్తి కలవి, మనుష్యుడు వాటిని నిగ్రహించుటకు ఎంతగా ప్రయత్నించినను, ఆసక్తి తొలగిపోనంతవరకును అవి అతని మనస్సును ఇంద్రియార్థముల వైపు బలవంతంముగా లాగికొని పోవుచునే యుండును. వివేకము (లక్ష్మణుని) తో కూడిన రామసాధకుడు కూడా సీతా రూప ఇంద్రియ వృత్తి ఆధీనములో పడి మారీచ రూప మాయతో వెనుక పరిగెత్తును. ఇది విపత్తు లక్షణము. అందువలనే బ్రహ్మ వృత్తి రూప రావణుడు సీతను అపహరించెను. అయితే రామ సాధకుడు అటువంటి మాయను చేధించెను. ఇట్టి మారీచ మాయను సంహరించుట ఆవశ్యకము. మారీచుడు స్వార్థములతో రాముని చేతిలో మరణించిన స్వర్గ ప్రాప్తి కలుగునని రావణుని యోచనను అంగీకరించును. ఇతరులపై జరిగెడి అన్యాయమును లెఖ్ఖ చేయక స్వార్థములతో తాను స్వర్గము చేరెదని భావించుట ఆధ్యాత్మికత కాదు. అందుచే మారీచుడు ఇట్టి షడ్యంత్రములో భాగమయ్యెను. అది కాంచన మృగము కాదు, చంచల లక్ష్మి అని రాముడు గ్రహించెను. కర్మ ఫలితము, మోహము కలసి ఉండును. కర్మ యొక్క గతిలో బుద్ధి ఏమి చేయును? చంచల లక్ష్మి వెనుక త్యాగి అయిన సాధకుడు పరిగెత్తెను.

## 3.14 సీతాపహరణము

మానవులుగా జీవించెడి వారికి ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము అను రెండు మార్గములు ఆవశ్యకముగా ఎరుంగ దగినవి. శరీరేంద్రియ మనోబుద్ధులతో ఈ లోకములో ధర్మార్థ కామములను పొందుటకు ప్రవర్తించుట ప్రవృత్తి మార్గము. భగవత్సేవ చేయుచు, భగవానునికి చెందిన ఈ విశ్వమును ప్రేమించుతూ, కర్మ జ్ఞానములను వానికే ఉపయోగ పరచుచు పొందవలసిన ఫలము భగవత్ప్రాప్తియే అని నిశ్చయించి దీనికి సాధనము భగవానుడే అను పూనిక తో ఈ లోకమున ప్రవర్తించుట నివృత్తి మార్గము. ఈ రెండు మార్గములను ఎరింగి, ఆచరించి, విశ్వమును ప్రేమించి సేవించి విశ్వాత్మకుడగు భగవానుని పొంది సేవించుచు ఆనందింప చేసి తాను ఆనందించుటకు ఎట్లు ప్రవర్తించ వలెనో ఎరుంగు వారందరకు శ్రీరామాయణమే శరణ్యము.

తగిన అవకాశము కోసము ఎదురు చూచుచున్న దశగ్రీవుడు (రావణుడు) లక్ష్మణుడు అటు వెళ్ళుట గమనించి వెంటనే సన్యాసి వేషములో సీత ఎదుట నిలిచెను. యతి రూపములో ఉన్న క్రూరుడైన రావణుడు, రామపత్నిని చంద్రుడు లేని రోహిణిని క్రూర గ్రహము[11] వలె చూచెను. **(రోహిణీం శశినా హీనాం గ్రహవత్ భృశ దారుణః)**. యతి రూపములో ఉన్న రావణుడు సీత యొక్క సౌందర్యమును వర్ణించుతూ, సీతతో .. భయంకరమైన రాక్షసులకు ఆలవాలమైన ఈ అరణ్యము నందు నీవు నివసింప తగదు. అప్పుడు సీత, రామలక్ష్మణులకై ఎదురుచూచుచు, యతి వేషములో ఉన్న రావణునికి అతిథి మర్యాదలు చేసెను. ఇంకను తన మరియు శ్రీరాముని వృత్తాంతమును, వారి వనవాస కారణమును వివరించెను. వనవాసము ప్రారంభించే సమయానికి శ్రీరాముని వయస్సు 25

---

[11] క్రూర గ్రహములు (అంగారకుడు, శని మొదలుగునవి) రోహిణిని చూచుట లోకమునకు అనర్థదాయకం

సంవత్సరములు అని తన వయస్సు 18 సంవత్సరములు అని చెప్తుంది. **(మమ భర్తా మహాతేజా వయసా పంచ వింశకః, అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే 3.47.10)** తరువాత సీత, రావణునితో తన పరిచయము అడుగగా, యతి వేషములో యున్న రావణుడు తీవ్రమైన స్వరముతో తాను రాక్షసరాజైన రావణుడను, తనను పతిగా స్వీకరించవలసినదిగా కోరతాడు. అందుకు సీత తిరస్కరించగా ..రావణుడు క్రుద్ధుడై తన నిజరూపమును ప్రదర్శించెను. అప్పుడు దుష్టాత్ముడైన రావణుడు కామాతురుడై **(కామాతురాణాం న భయం న లజ్జా)** సీతాదేవి జుట్టును ఎడమ చేతితోను, ఆమె తొడలను కుడి చేతితోను పట్టుకొనెను. **(వామేన సీతాం పద్మాఽక్షీం మూర్ధజేషు కరేణ సః ఊర్వో స్తు దక్షిణే నైవ పరిజగ్రాహ పాణినా 3.49.17)** అనంతరము రావణుడు పరుష వచనములతో సీతను భయపెట్టుచు ఒడిలోకి తీసుకొని రధము పైన ఉంచెను **(తత స్తాం పరుషై ర్వాక్యై ర్భర్త్సయన్ స మహా స్వనః, అంకేనాఽఽదాయ వైదేహీం రథమ్ ఆరోపయ త్తదా 3 49 20 )**. రథములో ఆకాశ మార్గమున పయనించుచుండగా సీతాదేవి ఆర్తురాలై, నిస్పృహతో కలవరపడుచు బిగ్గరగా ఏడవ సాగెను. ఆ ఆర్తనాదములు విని పక్షిరాజైన జటాయువు రావణునికి అనేక హితవచనములు చెప్పెను. రావణుడు వాటిని వినక పోవడముతో రావణునితో యుద్ధము చేసెను. యుద్ధములో రావణుడు జటాయువును సంహరించెను. అక్కడ నుంచి నేరుగా రావణుడు, సీతను లంకా నగరంలోని తన భవనమునకు తీసుకొనిపోయి తన వైభవమును చూపించి ప్రలోభ పెట్టుటకు ప్రయత్నించగా సీతాదేవి విముఖత ప్రదర్శించును. అయినను రావణుడు సీతను తనను పతిగా స్వీకరించ వలసినదిగా ప్రాధేయ పడును. అందుకు సీత శ్రీరాముని చేతిలో రావణుని మరణము తధ్యము అని చెప్పును. అందుకు క్రుద్ధుడైన రావణుడు ఆమెకు ఒక సంవత్సరము గడువు విధించి, ఆమె రక్షణ భారము రక్కసులకు

అప్పగించి ఆమెను అశోక వనమునకు చేర్చెను. తరువాత బ్రహ్మదేవుడు ఇంద్రుడిని పిలిచి దేవకార్యము సిద్ధించుటకై సీతా దేవి బ్రతికి యుండుట ఆవశ్యకము, ఎందుకనగా శ్రీరాముని పైన దిగులుతో ఆమె అన్నపాదులు స్వీకరించుట మానివేసినది. కావున ఆమెకు దివ్య పాయసాన్నము (హవిష్యాన్నము) ఈయవల్సినదిగా తద్వారా ఆమెకు ఆకలి దప్పులు ఉండవని చెప్తాడు. ఇంద్రుడు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం సీత దగ్గరకు వచ్చి ఆమెకు నమ్మిక కలుగుట కోసము అతని దివ్య దేవ చిహ్నములను ప్రకటించి ఆ దివ్య పాయసాన్నము ఇస్తాడు. సీత దానిని రామలక్ష్మణులకు నివేదన చేసి తాను భుజించెను. ఇందలి యోగ రహస్యమును గమనిద్దాము.

### 3.15 సీతాపహరణము యోగ రహస్యము

రావణుడు సన్యాసిగా "భవతి బిక్షామ్ దేహి" అనుచు ఆశ్రమ ద్వారమున నిలబడెను. సీత బిక్ష తెచ్చిన క్షణముననే మాయతో ఆమెతో సహా ఆకాశమార్గమున పరారయ్యెను. సామాన్య రూపములో, స్థూల దేహముతో ఆకాశ మార్గమున పోవుట సాధ్యము కాదు. సూక్ష్మ శరీరముతోనే సాధ్యము. ఆకాశమార్గమనగా ధ్యాన మార్గములో ఆకాశతత్వ ప్రాప్తిని చేరుకొనుట. ధ్యాన మార్గము ద్వారా రావణుడు సీతా వృత్తిని అపహరించెను. వృత్తుల హరణము ధ్యానము ద్వారా, చింతన ద్వారా జరుగును. చింతన మంచి చెడు వృత్తులలో ఏదైనా ఉండవచ్చు. సీతా వృత్తి కేవలము రాముని (ఆనందము) మాత్రమే ఇష్టపడును. సీతకు శోకము కలుగకుండా ఉండుటకు రావణ వృత్తి ఆమెను అశోక వనములో ఉంచెను. కాని సీత సాత్విక ఆనంద రూప రాముని మాత్రమే కోరుకొనును. బ్రహ్మ రూప రావణుని తిరస్కరించును. రావణుడు పూర్ణమైన బ్రహ్మరూపుడు కాడు. తన దశగ్రంధుల ముఖ రూపముల యందు అమితమైన ప్రేమ. రావణ శబ్దము **"రవైతేతి రావణః".** తపస్వాధ్యాయ నిరతమైన రామరూప ఆనందము ముందు రావణ వృత్తిని సీత నిరాకరించింది. రాముని ప్రాణప్రియము

చేసుకొనెను. పత్నికి పతి ప్రాణప్రియము కదా! పతివ్రతగా సీత ఆదర్శవంతురాలు. తన విద్వతను, ఆధ్యాత్మికతను ప్రచారములో పెట్టి కీర్తి రూప బలమును పెంచుకొనెడి వృత్తియే రావణుడు. ఈ విధమైన డాంబిక వృత్తి వలన తన చిత్తము మార్గము నుండి తప్పినదై రావణ వృత్తి యందే ఏకాగ్ర మగును. అటువంటి రావణ వృత్తిని సీత ఎందుకు ఇష్టపడును? రావణుడు సీతను ఆకాశమార్గములో తీసుకొని వెళ్లునప్పుడు జటాయు అడ్డుకొనును. **"జటాయు"** అనగా వేదజ్ఞానము. డాంబిక వేదజ్ఞానము రావణుడైతే, వాస్తవమైన వేదజ్ఞానము జటాయు. ఆకాశ మార్గములో నున్న రావణుని అడ్డుకొనవలెను కనుక అంతటి విశాల రూప జటాయు పక్షి రూపము ఎన్నుకొనబడెను. రావణ-జటాయు యుద్ధము నందు వాస్తవ వేద జ్ఞానము అపజయము నంది మరణించెను. ఇక్కడ రెక్కల రూపములో నున్న వేదవిహిత జ్ఞానము నష్టమై మృత్యువును ఎదుర్కొనుచు జటాయు పడిపోవును. అటువంటి వికాలావస్థలో యున్న జటాయును (వేదజ్ఞానము) రామ లక్ష్మణులు చూసి దుఃఖించుదురు. సీతా వృత్తిని తీసుకొని రావణ రూప అహంకార బ్రహ్మ వృత్తి పారిపోయెనని జటాయు (వేదజ్ఞానము) ద్వారా తెలియును. సాధకునకు నిరహంకార వృత్తి ఆవశ్యకము. లంక అనగా మాయావస్థ. అందువలన లంక సువర్ణమయము. ఈ సంసారము నందు సువర్ణము ఉన్నత శ్రేణి మాయ. రావణుని మాయాలంక సాగరమునకు ఆవలి వైపున ఉన్నది. ఇది సంసార సాగరము. కొందరు ఈ సంసారమును విడిచి ఆధ్యాత్మికత వైపు మాట్లాడెదరు. కానీ అంతఃకరణము నందు త్యాగము చేయక రావణ వృత్తితో కూడుకొన్న కామిని, కాంచనము, కీర్తి వీటి యందు అభిలాషతో ఉందురు. రావణుడు అదే విధముగా చూపబడెను. కాంచ రూపమందలి మోహముతో సీత ఈ మాయారూప లంకలో చిక్కుకొనెను. సీతావృత్తిని విడిపించుటకై ఈ మాయారూప లంక పైన రామ సాధకుడు యుద్ధము చేయును.

బ్రహ్మమ్మము నందు చరించే బ్రహ్మచారియైన హనుమంతుడు సీతను వెదుకుటకై ఈ లంకకే పోవును. కాంచన (చంచల) మృగము నందు సీత మోహితురాలైనది. సీతను రావణుడు సంపూర్ణ సువర్ణమయమైన నగరమునకు తీసుకొని పోయెను. సహజముగా సీత ఆనంద పరవశురాలు కావాలి. అనగా శోకము కలుగ కూడదు. అందుచేత సీతను అశోక వనము (శోక రహిత వనము) నందుంచెను. కానీ సీత (వృత్తి) యొక్క సంస్కారము రామ సాధకునితో ముడిపడి యున్నది. కనుక సీత అశోక వనమున శోకించుట చూపబడినది. రామరావణ వృత్తి యుద్ధమే రామాయణము. వాసుదేవానంద సరస్వతి ఆదిగా గల కొంతమంది మహానుభావులు ఈ సత్యము ఎరింగి యుండిరి. (ఈ విషయము స్థూలంగా ఉపోద్ఘాతములో చెప్పుకొన్నాము).

మాయ అనునది జీవుని ఆవరించును. ఆ మాయయే మృగముగా వచ్చిన మారీచుడు. మృగమరీచి అనగా ఎండమావి. మాయ ఆత్మను ఆవరించినప్పుడు భగవత్ స్వరూపము మరుగున పడును. అందుకనే కాంచన మృగమును చూడగానే మాయ వలన కోరిక కలిగి రాముని దూరము చేసుకొనును. రజోగుణముతో నిండిన మనస్సు ఆత్మను బంధించును. ఇది బంధనమునకు మూలము. కానీ సీతమ్మకు అట్టి బంధనమును వీడవలెనని స్ఫురణ గల్గును. రామునే స్మరించు చుండును.

### 3.16 శ్రీరాముని శోకము-జటాయు మరణము

జటాయు మరణించిన ప్రదేశము వాల్మీకి రామాయణములో రామలక్ష్మణులు ప్రయాణించిన మార్గము ప్రస్తుతము ఆంధ్ర ప్రదేశ్ లోని లేపాక్షి గా గుర్తించవచ్చు. (లే పక్షి కాలక్రమములో లేపాక్షి గా నామాంతరం చెందినది). ఇంకొక ప్రచారములో నమ్మకము ప్రకారము, జటాయుపాక ప్రదేశాన్ని ఏట పాక అని కూడా అంటారు, ఇది భద్రాచలానికి రెండు కి. మీ.ల దూరం లో కలదు. సీతాపహరణ సమయం లో ఆమె కేకలు విన్న జటాయువు రావణుడి తో ఈ ప్రదేశం లో యుద్ధం చేసాడని

ఇక్కడే తన ప్రాణాలు కోల్పోయాడని, అయితే, తన ఒక రెక్క మాత్రం విరిగి ఎగిరి వెళ్లి ఇక్కడకు 55 కి. మీ. ల దూరం లో కల రెక్కపల్లి లో పడిందని చెపుతారు. తర్వాత రాముడు జటాయువు ద్వారా సీతాపహరణను తెలుసుకున్నాడని చెపుతారు. రామలక్ష్మణులు పంచవటి నుంచి సీతాన్వేషణకై పశ్చిమము నుంచి దక్షిణ దిక్కుగా వెళతారు **(పంచవటి నాసిక్ అని భావన చేసినట్లయితే పశ్చిమ నుంచి దక్షిణ కు వెళితే ఋష్యమూకము రాదు. కావున గమనించ గలరు).** లేడి వెంట వెళ్లిన రాముడు కామరూపి అయి అడవిలో పరిగెత్తుచున్న లేడి రూపములో ఉన్న మారీచుని చంపి వెనుకకు ఆశ్రమునకు వచ్చుటకు మరలెను. అప్పుడు రామునకు అనేకమైన దుర్నిమిత్తములు కనబడెను. ఆందోళనతో ఉన్న రామునకు లక్ష్మణుడు ఎదురు వచ్చుచు కనపడెను. రాముడు లక్ష్మణుడితో.. నీ మీద నమ్మకంతో సీతమ్మను అప్పగిస్తే ఆమెను ఆపదలో పడవేసి నా ఆజ్ఞను ధిక్కరించి రావడము తగదని చెప్పెను. రామలక్ష్మణులు ఇద్దరు ఆశ్రమమునకు వచ్చుసరికి ఆశ్రమములో సీత జాడ కనబడలేదు. సీత కనబడక పోవుసరికి రాముడు పరిపరి విధముల దుఃఖించెను. రాముడు సుక్షత్రియుడు. మాహాపరాక్రమశాలి. ముల్లోకములలోను రామునికి ఎదురుగా నిలబడగలిగిన వారు ఎవరూ లేరు. అటువంటి రాముని భార్యను దొంగ లాగ రావణుడు ఎత్తుకొని పోయినాడు. ఇప్పుడు రామునికి సీతమ్మను ఎవరైనా రాక్షసులు కానీ క్రూర మృగములు గాని భక్షించాయా! లేక ఎవరైనా శత్రుత్వములో కానీ లేక వేరొక కారణము వలన గాని ఏ రాక్షసుడైన తీసుకొని వెళ్లాడా! అతనికి సమాచారం ఈయడానికి ఎవరూ లేరు. సర్వ శక్తివంతుడైనప్పటికీ భార్యను రక్షించు కోలేక పోయినాడనే అపప్రధ రాముని ఇంకనూ బాధించు చున్నది. ఇట్టి కష్టము ఎవ్వరికీ రాకూడదు. రామలక్ష్మణులకు అగమ్య గోచరంగా ఉన్నది. ఈ విధముగా అరణ్యము అంతయు సీతమ్మ జాడకై వెతుకుచు రాముడు ఆ అరణ్యములో కాన

వచ్చిన పశు పక్ష్యాదులను, చెట్లను, పుట్టలను, పర్వతములను, గోదావరి నదిని అన్నింటిని అడుగుచున్నాడు ... "సీత కనిపించిందా?". అలా వెళ్ళు చుండగా మృగము లన్నియు దక్షిణ దిశగా తల ఎత్తి పైకి చూచుచూ పోవుటను సూక్ష్మ బుద్ధిశాలి అయిన లక్ష్మణుడు చూచెను. అప్పుడు రామునితో అన్నా! ఈ మృగముల సంకేతమును బట్టి మనము రాక్షసులకు ఆలవాలమైన నైరుతి దిశగా సీత జాడ కోసము వెదుకుదాము (**సాధు గచ్ఛావహే దేవ దిశం ఏతాం హి నైఋతిం**) అని అటు ప్రయాణమైరి. అప్పుడు రాముడు భూమిపై పడి ఉన్న పుష్ప పరంపరను చూచి అవి సీత తన కురులపై ధరించినవిగా గుర్తించెను. అప్పుడు సెలయేళ్ళతో ఒప్పుచున్నట్టి ప్రస్రవణ పర్వతమును గమనించెను. ఆ పర్వతముతో **కచ్చిత్ క్షితి భృతాం నాథ దృష్టా సర్వాంగ సుందరీ, రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా 3 64 29** (పర్వత రాజ! సీతను చూచితివా అని అడిగెను). ఎక్కడ నుంచి సమాధానము రాకపోయే సరికి రాముడు క్రుద్ధుడై .. **మమ బాణాఽగ్నినిర్దగ్ధో భస్మీ భూతో భవిష్యసి, అసేవ్యః సతతం చైవ నిస్తృణ ద్రుమ పల్లవః.** నా బాణాగ్ని జ్వాలలలో మొత్తము భస్మీపటలనము చేస్తాను అంటాడు. ఇంతలో సమీపములోనే రాక్షసుడి పాదముద్రలు మరియు సీతమ్మ కాలిజాడలు కనుగొనెను. ఇంకా కొద్ది దూరములో విరిగిన బంగారు రథము, హతుడై యున్న సారధి, బాణములు కనపడెను. అది చూచి రాముడు కుపితుడై ఈ మహారణ్యమున సీతను ఎవ్వరును రక్షించలేదు. నాకు అప్రియము చేసి నన్ను అసమర్ధునిగా చూచిన ఈ ఇంద్రాది దేవతలను, రాక్షసులను ఈ ముల్లోకములను ప్రళయ స్థితిని కలిగించుదును అని లోకములను ధ్వంస మొనర్చుటకు పూనుకొనెను. అప్పుడు లక్ష్మణుడు శాంత వచనములతో అన్నా! ఇక్కడ భయంకరమైన యుద్ధ చిహ్నములు కనబడుచున్నవి. మనము సావధానులమై ముందుకు సాగుదాము అనెను. కొంత తడవకు పర్వత శిఖరము వలె రక్తసిక్తములతో యున్న జటాయువు కనబడెను. అప్పుడు ఆ పక్షి రాజు నేను నీ

తండ్రి ప్రియ మిత్రుడను. సీతను రావణుడు అపహరించాడు, నా రెక్కలను ఆ రావణుడు ఖండించాడు అని చెప్పెను. అయితే రావణుడు సీతను అపహరించుకు పోయిన సమయము **"విందముహూర్తము[12]"** అనగా నీనుండి దూరమైన సీతారూప ధనము తప్పక లభించును

**విన్దో నామ ముహూర్తోఽయం స చ కాకుత్స్థ నాఽబుధత్**
**త్వత్ ప్రియాం జానకీం హృత్వా రావణో రాక్షసేశ్వర:**
**ఝషవ ద్బడిశం గృహ్య క్షిప్రమ్ ఏవ వినశ్యతి**

ఈ విధముగా చెప్పి జటాయు నేలకొరిగి ప్రాణములు అనంత వాయువులో కలసి పోయెను. రావణుని చేతిలో తీవ్రముగా గాయపడి ప్రాణాపాయ స్థితికి చేరుకొన్న జటాయు శ్రీరాముడు వచ్చు వరకు బ్రతికి ఉండుటకు గల కారణము సీతా దేవి అనుగ్రహమే అని స్కాంద పురాణము చెప్పుచున్నది **(దేవీ మాం ప్రాహ రాజేంద్ర యావత్ సంభాషణం మమ, భవతాస్థావదాసన్ మే ప్రాణా ఇత్యాహ జానకీ).** తరువాత జటాయుకు శ్రీరాముడు అంత్య క్రియలను ఒనర్చెను. నాచే దహన సంస్కారములను పొంది ఉన్నందున **నీవు మోక్ష ప్రాప్తికి అర్హుడవు[13]** అనెను.

---

[12] "నష్టం ధనం విందతి (లభతే) అస్మిన్ - ఇతి విందః" వింద ముహూర్త కాలమున నష్టమైన ధనము యజమానికి తప్పక లభించును.

శ్లో|| **రౌద్ర: శ్వేతశ్చ మైత్రశ్చ తథా సారభటః స్మృతః|**
**సావిత్రో వైశ్వదేవశ్చ గాంధర్వః కుతపస్తథా||**
**రౌహినస్తిలకశ్చైవ 'విజయో' నైఋుతస్తథా|**
**శంబరో వారుణశ్చైవ భగః పంచదశః స్మృత||**

ఈ పదునైదు పగటి ముహూర్తములు. పదునొకండుదైన విజయ ముహూర్తమునకే 'విందము' అని నామాంతరము.

[13] తనను గూర్చి **"ఆత్మానాం మానుషం మన్యే"** (నేను మానవ మాత్రుడను) అని పేర్కొన్న శ్రీరాముడు మోక్షమును ఎట్లు ప్రసాదించును? **"సత్యేన లోకాన్ జయతి"** అను ప్రమాణము

**(మయా త్వం సమఽనుజ్ఞాతో గచ్ఛ లోకాన్ అనుత్తమాన్).** అశోక వనములో నున్న సీత రాముని కొరకై శోకించు చుండగా దండకారణ్యములో రాముడు సీతకై దుఃఖించు చుండును. అది సాత్విక వృత్తులకై పడిన శోకము గాని సీత అనే భౌతిక అస్థిత్వము కొరకు కాదు. సాధనాకాలములో పూర్వపు సాత్విక‌ వృత్తులను కోల్పోయినప్పుడు సాధకుడు గాబరా చెంది విలపించడము జరుగును వాసుదేవానంద సరస్వతి మాటలలో...

**రాజస స్వానుర్భూతిం తాం సీతాం యత్నాజ్ఞ హారః|**
**రామః పరాత్మామి తతః స్వాను ర్భూతిం వియోగతః||**

సీతా రూప స్వానుభూతులకై రాముడు విలపించెను. రామాయణములో తగినంత భాగము ఈ సీతా శోకమునకే వినియోగించ బడినది. రావణుడు పోయిన మార్గమును రామునకు తెలిపి జటాయు దేహత్యాగము చేసెను. చనిపోవుటకు ముందు జటాయు రామలక్ష్మణులకు పంపాసరోవరమునకు పోయి హనుమ, సుగ్రీవుల మిత్రత్వమును పొందుమని తద్వారా సీతను పొందవచ్చునని సలహా ఇచ్చెను. (Note)[14]

### 3.17 అయోముఖి

అరణ్య కాండములో అరణ్యములో సంచరించుచున్న రామలక్ష్మణులకు ఎదురు అయిన మొదటి రాక్షసుడు విరాధుడు. చివరి వాడు కబంధుడు. స్వాధీన ప్రవృత్తి, స్వార్థ ప్రవృత్తి ఆత్మకు సహజములు కావు. శరీర సంబంధముచే అజ్ఞానము, జ్ఞానమును ఆవరించగా కలుగును. జీవుడు తాను చేయు చున్నాను, తన కొరకు

---

ననుసరించి సత్యనిష్టాగరిష్ఠుడు అయినందున శ్రీరామునకు సర్వలోకములు అధీనములో ఉండును. కనుక శ్రీరాముడు మోక్షమును అనుగ్రహించుటలో విప్రతిపతి లేదు.

[14] సీతాపహరణం గ్రీష్మ ఋతువు లో జరిగింది. దక్షిణ భారతదేశంలో పగలు షుమారు 12 గంటలు. సీతాపహరణ సమయం పగటి ముహూర్తంలో 11వది. అంటే సీతాపహరణ సమయం షుమారు పగలు మూడు గంటలకు కావచ్చు.

చేయు చున్నాను అని శరీర భావముతో ప్రవర్తించును. అజ్ఞానముచే పరాధీనమై ప్రవర్తించుతూ స్వాధీన ప్రవృత్తి గల వాడను అని అనుకొనుట అజ్ఞాన విజృంభితము. ఈ విధముగా స్వాధీన ప్రవృత్తి, స్వార్థ ప్రవృత్తి తో భగవంతునకు చెందిన వాడినని భావించుట అసురత్వము. వాని ప్రీతి కొరకై వాని అధీనమై ప్రవర్తించు చున్నానని భావించుట మానవత్వము. విరాధుడు అనగా అప్రీతిని కలిగించువాడు. అప్రీతిని కలిగించు స్వార్థ ప్రవృత్తిని, స్వాధీన ప్రవృత్తిని అంతమొందించి భూమిలో పాతిపెట్టును. కానీ కబంధుని దహించినారు. కర్మ వలన, పుణ్య పాపముల వలన ఈ శరీరము లభించును. రజస్తమో గుణములు విజృంభించినప్పుడు శాస్త్రములను లెక్క చేయక, పరహింసతో, స్వార్థముతో, అహంకారంతో ప్రవర్తించ వలెనని అనిపించును. ఇట్టి అసుర ప్రవృత్తికి చివరి హద్దు కబంధుడు. శరీర పోషణయే పరమ ప్రయోజనము అని అనుకొనెడి వాడు కబంధుడు. యోగవాసిష్ఠములో వసిష్ఠుడు చెపుతూ ... ఇందుకు గాను పూర్వ వాసనలను (పూర్వ కర్మలను) పురుష ప్రయత్నముతో జయించాలి, శుభ వాసనలను అభివృద్ధి చేసుకోవాలి అని చెప్తారు. ఇంకా చెపుతూ .. ప్రపంచ వాసనలన్నీ సన్నగిలిపోవుటమే మోక్షం. ఆ వాసనలు అభివృద్ధి కావటమే బంధం. అభ్యాసం వలనే వాసనలు బలపడు తున్నాయి. ఆత్మలో మనస్సు ఏకత్వం పొందితే, అందులోని రాగ ద్వేషాలు, వాసనలు తొలగిపోతాయి. ఎవరి చిత్తం లో వాసనలు నశించినాయో అతడే జీవన్ముక్తుడు.

ఇక కథా విషయానికి వస్తే ...

రామలక్ష్మణులు సీతమ్మను వెతుకుచు ఘోరముగా, ప్రవేశింప శక్యము కానట్టి క్రౌంచారణ్యమున ప్రవేశించిరి. అందు భయంకర రూపముగల వికృతమగు ముఖము గల ఒక రాక్షసి కనపడెను. ఆమె అయోముఖి. ఆమె లక్ష్మణుని పట్టుకొని రమ్ము రమింతము (**ఏహి రంస్యావహేతి ఉక్త్వా**

**సమాలంబత లక్ష్మణం)** అనుచు కౌగిలించుకొని తన వైపు లాగికొని పోవుచుండెను. అప్పుడు లక్ష్మణుడు కోపించిన వాడై ఆమె ముక్కు చెవులు కోయగా పెద్దగా అరుచుచు పారిపోయెను. సాధకుని వివేకమును నష్టపరచు వివేకహీన వృత్తులే అయోముఖి. సాధకుడు తన లక్ష్మణ రూప వివేకమును నష్టపరుచక అటువంటి సందర్భములలో అయోముఖి వృత్తులను సంహరించ వలెను. అయోముఖ వధ తర్వాత రామలక్ష్మణులు ముందుకు సాగిరి.

### 3.18.1 కబంధ వధ

నెమ్మదిగా రామలక్ష్మణులు ఇద్దరు ముందుకు నడచుచు ఒక కీకారణ్యమునకు చేరిరి. అప్పుడు ఒక ప్రచండ వాయువు, భయంకరమైన శబ్దము వచ్చెను. పరీక్షగా చూడగా పొద యందు ఒక మొండెము మాత్రమే ఉన్న భయంకరమైన మహాకాయుడైన కబంధుడను రాక్షసుని గాంచెను. కడుపు వద్ద ముఖము ఉన్నది. వక్షస్థలం మీద అగ్నిహోత్ర జ్వాల వంటి మెఱయుచున్న ఒక కన్ను ఉన్నది. రెండు యోజనముల పొడవైన రెండు భుజములు ఉన్నవి. ఆ చేతులతో అనేకరకములైన మృగములను లాగుకొని భక్షించువాడు. రామలక్ష్మణులను గూడ తన వైపుకు లాగుకొనెను. అది గమనించిన రామలక్ష్మణులు అతని రెండు చేతులు ఖండించిరి. అప్పుడు కబంధుడు తన్ను ఉద్ధరించడానికి వచ్చినది రామలక్ష్మణులు అని ఎరిగి రామా! నేను శాపవశమున ఇట్లు రాక్షసుని కాలము గడుపుతున్నాను. మీరు నన్ను దహించినట్లయితే నాకు శాప విమోచనము అయ్యి మీకు సీత లభించు మార్గమును చెప్పి ఒక మిత్రుని వలననే సహాయపడగలను అని చెప్పెను. తరువాత ఆ కబంధుని ఒక గోతిలో వేసి దహనము చేసిరి. దహించిన తర్వాత ఆ రాక్షసుడు స్వస్వరూపమును పొంది రామా! దీనమైన అవస్థను పొందియున్నావు, నీ అంతగా నీవు శత్రువును జయించ జాలవు, నీకు మిత్రుడు సహాయము కావలెను. కావున సుగ్రీవుని సఖ్యము చేసుకొమ్మని తద్వారా సీత జాడ తెలియగలదని, సీతను పొందగలవని చెప్పి

అదృశ్యమయ్యెను. ఆ సుగ్రీవుడు కొంతమంది నమ్మకమైన మంత్రులతో కూడి ఋష్యమూక పర్వతము పైన ఉన్నారు. అతనికి రాక్షసులుండే అన్ని ప్రదేశములు, ఈ లోకములోని అన్ని స్థానములు తెలియును.

## 3.18.2 కబంధ వధలోని యోగ రహస్యము

కబంధ వధలోని యోగ రహస్యమును గమనిద్దాము. శిరస్సులేని శరీరము. ఇక్కడ శిరస్సు అనగా బుద్ధి లేదా వివేకము. వివేక రహిత సాధకుడు శిరస్సులేని కబంధ రాక్షసుని వంటి వారు. అటువంటి కబంధుడు లక్ష్మణుని తన ఉదరము నందు వేసుకొనుటకు సిద్ధపడెను. రామ సాధకుడు లక్ష్మణుని రక్షించి కబంధ రూప వివేక రహిత అవస్థను సంహరించెను. పరంపరాగతమైన మూర్ఖ కల్పనా రూప అయోముఖి మరియు వివేక రహిత కబంధులను నష్టపరచి సాధకుడు తన లక్ష్మణ రూప వివేకమును ఎల్లప్పుడూ ఉపయోగములో ఉంచవలెనని ఆశయము. అయితే కబంధుడు రామలక్ష్మణులకు పంపాసరోవరము, ఋష్యమూక పర్వతము గురించి వెల్లడించెను. సీతాశోధనకై సుగ్రీవుని సహాయము తీసుకొనమని చెప్పెను. రాముని శత్రువు కూడా రామునికి సుయోగ్యమైన సలహానిచ్చుట రామాయణ విశేషము. సాధకుని చెడ్డ వృత్తులు కూడా సాధకుని మిత్రులవుదురని కథ యందలి రహస్యము. "క" అనగా ఆనందము. "బంధ" అనగా అడ్డగించువాడు. కబంధుడు జ్ఞాన మార్గమును మూసుకొని పోవునట్లు చేయువాడు. శరీర పోషణయే ప్రధానమని భావించి దానికై యత్నించెడి కర్తృత్వ, భోకృత్వములు గల అసురత్వము నష్ట పరచ వలెను.

## 3.19 శబరి

శ్రీరాముని దర్శించిన తర్వాత శబరి నదీరూపముగా మార్పు చెందినదని, ప్రస్తుతము ఉన్న శబరి నదియే రామాయణ కాలములోని శబరి అని చాలా ప్రచారములో ఉన్నది. వాస్తవముగా వాల్మీకి రామాయణములో ఆ విధముగా

వర్ణించ బడలేదు. రామలక్ష్మణులు జటాయు మరణము (లేపాక్షి) తర్వాత కిష్కింధకు వెళతారు. ఋష్యమూక పర్వతము ప్రస్తుతము కర్ణాటకలోని హంపి వద్ద ఉన్నది. అక్కడ సుగ్రీవుని గుహ, ఆంజనేయుని జన్మస్థానము కలవు.

జీవుని పరమాత్మలో చేర్చెడి వాడు, చేర్చెడి మార్గమును సిద్ధము చేసెడివాడు ఆచార్యుడు/గురువు. అందుచే భగవత్ప్రాప్తికి ఆచార్యాభిమానమే ముఖ్యమని ఎరుంగ చేయుటకు శబరి వృత్తాంతము చెప్పబడినది. శబరిని దర్శించుటచే రామునకు జీవుడు పరమాత్మను పొందుటకు జీవుని సాధన, పరమాత్మ ప్రయత్నము కంటే ముఖ్యమైనది ఆచార్య కటాక్షము అని తెలియును. అందుచే ముందుగా శబరి దర్శనము చేసి ఆచార్య కటాక్షముచే ఆమె మోక్షమునిపొందు వృత్తాంతము రాముడు గుర్తించెను. సీతమ్మను పొందుటకు కూడా అట్టి ఆచార్యుడు కావలెనని రాముడు గుర్తించెను.

తదుపరి రామలక్ష్మణులు కబంధుడు చెప్పిన పంపా సరోవర మార్గమును జేబట్టి పశ్చిమ దిశగా పయనమయిరి. అక్కడ పంపా తీరములో మతంగ శిష్యుల పరిచర్యలు చేయుచు ఒక శబరి జాతి స్త్రీ తపస్సు చేయుచు వసించి యుండెను. ఆమె సన్యాసిని. ఆమెను శబరి అని పిలిచెదరు. ఆమెకు గురుసేవయే నిత్యము ఆచరించు ధర్మము. గుర్వాజ్ఞచే చిరకాలంగా శ్రీరామ దర్శనమునకై వేచి యున్నది.

రామలక్ష్మణులు ఆశ్రమములో శబరిని చేరిరి. యోగసిద్ధిని పొందిన ఆ శబరి రామలక్ష్మణులను చూచి........

**తౌ తు దృష్ట్వా తదా సిద్ధా సముత్థాయ కృతాంజలిః**

**పాదౌ జగ్రాహ రామ స్య లక్ష్మణ స్య చ ధీమతః**

**పాద్యం ఆచమనీయం చ ప్రాదాత్ యథా విధి**

రామలక్ష్మణులకు పాదాభివందనం చేసి అర్ఘ్యపాద్యాదులతో అతిథి మర్యాదలు గావించెను. అప్పుడు శబరిని రాముడు అడుగుతున్నాడు.

**కచ్చి త్తే నిర్జితా విఘ్నాః కచ్చి త్తే వర్ధతే తపః**
**కచ్చి త్తే నియతః కోప ఆహార శ్చ తపో ధనే**
**కచ్చి త్తే నియమాః ప్రాప్తాః కచ్చి త్తే మనసః సుఖమ్**
**కచ్చి త్తే గురు శుశ్రూషా సఫలా చారు భాషిణి**
**రామేణ తాపసీ పృష్ఠా సా సిద్ధా సిద్ధ సమ్మతా**
**శశంస శబరీ వృద్ధా రామాయ ప్రత్యుప స్థితా**

ఓ మృదుభాషిణీ! గురుసేవలో కృతార్థురాలివి అవుతున్నావా! అప్పుడు శబరి రామా! మా గురువులైన మతంగ మహర్షి నీవు చిత్రకూటమిలో ఉన్నప్పుడు పరమపదించినారు. వారి ఆజ్ఞానుసారం నేను నీ రాక కోసము నిరీక్షిస్తున్నాను. ఈనాడు నీ దర్శనము వలన నా తపస్సు, సిద్ధిచినది. మా గురువులు ఉపవాస నియమములు కారణంగా సప్త సముద్రముల దగ్గరకు వెళ్లలేక చింతన చేయగా అవియే ఇక్కడకు వచ్చినవి. అదిగో ఆ కనపడేదే **"సప్తసాగర తీర్థము"**, (ఇదియే తిరుపతి లో యున్న కపిల తీర్థం లేదా తిరుమలలోని శ్రీవారి పుష్కరిణి అని ఒక నానుడి). అని చెప్పి ఆ పంపాతీరమున లభ్యమయ్యేది మధురమైన పదార్థములను రామునికి భక్తితో సమర్పించింది. తరువాత శ్రీరాముని అనుమతితో శరీరమును అగ్నిహోత్రములో అర్పించి దివ్య శరీరములో పైకి వచ్చినది. అక్కడ నుంచి రామలక్ష్మణులు కిష్కింధ లోని ఋష్యమూక పర్వతము వేపు సాగినారు.

### 3.20 అరణ్య కాండ - సింహావలోకనము

లోకములో స్వార్థము, అహంకారము పెరిగి దేహాత్మాభిమానంతో శరీర పోషణకై లోకులను హింసించుచు జీవించెడి అసుర స్వభావము పెరిగిపోయిననాడు దానిని అణచుటకు ఆచరణముచే స్వస్వరూపమును అనగా మానవత్వమును లోకమున ప్రకాశింపచేయుటకు శ్రీరాముడు తన అకుంఠిత సత్యసంధత,

ఏకపత్నీవ్రతము, యోగదృష్టి ద్వారా మానవుడు దైవముగా మారి లోకములోని అసురభావమును రూపుమాపవచ్చని నిరూపించించి, లోక కళ్యాణమునకై తాను కర్మలను ఆచరించుతూ ఇతరులచే ఆచరింప చేయించాడు. **(యద్యదా చరతి శ్రేష్ఠ: తత్తదేవేతరో జనః స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే .. భ.గీ. 3 /21 శ్రేష్ఠుడైన పురుషుని ప్రవర్తనని లోకులు పాటింతురు)**. సీతమ్మను స్వార్థమునకై స్వతంత్రుడయి తనకై వినియోగించవలెనని యత్నించుట లోకవినాశకారము. ఇది రావణ తత్త్వము. దీనిని అంతమొందించుట రామతత్త్వము. ఇట్టి అసుర భావములను ధ్వంసము చేసి మానవత్వమును లోకమునకు చాటుటకు శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై దండకారణ్యమునకు ప్రవేశించాడు. చేసిన కర్మలకు దండముగా అనగా ఫలితముగా అనుభవించెడి సుఖ దుఃఖములతో నిండినదియే సంసారము. అదియే దండకారణ్యము. అందు దైవ స్వభావులైన తాపసులు, అసుర భావాలు కల్గిన రాక్షసులు ఉందురు. అటువంటి తాపసుల రక్షణకై అసురకోటి మధ్యకు తానే వచ్చి ప్రవేశించి నాడు **(స్వజనస్య రక్షితా)** దండకారణ్యము ఎవరును ప్రవేశింప వీలుకానిది. కానీ రాముడు దుర్ధర్షుడు కనుక ప్రవేశించెను. శరణాగత రక్షణయే రాముని దీక్ష. రామాయణము అంతయు ఇట్టి శరణాగతయే కన్పట్టును. ఇచ్ఛా, క్రియా, జ్ఞాన శక్తుల మూడు రూపాల్లో శక్తి స్వరూపిణిగా సీత యున్నది. సీతాదేవి మూలప్రకృతి స్వరూపిణి అందుకు ఆమెను ప్రకృతి గా పిలవబడుతున్నది. **(ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి త్రయం యద్భావ సాధనం, తద్బ్రహ్మసత్తా సామాన్యం సీతాతత్త్వ ముపాస్మహే, మూల ప్రకృతి రూపత్వాస్ త్సాసీతా ప్రకృతి:)** అట్టి సీత తన ఆనంద వృత్తి రూపమైన రాముని మాత్రమే కోరుకొనును. **(వృత్యావ్ సీతాం స్వానుభూతిమ్ సుఖమాస్తే ద దేవతః, సంసార విపినం ప్రతిపాహంకారౌ రావణాభిధ్యాహ్)**. సాధకుడైన జీవాత్మకు సీత రాజస అనుభూతి అటువంటి స్వానుభూతి రూపమైన సీతాసహిత రామరూప సాధకుడు సుఖముగా ఉండును.

సంసారము ఒక విపినము అనగా దండకారణ్యము. అందు రావణ రూప అహంకారము ప్రవేశించును. **(రాజసః స్వానుభూతింతాం సీతాం యత్నాజ్ఞ హారహా, రామః పరాత్మపి తతః స్వానుభూతి వియోగతః)**. సాధనాయత్నము ద్వారా ప్రాప్తించినది రాజస వృత్తి అయిన సీత. ఈ రాజస వృత్తి రూప సీతను బ్రహ్మ రూప రావణుడు హరించినాడు. రామ జీవాత్మ పరమాత్మ స్వరూపుడైనప్పటికీ, రాజస వృత్తి హరింపబడినప్పుడు సీతావియోగమనే కారణములో దుఃఖితుడు అయ్యాడు. మానవ జీవనమునకు అత్యావశ్యకమైనది వివాహ సంబంధము. వివాహము ద్వారా తక్కిన సంబంధము లన్నిటి కంటెను పతి-పత్నిల శారీరక సంబంధము మహత్వపూర్ణముగా నిలబడును. ఇదియే పరిణామమునకు మూలము. దైనందిన వ్యవహారములకు తోడు, పతి-పత్నుల జీవాత్మల యందు పరస్పరము సంస్కార పరిణామము జరుగును. శరీరమునకు పరిణామము (మార్పు) ఎట్లు జరుగునో, జీవాత్మ కూడా ప్రగతి నొందును. అటువంటి జీవాత్మలు పరస్పరము ప్రగాఢ ప్రేమతో జీవనము సాగించినచో జీవాత్మల పరస్పర ఉన్నతి జరిగి ముక్తిని పొందుటలో అగ్రేసరులగుదురు. వైదిక పరంపరలో వేలకొలది సంవత్సరములుగా కొనసాగుతున్న అతీంద్రియ అనుభవమిది. జన్మ జన్మాంతరముల యందు ఈ ప్రేమ సంబంధము రెండు జీవాత్మలను ఉన్నతి వైపునకు తీసుకొని పోవుట అనునదియే వైజ్ఞానిక సత్యము. సీతారాముల జీవనము అటువంటి పరిణామ జీవన విజ్ఞానమే. విద్య, పరాక్రమము, సంపత్తి, అంగబలం ఇత్యాది యందు రావణుడు, రాముని కంటెను అధికునిగా చూపబడెను. రావణుడు తన స్వభావంతో సీతను భార్యగా చేసుకొనవలెనని, తన ఆధికారముగా భావించెను. ఈ పురుష ప్రవృత్తి కారణముగనే అనేక స్త్రీ విషయక ప్రకరణములు సాగుచున్నవి. రావణుని చరిత్ర ఈ విధముగానే చూపబడినది. కానీ శూర్పణఖ, అయోముఖి వంటి స్త్రీలు

రామలక్ష్మణులను  మోహించినను వైదిక పరంపర ననుసరించి స్త్రీ మోహితులు గాలేదు. సుసంస్కారయుత స్త్రీ అయిన సీత తనను మోహించిన అన్య పురుషుడు ఎంతటి సౌందర్యవంతుడు, బలవంతుడు, సంపద పరుడు అయినను పతి ప్రేమ యందు లోపము చూపించదు. ఈ ఆదర్శమును వాల్మీకి సీత ద్వారా ప్రపంచ ప్రజల ముందుంచి వైదిక ధర్మము యొక్క ఉన్నతిని చాటినాడు. సీతారాముల అన్యోన్య ఆదర్శము ప్రపంచమునకు ఆదర్శము.

**అరణ్య కాండ సమాప్తము**

**శ్రీరామ జయరామ జయజయ రామ**

# 4.0 కిష్కింధ కాండము

## 4.1 హనుమ సమాగము

అరణ్య కాండలో మారీచుడు బంగారు లేడిగా మారి సీతమ్మను ఆకర్షించింది. ఇది మొదట జీవులు సంసారమున ఎట్లు ప్రవేశింతురో వెల్లడించెను. ప్రియురాలు దూరము అయినప్పుడు ప్రియుడు సుందరమగు దృశ్యములను చూడగానే ఆమెను స్మరించి శోకించు చుండును. జీవాత్మల ఎడబాటు పరమాత్మ కూడా అనుభవించును. శ్రీరాముడి పరిస్థితి అలాగునే యున్నది. రామాయణ కావ్యము శ్రీరాముడు నరుడిగా ప్రేయసి వియోగములో అనుభవించెడి వేదనను అనుభవించుచున్నట్లు కనబడును. ప్రకృతి యొక్క సౌందర్యమును అనుభవించుట తప్పు గాదు. కానీ దానిచే రజోగుణ వికారమగు కామమునకు లోనుకాకుండా ఉండవలెను. కానీ ఉండజాలడు. ఈ క్లిష్టమైన దశను రాముడు అనుభవించుతూ మనకు దర్శింప చేయుచున్నాడు.

ఋష్యమూకమునుండి రామలక్ష్మణులను సుగ్రీవుడు చూచి తనను సంహరించుటకు వాలి పంపేనేమో అని సందేహ పడెను. అప్పుడు మాటలాడుటలో నేర్పరి అయిన హనుమ సుగ్రీవునితో "ఈ ఋశ్యమూకమునకు వాలి రాలేడు కావున భయము నొందవలదు" అని చెప్పెను. శుభకరమగు మాటలు విన్న సుగ్రీవుడు హనుమతో వాలి చాలా బుద్ధిమంతుడు, కార్యదక్షుడు, అనేక ఉపాయములు తెలిసిన వాడు కావున నీవు స్వస్వరూపమును వ్యక్త పరచకుండా వారి స్వభావమును గమనించుమని చెప్పెను. అంత హనుమ భిక్షు రూపమున రామలక్ష్మణులను చేరి వీరు తప్పక సుగ్రీవుని విరోధి అయిన వాలిని అంతమొందించ గలరని నిశ్చయించుకొని వారిని ప్రశంసించి మీరు మనుష్యరూపములో యున్న దేవతల వలె యున్నారు. రాజ్యమునకు తగిన వారై యుండియు ఏల జటామండలము దాల్చి ఇచటకు వచ్చియున్నారు.

సమస్త ఆభరణములు దాల్చుటకు తగిన బాహువులు కలిగి యుండియు ఎందుకు ఆభరణములు ధరింపరైతిరి అని అడిగెను. వారి మీద నమ్మకము కలిగి తన యొక్క భిక్షుక రూపమును వీడి తాను వచ్చిన ప్రయోజనము, వానర రాజైన సుగ్రీవుడు పంపగా వచ్చినానని, నా పేరు హనుమ అని, సుగ్రీవుడు మీతో మిత్రత్వము కోరుకొంటున్నాడు అని నుడివి ఊరకుండెను. అప్పుడు రాముడు లక్ష్మణునితో మనము వెతుకుతున్న సుగ్రీవుడు, తన మంత్రిని పంపినాడు.

**న అన్‌ఋగ్వేద వినీతస్య న యజుర్వేద ధారిణ:**
**న సామవేద విదుష: శక్యం ఏవం ప్రభాషితుం**
**న్యూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం**
**బహు వ్యాహరతా అనేన న కించిత్ అపశబ్దితం**
**న ముఖే నేత్రయోర్వాఽపి లలాటే చ భ్రువో: తథా**
**అన్యేషు అపి చ గాత్రేషు దోష: సంవిదిత: క్వచిత్**
**అవిస్తరం అసందిగ్ధం అవిళంబితమ్ అద్రుతం**
**ఉర: స్థం కంఠగం వాక్యం వర్తతే మధ్యమే స్వరే**
**సంస్కార క్రమ సంపన్నాం అద్భుతం అవిళంబితాం**
**ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీం**
**అనయా చిత్రయా వాచా త్రి స్థాన వ్యంజనస్థ యా:**
**కస్య న ఆరాధ్యతే చిత్తం ఉద్యత అసే అరే: అపి**

ఈతడు మూడు వేదములను అధ్యయనము చేసినట్లు ఇతని మాటల వలన తెలియు చున్నది. అంతియే గాక ఇతడు మనతో పెక్కు విషయములను వివరించెను. ఎక్కడను అపశబ్దము లేదు. కనుక ఇతడు సమస్త వ్యాకరణము కూలంకషముగా నేర్చినవాడు అని తెలియును. మాట్లాడు నప్పుడు ముఖము నందు, ఫాలభాగము నందు, కనుబొమల యందు, తదితర శరీర భాగముల యందు ఎట్టి వికారము లేదు. ఇతడు సంక్షిప్తముగా తన అభిప్రాయములు తెలియ

చేసినాడు. ఇతను పలికిన మాటలు వ్యాకరణ శాస్త్ర సమ్మతములు. ఇతని వచనములు భావములను ప్రకటించుటకు అనుగుణమగు స్వరస్థానములో (స్వరములు ఉన్నతములగు స్థానములు మూడు అవి వక్షస్థలం, కంఠము, శిరస్సు) పలుక బడుటచే ఆశ్చర్యము కలిగించు చున్నది. అప్పుడు రామలక్ష్మణులు సమయోచిత వచనములతో హనుమతో మాట్లాడి సుగ్రీవుని వద్దకు వెళ్లిరి.

## 4.2 రామ సుగ్రీవుల మైత్రి

రామలక్ష్మణులను సుగ్రీవుని వద్దకు చేర్చి హనుమ సుగ్రీవునితో .. మహావీరుడైన రాముడు దశరథ మహారాజు పుత్రుడు, మహాపరాక్రమశాలి, వాలిని సంహరించ సమర్థుడు కావున అతనితో మిత్రత్వము సేయుము. వారు కూడా సీతాన్వేషణకై నీ మిత్రత్వమును అభిలషించు చున్నారు అనెను. అప్పుడు సుగ్రీవుడు మిగుల సంతోషించి, రామలక్ష్మణులకు అతిథి మర్యాదలు చేసి మిత్ర హస్తమును అందించెను.

**తతోఽగ్నిం దీప్యమానం తౌ చక్రతు శ్చ ప్రదక్షిణమ్**
**సుగ్రీవో రాఘువ శ్చైవ వయస్యత్వమ్ ఉపాగతౌ**

అప్పుడు రామసుగ్రీవులు అగ్నిసాక్షిగా మిత్రులైరి. సుగ్రీవుడు రామునితో రామా! మా అన్న వాలి అకారణముగా నాతో వైరము నొంది నన్ను రాజ్యము నుండి వెడలగొట్టి, నా భార్యను అపహరించెను. అతడు మహా బలవంతుడు కాన నాకు వాలిని సంహరించి రక్షణ ఈయవలసినదిగా ప్రార్థన. అందుకు రాముడు సుగ్రీవునకు అభయమును ఒసగెను. సుగ్రీవుడు రామునితో రామా! మేము ఇచ్చట నుండగా ఒకనాడు ఒక క్రూరాత్ముడైన రాక్షసుడు బలవంతముగా ఒక స్త్రీని తీసుకొని పోవుట చూచితిమి. అతను దక్షిణ దిశగా పయనం అయ్యాడు. ఆ రాక్షసుని నివాస స్థానము, అతని వంశము, వాని శక్తిసామర్థ్యములు నాకు

తెలియవు. ఆ స్త్రీ ఆర్తనాదముతో మిమ్ములను గూర్చి బిగ్గరగా ఏడ్చుతూ శోకించుట గమనించితిని. ఆమె నీ భార్య అయిన సీత అయి ఉండవచ్చు. ఆమెను తీసుకొచ్చి మీకు అప్పగించగలను అని నమ్మకముగా పలికెను. మమ్ములను చూచి చీరకొంగులో ఒక నగల మూటను జారవిడిచింది కావున వాటిని గమనించ వలసినది. రాముడు ఆ నగల మూటను చూచి ఆశ్రునయనముల వలన, లక్ష్మణునితో వాటిని పరికించమనెను. అప్పుడు లక్ష్మణుడు ...

**నాఽహం జానామి కేయూరే నాఽహం జానామి కుండలే**

**నూపురే త్వఽభి జానామి నిత్యం పాదాఽభి వందనాత్**

అన్నా! ఈ కేయూరములను, కుండలములు నేను ఎరుగను. నిత్యము ఆమెకు పాదాభివందనం చేయువాడను కావున ఈ కాలి అందెలు ఆమెవే అని నుడివెను. **(ఈ శ్లోకము భారతీయ సంస్కృతికి మచ్చుతునక)** సుగ్రీవుడు శ్రీరామునితో వాలి మహాబలవంతుడు. అతను దుందుభి అను ఒక ఘోరమైన రాక్షసుని సంహరించి ఆ దుందుభి యొక్క మహాకళేబరమును ఒకే ఒక్క ఊపుతో యోజనము దూరము విసిరి వైచెను. అట్లు విసిరివేయబడిన దుందుభి రక్తబిందువులు ఇక్కడ ఆశ్రమమునందున్న మతంగ మునిపై పడగా అతను క్రుద్ధుడై పవిత్రమైన ఈ ఋష్యమూక పర్వతమును రాక్షస రక్తబిందువులతో అపవిత్రము చేసినాడు గావున, ఆ వాలి ఈ పర్వతము నకు యోజన దూరము వరకు ప్రవేశించినచో అతనికి మరణము తథ్యము అని శాపము ఇచ్చెను. అప్పటి నుండి వాలి ఇచ్చటకు రాకుండెను. నేను నా మంత్రులతో ఇచ్చట దుఃఖరహితుడనై ఉంటిని. శ్రీరాముడు, సుగ్రీవునకు విశ్వాసము కలిగించుట కొరకై ఆ దుందుభి కళేబరమును కాలిబొటన వ్రేలితో పది యోజనములు విసిరి వేసెను. రాముడు ప్రయోగించిన బాణము ప్రచండ వేగముతో అక్కడి ఏడు మద్దిచెట్లను చీల్చుకొని పాతాళమునకు ఏగి అంతే వేగముతో మరల శ్రీరాముని వద్దకు చేరెను.

సుగ్రీవునకు ఆ విధముగా నమ్మకము కలిగిన తర్వాత వాలి సుగ్రీవుల ద్వంద యుద్ధములో శ్రీరాముడు వాలిని సంహరించెను.

**4.3 వాలి శ్రీరాముని అధిక్షేపించుట**

**తతః శరేణ అభిహతో రామేణ రణ కర్కశః**
**పపాత సహసా వాలీ నికృత్త ఇవ పాదపః**
**స దృష్ట్వా రాఘవం వాలీ లక్ష్మణం చ మహా బలమ్**
**అబ్రవీత్ ప్రశ్రితం వాక్యం పరుషం ధర్మ సంహితమ్**
**త్వం నరాఽధిపతేః పుత్ర ప్రథితః ప్రియ దర్శనః**
**కులీనః సత్త్వ సంపన్నః తేజస్వీ చరిత వ్రతః**
**పరాఙ్ముఖ వధం కృత్వా కో ను ప్రాప్త స్త్వయా గుణః**
**యత్ అహం యుద్ధ సంరబ్ధః శరేణ ఉరసి తాడితః**
**దమః శమః క్షమా ధర్మో ధృతిః సత్యం పరాక్రమః**
**పార్థివానాం గుణా రాజన్ దండః చ అపి అపరాధిషు**
**న త్వాం వినిహత ఆత్మానం ధర్మ ధ్వజమ్ అధార్మికమ్**
**జానే పాప సమాచారం తృణైః కూపమ్ ఇవ ఆవృతమ్**
**సతాం వేష ధరం పాపం ప్రచ్ఛన్నమ్ ఇవ పావకమ్**
**న అహం త్వామ్ అభిజానామి ధర్మ చ్ఛద్మాఽభిసంవృతమ్**
**విషయే వా పురే వా తే యదా న అపకరోమి అహమ్**
**న చ త్వాం అవజానేఽహం కస్మాత్ త్వం హంసి అకిల్బిషమ్**
**వయం వన చరా రామ మృగా మూల ఫలాఽశనాః**
**ఏషా ప్రకృతిః అస్మాకం పురుషః త్వం నరేశ్వరః**

శ్రీరాముడు తన తీవ్రమైన బాణముతో కొట్టగా వాలి మొదలు నరికిన మహావృక్షం వలె నేలకొరగెను. రామలక్ష్మణులను చూచిన తర్వాత వాలి శ్రీరాముడిని

ధర్మబద్ధముగా ఇట్లు పరుష వచనములు పలికెను. స్వామీ! మహారాజు కొడుకువు, ధర్మ శాస్త్రములను అభ్యసించిన వాడివి, ఉత్తమ వంశములో పుట్టిన వాడివి, సత్వగుణము కలవాడవు, పరాక్రమంతుడవు, ధర్మ నియమములు పాటించువాడవు, వేరొకనితో యుద్ధము చేయుచున్నప్పుడు నన్నేల సంహరించితివి? ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, సహనము, ధర్మాచరణము, ధైర్యము, సత్య వ్రతము, పరాక్రమము, అపరాధులను దండించుట మొదలగు రాజులకు ఉండవలసిన గుణములన్నియు నీకు ఉన్నవి. తార ఎంత చెప్పియున్నను వినకుండా ధర్మాత్ముడైన రాముడు ఇతరులతో యుద్ధము చేయునప్పుడు దెబ్బతీయడని విశ్వసించితిని. కాని ముసుగు కప్పుకున్న అధర్మపరుడవని, గడ్డితో కప్పియున్న భావి వంటి వాడివని ఎరుగనైతిని. నేను ఎప్పుడు నిన్ను అవమాన పరచుట గాని, అపకారము తలపెట్టుట గాని చేయలేదు. అట్టి నన్ను ఏల సంహరింప బూనితివి? మేము వనమూలములు తిను వనచారులము. నీవేమో మహారాజువు. నా చర్మము గాని, రోమములు గాని, దంతములు గాని నీకు ఏవిధముగాను ఉపయోగ పడవు. నా మాంసఖండములు తినుటకు అయోగ్యము. సీతాదేవిని తీసుకొని వచ్చుటకు నీవు సుగ్రీవునితో మైత్రి చేసితివి. అలా కాకుండా నన్ను కోరినచో ఒక్క రోజులో సీతా దేవిని నీకు అప్పగించెడివాడను. అంతియే గాక రావణుని బంధించి నీ ఎదుట నిలబెట్టేవాడిని. లోకములో ప్రాణులందరు ఎదోఒకరోజు మరణించ వలసినదియే. కానీ నన్ను చంపిన తీరు మాత్రము అనుచితము. నన్ను చంపుట ఉచితమే యని భావించినచో నాకు ప్రత్యుత్తరమిమ్ము.

**వాలి:** సాధనా క్షేత్రములో రాముని అవస్థ కన్నా, వాలి అవస్థ ఎంతయో మిన్న. ఆ సమయమునకు రాముని అవస్థ వాలిని జయించుటకై సమతూకములో లేదు. కనుకనే వాలిని చాటు నుండి వధించవలసి వచ్చినది. అందువలననే వాలి

రామునికి ఆ విధమైన అధర్మ యుద్ధము నందు గాక ఎదురుగా పోరాడవలసి యుండవలెనని చెప్పినాడు.

**4.4 శ్రీరాముడు ధర్మసమ్మతముగా సమాధానము ఇచ్చుట**

నేలకూలిన వాలి వివేకము లేనివాడై పరుషముగా అధిక్షేపించుతూ మాటలాడిన మాటలకు, శ్రీరాముడు ధర్మబద్ధంగా ఇట్లు సమాధానం చెప్పెను.

**ధర్మమ్ అర్థం చ కామం చ సమయం చాఽపి లౌకికమ్**
**అవిజ్ఞాయ కథం బాల్యాత్ మామ్ ఇహ అద్య విగర్హసే**
**జ్యేష్ఠో భ్రాతా పితా చైవ య శ్చ విద్యాం ప్రయచ్ఛతి**
**త్రయ: తే పితరో జ్ఞేయా ధర్మే చ పథి వర్తినః**
**యవీయాన్ ఆత్మనః పుత్రః శిష్య శ్చాఽపి గుణోదితః**
**పుత్రవత్ తే త్రయ శ్చిన్త్యా ధర్మ: చ ఏవ అత్ర కారణమ్**
**సూక్ష్మః పరమ దుర్జ్ఞేయః సతాం ధర్మః ప్లవంగమ**
**హృది స్థః సర్వ భూతానామ్ ఆత్మా వేద శుభాఽశుభమ్**
**తత్ ఏతత్ కారణం పశ్య యదఽర్థం త్వం మయా హతః**
**భ్రాతుర్ వర్తసి భార్యాయాం త్యక్త్వా ధర్మం సనాతనమ్**
**అస్య త్వం ధరమాణ స్య సుగ్రీవ స్య మహాత్మనః**
**రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాప కర్మ కృత్**
**త ద్వ్యతీతస్య తే ధర్మాత్ కామ వృత్త స్య వానర**
**భ్రాతృ భార్యా అభిమర్శే అస్మిన్ దణ్డో అయం ప్రతిపాదితః**
**రాజభి: ధృత దణ్డా స్తు కృత్వా పాపాని మానవాః**
**నిర్మలాః స్వర్గమ్ ఆయాన్తి సన్తః సుకృతినో యథా**
**శాసనాత్ వా విమోక్షాత్ వా స్తే న: పాపాత్ విముచ్యతే**
**రాజా తు అశాసన్ పాపస్య తత్ అవాప్నోతి కిల్బిషం**

**యాన్తి రాజర్షయ శ్చ అత్ర మృగయాం ధర్మ కోవిదాః**
**తస్మాత్ త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర**
**అయుధ్య న్ప్రతియుధ్య న్వా యస్మాత్ శాఖా మృగో హి అసి**
**త్వం తు ధర్మమ్ అవిజ్ఞాయ కేవలం రోషమ్ ఆస్థితః**
**ప్రదూషయసి మాం ధర్మే పితృ పైతామహే స్థితమ్**

ధర్మార్థకామములను లౌకిక విషయములు తెలుసుకొనకుండా అజ్ఞానముచే నన్ను తూలనాడుతున్నావు. ఈ భూమియు అంతయు ఇక్ష్వాకుల ప్రభువుల అధీనం లోనిది. అట్టి ఈ భూమిని ధర్మాత్ముడైన భరతుడు పరిపాలించు చున్నాడు. అతని ధర్మబద్ధమైన ఆదేశాలు పాటించుతూ మేము భూమి అంతయు తిరుగు తున్నాము. (రాజ శాసన విషయమై చిన్న పెద్ద లకు తారతమ్యము లేదని రాముడు స్పష్టము చేయుచున్నాడు. **"కనిష్టేన జ్యేష్ఠ నియోగ: కథం? ఇత్యపేక్షాయాం రాజధర్మోయం ఇత్యాశయేన ఉక్తం ధర్మపథం")**. అగ్రజుడైన సోదరుడు, జన్మనిచ్చిన తండ్రి, విద్యనొసగిన గురువు ఈ ముగ్గురు తండ్రులే. ఇది ధర్మ మార్గము. చిన్నవాడైన సోదరుడు, తనకు జన్మించిన పుత్రుడు, సద్గుణములు గల్గిన శిష్యుడు ఈ ముగ్గురు పుత్రులుగా భావించాలి. ధర్మము అతి సూక్ష్మమైనది. సమస్త ప్రాణులలో యున్న పరమాత్మయే శుభాశుభములను, ధర్మాధర్మములను ఎరుగును. నీవు చేసిన పాపకర్మకు శిక్షగా నిన్ను చంపితిని. నీ సోదరుడు బ్రతికి ఉండగా నీ కోడలి తో సమానమైన అతని భార్యను స్వీకరించితివి గాన నీకు మరణ దండనమే యుక్తము. పాపము చేసిన వారు రాజుచేత దండింప బడినచో వారి పాపములు నశించును. అట్లు దోషరహితులై పుణ్యము చేసిన వాని వలే స్వర్గమునకు పోవుదురు. అనగా రాజుచేత దండింపబడిన పాపాత్ములు గూడ పుణ్యాత్ములు అగుదురు. **(ఇక్కడి ధర్మ సూక్ష్మమును గమనించితే ప్రస్తుతము శిక్ష పడిన దోషులు తప్పించుకొన చూడకుండా శిక్ష అనుభవించుటయే శ్రేయస్కరము)**. కానీ

రాజు పాపాత్మునికి శిక్ష విధింపకున్నచో ఆ పాపము రాజునకు చుట్టుకొనును. **(రాజా రాష్ట్రకృతం పాపం).** నీవు శాఖామృగానివి కావున నిన్ను పొంచి యుండి చంపుటలో తప్పు లేదు. ఓ వానరా! నేను మా పూర్వజులు అనుసరించిన ధర్మ మార్గము నందే నడచు కొనుచున్నాను. నీవు ధర్మ రహస్యములు తెలియక నన్ను నిందించు చున్నావు.

## 4.5 తార

వాలి శ్రీరాముని నిందించినందుకు మిక్కిలి పరితపించి తన భార్య అయిన తారను, కుమారుడైన అంగదుని శ్రీరాముని రక్షణకై ఒసగెను. పంచ కన్యలలో వాలి పత్ని తార కూడా యున్నది. కిష్కిందకు రాజైన వారందరికి తార భార్యగా యుండును. మరి ఆమె పతివ్రతయా? ఆదర్శ స్త్రీ ఎట్లయినది? (అయితే పంచ కన్యలలో ఒకరైన తార ఈ వానర భార్య తార కాదని ఆమె బుధుని భార్య యని తారా శశాంకములో ఉన్నట్లు కొందరి భావన)

**అహల్యా, ద్రౌపదీ, సీతా, తారా, మండోదరీ, తథా**
**పంచకన్యా స్మరేన్నిత్యం మహాపాతక నాశనమ్**

'తార' అనగా తమ యందే స్థిరమైన శక్తిని ప్రక్షేపణ చేయు మరింత శక్తివంతమైన ఆత్మ రూప అవస్థ. ఆ ఆత్మ రూప అవస్థ యందు వ్యాపకమైన శక్తిని వికిరణము చేయు ప్రక్రియయే తార. 'వాలి' అనేది పరమోచ్ఛ ఆత్మ రూప అవస్థకు చేరువారికి పత్నిగా తార అనెడి ప్రక్షేపణ ప్రక్రియ దానంతట అదియే న్నద్ధమగును. తార గురించి స్కంద పురాణములోని విషయము గమనించితే ... పాల సముద్రమును మధించునప్పుడు "తార" అందుండి జన్మించెను. అప్పుడు ఆమె యొక్క దక్షిణ (కుడి) హస్తమును వాలియు, వామ (ఎడమ) హస్తమును సుషేణుడు పట్టుకొనిరి. అంతట ఆమె కొరకు వారిరువురికి నడుమ వివాదము

జరిగినది. దేవతల తీర్పులో తార సుషేణునికి కూతురుగాను, వాలికి భార్య గాను అయ్యెను.

**శ్లో|| దేవైః సుషేణ కలహే పుత్రీతి ప్రతిపాదితా|**
**సుషేణో దుహితుః తస్యాః స్వయంవరమ్ అకల్పయత్|**
**ఇత్థమ్ ఊడా కపీంద్రేణ తారా సర్వాంగ సుందరీ||**

**4.6 శ్రీరాముడు సుగ్రీవాంగదాదులను ఓదార్చుట**

శోకించుచున్న సుగ్రీవునితో, అంగదునితో, తారతో ఓదార్చుతూ శ్రీరాముడిట్లు పలికెను. "చనిపోయిన వారిని గూర్చి శోకములో పరితపించుటచే, చనిపోయిన వారికి శ్రేయస్సు కలుగదు.

**నియతిః సర్వ భూతానాం నియోగేషు ఇహ కారణమ్**
**న కర్తా కస్యచిత్ కశ్చిన్ నియోగే చాఽపి న ఈశ్వరః**
**స్వభావే వర్తతే లోక: తస్య కాలః పరాయణమ్**
**న కాలః కాలమ్ అత్యేతి న కాలః పరిహీయతే**
**స్వభావం వా సమాఽఽసాద్య న కశ్చిత్ అతివర్తతే**
**న కాలస్యాఽస్తి బన్ధుత్వం న హేతుర్ న పరాక్రమః**
**న మిత్ర జ్ఞాతి సంబన్ధః కారణం న ఆత్మనో వశః**
**కిం తు కాల పరీణామో ద్రష్టవ్యః సాధు పశ్యతా**
**ధర్మ శ్చ అర్థ శ్చ కామ శ్చ కాల క్రమ సమాహితాః**

లోకములన్ని ఆ సర్వేశ్వరుని నియతి ప్రకారమే జరుగును. ఎవరు కూడా స్వతంత్రముగా నియతికి విరుద్ధముగా చేయలేడు. కాలమును ఎవ్వరు ఉల్లంఘించలేరు. తరువాత సుగ్రీవుడు, వాలికి దహన సంస్కారములు చేసెను. శ్రీరాముని ఆదేశములో ఆ రాజ్యమునకు లక్ష్మణుడు సుగ్రీవుని వానర రాజుగా పట్టాభిషేకము చేసెను. అప్పుడు వర్షాకాలం ఆరంభము కావడంతో సీతాన్వేషణకు

విరామము ఇచ్చినారు. అచటనే రామలక్ష్మణులు ప్రస్రవణ పర్వతము వద్ద ఆ కాలములో ఉన్నారు.

యోగావాసిష్ఠములో వసిష్ఠ మహర్షి నియతిని గురురించి వివరించుతూ ... రామా! చిత్ శక్తి, స్పందరూపిణి అయిన మహానియతి ఒకటి ఉన్నది. ఆ నియతి (పద్ధతి ప్రకారం నడిపించే శక్తి) బలం చేతనే తత్వజ్ఞుల శరీరం నిలబడి లౌకిక వ్యవహార యోగ్యం అవుతుంది. అట్టి మహా నియతియే "మహాసత్త- మహాచిత్- మహాశక్తి- మహాదృష్టి- మహాక్రియ- మహాద్భావము- మహాస్పందము- మహాత్మరూపము --- ఇత్యాదినామరూపములతో వ్యవహరించబడుతుంది. "ఇది అగ్ని, ఇది ఊర్ధ్వముఖముగా వెలుగుతుంది; ఇది ఈ సమయములో పుడుతుంది; ఇది ఈ విధముగా చలిస్తుంది" మొదలైన నియమాలన్ని సృష్టి మొదటే పుడుతున్నాయి. ఈ ప్రపంచము అంతా ఒక నియతి చేత పరిపాలింప బడుతుంది. ఈ నియతి యొక్క బలము చేతనే రాక్షసులు, దేవతలు, నాగులు మొదలైన వారంతా కల్పాంతము వరకు స్థాపింపబడుతూ ఉన్నారు. బ్రహ్మము, నియతి, సృష్టి - ఈ మూడు ఒకటేగాని వేరువేరు కాదు. ఈ మహానియతినే "దైవము" ఈశ్వరసంకల్పము" అనికూడా అంటున్నాము. ఇది సర్వకాల సర్వావస్థలలోను ఉంటుంది. ఓ రామా! నీవు దైవాన్ని గురించి అడగటం, నేనుచెప్పటం, ఎవరైనా ఏదైనా ప్రయత్నము చేసినా అది అంతా నియతి లోని భాగమే. అవశ్యం జరగవలసియున్న దాన్ని రుద్రుడుకూడా ఆపలేరు. ఒకవేళ నిర్వికల్ప సమాధిలో వాయువును కూడా నిరోధించి తత్వజ్ఞు డెవడైనా ముక్తిని పొందితే అది పురుషాకారం అవుతుంది. కానీ, ఆ పురుషాకారం కూడా ఈశ్వరనియతి లోనిభాగమే. శివ గీతలో కూడా పరమ శివుడు శ్రీరామునికి ఇట్టి విషయమై స్పష్టము చేసెను

## 4.7 శ్రీరాముని విషాదము-లక్ష్మణుని హితబోధ

వర్ష ఋతువు నందు శ్రీరాముడు విరహ వేదనకు గురి అయ్యెను. శ్రీరాముడు లక్ష్మణునితో, లక్ష్మణా! సుగ్రీవుడు శరత్కాలం మొదలు కాగానే గుర్తించి మనకు ఉపకారము చేయుటకు స్వయముగా పూనుకొనగలడు.

**ఉపకారేన వీరోహి ప్రతీకారేణ యుజ్యతే**

**అకృతజ్ఞో ప్రతికృతో హంతి సత్యవతామ్ మనః**

సుగ్రీవుడు మహావీరుడు. రాముని సహాయము పొందినవాడు. ఈ రెండు కారణములుగా రామునికి ప్రత్యుపకారము చేయవలసిన స్థితి యందు యున్నాడు. ప్రపంచమున తమకు చేసిన సహాయమును మరచి ప్రత్యుపకారము చేయని వారు సత్పురుషుల మనస్సుకు బాధను కలుగ చేయుదురు. శరత్కాలం మొదలు కాగానే మిత్ర కార్యము (సీతాన్వేషణ) నకు పూనుకొనవలసినదిగా హనుమానుడు సుగ్రీవునకు సూచించును.

**యో హి మిత్రేషు కాలజ్ఞః సతతం సాధు వర్తతే**

**తస్య రాజ్యం చ కీర్తి శ్చ ప్రతాప శ్చ అభివర్ధతే**

**యస్య కోశ శ్చ దణ్డ శ్చ మిత్రాణి ఆత్మా చ భూమిప**

**సమవేతాని సర్వాణి స రాజ్యం మహత్ అశ్నుతే**

ఏ రాజైతే సమయము నెరిగి మిత్రులతో మంచి మార్గమున వ్యవహరించునో అతడి రాజ్యము, కీర్తియు, ప్రతాపము వర్ధిల్లును. ఏ రాజునకు కోశము, దండము, మిత్రులు సమముగా ఉండునో అతడి రాజ్యము అత్యున్నత స్థితి యందుండును. కావున రాజా! మిత్రకార్యమునకై వానర శ్రేష్ఠులను అందరిని రప్పించవలసినదిగా ప్రార్థన. హనుమ అవ్విధముగా ప్రశస్తమైన మాటలు మాట్లాడగా సంతృప్తి చెందిన సుగ్రీవుడు, నీలుని పిలిచి అన్ని దిక్కులలో ఉన్నటువంటి తమ సేనాధిపతులు అందరూ ససైన్యముగా పదిహేను దినములలో రావలసినదిగా శాసించెను.

**గుహాం ప్రవిష్టే సుగ్రీవే వియుక్తే గగనే ఘనైః,**
**వర్ష రాత్ర ఉషితో రామః కామ శోకాఽభిపీడితః**

ఈ లోగా శ్రీరాముడు శరత్కాలం యొక్క నిర్మలమైన మేఘములను చూచి సీత ఎడబాటు కొరకై మిగుల వ్యాకుల పడెను. కామవాసనల వలన రామసాధకుడు కూడా పీడితుడగును. అయితే ఎటువంటి కామవాసనలు? సీతారూప సాత్విక అనుభూతులు. సాధనా సమయము నందు పొందిన అనుభూతులు తిరిగి తిరిగి ప్రాప్తించాలని సాధకుడు కోరుకొనును. దీనివలన సాధకుడు ప్రగతి నొందడు. పూర్వ అనుభూతులను త్యజించి మరింత ఉన్నతమైన అనుభూతులను పొందుచు చివరగా, అనుభూతి రహిత శ్రేష్ఠ సమాధి అవస్థను చేర వలెను. కాని రాముడింకను సీతా రూప సాత్త్విక రూప అనుభూతుల కొరకై పరితపించును. లక్ష్మణుడు మాత్రము రాముడా స్థితి నుండి ముక్తము కావాలని చెప్పు చున్నాడు.

**కిమ్ ఆర్య కామ స్య వశంగతేన, కిమ్ ఆత్మ పౌరుష్య పరాభవేన**
**అయం సదా సంహ్రియతే సమాధిః, కిమ్ అత్ర యోగేన నివర్తితేన**
**క్రియాభియోగం మనసః ప్రసాదం. సమాధి యోగ అనుగతం చ కాలమ్**
**సహాయ సామర్థ్యమ్ అదీన సత్త్వః, స్వ కర్మ హేతుం చ కురుష్వ హేతుమ్**

అన్నా! పరాక్రమమును (పురుష ప్రయత్నము) విస్మరించి ఈ విధముగా కామ ప్రతంత్రుడగుట వలన ఏమి ప్రయోజనము? దీనివలన చిత్త స్థైర్యము దెబ్బతినును. అందువలన లాభమేమి? ఇట్టి స్థితిలో మనస్సును చిక్కబట్టుకొన్నచో ఈ చింత దూరమగును. దైన్యమును వీడుము. కార్య సాధనకు పూనుకొనుము. మనస్సును ప్రసన్నము గావింపుము. ఇప్పుడు చిత్త స్థైర్యమును (ధైర్యమును) వహింపుము. సుగ్రీవుడు మొదలగు వారి యొక్క సామర్థ్యమును ఉపయోగించుకొనుము. కార్య సిద్ధికి తోడ్పాటు విధానము అవలంబించుము.

ఇచ్చట లక్ష్మణుడు రాముని వంటి ఆదర్శ పురుషుడు సీత కొరకై అంతగా శోకించుట తగదని చెప్పు చున్నాడు. లక్ష్మణుడు సాధకుని యందలి వివేక వృత్తి కనుక ఒంటరిగా యున్నను రాముని కంటే సంతులనంలో ధీరోదాత్తుడుగాను చూప బడినాడు. వాల్మీకి పై శ్లోకములలో క్రియా యోగములో సీతను త్యజించమని రామునికి చెప్పుచున్నాడు. అనగా అంతకన్నను ఉచ్చ అనుభూతుల ద్వారా సీతా రూప అనుభూతులను త్యజించడమన్న భావన. అదే లక్ష్మణుని ద్వారా రామునికి ఇచ్చిన సలహా. ఓ! రాముడా! పత్ని యందలి కోరికను వదలి పౌరుష ధారణ చేయవలెను. యోగము ద్వారా మనస్సును సమాధి అవస్థకు తీసుకొని వచ్చి నివృత్తము కావలెను. నీవు క్రియా యోగమును ధారణ చేసి మనస్సును శాంత పరచుము. సమాధి యోగము ద్వారా కాలమునకు అతీతుడవై నీ యందున్న మహాశక్తి సామర్థ్యమును జాగృత పరచి దీన భావమును త్యజించుము. కర్తవ్యమును నిష్కామ భావముతో నెరవేర్చుము. దీని ద్వారా వాల్మీకి ఎటువంటి కోరికలు లేకుండా మానవుడు తనను భగవంతునికి అర్పణం చేసుకోవాలని సూచించారు. భగవద్గీత లో కూడా శ్రీక్రష్ణుడు అర్జునుడు కి ఇటువంటి సూచనయే చేస్తాడు

**ప్రియా విహీనే దుఃఖాఽఽర్తే హృత రాజ్యే వివాసితే**

**కృపాం న కురుతే రాజా సుగ్రీవో మయి లక్ష్మణ**

**అనాథో హృత రాజ్యో అయం రావణేన చ ధర్షితః**

**దీనో దూర గృహః కామీ మాం చైవ శరణం గతః**

**ఇతి ఏతైః కారణైః సౌమ్య సుగ్రీవ స్య దురాత్మనః**

**అహం వానర రాజస్య పరిభూతః పరంతప**

లక్ష్మణా! రాజ్యాధికారమునకు దూరమై, సీతను ఎడబాసి, దుఃఖార్తితుడై యున్న నాపై సుగ్రీవుడు దయ చూపుట లేదు. భార్య ఎడబాటుచే శ్రీరాముడు దైన్యముచే

సుగ్రీవుని శరణు జొచ్చి నాడు. కాని దురాత్ముడైన వానర రాజు నన్ను చులకన చేయుచున్నాడు.

**అర్థినామ్ ఉపపన్నానాం పూర్వం చ అపి ఉపకారిణామ్**
**ఆశాం సంశ్రుత్య యో హన్తి స లోకే పురుషాఽధమః**
**శుభం వా యది వా పాపం యో హి వాక్యమ్ ఉదీరితమ్**
**సత్యేన పరిగృహ్ణాతి స వీరః పురుషోత్తమః**
**కృతాఽర్థా హి అకృతాఽర్థానాం మిత్రాణాం న భవన్తి యే**
**తాన్ మృతాన్ అపి క్రవ్యాదః కృతఘ్నాన్ న ఉపభుంజతే**

పూర్వము తమకు సహాయము చేసి ఇపుడు సహాయము పొందవలసిన కష్టస్థితి యందున్న, సహాయార్థము చేరవచ్చినట్టి వారికి సహాయము చేయునట్లు నమ్మించి సహాయము చేయనివారు ఈ లోకములో అధమ మానవులు. తాము చెప్పిన వాక్యము మంచిదైనను చెడుదైనను దానికి కట్టుబడి యుండి సత్యమును తప్పనివాడు ఉత్తమ మానవుడు. తమ కార్య సాఫల్యమును స్నేహితుని సహాయములో పొంది, కార్యార్థియై యున్న ఆ స్నేహితునికి ప్రత్యుపకార మాచరింపని కృతఘ్నుడు మరణము నొందినప్పుడు అతడి శరీరమును మాంస భక్షణము చేయు జంతువులు కూడా స్పృశింపవు. మాట తప్పినచో వాలికి పట్టిన దుర్గతి తనకు కూడా పట్టునేమో అని సుగ్రీవుడు భయము లేకుండుట మిగుల ఆశ్చర్యకరం. కావున లక్ష్మణా! వెంటనే నీవు వెళ్లి క్రుద్ధుడనైన నా మాటలు సుగ్రీవునికి వివరించుము.

గురువు అయిన వసిష్ఠ మహర్షి దగ్గర ఆత్మ జ్ఞానము పొంది, విశ్వామిత్రుని వద్ద అభ్యాసము చేసినా, మానవునునికి కలిగే మాయా ప్రభావము వలన శ్రీరాముడు సీతా వియోగము వలన అమితమైన దుఃఖాన్ని పొందుతాడు. సర్వ శక్తి సంవితుడైన చక్రవర్తి అయి ఉండి కూడా వసిష్ఠ మహర్షి కృపచే సంపూర్ణ ఆత్మ

జ్ఞానము పొందినా మాయ ప్రభావము వలన ఏమి చేయలేని నిస్సహాయ స్థితిలోకి వెళతాడు. అందుకనే ఆది శంకరాచార్య తన భజ గోవిందం శ్లోకం 11 లో **"మాయామయమిదమ్-అఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా | సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుక్రింకరణే||"** అని చెప్తారు. ఈ జగత్తు సృష్టి అంతా మాయామిదం అని, మానవుడు ఆ మాయ నుంచి ఎల్లప్పుడూ జాగరూకలో ఉండాలి అని ఉద్బోధిస్తారు.ఇట్టి మాయ నుంచి బయిట పడమని అగస్త్యుడు రామునికి అరణ్యావాసంలో విరజా దీక్ష ఇస్తాడు. అప్పుడు పరమ శివుడు ప్రత్యక్షమై గీతను ఉద్బోధించారు. అదియే శివగీత. శివ గీతలో పరమేశ్వరుడు ఇట్టి మాయాస్వరూపాన్ని వివరించుతారు. అప్పుడు స్వస్తుడై రాముడు కార్యోన్ముఖుడు అవుతాడు. అయినా మానవుడు కావున మరల మరల చింతాక్రాంతుడు అవుతాడు.

**4.8 లక్ష్మణుడు సుగ్రీవుని వద్దకు ఏతెంచుట,**

**తారయా సహితః కామి సక్తః కపి వృషో రహః**
**న తేషాం కపి వీరాణాం శుశ్రావ వచనం తదా,**
**సంగృహ్య పాదౌ పితుః ఉగ్ర తేజా**
**జగ్రాహ మాతుః పున రేవ పాదౌ**
**పాదౌ రుమాయా శ్చ నిపీడయిత్వా**
**నివేదయా మాస తతః తమ్ అర్థం**
**స నిద్రా మద సంవీతో వానరో న విబుద్ధవాన్**
**బభూవ మద మత్త శ్చ మదనేన చ మోహితః**

లక్ష్మణుడు కిష్కింద నగరము చేరు సమయమునకు సుగ్రీవుడు తారతో కామవశుడై యున్నాడు. అప్పుడు మహాబలశాలియైన అంగదుడు సుగ్రీవుని మధు సేవనం వలన మత్తులో ఉండగా, తల్లియైన రుమ పాదములపై మోకరిల్లి లక్ష్మణుని ఆగమనమును వివరించెను. అంత సుగ్రీవుడు తన ఆసనము పైనుంచి

దిగ్గున లేచి మంత్రులతో లక్ష్మణుని కోపము ఉపశమించే మార్గము ఆలోచించెను. బుద్ధిశాలి అయిన హనుమానుడు సీతాన్వేషణ ప్రయత్నమునకు సమయము ఆసన్నమైనదని వివరించెను.

### 4.9 లక్ష్మణుని శాంతపరచుటకు సుగ్రీవుడు తారను పంపుట

క్రుద్ధుడైన లక్ష్మణుడు ధనుష్టంకారము చేసి ఆ రాజ భవనంలోని ఏకాంత (స్త్రీలసవ్వడి లేని) స్థలమున నిలబడెను. అప్పుడు సుగ్రీవుడు తారను పిలిచి, లక్ష్మణుడు సౌమ్యుడు, స్త్రీల యందు గౌరవభావం కలవాడు కావున వెళ్లి అతనిని ప్రసన్నము చేసుకొని వలసినదిగా కోరతాడు. అప్పుడు తార బయిలుదేరుతున్నది. ఆమె పరిస్థితి ఎలా ఉన్నదంటే...

**సా ప్రస్ఖలంతీ మద విహ్వలాఽక్షీ, ప్రలంబ కాంచీ గుణ హేమ సూత్రా**
**స లక్షణా లక్ష్మణ సన్నిధానం, జగామ తారా నమిత అంగ యష్టిః**
**స తాం సమీక్ష్య ఏవ హరీశ పత్నీం, తస్థౌ ఉదాసీనతయా మహాత్మా**
**అవాఙ్ముఖో అభూత్ మనుజేంద్ర పుత్రః, స్త్రీ సన్నికర్షాత్ వినివృత్త కోపః**

మధువు గ్రోలుటచే తార యొక్క కనులు మూతబడు చుండెను. తొట్రుబాటుతో అడుగులు తడబడు చుండెను. నడుముకు చుట్టుకొన్న వడ్డాణము యొక్క బంగారు సూత్రములు వ్రేలాడు చుండెను. స్త్రీల ఎదుట తన కోపమును ప్రకటించుట ఉచితము కాదని లక్ష్మణుడు శాంతము వహించెను. లక్ష్మణుడు శాంతముతో సుగ్రీవుడు శ్రీరాముని వద్ద సహాయము తీసుకొని సీతాన్వేషణను మరచినాడని చెప్పెను. అప్పుడు తార, లక్ష్మణునితో .. సుగ్రీవుడు వానరుడు, మధువును గ్రోలి యున్నాడు, కామావశుడై యున్నాడు. కానీ సీతాన్వేషణ విషయమై మరువలేదు. తగిన ఆజ్ఞలు ఇచ్చియే యున్నాడు. సత్పురుషులు గౌరవభావముతో (మాతృభావముతో/సోదరి భావముతో) పర స్త్రీలను

చూచుట దోషము కాదు అని చెప్పి లక్ష్మణుని అంతఃపురమునకు తీసుకొని వెళ్లెను. అప్పుడు సుగ్రీవుడు ఎలా ఉన్నాడంటే...

**రుమాం తు వీరః పరిరభ్య గాఢం, వర ఆసనస్థో వర హేమ వర్ణః**

**దదర్శ సౌమిత్రిమ్ అదీన సత్త్వం, విశాల నేత్రః సువిశాల నేత్రమ్**

సుగ్రీవుడు రుమను కౌగిలించుకొని యున్నాడు. అప్పడు సుగ్రీవుడు దిగ్గున తన సింహాసమున నుండి దిగెను.

### 4.10 సుగ్రీవుడు శ్రీరాముని దర్శించుట

లక్ష్మణుడు తార మొదలుగాగల వీరుల ద్వారా సుగ్రీవుడు సీతాన్వేషణకై తగు ఏర్పాట్లు చేసినాడని తెలుసుకొని సంతోషములో సుగ్రీవుడు అశేష వానర సేనానితో శ్రీరాముని దర్శనార్ధమై వెళతారు. అందుకు శ్రీరాముడు మిగుల సంతసించెను.

**ధర్మమ్ అర్థం చ కామం చ కాలే యః తు నిషేవతే**

**విభజ్య సతతం వీర స రాజా హరి సత్తమ**

**హిత్వా ధర్మం తథా అర్థం చ కామం యస్తు నిషేవతే**

**స వృక్షాఽగ్రే యథా సుప్తః పతితః ప్రతిబుధ్యతే**

**అమిత్రాణాం వధే యుక్తో మిత్రాణాం సంగ్రహే రతః**

**త్రివర్గ ఫల భోక్తా తు రాజా ధర్మేణ యుజ్యతే**

ఎల్లప్పుడూ ఎవరైతే ధర్మార్థకామములను విభజించి ఆయా కాలములందు సేవించునో అతడే సరియైన రాజు. ధర్మార్థములను విడిచి కామమును మాత్రమే ఎల్లప్పుడూ సేవించువాడు వృక్షాగ్రామున నిదురించువాడు నేలపై బడి మేల్కొనునట్లుగా, అధఃపతనము పొందిన తర్వాతనే తన నడత యందలి దోషము తెలుసుకొనును. శత్రువులను హతమార్చుతూ, మిత్రులను కూడగట్టుచు కాలమును గడుపు రాజు సరియగు రాజ ధర్మమును ఆచరించినవాడు. కాన ధర్మార్థకామములను సరిగా నిర్వర్తించిన సత్ఫలితములను పొందును. ఇంకను

శ్రీరాముడు సుగ్రీవునితో .. సుగ్రీవా! శత్రువులను నశింపజేయ సామర్థ్యము కలవాడవు. శత్రువు పై దండెత్తుటకు సమయము ఆసన్న మైనది కాన మంత్రులతో ఆలోచించమని చెప్పగానే, సుగ్రీవుడు రామా! ఉత్సాహవంతులు, మహాపరాక్రమ శాలురు, కామరూపులు, అనేకమైన ఉచ్ఛజాతికి చెందినవారు, అనేకమైన మహాపర్వతములలో నివసించు వానరులు, భల్లూకములు కోట్లకొలదిగా సీతాన్వేషణకై మరియు రావణ సంహారమునకై నీతో కలసి నడుచుటకు వచ్చి యున్నారు అని చెప్పెను. వారి సంఖ్యను వివరించుతూ ...

**శతైః శత సహస్రై శ్చ కోటిభి శ్చ ప్లవంగమాః**
**అయుతై శ్చ వృతా వీరా శంకుభి శ్చ పరంతప**
**అర్బుదైః అర్బుద శతైః మధ్యై శ్చ అన్తై శ్చ వానరాః**
**సముద్రై శ్చ పరార్థై శ్చ హరయో హరి యూథపాః**

ఆ వానరులు వందలు, లక్ష, కోటి, శంకువు, అర్బుధము, మద్యము, అంతము, సముద్రము, పరార్థము అను సంఖ్యలో ఉన్నారు. (ఈ సంఖ్యావిషయములు జ్యోతిషశాస్త్రము నందు ఈ విధముగా చెప్పబడినది. **ఏకం దశశతంత్వస్మాత్ సహస్రం అయితం తతః, పరం, లక్ష్యం, ప్రయుతం, కోటిం, ఆధార్బుధం, బృందం, ఖర్వం, నిఖర్వంచ, తస్మాన్మహా సరోజం, శంకుం, సరితాంపతిమ్, త్వంతం మద్యం, పరార్థమాహు:, యథోత్తరం, దశగుణం తథాజ్ఞేయం** .. ఒకటి, పది, వంద, వేయి, ఆయుధము, లక్ష, ప్రయుతము, కోటి, అర్బుదము, బృందము, ఖర్వము, నిఖర్వము, పద్మము, శంకువు, సముద్రము, అంతము, మద్యము, పరార్థము - అనునవి సంఖ్యలు. వీటిలో వరుసగా ఒక సంఖ్య కంటే తరువాతి సంఖ్య పదిరెట్లు అని ఎరుగవలెను). అందుకు రాముడు సంతోషముతో ముందుగా ఆయా వానరులను సీతాన్వేషణ కార్యమునకు వినియోగించమని చెప్పెను. అప్పుడు సుగ్రీవుడు ఆ వానరులను నాలుగు

దిక్కులు పంపుతూ ఆయా దిక్కులలోని విశేషాలు మొదలగునవి అన్నియు చెప్పుచున్నాడు. **(ఇక్కడ భూగోళ వర్ణన చాలా విశేషమైనది. సుగ్రీవుడు వానర సమూహములను సీతాన్వేషణకై పంపునపుడు వింధ్య పర్వతమును కేంద్రముగా చేసికొనెను).** రాముడు ఆశ్చర్యముతో భూమండలమున ఉన్న అన్ని దేశములు స్పష్టముగా నీకు ఎటుల తెలియును అని సుగ్రీవుని అడుగగా .. సుగ్రీవుడు వినమ్రతతో .. రామా! నా అన్న వాలి నన్ను చంపుటకు వెంటాడుచుండగా నేను భూమండలం అంతయు తిరిగితిని. నేను పారిపోసాగితిని. నేను నా మిత్రులతో గూడి పలు నదీతీరములను, వనములను, నగరములను, పర్వతములను గాంచుతూ పిక్కబలము చూపసాగితిని. ఆ సమయమున నాకు భూమి అద్దములో నున్న దానివలెను, అలాత చక్రము రీతిగాను, ఆవు గిత్త ప్రమాణము మాదిరిగా కన్పట్టెను. (భూమండలం ఎంత విశాలమైనది అయినను అద్దములో చిన్నధిగానే కనపడును. "కొండ అద్దము నందు కొంచెమునై యుండదా" . అలాతము అనగా కొరివి. కొరివిని తీసుకొని తిప్పినప్పుడు అది ఒక చక్రము వలె కనబడును. ఆవు పాదము చిన్నది గదా! మిక్కిలి వేగముగా పరిగెత్తుచున్న సుగ్రీవునకు ఈ భూమండలం అంతయు అద్దములో నున్న దానివలె, అలాతచక్రము వలె, గోష్పాదము వలె  చిన్నదానిగా కనబడెను). అప్పుడు బుద్ధిమంతుడైన హనుమ మతంగి మహర్షి శాపము వలన ఋష్యమూక పర్వతమునకు వాలి రాడు అని చెప్పగా అప్పటి నుంచి నేను నా మంత్రులతో ఈ పర్వతముపై ఉండ యుంటిని అని చెప్పెను.

### 4.11 భూగోళ వర్ణనము - తూర్పు దిక్కు

సుగ్రీవుడు "వినత" అనే సేనానాయకుడిని పిలిచి, వినతా! చంద్రుని అంశచే, సూర్యుని అంశచే జన్మించిన లక్షమంది వానరులను తీసుకొని తూర్పు దిక్కునకు ఏగుము. అచట సీతమ్మ ఉన్నదేమో చూడుము.

తూర్పు దిక్కును గురించి చెపుతూ ...

తూర్పు దిక్కున రమ్యమగు భాగీరథి, సరయు, కౌశికి, కాళింది, యమున, సరస్వతి, సింధువు, శోణము, మహి, కాలమహి మొదలగు నదులు గలవు. అచ్చట బ్రహ్మమాల, విదేహ, మాళవ, కాశి, కోశల, మహాగ్రామము, పుండ్రము, వంగము మొదలగు దేశములు గలవు. అవి అన్నియు వింధ్య పర్వతములకు మధ్య వలయాకారంగా ప్రవహించుతున్న నదికి తూర్పు దిక్కున ఉన్నవి. అక్కడ నుండి సముద్రమున మునిగి ఉన్న పర్వతములు, సముద్ర అంతర్భాగమున కొన్ని పట్టణములు ఉన్నవి. అక్కడ నుండి మంథర పర్వత అగ్రభాగమునకు పోవలెను. అక్కడి వనచరుల రూపములను వాల్మీకి సుగ్రీవుని ద్వారా తెలియ చేస్తున్నారు. అక్కడ చెవులు లేనివారు, పెదవులపై చెవులు గలవారు, ఇనుప ముఖము గలవారు, ఒక పాదము గలవారు, నరమాంస భక్షకులు, కిరాతులు, బంగారు వర్ణము గలవారు, పచ్చి చేపలు తినువారు ఉందురు. అక్కడ నుండి కొండలతో నిండి ఉన్న వేరొక ద్వీపము గలదు. ఆ ద్వీపము దాటిన తర్వాత ఆకాశము అంటుచున్నటువంటి "శిఖరము" అనేసి పర్వతము గలదు. అవి అన్నియు సముద్ర మధ్యమమున గలవు. అక్కడ ఎర్రటి నీరు గల "శోణము" అను నది గలదు. (The Yangtze River in Chongqing, China, is called as red river also known as the Hồng Hà and Sông Cái in Vietnamese and the Yuan River in Chinese, is a river that flows from Yunnan in Southwest China through northern Vietnam to the Gulf of Tonkin) తరువాత ఉవ్వెత్తు కెరటముల ఎగిసిపడుచు ఉన్న ఇక్షు సముద్రము, ద్వీపములు గలవు. తరువాత ముందుకు సాగినచో శాల్మలి (బూరుగు) వృక్షములతో విశాలమైన శాల్మలి అను మహా ద్వీపము కనపడును. అక్కడ మందేహాది రాక్షసులు ఉందురు. (మందేహాది రాక్షసుల వివరణ ఇంతకు ముందు ఈయడము అయినది) వీటి తర్వాత కుశ, క్రౌంచ ద్వీపములు ఉండును. (సప్తద్వీపములు. 1.జంబూ ద్వీపము; 2.ప్లక్ష ద్వీపము; 3.శాల్మలి ద్వీపము;

4.కుశ ద్వీపము; 5.క్రౌంచ ద్వీపము; 6.శాక ద్వీపము; 7.పుష్కర ద్వీపము, **"సప్త ద్వీపావసుమతీ' - అని మార్కండేయ పురాణంలోనూ, 'సప్త ద్వీపవతీ మహీ'** అని బ్రహ్మాండ పురాణంలోనూ కలదు. పురాణాలలో వర్ణింపబడిన ప్రకారం జంబూ ద్వీపమే ఈ ఏడు ద్వీపాలకు మధ్యలో ఉన్నది. ఈ జంబూ ద్వీపమే ఇప్పటి ఆసియా ఖండానికి, దానికి తూర్పు దక్షిణంలో ఉన్న ద్వీపాలకు సరి పోతున్నది.). అక్కడ నుంచి ఉత్తర దిక్కున పదమూడు యోజనముల విస్తీర్ణములో "జాతరూప శైలము" అనెడి బంగారు కొండ గలదు. అక్కడే మహాపురుషుడగు అనంతుడు గలడు. అక్కడ నుంచి వంద యోజనముల బంగారు విస్తీర్ణము గల బంగారు ఉదయ పర్వతము ఉండును. ఇది సూర్యుడు ఉదయించు ద్వారము. (బంగారు పర్వతమనగా సూర్యుని ఉదయ కిరణములు కొండ పై బడి బంగారు వర్ణములో శోభిల్లును. ప్రస్తుతము ఇది జపాన్ దేశము కావచ్చు). ఇది తూర్పు దిక్కు యొక్క విశేషము. ఆయా ప్రదేశములలో సీతమ్మకి వెదికి మాసములోపు రావలెను.

**4.12 భూగోళ వర్ణనము - దక్షిణ దిక్కు**

అంగదుడు నాయకుడుగా, హనుమదాదులను దక్షిణ దిక్కుకు సుగ్రీవుడు పంపుచున్నాడు. దక్షిణ దిక్కు గురించి వివరించుతూ ...

వేయి శిఖరములలో వింధ్య పర్వతము దక్షిణ దిక్కున గలదు. దక్షిణమున నర్మద, గోదావరి, కృష్ణ, మేఖల, ఉత్కళ అను నదులు, విదర్భ, ఋషికము, మహిషము, వంగము, కళింగము, కౌశికము అను దేశములు దండకారణ్యమున ఉండును. అటులనే ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ దేశములు గలవు. అక్కడ నుండి కావేరి బయల్వెడలిన "సహ్యాద్రి" పర్వతము గలదు. తరువాత అంతులేని మహా సముద్రము. ఒడ్డు నుంచి నూరు యోజనముల దూరములో లంక ద్వీపము గలదు. అదియే రావణుని దేశము. ఆ తరువాత సముద్రాన్ని దాటితే పుష్పితము అనే పర్వతము కనపడుతుంది. అది దాటితే సూర్యవత్, వైద్యుతం అనే

పర్వతాలు కనపడతాయి. ఆ తరువాత కుంజరం అనే పర్వతం కనపడుతుంది, దాని మీద విశ్వకర్మ అగస్త్యుడికి బ్రహ్మాండమైన భవనం నిర్మించాడు. అలా ముందుకి వెళితే భోగవతి అనే నగరం వస్తుంది, అందులో విషంతో కూడుకున్న పాములు ఉంటాయి. అక్కడే సర్పాలకి రాజైన వాసుకి ఉంటాడు. ఆ తరువాత ఎద్దు ఆకారంలో ఉన్న వృషభ పర్వతం కనబడుతుంది. దానిమీద గోశీర్షకము, పద్మకము, హరిశ్యామము అనే మూడు రకాల చందనం కనపడుతుంది. ఇవి కాకుండా అగ్నితుల్యము అనే చందనం కూడా ఉంటుంది, కాని మీరు పొరపాటున కూడా ఆ చందనాన్ని ముట్టుకోకండి. అక్కడ శైలూషుడు, గ్రామణి, శిక్షుడు, శకుడు, బభ్రువు అనే 5 గంధర్వ రాజులు పరిపాలన చేస్తుంటారు. మీరు వారికి నమస్కారం చేసి ముందుకి వెళితే, పృధ్వికి చివరన పుణ్యం చేసుకున్నవారు స్వర్గానికి వెళ్ళేవారు కనపడతారు. అదికూడా దాటిపోతే పితృలోకం వస్తుంది. ఇక అది దాటితే యమధర్మరాజు యొక్క సామ్రాజ్యం ఉంటుంది, అక్కడ పాపులు ఉంటారు. మీరు అది దాటి వెళ్ళలేరు. దక్షిణ దిక్కున అక్కడిదాకా వెళ్ళి వెతికిరండి " అన్నాడు.

సుగ్రీవుడు ప్రత్యేకంగా హనుమను పిలిచి నీకు ఈ భూమిపై గాని, అంతరిక్షంలో గాని తెలియని ప్రదేశము లేదు. భూమిపై, నీటిపై, ఆకాశము నందు పోగలవాడవు. అసుర, నర, నాగ, దేవ, గాంధర్వ లోకములు, సాగరములు, పర్వతములు అన్నియు తెలియును. వాయువుతో సమానమైన వేగము కలవాడవు. బలము, బుద్ధి, పరాక్రమము, దేశకాలములు ఎరిగి ప్రవర్తించు నేర్పు, నీతి శాస్త్రము నీకు బాగుగా తెలియును. కావున నీవు కార్యసిద్ధిని గురించి బాగుగా ఆలోచించుము అని చెప్పెను. అప్పుడు శ్రీరాముడు హనుమ శక్తి సామర్థ్యముల పైన నమ్మికతో అతనికి సీతకు గుర్తుగా తన అంగుళీయకమును ఇచ్చెను.

Hanuman crossed ocean of hundred yojanas. At the present time the shore to shore distance between southern tip of India and

Northern tip of Sri Lanka is around sixty miles. Even with a measure of 2.5 miles per yojana, hundred yojanas translate to 250 miles. To explain this anomaly, we need to consider that around the time of Ramayana, the distance was lot more than the current sixty miles. The current theories by geologists that the ocean between India and the current Sri Lanka had been replaced by land mass over a period of time. As per Dr. E. Vedavyas, IAS (retired) considering if there is no change of land mass over a period of time the place where Lanka situated is near to the equator.

### 4.13 భూగోళ వర్ణనము - పశ్చిమ దిక్కు

తరువాత సుగ్రీవుడు సుషేణుడిని పిలిచి, "మీతో పాటు మరీచి మహర్షి యొక్క కుమారుడైన అర్చిష్మంతుడు, అర్చిర్మాల్యుడు మొదలైన వానరాలని తీసుకొని పడమర దిక్కుకి వెళ్ళండి. అప్పుడు మీరు సౌరాష్ట్ర, బాహ్లిక, చంద్ర, చిత్ర, కురు, పాంచాల, కోసల, అంగ, మగధ, అవంతి, గాంధార, కాంభోజ మొదలైన రాజ్యాలు, పట్టణాలు, గ్రామాలు వెతకండి. అలాగే మురచిపురం, జటాపురం కనపడతాయి, వాటిని కూడా వెతకండి. సింధు-సాగర సంగమ స్థానంలో, 100 శిఖరాలతో, పెద్ద చెట్లతో సోమగిరి అనే పర్వతం కనపడుతుంది. మీకు ఆ పర్వతం మీద రెక్కలున్న సింహాలు కనపడతాయి, అవి ఏనుగుల్ని ఎత్తుకుపోతుంటాయి, సముద్రంలోని తిమింగలాలని ఎత్తుకుపోతుంటాయి. అక్కడ సముద్రంలో పారియాత్రం అనే పర్వతం ఉంది, అది 100 యోజనాల విస్తీర్ణంలో ఉంటుంది. దానిమీద 24 కోట్ల గంధర్వులు ఉంటారు, వాళ్ళకి నమస్కారం చేసి ముందుకి వెళ్ళండి. అప్పుడు మీకు 100 యోజనాల ఎత్తయిన వజ్ర పర్వతం కనపడుతుంది. సముద్రంలో నాలుగోవంతు భాగంలో చక్రవంతం అనే పర్వతం ఉంటుంది, దానిమీద విశ్వకర్మ వెయ్యి అంచుల చక్రాన్ని నిర్మించాడు. ఆ చక్రాన్ని ఎవరూ తీసుకోకుండా చూస్తున్న హయగ్రీవుడు అనే రాక్షసుడిని శ్రీ మహావిష్ణువు చంపి ఆ చక్రాన్ని తీసుకున్నారు, అలాగే పంచజనుడు అనే మరొక రాక్షసుడిని చంపి శంఖాన్ని

తీసుకున్నారు. అక్కడినుంచి ముందుకి వెళితే మీకు ప్రాక్ జ్యోతిషపురం అనే ప్రాంత కనపడుతుంది, దానిని నరకాసురుడు పరిపాలిస్తున్నాడు. దాని తరువాత సర్వ సౌవర్ణ అనే పర్వతం కనపడుతుంది. ఆ పర్వతాల మీద ఏనుగులు, పందులు, పులులు, సింహాలు పెద్ద పెద్దగా అరుస్తూ ఉంటాయి. అదికూడా దాటిపోతే మేఘనం అనే పర్వతం కనపడుతుంది, ఈ పర్వతం మీదనే ఇంద్రుడు పాకశాసనుడు అనే రాక్షసుడిని సంహరించి దేవతల చేత అభిషిక్తుడయ్యాడు. ఆ తరువాత 60,000 బంగారు పర్వతాలు కనపడతాయి, వాటి మధ్యలో మేరు పర్వతం ఉంటుంది. ఆ పర్వత శిఖరం మీద ఉన్న ఏ వస్తువైనా బంగారంలా మెరిసిపోతుంది. ఈ మేరు పర్వతం నుండి అస్తమయ పర్వతం 10,000 యోజనాల దూరంలో ఉంది, ఇంత దూరాన్ని సూర్య భగవానుడు అర ముహూర్తంలో దాటి వెళ్ళిపోతాడు. అక్కడే విశ్వకర్మ చేత నిర్మింపబడ్డ భవనంలో పాశము పట్టుకొని ఉన్న వరుణుడు నివసిస్తూ ఉంటాడు. అక్కడినుంచి ముందుకి వెళ్ళాక బ్రహ్మగారితో సమానమైన మేరు సావర్ణి అనే మహర్షి కనపడతారు, ఆయనకి నమస్కారం చేసి సీతమ్మ ఎక్కడుంది అని అడగండి. ఇక అక్కడినుండి ముందుకి వెళ్ళడం కష్టం. కావున మీరందరూ అక్కడిదాకా వెతికి రండి " అన్నాడు.

### 4.14 భూగోళ వర్ణనము - ఉత్తర దిక్కు

తరువాత ఆయన శతబలి అనే వానరుడిని పిలిచి " శతబలి! నువ్వు లక్ష వానరములతో కలిసి ఉత్తర దిక్కుకి వెళ్ళు. నువ్వు మ్లేచ్ఛ, పులింద, శూరసేన, ప్రస్థల, భరత, కురు, మద్రక, కాంభోజ, యవన, శక, కౌరవ మొదలైన ప్రాంతములలో వెతకండి. ఆ తరువాత సుదర్శన పర్వతాన్ని, దేవసఖ పర్వతాన్ని వెతకండి. ఆ తరువాత 100 యోజనాల నిర్జనమైన ప్రదేశం ఉంటుంది. ఆ తరువాత విశ్వకర్మ నిర్మితమైన తెల్లటి భవనంలో యక్షులకు రాజైన కుబేరుడు నివసిస్తూ ఉంటాడు. అక్కడున్న క్రౌంచ పర్వతానికి ఒక కన్నం

ఉంటుంది, అందులోనుండి దూరి అవతలివైపుకి వెళ్ళండి. అప్పుడు మీకు మైనాక పర్వతం కనపడుతుంది, అక్కడ కింపురుష స్త్రీలు నివాసం చేస్తుంటారు, మయుడు అక్కడే నివాసం ఉంటాడు. అక్కడే మీకు సిద్ధుల, వైఖానసుల, వాలఖిల్యుల ఆశ్రమాలు కనపడతాయి. (వీరి గురించి ఇంతకు ముందు వివరణ ఈయడం అయినది) అది కూడా దాటితే వైఖానస సరస్సు కనపడుతుంది, అందులో కుబేరుడి వాహనమైన సార్వభౌమము అనే ఏనుగు ఆడ ఏనుగులతో కలిసి స్నానం చేస్తుంది. ఆ తరువాత ఆకాశం ఒక్కటే ఉంటుంది. భయపడకుండా అది కూడా దాటితే శైలోదం అనే నది వస్తుంది. ఆ నదికి అటూ ఇటూ కీచకములు అనే వెదుళ్ళు ఉంటాయి, ఆ వెదుళ్ళ మీద ఋషులు అటూ ఇటూ దాటుతుంటారు. అక్కడినుండి ముందుకి వెళితే సిద్ధపురుషుడు కనపడతాడు. అది కూడా దాటితే పుణ్యాత్ములకు నివాసమైన ఉత్తరకురు దేశం కనపడుతుంది. అక్కడ ఎన్నో వేల నదులు ప్రవహిస్తుంటాయి, అన్ని నదులలోను వెండి పద్మాలు ఉంటాయి. వాటినుండి రజస్సు నీళ్ళల్లో పడుతూ ఉంటుంది, అందువలన ఆ నీరు సువాసనలు వెదజల్లుతుంటుంది. అక్కడ చిత్రవిచిత్రమైన చెట్లుంటాయి, ఆ చెట్ల కింద నిలుచుని ఒక కోరిక కోరితే, ఆ కోరికలకి సంబంధించినది ఆ చెట్టుకి వస్తుంది. అక్కడినుంచి ముందుకి వెళితే మీకు సంగీత ధ్వనులు వినపడతాయి, అక్కడ ఎందరో సంతోషంగా తపస్సు చేసుకుంటూ తిరుగుతూ ఉంటారు. అక్కడికి వెళ్ళాక మీకు దుఃఖం అన్నది ఉండదు. అది దాటిపోతే ఉత్తర సముద్రం కనపడుతుంది, ఆ సముద్రం మధ్యలో సోమగిరి అనే పర్వతం ఉంటుంది. సూర్యుడు లేకపోయినా ఆ పర్వతం ప్రకాశిస్తూ ఉంటుంది. అదికూడా దాటి వెళ్ళిపోతే ఒక పర్వతం మీద బ్రహ్మాండమైన, రమ్యమైన మందిరం కనపడుతుంది.

**భగవాన్ తత్ర విశ్వాత్మా శంభుః ఏకాదశ ఆత్మకః |**
**బ్రహ్మా వసతి దేవేశో బ్రహ్మ ఋషి పరివారితః||**

అక్కడ శంకరుడు11 రుద్రులుగా వచ్చి కూర్చుంటాడు. ఆ పక్కనే బ్రహ్మగారు వేదాన్ని బ్రహ్మర్షులకి చెప్తుంటాడు. ఇక అది దాటి ఏ ప్రాణి వెళ్ళలేదు. మీరు అక్కడిదాకా వెళ్ళి సీతమ్మని వెతకండి. ఒక నెల సమయంలో సీతమ్మ జాడ కనిపెట్టండి " అని చెప్పాడు.

## 4.15 సంపాతి సీత జాడ చెప్పుట

సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం 4 దిక్కులకి వెళ్ళిన వానరములలో 3 దిక్కులకి వెళ్ళిన వానరములు నెల రోజుల తరువాత వెనక్కి తిరిగి వచ్చేశాయి. వాళ్ళు అన్ని ప్రాంతాలని వెతికినా సీతమ్మ జాడ ఎక్కడా కనపడలేదు. దక్షిణ దిక్కుకి వెళ్ళిన వానరములు వింధ్య పర్వతం దెగ్గరికి వెళ్ళి, ఆ పర్వతంలో ఉన్న చెట్లని, గుహలని, సరస్సులని, మార్గమధ్యంలో ఉన్న నదులని, పట్టణాలని, గ్రామాలని అన్వేషిస్తూ వెళుతున్నారు. అలా వెతుకుతూ వెతుకుతూ సుగ్రీవుడు విధించిన నెల రోజుల గడువు దాటినది. సుగ్రీవుడు చండ శాసనుడు. గడువు తీరిన తర్వాత సీత జాడ లేకుండ వెళితే ఎలాగూ మరణ దండన విధిస్తాడు కావున యువరాజైన అంగదుడునితో సహా వానరులు ప్రాయోపవేశము చేయడానికి సిద్ధపడి రామకథ చెప్పుకుంటూ ఉండగా.. అది జటాయు సోదరుడైన సంపాతి చెవిన పడింది. అప్పుడా పక్షి చెపుతూ.. సంపాతి అనబడే నేను, జటాయువు సోదరులము. సూర్యుడు ఉదయించినప్పటినుంచి అస్తమించేలోపు ఆయనతో సమానంగా ప్రయాణం చెయ్యాలని మేము ఒకనాడు పందెం కాసుకున్నాము. అనుకున్న ప్రకారం నేను, జటాయువు సూర్యుడి వెనకాల వెళ్ళిపోతున్నాము. అలా వెళుతుండగా మిట్ట మధ్యాహ్నం వేళ మేము సూర్యుడికి దెగ్గరగా వచ్చాము. అప్పుడా సూర్యుడి వేడిని భరించలేక జటాయువు స్పృహతప్పి కిందపడిపోతున్నాడు. పెద్దవాడిని కనుక తమ్ముడిని రక్షించాలని నేను నా రెక్కలని జటాయువుకి అడ్డంగా పెట్టాను. అప్పుడా సూర్యుడి వేడికి నా రెక్కలు కాలిపోయి

వింధ్య పర్వతం మీద పడిపోయాను. కాని నా తమ్ముడు ఎటు వెళ్ళిపోయాడో నాకు తెలీలేదు. మళ్ళీ ఇంతకాలానికి మీవల్ల నా తమ్ముడి గురించి విన్నాను. రెక్కలు కాలిపోయాయి ఇలా పడి ఉన్నాను, కాని రామకార్యానికి నేను మాటమాత్రం సహాయం చేస్తాను. సీతమ్మని రావణుడు ఆకాశ మార్గంలో తీసుకెళుతున్నప్పుడు ఆమె ఆభారణాలని కొంగుకి చుట్టి విడిచిపెట్టడం నా కొడుకు అయిన సుపార్శుడు వలన తెలిసింది. ఈ సముద్రానికి దక్షిణ దిక్కున 100 యోజనముల అవతల లంక ఉంటుంది. అట్టి లంకా నగరంలో దీనురాలై, రాక్షస స్త్రీల మధ్యలో సీతమ్మ ఉంది. నేను ఇక్కడే కూర్చుని సీతమ్మని చూడగలను. మాకు ఆ శక్తి ఉంది. ఎందుకంటే, భూమి నుండి ఆకాశానికి కొన్ని అంతరములు ఉన్నాయి. మొదటి అంతరములో తమ కాళ్ళ దెగ్గర ఉన్న ధాన్యాన్ని ఏరుకొని తినే కుక్కుటములు అనే పక్షులు ఎగురుతాయి. రెండవ అంతరంలో చెట్ల మీద ఉండే ఫలాలని తినే పక్షులు ఎగురుతాయి. మూడవ అంతరంలో భాసములు, క్రౌంచములు ఎగురుతాయి. నాలుగవ అంతరంలో డేగలు ఎగురుతాయి. అయిదవ అంతరంలో గ్రద్దలు ఎగురుతాయి. ఆరవ అంతరంలో హంసలు ఎగురుతాయి. ఏడవ అంతరంలో వినతా పుత్రులమైన వైనతేయులము (గరుడుడు, అరుణుడు/అనూరుడు, సంపాతి, జటాయు - అనూరుడు పుత్రులు) కాబట్టి మేము ఎగురుతాము. అందుకని మేము తినే తిండి చేత, సహజంగా మేము జన్మించిన జాతి చేత 100 యోజనముల అవతల ఉన్న విషయాన్ని కూడా ఇక్కడే ఉండి చూడగల దృష్టి శక్తి మా కంటికి ఉంటుంది. అదుగో దూరంగా లంకా పట్టణంలో, అశోక వనంలో సీతమ్మ కూర్చుని ఉండడం నాకు కనిపిస్తుంది. మీలో ఎవరైనా సాహసం చేసి 100 యోజనముల సముద్రాన్ని దాటి వెళ్ళగలిగిన వాడు ఉంటె, సీతమ్మ యొక్క దర్శనం చెయ్యవచ్చు. ఇంక అక్కడున్న వానరాలకి ఇది చూడగానే చాలా సంతోషం వేసింది. సముద్రాన్ని దాటుదామని వాళ్ళందరూ కలిసి సముద్రం యొక్క ఉత్తర తీరానికి చేరుకున్నారు. అప్పుడు వాళ్ళు అనుకున్నారు " ఈ

100 యోజనముల సముద్రాన్ని దాటి ఆవలి ఒడ్డుకి వెళ్ళగలిగినవాడు ఎవడు. మిగిలిన వానర జాతికి ఎవడు ప్రాణప్రదానం చెయ్యగలిగినవాడు. ఈ సముద్రం దెగ్గర నిలబడిపోయిన వానరాలు సంతోషంగా తిరిగి వెళ్ళి తమ భార్యాపిల్లలని చూసేటట్టు చెయ్యగలిగినవాడు ఎవడు. ఎవరివల్ల ఈ కార్యం జరుగుతుంది, ఎవరు అంతటి సమర్థుడు " అని అడిగారు. అప్పుడు జాంబవంతుడు ఒక్కడిగా కూర్చున్న హనుమంతుడి దెగ్గరికి వెళ్ళి ... నువ్వు పుట్టగానే ఆకాశంలో ఉన్న సూర్యుడిని చూసి తినే ఫలం అనుకొని ఆయనని పట్టుకోబోయావు, నిన్ను పడగొట్టగలిగే వాడు ఈ బ్రహ్మాండంలో ఎవ్వరు లేరు. ఇవ్వాళ కొన్ని కోట్ల వానరముల భవిత, సౌభాగ్యము, ప్రాణములు నీ చేతులలో ఉన్నాయి. నీ వీర్యమును, తేజస్సును, పరాక్రమమును ఒక్కసారి పుంజుకో. 100 యోజనముల సముద్రాన్ని అవలీలగా దాటి సీతమ్మ జాడ కనిపెట్టి ఇక్కడికి రా. హనుమా! నీ శక్తిని చూపించు " అని జాంబవంతుడు అన్నాడు. జాంబవంతుడి మాటలు విన్న హనుమంతుడు మేరు పర్వతం పెరిగినట్టు తన శరీరాన్ని పెంచేశాడు. గుహలో నుండి బయిటకు వచ్చిన సింహంలా, తన స్వస్వరూపాన్ని పొంది, అక్కడ ఉన్న వృద్ధులైన వానరాలకి నమస్కరించి ఇక్కడ నుండి లేచి దక్షిణ దిక్కున ఉన్న సముద్రాన్ని ముట్టుకుంటాను. రావణాసురుడిని కొట్టి చంపేస్తాను, లేదా లంకని పెల్లగించి చేతితో పట్టి సముద్రానికి ఈవలి ఒడ్డుకి తీసుకువచ్చి రాముడి పాదాల దెగ్గర పడేస్తాను. అని చెప్పి ఈ భూమి నన్ను తట్టుకోలేకపోతుంది, అందుకని మహేంద్రగిరి పర్వతం మీద నుంచి బయలుదేరతాను " అన్నాడు. ఇందలి యోగ రహస్యమును తెలుసుకొందాము.

## 4.16 సంపాతి కథ యందలి యోగ రహస్యము

వాల్మీకి మహర్షి యోగ సాధనకు సంబంధించిన ప్రకరణము లన్నియు సుగమముగా ఆవిష్కరించెను. సాధన ప్రగతి నొందుచున్న కొలది,

తత్ఫలితముగా సాధకుని శక్తి వృద్ధి యగును. శక్తితో పాటుగా గర్వము, అహంకారము అధికమై సాధకుడు అనవసరమైన భ్రమలలో తేలియాడును. లేదా తొందరపాటులో అనావశ్యక కార్యము లందు తనకు ప్రాప్తించిన అవస్థను ఉపయోగించును. సంపాతి అవస్థ ఇటువంటిదే అయిన ఉచ్ఛ అవస్థ నుండి క్రిందికి పడిపోతూ సాధన యొక్క దక్షిణ (పూర్వపు) అవస్థకు చేరుట.

**సంప్రాప్య సాగరస్యాఽన్తం సంపూర్ణం శత యోజనమ్**
**ఆసాద్య దక్షిణం కూలం తతో ద్రక్ష్యథ రావణమ్**
**త త్రైవ త్వరితాః క్షిప్రం విక్రమధ్వం ప్లవంగమాః**
**జ్ఞానేన ఖలు పశ్యామి దృష్ట్వా ప్రత్యాఽఽగమిష్యథ**

లంక సముద్రము మధ్యన యున్నది. అనగా మాయ చుట్టూ సంసార సాగరము వ్యాపించి యున్నది. దానిని ప్రాప్తించుకొనుటకై ఈ సంసార సాగరమును దాటవలసి యున్నది. శత యోజనముల దూరమనగా అనేకమైన ఉపాయములు. దక్షిణ తీరమనగా రావణుని కాంచన వృత్తి రూప జ్ఞానమనెడి అహంకారము యొక్క స్థానము. ఈ దక్షిణ తీరమును మార్గదర్శనం చేసిన సంపాతి గురించి తెలుసుకొనవలసి యున్నది. సంపాతి, జటాయు నిశాకరముని (రాత్రి యందు సాధన చేయువారు) శిష్యులు. వృత్రాసురుని జయించిన ఇంద్రుని జయించుటకు వీరిరువురు ఆకాశ మార్గములో (ధ్యాన మార్గము ద్వారా) స్వర్గలోకమునకు ఏగిరి. స్వర్గము అనగా సమాధి. లోకము అనగా అవస్థ. స్వర్గలోకమనగా సమాధి అవస్థను ప్రాప్తించుకొని ఇంద్రియములను జయించుట. స్వర్గలోకమును గురించి శ్రీమద్భాగవతమున ఇట్లు చెప్పినారు.

**అత్రైవ నరకః స్వర్గ ఇతి మాతః ప్రచక్షతే**
**యయాత నావై నారక్యాస్తా ఇహాప్యుపలక్షితా**

స్వర్గ నరకములు మనస్సు యొక్క అవస్థలు. శరీరభావము అధిగమించిన (సమాధి) ప్రగతిశీల అవస్థయే స్వర్గలోకము. ఆ అవస్థ యందు ఒక కల్ప కాలము

యున్నను శరీరము నందు మార్పు రాదు. అక్కడ మృత్యు భయము, ఆకలిదప్పులు, వృద్ధాప్యము, శోకము ఉండదు అంతయు ఆనందమే ఆనందము. ఈ అవస్థయే వృత్తాసురుని సంహరించిన తర్వాత ప్రాప్తించేది శూన్య అవస్థ.

**పురా వృత్ర వధే వృత్తే పరస్పర జయైషిణౌ**
**ఆదిత్యమ్ ఉపయాతౌ స్వో జ్వలన్తం రశ్మి మాలినమ్**
**ఆవృత్యాఽఽకాశ మార్గేణ జవేన స్మ గతౌ భృశమ్**
**మధ్యం ప్రాప్తే చ సూర్యే చ జటాయుః అవసీదతి**
**తమ్ అహం భ్రాతరం దృష్ట్వా సూర్య రశ్మిభిః అర్దితమ్**
**పక్షాభ్యాం ఛాదయా మాస స్నేహాత్ పరమ విహ్వలః**
**నిర్దగ్ధ పక్షః పతితో విన్ధ్యేఽహం వానరోత్తమాః**
**అహమ్ అస్మిన్ వసన్ భ్రాతుః ప్రవృత్తిం నోపలక్షయే**

ప్రగతి నిరోధకమైన వృత్తాసురుని రాక్షస ప్రవృత్తి ఇంద్రునిచే సంహరింపబడినప్పుడు సంపాతి, జటాయు లిద్దరు ఆకాశమార్గములో స్వర్గమునకు (ఇంద్రుని జయించుటకు) పోయెదరు. అనగా ధ్యానము ద్వారా సమాధి అవస్థకు చేరెదరు. అప్పుడు సూర్య తేజస్సు వలన జటాయు వ్యాకుల పడినప్పుడు సంపాతి తన రెక్కలతో రక్షించి క్రింద పడిపోయెను. ధ్యాన మార్గము నుండి విచలితుడై క్రిందకు పడిపోయెను. పర్వతముపై దీర్ఘకాలం ఉండుట వలన ప్రాణశక్తి క్షీణించి సంపాతి వృద్ధుడాయెను.

**తత స్తు సాగరాన్ శైలాన్ నదీః సర్వాః సరాంసి చ**
**వనాన్ ఉదధి వేలాం చ సమీక్ష్య మతి: ఆగమత్**
**హృష్ట పక్షి గణా కీర్ణః కన్దరాఽన్తర కూటవాన్**
**దక్షిణ స్యోదధే స్తీరే విన్ధ్యోఽయమ్ ఇతి నిశ్చితః**

తెలివి వచ్చుసరికి సంసార సాగరము యొక్క దక్షిణ తీరము అనగా సాధన యొక్క దక్షిణ అవస్థ యందు క్రిందకు దిగిపోతిని.

ఇంద్రియ శక్తుల ద్వారా ప్రగతి నిరోధక వృత్తిని సంహరించుట, అచ్చట నుండి ఇంద్రావస్థను జయించి ఆకాశ మార్గమున (ధ్యాన మార్గమున) సమాధి అవస్థకు చేరుట, అచట నుండి సూర్య ప్రకాశము లేదా జ్ఞానము/బ్రహ్మ జ్ఞానము ప్రాప్తించుకోవాలి అనే కోరికతో తీవ్ర సాధనలో భరించలేని తాపము పొంది, మిగిలియున్న అహంకారము కారణంగా క్రింది అవస్థకు పడిపోవుట జరుగును. అదియే సాధన యొక్క దక్షిణ అవస్థ లేక దక్షిణాయనము.

**శ్లో|| అగ్నిర్జ్యోతి రహః శుక్లః షన్మాసా ఉత్తరాయణం భ|గీ| 24 /1**

**ధూమో రాత్రి స్తథా కృష్ణః షన్మాసా దక్షిణాయనం భ|గీ| 25 /1**

భగవద్గీత ఎనిమిదవ అధ్యాయము - అక్షర పరబ్రహ్మ యోగము - లో శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. అగ్ని, తేజము, పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణము ఆరు మాసములు ... వీటి యందు గతించిన బ్రహ్మవేత్తలు పరబ్రహ్మ స్థితిని పొందుదురు. వారికి పునర్జన్మ లేదు. ఈ మార్గమును అర్చిరాది మార్గమనియు, దేవయాన మార్గమనియు అందురు. ఈ మార్గము నందు పోవు యోగులు, సూర్య మండలము ద్వారా స్వర్గమును ప్రవేశించి బ్రహ్మలోకమునకు ఏగి అచ్చట ఆత్మానుభూతి నొంది బ్రహ్మ కల్పాంతమున విదేహముక్తులు అగుదురు. పొగ, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయన ఆరుమాసములు ... వీటి యందు మరణించిన యోగులు చంద్రమండలమును చేరి, తిరిగి భూమియందు జన్మింతురు. ఈ మార్గమును ధూమాది మార్గమనియు, పితృయానం మార్గమనియు అందురు. ఈ మార్గమున పోవు యోగులు, చంద్రమండలం ద్వారా స్వర్గమునకు ఏగి దివ్యభోగానుభవము ముగిసిన పిమ్మట చంద్ర కిరణముల ద్వారానో, వర్షధారల ద్వారానో భూమి యందు సస్యాదులలో ప్రవేశించి అన్నరూపమున ప్రాణుల

జఠరమందు జొచ్చి శుక్రముగా మారి, శుక్రశోణిత సంయోగము వలన స్త్రీ గర్భము నందు స్థూల శరీరమును ధరించి జన్మింతురు.)

సుగ్రీవ-రాముల కలయిక మరియు హనుమ-సంపాతి సంవాద సమయము నందు రాముని పాదావస్థను ఉత్తరాయణ అవస్థగా గ్రహించ వలెను. ఈ అవస్థ దక్షిణాయన అవస్థ కన్నా శ్రేష్టమైనది. ఉచ్చ అవస్థలకు పోగోరు సాధకుడు క్రింది అవస్థల యందలి అనుభూతులను త్యజించవలసి యున్నది. అదేవిధంగా పూర్వ అనుభూతులను పొందగోరు సాధకుడు మరల ఆయా దక్షిణ అవస్థలకు పోవలెను. అందుచే రామాయణకారుడు సీత మరియు లంక దక్షిణ దిశలో ఉన్నవని క్రింది అవస్థలను చెప్పకనే చెప్పుచున్నాడు.

### 4.17 కిష్కిందా కాండము-సింహావలోకనం

కిష్కింద నామమును పెట్టుటలో వాల్మీకి తన చర యోగావస్థను, అత్యంత బుద్ధిమతను పరిచయము చేసినాడు. నిర్వికల్ప సమాధి యందు నిరాలంబ, నిర్గుణ, శూన్య అవస్థ తారసబడును. ఆ అవస్థ ఎవరికీ చెందినది కాదు. ఒకరు మరొకరిని ధారణ చేసినది కాదు. అంతయు శూన్యము. నిరాలంబము, అవస్థ కాని అవస్థ. అటువంటి అవస్థయే కిష్కింధ. రాజైన వాలి అట్టి శూన్య అవస్థకు చేరినవాడు. కుండలిని యందు చెప్పిన ఋగ్వేద [15]నాసదీయ సూక్తమును చూద్దాము.

**శ్లో|| నాస దాసీన్నో సదాసీత్త దానీం| నాసీద్రజో నోవ్యామాపరాయత్|**
**కిమావరీవ కుహ కస్య శర్మ న్నంభః| కిమాసీదగహనం గభీరం|**
**నమృత్యు రసీదా మృతం, నతర్హి నారాత్రయా అహనాసీద ప్రాకేతః|**
**అనీద వాతం స్వధయా తదేకం| తస్మాద్దాన్యన్న పరః కించనాస||**
**...... ఋ|| మం|| 10 వ సూక్తి 129**

[15] Source : వైదిక విశ్వం-పరికల్పన by యోగిరాజ్ మనోహర్ హర్ కరే (కాకాజీ)

అటువంటి అవస్థలో సత్తుగాని అసత్తుగాని లేదు. అస్థిత్వము, అనస్థిత్వము లేదు. ఆ సమయములో ధారణ చేసే జలము లేదు. అసలు పరాక్కువస్థా యొక్క గహన గంభీరమైన వ్యోమము లేదు. మూల శక్తి ఏది? మూల పదార్థము ఏది? ఏది దేన్ని ఆవహిస్తుంది? ఆ శూన్య స్థితి యొక్క గహణత్వాన్ని తెలుసుకొన గలది ఎముంది? ఆ సమయములో గంభీర గహణత్వము ఏది? అచ్చట నాశము లేదు, ఉత్పత్తి లేదు. ప్రకాశము లేదు. అంధకారము లేదు. ఒకే ఒక చైతన్యము. తనలో తానే స్పందిస్తున్నది. ఆ చైతన్యాన్ని తెలుసు కొనగల వస్తువు ఏది? ఎక్కడ నుండి స్పందిస్తుంది? ఆ చైతన్యాన్ని తెలిసికొన గల నిగూఢమైన సత్యాన్ని వెలుగులోకి తెచ్చుటకు ఒక సాటిలేని ప్రయత్నము. ప్రతి అస్థిత్వము తనకు తాను గానే అసంఖ్యాకమైన అనుభవాలతోను, బాహ్య రూపం వెనుక నున్న నిజ తత్వము తోను కూడి యుంటుంది. ఇటువంటి అస్థిత్వము యందు నిగూఢమైన జ్ఞానం దాగి యున్నది. ఈ జ్ఞానాన్ని వెలుగులోకి తెచ్చే సముదాయము వేదాలు. జగదారంభము యొక్క మూల అవస్థ యందలి నిర్వికల్ప సమాధి అనుభవమును పొందినవారు నాసదీయ సూక్తమును సంపూర్ణముగా అవగాహన చేసుకొన గలరు. తర్క వితర్కముల వలన ఉపయోగము లేదు. ప్రకృతి యొక్క మూల అవస్థ యందలి విజ్ఞానమును మహాపురుషులు గ్రహించగలరు. ఈ కిష్కింధ శూన్య అవస్థ కు ప్రతీక.

**దుందుభి:** దుందుభి అనగా డోలు లేదా నగారా. శూన్య (సమాధి) అవస్థకు పోవునప్పుడు సాధకుడు అనాహత నాదములు వినును. అవి... మృదంగనాదము, భాసురీనాదము, సముద్ర కెరటముల నాదము, ఘంటానాదము, శంఖునాదము, మేఘనాదము, సూర్యచంద్ర కిరణముల నాదము ఇత్యాది. మనము ముందుగా చూసిన పరమోచ్ఛ శూన్య అవస్థ ఈ అనాహత నాదముల కన్నా ఉత్కృష్టమైనది. (పరమోత్కృష్టమైన పరనాదము గురించి ఉపోద్ఘాతము లో చర్చించుకొన్నాము) ఎల్లప్పుడూ అనాహత నాదములనే విను

సాధకుడు శూన్య అవస్థకు పోయినట్లు కాదు. అంచేత కిష్కింధ రూప సమాధి అవస్థ యందు ఉండగోరు వాలి సాధకుడు దుందుభిని నిర్మూలన (సంహరించుట) చేయవలసి యున్నది. ఆ దుందుభి సంహారమునకై బిలమునందు ప్రవేశించి ఒక సంవత్సర కాలము ఉండెను. కాని వారికి సమయము ఒక క్షణములా గడచెను. బిలమనగా సూక్ష్మ రంధ్రము. అటువంటి చిన్న రంధ్రము నందు దుందుభి, వాలి వంటి విశాల కాయులు ప్రవేశించుట సాధ్యమా? అచ్చట అన్నపానీయాలు, గాలి, ప్రకాశము లేకుండా సంవత్సర కాలము ఎలా గడిపిరి? (లేఖకుడు ఋశ్యమూకం మరియు హంపి లోని వాలి గుహ, సుగ్రీవ గుహ మరియు హనుమ జన్మ స్థానమైన గుహలను దర్శించి యున్నాడు. అంతటి విశాల దేహులు అంత చిన్న గుహలలో ఎలా ఉండారో అని ఆశ్చర్యము కలుగును) గహన యోగ సాధన యందు ఉచ్ఛ సాధకునకు ఈ బిలము యొక్క అనుభవము కల్గును. ఈ బిలమే ఇడ, పింగళ మధ్య ఉన్న సుషుమ్నా నాడి. సాధకుడు తన చిత్తము ద్వారా సుషుమ్నా నాడిలో చరించు చున్నప్పుడు బాహ్యామునందున్న సమయము స్ఫురించదు. సమాధి అవస్థ యందున్న అట్టి సాధకుడు కాలాతీతుడు. దేహ భావముకు కొద్ది క్షణములే గడచినట్లుండును. మేరుదండమునందున్న అతి సూక్ష్మమైన సుషుమ్న నాడియే వాలి జొరబడిన బిలం. ఈ బిలం నందు ప్రవేశించినప్పుడు దుందుభి నాదము శాంత మగును. శాంతబడిన సుషుమ్న రూప బిలమున వాలి ఒక సంవత్సర కాలము దేహ భావమునకు అతీతుడగును. కాని సమాధి అవస్థకు బయిట నున్న సుగ్రీవునకు సాధారణ భావమున ఒక సంవత్సరమయ్యెను. యోగి గంటల తరబడి యున్న సమాధి అవస్థను అవగాహన చేసుకొనలేక, ఓర్మి కోల్పోయి సామాన్యులు తమ తమ వ్యవహారములలో నిమగ్నమయ్యెదరు. సుగ్రీవుడు ఈ విధముగానే బిలం వదలి కిష్కింధకు వెళ్లెను. శక్తి ప్రక్షేపణ చేయు తారను, ఆందరూపమైన రుమను (సుగ్రీవుని భార్య) వాలి స్వీకరించి సుగ్రీవుని బయిటకు పంపెను.

తద్వారా తాపసి జీవనమునకు సుగ్రీవుడు అలవాటుపడునట్లు చేసెను. రాముడనగా ఆనందము. వాలి అవస్థ బ్రహ్మమయి సంపూర్ణ శూన్యావస్థకు చేరెను. **"ప్రణవోధను: శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే"** ఆత్మా రాముడు ఈ విధంగా సాధనారూప ధనస్సును ఆత్మ రూప బాణములో సంధించి వాలి రూప బ్రహ్మపై గురి పెట్టెను. ఆత్మా రాముడు వాలి రూప బ్రహ్మగా మారెను. వాలి సంహరింపబడిన తర్వాత సుగ్రీవుడు కిస్కిందకు రాజయ్యెను. తార రూప శక్తి ప్రక్షేపణ అవస్థ సుగ్రీవునికి పత్ని అయినది. వీర పురుషుడైన రాముడు కూడా కామవాసనల (సీతా రూప సాత్విక అనుభూతులు) వలన దుఃఖితుడు అవుతాడు. అయితే లక్ష్మణుడు మాత్రము ఉచ్చ అనుభూతుల ద్వారా సీతా అనుభూతులను త్యజించమను చున్నాడు. వానరులందరూ ఏకత్రితమై సీతా శోధనము హనుమానుని ద్వారానే జరుగ వలెనని నిశ్చయించిరి. హనుమానుడు మనస్సులో లంకను స్మరించుకొనెను. లంక అనగా మాయ. కామిని, కాంచనము మరియు కీర్తి - ఈ మూడింటి ప్రదేశము లంక. లంక చుట్టును సముద్రము యున్నది. సముద్రము అనగా సంసారము. లంక సంసారము మధ్యలో చిక్కు కొని యున్నది. అట్టి లంకను శ్రేష్ఠ సాధకుడైన రాముడు ఉద్ధరించవలెను.

## కిష్కిందా కాండము సమాప్తము

## శ్రీరామ జయరామ జయజయ రామ

# 5.0 సుందర కాండము

## 5.0 సుందర కాండము

శ్రీరాముడు చైత్ర శుద్ధ నవమి పునర్వసు నక్షత్రము నాలుగవ పాదము కర్కాటక లగ్నము నందు, భరతుడు చైత్ర శుద్ధ దశమి పుష్యమి నక్షత్రము మీన లగ్నము నందు, లక్ష్మణ, శత్రుఘ్నులు చైత్ర శుద్ధ దశమి ఆశ్లేష నక్షత్రము కర్కాటక లగ్నము నందును జన్మించిరి. వారి వారి జనన కాలము నందు రవి, కుజ, గురు, శుక్ర, శనులు ఉచ్ఛ దశలలో యుండిరి. జ్యోతిషశాస్త్ర ప్రమాణము ప్రకారము శ్రీరాముడు లోకనాయకుడు అనగా జగత్ప్రభువుగా, తక్కిన వారు జగత్ప్రసిద్ధులైరి.

**సర్వే వేదవిదః శూరాః సర్వే లోక హితే రతాః**

**సర్వే జ్ఞానోప సంపన్నాః సర్వే సముదితా గుణైః**

ఆ రాజకుమారులు వేదశాస్త్రములను అభ్యసించిరి. ధనుర్విద్య యందు ప్రావీణ్యము సంపాదించిరి. యుక్త వయస్కులైన తన పుత్రుల వివాహ విషయమై దశరథ మహారాజు ఆలోచించుచుండగా విశ్వామిత్ర మహర్షి వచ్చి యజ్ఞ సంరక్షణార్థమై శ్రీరాముని పంప వలసినదిగా కోరతాడు. ఆ కోరిక విని దశరథ మహారాజు విశ్వామిత్రునితో ..

**ఊన షోడశ వర్షో మే రామో రాజీవ లోచనః**

**న యుద్ధ యోగ్యతామ్ అస్య పశ్యామి సహ రాక్షసైః**

రాముడు పదుహారు సంవత్సరముల ప్రాయము వాడు, క్రూర రాక్షసులతో యుద్ధము చేయలేడు.

ఇక్కడ వాల్మీకి తన కావ్యములో శ్రీరాముడు జననము తర్వాత వారు పదునారు సంవత్సరముల ప్రాయములో సకల విద్యా పారంగతులైరి అని చెప్పెను. తరువాత శ్రీరాముని వైరాగ్యము, వసిష్ఠ మహర్షి చెప్పిన ఆత్మ విజ్ఞానము మనకు వాల్మీకి

రామాయణములో కానరాదు. అది యోగ వాసిష్ఠము నందు యున్నది గావున గమనించ గలరు.
రావణుడు అమోఘమైన తపఃసంపన్నుడు. అట్టి రావణుని సంహరించుటకు రావణుని మించిన తపఃశక్తిని పొంది యుండవలెను.
వేదము - సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము - అని మూడు భాగాలు. ఆరణ్యకంలో వివిధ తపస్సులు క్రింది విధంగా పేర్కొనబడినవి:
**ఋతం తపః, సత్యం తపః, శ్రుతం తపః, శాంతం తపః, దమస్తపః, శమస్తపః, దానం తపః, యజ్ఞం తపః, భూర్భువస్సువర్బ్రహ్మై తదుపాస్య తపః.**
1. ఋతము = సూనృత భాషణము - వాక్కుతో సత్యము పలుకుట, 2. సత్యము = త్రికాలలలో - భూత-భవిష్యత్-వర్తమానాలలో - ఉండేది. యథార్ధ వస్తు చింతనం చేయటం. సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ (తైత్తిరీయోపనిషత్తు), 3. శ్రుతము = వేదాధ్యయనము, 4. శాంతము = శాంతముగా నుండుట (ఓర్పు), 5. దమము = ఇంద్రియ నిగ్రహము, 6. శమము = కామక్రోధాదులు లేకుండుట, 7. దానము = బ్రహ్మార్పణముగా ఇతరులకు ఇచ్చుట, 8. యజ్ఞము = దేవతారాధన. ఇవేకాకుండా బ్రహ్మను (అంటే సర్వమూ తానే అయి, సర్వత్రా, సర్వకాలములలో ఉండేవాడు) ఉపాసించుట కూడ తపస్సే. యజ్ఞములు పలు రకాలు. వాటిలో తపోయజ్ఞం ఒకటి. అదే ఆ పైన చెప్పబడినదియే యజ్ఞం తపః.
శ్రీమద్భగవద్గీతలో శ్రీ క్రుష్ణ భగవానుడు ఐదు రకాలైన యజ్ఞ భేదములను ఇట్లా వివరించాడు.
**ద్రవ్య యజ్ఞాస్తపోయజ్ఞా, యోగ యజ్ఞాస్తథాపరే|**
**స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ, యతయః సంశితవ్రతాః||**
**(జ్ఞానయోగము: 4-28)**
వాటిలో తపస్సు కూడా ఒక యజ్ఞమే. ఈ మాదిరి పుణ్య కార్యాలు, తపస్సులు చేస్తే దైవారాధన వల్ల లోక కళ్యాణం జరుగుతుంది. మహర్షులు, సాధు పురుషులు

తమ స్వార్థం కోసంగాక, లోక క్షేమం కోరి తపస్సు చేస్తారు. కామక్రోధాలను, రాగద్వేషాలను దరిజేరనీయక, జితేంద్రియులై, సత్వ గుణ ప్రధానులై త్రికరణ శుద్ధితో తపస్సు చేస్తారు. అట్టి తపోధనుల తపస్సంపద లోక కళ్యాణానికి దారి తీస్తుంది. శ్రీరాముడు లోకకళ్యాణార్థమై తపస్సు చేస్తాడు.

## 5.1 హనుమ స్వరూపము

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరాత్మజే**

**వేద: ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా**

వేదములచే తెలియబడు పరమపురుషుడు దశరథునికి కుమారుడైనట్లుగా,వేదము,వాల్మీకి వలన , రామాయణ రూపములో ఉండినది..

శ్రీమన్నారాయణుడు ఈ భూమిపై మరల నసించిపోవు చున్న ధర్మాన్ని నిలబెట్టడానికి శ్రీరాముడు గా అవతరించాడని మన భారతీయుల ప్రగాఢ విశ్వాసము. శ్రీరాముని మీద మనకు లభించినన్ని పరిశోధనా గ్రంథాలు వేటి యందు లభించవు. శ్రీరాముడు మానవునిగా జన్మించి తన శిష్య ప్రజ్ఞచే సకల శాస్త్రాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసి, అకుంఠిత దీక్షతో ఆయా యోగ రహస్యాలను అభ్యాసం చేసి, తన సత్య సంధతతో భగవంతునిగా రూపాంతరము చెందినవాడు. తనను గూర్చి "ఆత్మానాం మానుషం మన్యే" (నేను మానవ మాత్రుడను) అని పేర్కొన్న శ్రీరాముడు "సత్యేన లోకాన్ జయతి" అను ప్రమాణము ననుసరించి సత్యనిష్ఠాగరిష్ఠుడు అయినందున శ్రీరాముడు అన్ని లోకములను జయించ గలిగిన వాడై భగవంతునిగా ఈ లోకుల దృష్టిలో ఉండిపోయాడు. దుర్లభమైన మానవ జీవితమును వ్యర్థము చేసుకొనకుండా బాహ్యమున ధర్మాచరణమును, అంతరమున జ్ఞానము కలిగి ఉండవలెనని మనకు శ్రీరాముని ద్వారా తెలియు చున్నది.

రామలక్ష్మణులు సీతను అన్వేషించుతూ పంపా తీరమునకు వచ్చినప్పుడు, సుగ్రీవుని భయము పోగొట్టుటకై హనుమ సుగ్రీవునితో ఇది ఋశ్యమూకం గాన ఇక్కడికి వాలి, వాలి సంబంధీకులు రాలేరు అని చెపుతాడు. ఆ విధంగా రామాయణంలో హనుమ పాత్ర పరిచయము అయింది. రామసౌందర్యమును చూడగానే హనుమ ఆకర్షితుడయ్యెను. హనుమను చూచి, అతని సంభాషణ విని నంతనే రాముడు అతనిలోని గుణగణములను తెలుసుకొనెను. రాముడు లక్ష్మణుతో హనుమను గురించి చెపుతూ ..

వాక్యకుశలః,(వాక్యకుశలుడు), ఋగ్వేదమునందు బాగుగా శిక్షణ పొందినాడు, యజుర్వేదమును ధారణ చేసినాడు, సామవేదమును చక్కగా ఎరిగిన వాడు, వ్యాకరణమును అనేక మార్లు వినినాడు, మాట్లాడినప్పుడు సందిగ్ధము లేకుండా, తొందరగా గాని, మెల్లగా గాని గాకుండా ముఖము నందు ఎట్టి వికార భావములు లేకుండా, మధుర స్వరముతో, సంస్కారముగా, మంగళకరమైన మధుర స్వరముతో మాట్లాడినాడు అనెను. ఇట్టివాడు దూతగా ఉన్నచో కార్యము తప్పక సిద్ధించునని దూతగా హనుమ యొక్క విశిష్టతను చెప్పినాడు. హనుమ యొక్క ఉత్పత్తి ప్రకారమును పరిశీలించిన శబ్దమునకు హనుమతో గల సామ్యము గోచరించును. మనలోని ఒక భావమును ఆవిష్కరించ వలెనన్న కోరిక గలిగినచో శరీరములోని వాయువులలో కదలిక గల్గును. ఆ వాయువుచే అభిహతమై మూలాధార స్థానము నుండి శబ్దము బయలుదేరి నాభిని, హృదయమును, కంఠమును దాటి తిన్నగా శిరస్థానమును చేరును. అచట నుండి పైకి పోవ వీలు లేక కంఠము నుండి ముఖము గుండా వెలికి వచ్చును. అట్లు వచ్చునప్పుడు నోటిలోని ఆయా స్థానములలో వాయువు యొక్క తాకిడిచే శబ్దముగా వెలికి వచ్చును. ఇందు హనుమకు, శబ్ధమునకు సాపత్యమును చూద్దాము.

1 హనుమ వాయువు వలన జన్మించాడు. శబ్దము కూడా వాయువు వలననే జనియించింది.

2 పుట్టగానే హనుమ సూర్య మండలము వైపు (సమాధి అవస్థ) కు పోయెను. శబ్దము కూడా ముందుగా శిరస్సు వైపు సాగును. అటు పోవ వీలుగాక నోటి నుండి వెలుపలికి వచ్చును. నోటిలోని ఆయా వర్ణముల అభివ్యక్త స్థానములే అంజన, కనుక అంజనాసుతుడు అయ్యెను.

3 సూర్యుని నుండి క్రిందకు పడిపోటచే దౌడలు సొట్ట బోయి హనుమ గా పేరు వచ్చినది. శబ్దము గూడ శిరఃస్థానము నుండి నోటిలోని దౌడల కదలికచే వర్ణ రూపమున వెలుపలికి వచ్చును గాన శబ్దము గూడ "హనుమ" అగును.

4 శబ్ద సామర్థ్యము వలన అవసరమైన కార్యములు నెరవేర్చుటలో మంత్రి వలే పని చేయును. స్వాధ్యాయన ప్రవచన శీలి యగు సుగ్రీవునకు హనుమ సచివుడు.

ఇట్టి హనుమయే రాముని సీతమ్మతో కలుపును.

**5.2 సుందర కాండ సౌందర్యము**

శ్రీరామాయణము మహాకావ్యము. కావ్యమున శబ్దము, అర్థము, రసము - అను మూడు ఉండును. ఈ మూడును సుందరములై యున్న ఆ కావ్యము మాహాకావ్యము. సుందర కాండలో ఇట్టి శబ్దార్థరస సౌందర్యములు అధికము. కావుననే ఇది సుందరకాండ.

ఇందలి కావ్యగత శబ్దార్థరస సౌందర్యములను పరిశీలింతుము.

**1 శబ్ద సౌందర్యము**

**హంసో యథా రాజత పంజర స్థః , సింహో యథా మన్దరకన్దర స్థః**

**వీరో యథా గర్వీత కుఞ్జర స్థః, చన్ద్రోఽపి బభ్రాజ తథాఽమ్బర స్థః**

మున్నగు శ్లోకములలో వర్ణ, పద, అనుప్రాసలు అందము కనబడును.

**2 "అర్థ సౌందర్యము**

ఇందలి వర్ణనలు, కథ, అలంకారములు కడు మనోహరములు. ఉదాహరణకు

**ఊరు వేగోద్ధతా వృక్షా ముహూర్తం కపిమ్ అన్వయుః**
**ప్రస్థితం దీర్ఘమ్ అధ్వానం స్వబన్ధుమ్ ఇవ బాన్ధవాః**
**తమ్ ఊరు వేగోన్మథితాః సాలా శ్చాఽన్యే నగోత్తమాః**
**అనుజగ్ముర్ హనూమన్తం సైన్యా ఇవ మహీ పతిమ్**

ఆ కపివరుని వేగమునకు ఆ మహావృక్షములన్నియు ఒక ముహూర్తకాలము అతనిని వెన్నంటి ఒక మహారాజును అనుసరించుచున్న సైన్యము వలె కాన వచ్చెను.

అటులననే రావణుని అంతఃపురంలో పెట్టిన దీపములు ఆరకుండా జూదములో ఓడిపోయినను వదలలేక అటువైపు చూచుచున్న జూదగాళ్ళతో పోల్చెను. (9.32). ఇట్టి అనేకమైన అలంకారములు సముద్రతరణ, లంకాన్వేషణ, సీతాదర్శనము, అశోకభంజనము, రావణ దర్శనము, లంకాదహనాదులలో కావ్య సౌందర్యము వర్ణనాతీతము.

**3 రస సౌందర్యము**

ఈ కాండలో నవరసాలు చాలా అందముగా వర్ణింపబడినవి. సీతారాముల పరస్పరానురాగము, ఎడబాటును వర్ణించుటలో "శృంగారము" గోచరించును. రాక్షసులను జయించుటలో "వీరరసము" గానబడును. సురస, సింహిక, లంకిణీల వ్యర్థాటోపము "హాస్యరసమును" సూచించును. రాక్షసులను చంపుటలో "రౌద్రరసము" కనబడును. లంకాదహనములో "భయానకం" గోచరించును. సముద్ర లంఘనములో "అద్భుతము" గోచరించును. సీత కనబడక హనుమ నిర్వేదము చెందినప్పుడు "శాంతము" కనబడును. రాక్షసుల వలన సీత పడిన బాధ "కరుణ" ను చూపును.

ఈ కాండ యందు మొదట నుండి చివర వరకు హనుమ కనబడును. పదిహేనవ సర్గ నుండి చాలా వరకు సీత కనబడును. చివరి సర్గలో శ్రీరాముడు కనబడును.

ఈ ముగ్గురి యొక్క సౌందర్యములు ఇందు అభివ్యక్త మగుటచే దీనికి "సుందరాకాండ" అయినది.

**సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా**
**సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనం**
**సుందరే సుందరం కావ్యం సుందరే సుందరః కపిః**
**సుందరే సుందరం మంత్రం సుందరే కిం న సుందరం**

అనునది ప్రాజ్ఞుల వచనము. పురుష మోహనాకారుడు, సుగుణగుణా సుందరుడు, శ్రీరాముడు. సర్వవిధముల భువనైక సుందరి సీతామాత. కాంచనాద్రి కమనీయ విగ్రహుడైన హనుమ పరమ సుందరుడు. అశోక వనము అతిలోక సుందరము. శ్రీసీతారామహనుమంతుల మహామంత్రములు దివ్యములు, సుందరములు. ఈ మహితాత్ముల కథ సర్వాద్భుత సుందరము. ఈ సుందరాకాండము యొక్క బహువిధవైభవములను వర్ణించు కవిత్వము (కావ్యము) అంత్యంత సుందరము. ఈ సుందర కాండము నందు సుందరము కానిదేది లేదు. సీతాన్వేషణ మహాకార్యమున ప్రముఖ పాత్రను నిర్వహించిన మహాత్ముడు హనుమ. హనుమ యొక్క శక్తిసామర్థ్యములు, బలపరాక్రమములు అత్యద్భుతములు, నిరుపమానములు. ఈయన కార్యదీక్షతలు అపూర్వములు. అణిమాది అష్ట సిద్ధులు అన్నియు ఈయనకు కారతలామలకములు. బుద్ధి, వైభవము సాటిలేనిది. సమయస్ఫూర్తి ఉగ్గుపాలతో అబ్బిన విద్య. ఇంత ఎందులకు ఈ మహాత్ముని విషిష్ఠ లక్షణము లన్నియు ఈ సుందర కాండము గోచరించును. అయినను ఎల్లప్పుడూ తనను దాసుడుగానే అభివర్ణించుకొన్నాడు గాని సర్వస్వతంత్రుడిగా భావించుకోలేదు. అహంకారము ఈషన్మాత్రము గూడ లేదు.

## 5.3 హనుమ సాగరయానము

**తతో రావణ నీతాయాః సీతాయాః శత్రు కర్శనః**
**ఇయేష పదమ్ అన్వేష్టుం చారణా చరితే పథి**

అంగదాది వానరుల అభ్యర్థనను అనుసరించియు, జాంబవంతుని ప్రోత్సాహముతో హనుమ సముద్రమును లంఘించుటకు మహేంద్ర పర్వతమును అధిరోహించి సీతాన్వేషణకు చారణాది దివ్య జాతుల వారు సంచరించు ఆకాశ మార్గమున వెళ్ళుటకు నిశ్చయించుకొనెను. ఇచట ఆకాశమున వెళ్ళుట యనగా బ్రహ్మనిష్ఠ కలిగి యుండుట. ఆకాశమనగా పరబ్రహ్మము (అంతటా పూర్ణముగా ప్రకాశించువాడు). దాని యందు విహరించువాడే సంసార సముద్రమును తాను దాటి జీవులను తరింప చేయగలడు.

**ముమోచ చ శిలాః శైలో విశాలాః సమన శ్శిలాః**
**మధ్యమేనాఽర్చిషా జుష్టో ధూమ రాజీ రివాఽనలః**

ఆ మహాబలుడి చే అదుమబడిన మహేంద్రగిరి తన పగుళ్లనుంచి బంగారు, వెండి, కాటుక ధారలను వెలిగ్రక్కును. ఏలనన అగ్ని యొక్క సప్తార్చులలో [16]"మాధ్యమార్చి" అనునది సులోహిత. దాని జ్వాలల నుండి పొగలు వెలువడుచున్నట్లు హనుమచే అదుమబడిన ఆ మహేంద్రగిరి నుండి పెద్ద పెద్ద ఎర్రని శిలలు ముక్కలు ముక్కలుగా బయటపడ సాగెను. హనుమ పైకి ఎగుర సన్నద్ధుడై అంగదాది వానరులతో ఇట్లనెను.

**వానరాన్ వానర శ్రేష్ఠ ఇదం వచనమ్ అబ్రవీత్**
**యథా రాఘవ నిర్ముక్తః శరః శ్వసన విక్రమః**

---

[16] కాలీ, కరాలీ, చ మనోజవా చ, సులోహితా యా, చ సుధూమ్రవర్ణా| స్ఫులింగినీ, విశ్వరుచీ, చ దేవి లీలాయమానా ఇతి సప్త జిహ్వాః|| (ముండకోపనిషత్) అను ఏడును అగ్ని జ్వాలలు. వాటిలో మధ్యమ జ్వాలా అయిన "సులోహిత" నుండి ధూమము బయలుదేరును.

**గచ్ఛేత్ త ద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్**
**న హి ద్రక్ష్యామి యది తాం లఙ్కాయాం జనకాఽఽత్మజామ్**
**అనేనైవ హి వేగేన గమిష్యామి సురాఽఽలయమ్**
**యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యాఽమ్యకృత శ్రమః**
**బద్ధ్వా రాక్షస రాజానమ్ ఆనయిష్యామి రావణమ్**
**సర్వథా కృత కార్యోఽహమ్ ఏష్యామి సహ సీతయా**
**ఆనయిష్యామి వా లఙ్కాం సముత్పాట్య సరావణామ్**
**ఏవమ్ ఉక్త్వా తు హనుమాన్ వానరాన్ వానరోత్తమః**
**ఉత్పపాతాఽథ వేగేన వేగవాన్ అవిచారయన్**
**సుపర్ణ మివ చాఽఽత్మానం మేనే స కపికుంజరః**

రామబాణము వలె మిక్కిలి వాయువేగముచే రావణ పాలిత లంకకు ఎగెదను. అక్కడ సీతమ్మ కనబడనిచో, అదే వేగమున సురలోకమునకు పోయెదను. అక్కడ గూడ సీతాదేవి కనబడనిచో రావణుని బంధించి తీసుకొని వచ్చెదను. ఏదిఏమైనా కృతకృత్యుడనై వచ్చెదను. లేనిచో రావణునితో సహా లంకను పెకిలించుకొని తీసుకొని రాగలను. అని చెప్పి మిక్కిలి వేగముతో గరుడుని వలె అంతరిక్షమునకు ఎగిరెను. ఆత్మీయులను వీడ్కోలినప్పుడు వారిని కొంతదూరము అనుసరించి, వాటి ఎడబాటునకు తట్టుకొనలేక దుఃఖాశ్రువులను రాల్చి శోక తప్తులగుదురు. అదేవిధముగా అచ్చటి మహావృక్షములు ఆయన వేగమునకు కొంతదూరము అనుసరించి పుష్పములను రాల్చుతూ సముద్రముపై పడిపోయెను.

**దశ యోజన విస్తీర్ణా త్రింశ ద్యోజనమ్ ఆయతా**
**ఛాయా వానర సింహస్య జలే చారుతరాఽభవత్**

సంధ్యా సమయము కావడం మూలాన మారుతి యొక్క శరీరచ్చాయ పొడవు పది యోజనములు, వెడల్పు ముప్పది యోజనములుగా కనబడెను. త్రోవలో సాగరుని యొక్క ప్రోద్బలముచే మైనాకుడు (సముద్రములో నున్న పర్వతము) హనుమను కొంచెము తడవు విశ్రాంతి తీసుకొనమని ప్రార్ధించగా, అందుకు సున్నితముగా తిరస్కరించి హనుమ తన ప్రయాణమును కొనసాగించెను.

### 5.4.1 సురసా రాక్షసి

పిమ్మట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, మహర్షులు నాగ మాత యగు సురసతో .. నీవు ఆకాశమంత నోరుతో హనుమ కు విఘ్నము కలిగించి అతని కార్యసాధన దీక్షను పరీక్షించుము అనిరి. ఇట్లు వారు కోరగానే సురస హనుమ మార్గమును అడ్డగించి "ఓ వానరా! దేవతలు నిన్ను నాకు ఆహారముగా ఒసగినారు కావున నీవు నా ముఖమున ప్రవేశించుము" అనెను. అప్పుడు హనుమ "నేను రామకార్యార్థినై సీతాన్వేషణకు వెళ్లుచున్నాను కావున నేను సీతాదేవిని చూచి ఆ విషయము రామునికి ఎఱింగించి తర్వాత నీనోట పడుదును కావున నన్ను అడ్డగించవద్దు" అని కోరెను. అందుకు సురస ఒప్పుకొనకపోగా హనుమ సురసతో నా శరీరము పట్టగలిగినంత నీ నోరు తెరువుము అని, హనుమ తన శరీరమును వరుసగా పది, ముప్పది, తొంబది యోజనములు పెంచెను. సురస గూడ తన నోరును వరుసగా ఇరువది, నలుబది, నూరు యోజనములుగా పెంచెను. అప్పుడు బుద్ధిశాలి అయిన హనుమ తన శరీరము సూక్ష్మముగా చేసి నోటిలో ప్రవేశించి వెంటనే బయిటకు వచ్చి నీ కోరిక తీరినది గాన నన్ను వెడలుటకు అనుమతిని ఈయమని కోరెను. అప్పుడు సురస తన స్వసరూపమును పొంది ..

**అర్థ సిద్ధ్యై హరి శ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథా సుఖమ్**
**సమాఽఽనయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా**

"ఓ! వానర శ్రేష్టా! హాయిగా ముందునకు సాగి కార్యసిద్ధిని పొందుము. మహాత్ముడగు శ్రీరామునితో సీతమ్మను చేర్చుము". అని ఆశీర్వదించి చనెను, ఆకాశములో నిలిచి యున్న భూతగణము లన్నియు భేష్ భేష్ అని ప్రసంశించెను.

### 5.4.2 సురసా రాక్షసి యందలి యోగ రహస్యము

ఇందలి యోగ రహస్యమును పరిశీలిద్దాము. రాక్షసి తన నోరును శతయోజనములు పెంచినదియట. మానవుని శరీరము అందునా నోరు శతయోజనముల యంతటి పెద్దదిగా యుండునా? వివేకము భ్రష్టమైనప్పుడు మానవుడు తన దుర్గుణములు తద్వారా వాని అధఃపతనము శత విధముల/శతముఖముల జరుగును. "వివేక భ్రష్టానాం, భవతి విని పాతః శత ముఖః" ఈ సురస శత యోజన వృత్తి రూపము సాధకుని మ్రింగుటకై లాలస పడును. కానీ సాధకుడు అహంకార రహితుడై చిన్న వాడైనచో అటువంటి వాని ముక్తి జరుగును. సాధకునికి లభించు అష్ట సిద్ధులలో లఘిమ - అనగా అణువంత చిన్నవాడవడం, ప్రాకాయి - శరీరమును అతి విశాలముగా చేయడము - భాగములు.

యోగ మార్గములో సిద్ధులు అవశ్యముగా సిద్ధించును. అయితే సాధకుడు ఆ సిద్ధులకు బానిస కానిచో తదుపరి ప్రగతి సాధ్యమగును. కానిచో సిద్ధుల మాయలో పడి సాధకుడు అతి తీవ్రగతితో పతనమగును. సంసార మాయ నుండి విడుదలై సిద్ధుల మాయలో చిక్కుకొనిన సాధకుడు అక్కడి నుండి విడిపించుకొనుట కష్టము. ఈ సిద్ధుల యొక్క మాయ శత యోజనముల యంత పెద్దదిగా యుండి మహాసాధకులను కూడా మ్రింగి వేయును. అందుచే బుద్ధిమంతుడైన హనుమ అట్టి మాయ నుండి ముక్తమగుటకై నమ్రతతో సూక్ష్మ రూపుడై తనకు ప్రాప్తించిన సిద్ధులన్నియు పరమాత్మకు సమర్పించును. ఈ సూక్ష్మ శరీరము ద్వారా

తనలోని అహంకారమును హనుమ వదిలెను. ఇదే కాండలో లంకలో సీతను అన్వేషించునప్పుడు గూడ హనుమ సూక్ష్మ రూపములోనే తన అహంకారమును వదిలి సర్వము రామునిపై కార్య భారము మోపి, తనతో కార్యము రాముడే (భగవంతుడు) చేయించుచున్నాడు అని తలచి అన్వేషించును.

**5.5 సింహిక**

గరుడ వేగములో హనుమ ఆకాశము నందు సాగు చుండగా ఎదురుగాలి చే మందగించిన ఓడ వలె హనుమ వేగము తగ్గెను

**ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ**
**మనసా చిన్తయా మాస ప్రవృద్ధా కామ రూపిణీ**
**అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యఽహమ్ ఆశితా**
**ఇదం హి మే మహత్ సత్త్వం చిరస్య వశమ్ ఆగతమ్**

కామరూపియైన సింహిక నామ రాక్షసి ఆకాశమున పోవుచున్న హనుమను చూచి "ఆహా! చాలా కాలమునకు నాకు ఒక మహా జంతువు ఆహారముగా దొరకబోవుతున్నది" అని ఆలోచించి, హనుమ ఛాయను బట్టి హనుమను తన నోటిలోనికి,లాగుకొనుచుండెను. క్రిందికి చూడగా సముద్రములో హనుమ ఒక మహాభూతమును చూచెను. సుగ్రీవుడు సముద్రములో నీడను బట్టి లాగెడి ఒక మహారాక్షసి గలదు అని చెప్పిన మాట జ్ఞప్తికి వచ్చి హనుమ శరీరమును ఒక్కసారిగా పెంచెను. కానీ అందుకు తగిన పరిమాణంలో సింహికారాక్షసి గూడ పాతాళ కుహూరమును బ్రోలు తన నోరును పెంచెను. వెంటనే హనుమ తన శరీరమును సంకోచింప చేసి, దాని నోటిలో దూరి తన గోళ్ళతో దాని మర్మములను త్రుంచి మరల అంతరిక్షము చేరెను. హనుమ చేసిన ఈ కార్యమునకు సంతోషించి ఆకాశములోని భూతములన్నియు బాగు, బాగు అనెను.

ఆధ్యాత్మిక మార్గములో పయనించువాడు విహిత కర్మలను ఆచరించవలెను. నిషిద్ధ కర్మలను పరిత్యజించి వలెను. శాస్త్రములో చెప్పని కర్మలను ఆచరించిన

యడల అవి మనలను హింసించును. కావున అవి "సింహిక" అనబడును. సింహిక అనగా హింసించునది. నిషిద్ధ కర్మకు మనమెట్లు వశమగుదమో మనకే తెలియదు. చేయకూడదని తెలిసియు, చేయవలదను కొనుచునే దానికి వశమగుదుము. (ప్రస్తుత కాలములో మద్యపానము, ధూమపానం, జూదము ఇత్యాది). వశమైన తర్వాత గాని వశపడినట్లు తెలియదు. అట్టి కర్మలు తెలియకుండా ఆక్రమించుట - సింహిక నీడను బట్టి లాగుట. అందుకనే సురసను చంపకుండా వదిలిన హనుమ సింహికను చంపెను.

హనుమానునిపై పడు సూర్యకిరణముల వలన తన నీడయే క్రిందనున్న సాగరముపై వ్యాపించెను. ఈ వర్ణన ద్వారా వాల్మీకి యోగ మార్గములో ప్రాప్తించే ఒక ఛాయా సిద్ధిని మనకందించెను. ఉపనిషత్తులలో ఈ ఛాయా పురుషుడు అంగుష్ఠ మాత్ర పురుషుడుగా వర్ణింపబడినాడు. ఈ అంగుష్ఠమాత్ర పురుషుడు ఎంతో బలవానుడు మరియు త్రికాలదర్శి. "కఠోర ఉపనిషత్" లో "ఈశాన" అని తెల్పినారు.

**శ్లో|| అంగుష్ఠమాత్ర పురుషో జ్యోతి రివా ధూమకః|**

**ఈశానో భూత భవ్యస్య స ఎవాద్యసఉశ్వః||**

ఈ ఛాయాపురుషుడు చాతుర్మాత్రాత్మక జగత్తున కతీతుడై, త్రికాలజ్ఞుడై, త్రిలోకగామియై యుండును.

**శ్లో|| మనోజవం మారుత తుల్య వేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం|**

**వాతాత్మజం వానర యూధ ముఖ్యం, శ్రీరామదూతం శరణం ప్రపధ్యే||**

మారుతమనగా దేశకాలములకు అతీతము. కాలమునకు అతీతమగుట వలన ఛాయాపురుషుడు ఇతరులకు కనిపించడు. తాను ఏ వస్తువును తాకినను, ఆ వస్తువు కూడా అదృశ్యమగును. ఎవరైతే ఈ ఛాయాపురుషుని ఉపయోగము నీచకార్యములకు వినియోగింతురో అతడు తన అధఃపతనమును కొని

తెచ్చుకొనును. సాధనలో ఛాయాపురుష అవస్థ చాలా ఉత్కృష్టమైనది. అధఃపతనము చెందిన సింహికా రాక్షసి అవస్థయే వేదమున ఈ విధముగా వర్ణింపబడినది.

**య ఈ చకార్న సౌ అస్య వేదయ ఇద దర్శహిరుగిన్ను తస్మాత్,**
**సమాధుర్యోమ్ నా పరివేతో అంతర్బహు ప్రజా నిరుతిమా వివేశః**
**(ఋ.వే.1 164 32 )**

అజ్ఞానములో నున్న జీవి మాతృగర్భము ద్వారా అనేక జన్మలను ధారణ చేయును. జన్మలకు అతీతమైనను, సర్వజ్ఞమైనను, ఘోర కర్మలో పడి తానేమి చూచుచున్నదో ఏమి చేయుచున్నదో తెలియని అజ్ఞాన స్థితిలో యుండును.
దేహము నాలుగు రకాలు. మొదటిది - ఎముకలు, మాంసము, మజ్జ, రక్తములో కూడుకొన్న "జడ దేహము". సుషుప్తావస్తలో సూక్ష్మ శరీరములో ఉండునది - "లింగ దేహము". ఇదియే ఛాయాపురుషుడు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములకు, దేశకాలములకు అతీతము. తన యొక్క ఛాయవలె కనిపించే ఈ లింగ దేహము/శరీరము ను బంధనమున ఉంచి దాని ద్వారా సిద్ధులకు ఉపయోగించు సాధకుడు పతనము నొందును. హనుమాన రూప సాధకుడు ఇట్టి బంధనమున చిక్కుకొనడు. మూడవది లింగ దేహము కన్నను ఉన్నతమైనది - "కారణ దేహము". సంకల్ప మాత్రముననే కార్యము నెరవేరును. అంతకంటెను సూక్ష్మమైనది "మహాకారణ దేహము". ఈ సంసారమునకు కారణ బీజమైనది. యోగ వాసిష్ఠములో ఇట్టి అతివాహిక సూక్ష్మ దేహములో లీల (సరస్వతి దేవి భక్తురాలు), సరస్వతులు ఇద్దరు సమస్త బ్రహ్మాండములు తిరిగారని వసిష్ఠ మహర్షి చెపుతారు. సరియైన ఆధ్యాత్మిక మార్గములో పయనించువారు హనుమ వలె ఛాయాపురుషునకు అతీతముగా యుందురు.

## 5.6 లంకలో హనుమ ప్రవేశము

సముద్ర లంఘనమున హనుమ చేసిన దుష్కర కార్యములు నాలుగు. అవి - నూరు యోజనముల సముద్రమును దాటి సీత జాడ కనుక్కొని వెనకకు రాగలనని సంకల్పించుకొనుట, మైనాకుని సగౌరవ విశ్రాంతిని సున్నితముగా తిరస్కరించుట, సురసను జయించుట మరియు సింహికను చంపుట. ఈ నాలుగు నాలుగు లక్షణములు. 1 ధృతి: సర్వ వ్యాపారములను ఆత్మోన్ముఖం చేయుట, 2 దృష్టి: దేనిని పొందవలెనో దాని యందే దృష్టి తప్ప ఇతరములపై ఉండకుండుట. 3 మతి: ఆచరించ వలసిన కర్మలను ఆచరించుతూ బంధనమున పడకుండా "ఆత్మస్వరూప జ్ఞానము" ఉండుట. 4 దాక్ష్యము: నిషిద్ధకర్మ త్యాగము. ఇట్లు హనుమ ఈ నాలుగు లక్షణములతో సముద్రమును లంఘించినట్లే ఆధ్యాత్మిక మార్గములో పయనించువారు ముందుకు సాగుటకు ఈ నాలుగు ఆవశ్యకములు అని ఈ వృత్తాంతము సూచించును.

సూర్యాస్తమయ సమయమునకు, హనుమ నూరు యోజనముల సముద్రమును దాటి త్రికూట పర్వత శిఖరమున నిలిచి లంకను చూచెను. పరాక్రమశాలి అయిన హనుమ ఇటువంటి నూరు యోజనములు ఎన్నియైనను అవలీలగా దాటగలను అని హనుమ భావించెను. సాధన చేయువానికి ఇట్టి స్థితి ఆవశ్యకముగా నుండవలెను. ఆసనము పైనుండి ప్రాణాయామాదులు చేసి లేచిన తర్వాత శరీరము కానీ, మనస్సు కానీ బడలిక చెందరాదు. ఇంకను ఎంతకాలము చేసినను చేయగలనన్నట్లు ఉత్సాహము ఉండవలెను. ఇది కలుగు వరకు సాధన పూర్తి కాదు. అచ్చటి నుండి లంకా నగర శోభను, అచ్చటి రక్షణ వ్యవస్థను నిశితంగా పరికించి లంకా నగరమును జయించుటలోని పెక్కు ఉపాయములు ఆలోచించెను. ముందుగా సీతమ్మకై అన్వేషణ చేయవలెనని, అందుకు రాత్రి సమయమే సరియైనదని, అందుకు సూక్ష్మ రూపమున లంక నగరములో ప్రవేశించ వలెనని

నిర్ణయించు కొనెను. నెమ్మదిగా లంకానగర ద్వారము వద్దకు వచ్చెను. అప్పుడు హనుమను కామరూపిణియగు లంక అడ్డగించెను. హనుమ లంకతో నీవెవ్వరివన

**అహం రాక్షస రాజస్య రావణస్య మహాత్మనః**

**ఆజ్ఞా ప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీ మిమాం**

**అహం హి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ**

**సర్వతః పరిరక్షామి హ్యేత త్తే కథితం మయా**

రాక్షస రాజైన రావణుని ఆజ్ఞను పాలించుతూ నేను ఈ లంకా నగరమును కాపాడు చున్నాను. నన్ను ధిక్కరించి ఇందు ప్రవేశించలేవు అనెను. అందుకు సౌమ్యముగా హనుమ, లంకతో .. "లంకానగర శోభను పరికించి వెడలెదను" అనెను. కానీ లంక తనను జయించనిదే నగరములో ప్రవేశించుట అసాధ్యము అని చెప్పుటతో హనుమ ఆడుది కదా యని ఎక్కువగా కోపము తెచ్చుకొనకుండా కొద్దిపాటి కోపముతో పిడికిలితో గద్దెను. దానికే నిశాచర, హనుమతో "నన్ను అనుగ్రహింపుము. నీచే ఓడింపబడితిని గాన బ్రహ్మ వర ప్రభావము వలన రాక్షసులకు కీడు కల్గు సమయము ఆసన్నమైనది. హాయిగా సీతమ్మను వెతుకు కొనుము" అని చెప్పెను. ఇక్కడ వాల్మీకి "అహం" అని రెండుమార్లు ప్రయోగము చేసినారు. ఈ 'అహం' దేహాత్మాభిమానాన్ని, అహంకారమును సూచించును. ఇట్టి అహంకారమును జయించిన నాడే మనసులోని వాసనలు, చిత్తవృత్తులు నసించి సీతమ్మ దర్శనమగును. హనుమ లంకను జయించి ద్వారము గుండా కాకుండా ప్రాకారమును దాటి శత్రువుల తలపై మోపినట్లు తన ఎడమ పాదమును హనుమ ముందుగా పెట్టి లోనికేగెను. **(అద్వారేణ మహాబాహుః ప్రాకార మఽభిపుప్లువే) (గ్రామం వా నగరం వాపి, పత్తనం వా పరస్య హి, విశేషాత్ సమయే సౌమ్య, న ద్వారేణ విశేనృప. ప్రయాణ కాలే చ గృహప్రవేశే, వివాహ కాలేఽ పి చ దక్షిణాంఘ్రిమ్, కృత్వాగ్రతః శత్రుపుర ప్రవేశే, వామంనిదద్యా చ్చరణం నృపాలా.** ఓ రాజా! శత్రువు యొక్క గ్రామమును గాని,

నగరమునుగాని, పట్టణమును గాని విశేష సమయమున ముఖ్య ద్వారము నుండి ప్రవేసింపరాదు, ప్రయాణము చేయుచున్నప్పుడు, గృహప్రవేశ సమయమున, వివాహ కాలము నందు కుడికాలు ముందుంచాలి. శత్రుపురమున ప్రవేశించునప్పుడు ముందుగా ఎడమ కాలు మోప వలెను. ఇది బృహస్పతి వచనము. ... నీతి శాస్త్రము.)

**5.7 రావణ అంతఃపురమున హనుమ ప్రవేశించుట**

హనుమ లంకానగరములో అనేకమైన భవనములను, పతివ్రతలగు స్త్రీలు వారి భర్తలతో నిదురించుటను, ప్రియురాండ్రపై తమ హస్తములు వేసిన స్త్రీలను, అనేకమైన పరిశుద్ధ స్వభావులు, మహానుభావలు, సుప్రభావలు, కాంతిమతులు, లజ్జావతులు, ప్రియుల ఒడిలో కూర్చున్నవారు, బంగారు కాంతుల గలవారు, మేలిముసుగు లేనివారు ఇలా అనేకమైన స్త్రీలను చూచెను. తరువాత రావణ అంతఃపురములోను వారి మంత్రుల భవనములలోను సీతకై వెదికెను. కానీ ఎచ్చటను కానరాలేదు. ఇంతకు మునుపు తాను సీతను చూడలేదు కావున, హనుమ తన మనస్సున సీతాదేవి యొక్క ఊహాచిత్రమును నిర్మించుకొనెను. వాస్తవముగా పదునారు కళలతో గూడి చంద్రుని వలె భాసిల్లు సీతాదేవి, శ్రీరాముని ఎడబాటు వలన విదియ చంద్రుని వలె కాంతిహీనమై, ధూళిధూసరితమై, రావణుని వాగ్బాణముల గుర్తులు ఆమె ముఖ కవళికపై యుండును. అట్టి జానకిని ఎంత వెదికినను తరుణీమణులలో కానరాకుండెను. పిమ్మట హనుమ మేఘము వలె మహోన్నతమైన పుష్పక విమానమును దర్శించెను.

**తత స్తదా బహు విధ భావితాఽఽత్మనః**
**కృతాఽఽత్మనో జనక సుతాం సువర్త్మనః**
**అపశ్యతోఽభవ దఽతి దుఃఖితం మనః**
**సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః**

ఈ విధముగా అనేకవిధములుగా నిశిత బుద్ధితో ప్రయత్నమూ చేసినను సీత జాడ కాన రాకపోయేసరికి హనుమ మిగుల దుఃఖితుడు అయ్యెను. తరువాత నెమ్మదిగా రావణుని నిజ అంతఃపురమును చేరుకొన్నాడు. అందు రావణుడు అపహరించి తెచ్చిన కన్యలు, రావణుని పత్నులు, పానముచే అలసి యున్న స్త్రీ రత్నములు ఇలా అనేక మంది కనబడిరి. వారి మధ్య రావణుడు నక్షత్ర రాజు వలె యున్నాడు.

**గౌరీం కనక వర్ణాఽఽభామ్ ఇష్టామ్ అన్తః పురేశ్వరీమ్**
**కపి ర్మన్డోదరీం తత్ర శయానాం చారు రూపిణీమ్**
**స తాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాఽఽత్మజః**
**తర్కయా మాస సీతేతి రూప యౌవన సంపదా**
**హర్షేణ మహతా యుక్తో ననన్ద హరియూథపః**
**ఆస్ఫోటయా మాస చుచుమ్బ పుచ్ఛం,**
**ననన్ద చిక్రీడ జగౌ జగామ**
**స్తమ్భాన్ అరోహన్ నిపపాత భూమౌ,**
**నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్**

అక్కడ శయ్యపై పరుండి బంగారు రంగును పోలిన స్త్రీ మూర్తిని (రావణుని పట్ట మహిషి అయిన మండోదరి) చూసి హనుమ సీతమ్మ అనుకొని భ్రమపడి కోతి చేష్టలు చేసెను. ఆనందములో హనుమ జబ్బలు, తొడలు చరచుకొనెను. తోక ముద్దుపెట్టుకొనెను. పాటలు పాడెను. నృత్యము చేసెను. స్తంభములెక్కి దుమికెను. ఈ విధముగా సంతోషములో పిల్లవాని చేష్టలు చేసెను. తరువాత బుద్ధిశాలియైన ఆ మహాకపి భర్తని ఎడబాసిన సీత ఇలా సర్వాలంకారణ భూషితయై నిదురించదు, ఈమె సీత కాదని వేరొక వనితయని అని నిశ్చయమునకు వచ్చియుండెను. ఈ విధముగా అనేక మంది స్త్రీలను చూచినను

సీత జాడ లేదు. ఈ విధముగా అనేకమైన భంగిమలలో స్త్రీలను చూచుటచే ధర్మ భంగమయ్యేనని ఒకింత చింతించెను. మరల తేరుకొని ...

**మనో హి హేతుః సర్వేషామ్ ఇన్ద్రియాణాం ప్రవర్తనే**
**శుభాఽశుభా స్వఽవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్**

మనస్సే కదా సర్వేంద్రియములను ప్రవర్తింపజేయుటలో కారణమైనది. కానీ నా మనస్సు నిలకడగా, ఎటువంటి వికారములు లోనుకాకుండా యున్నది. అయినను స్త్రీని వెతుకుటకు స్త్రీ సమూహములోనే వెతకాలి కదా! అనుకోని తాను ధర్మ భ్రష్టుడు కాలేదు అనుకొనెను. మరల ధైర్యము తెచ్చుకొని అనేకమైన లతాగృహములు మొదలుగాఁగలవి వెతుకుచుండెను.

**అనిర్వేదః శ్రియో మూలమ్ అనిర్వేదః పరం సుఖమ్**
**అనిర్వేదో హి సతతం సర్వాఽర్థేషు ప్రవర్తకః**
**కరోతి సఫలం జంతో:కర్మ య త్తత్ కరోతి సః**
**తస్మాత్ అనిర్వేద కృతం యత్నం చేష్టేఽహ ముత్తమం**

సర్వ విధముల అభివృద్ధికి నిర్వేదము లేకుండుటయే. ఉత్సాహము కలిగియుండుట ఐశ్వర్యమునకు మూలము. ఉత్సాహమే ఉత్తమ సుఖము. నిరుత్సాహవంతుడు కానివాడే అన్నిపనులను ఆరంభింపగలడు. కావున ఉత్సాహముతో మరల ఏయే ప్రదేశములలో శ్రద్ధ చూపలేదో ఆయా ప్రదేశములలో వెతుకుటకు హనుమ నిశ్చయించుకొనెను.

### 5.8 సీత కొరకై అశోక వనములో వెతుకుటకు హనుమ ఆలోచన

హనుమ మరల పానశాలలను, పుష్పగృహములను, చిత్రశాలలను, క్రీడాగృహములను, ఇంటిపెరటి తోటలను, అవాంతర వీధులను, భూమిగృహములను, చతుష్పద మండపములను, ఊరికి దూరముగా స్వైర విహారమునకై నిర్మింపబడిన గృహములను వెదికెను. సీత కానరాక పోయేసరికి

మరల దుఃఖితుడయ్యేను. అప్పుడు హనుమ దిగులుతో రావణుడు సీతను తీసుకొచ్చే సమయములో సముద్రములో జారి పడిపోయెనేమో, లేక హృదయగతి ఆగిపోయినదా, లేక సీత తనంతట తానే ప్రాణములు తీసుకోలేదు కదా, లేక రాక్షసులచే భక్షింప బడి యుండునా, లేక ఎచ్చటనైనను బంధించి యుండునా, అని నిర్వేదము చెంది సీతమ్మను చూడకుండా కిష్కింధకు వెళ్లి అందరిని బాధ పెట్టి వారి మరణమునకు కారణము కాజాలను అని నిశ్చయించుకొని ఆత్మత్యాగమునకు సిద్ధపడెను. అందుకు వానప్రస్థుడనై దొరికినది తింటూ యుండెదను, లేదా సాగర ప్రాంతమున చితిని ఏర్పరుచుకొని ప్రజ్వరిల్లుచున్న పవిత్రాగ్నిని(అరణిని మధించుట వలన కలిగిన అగ్ని) చేరెదను, లేదా ప్రాయోపవేశము చేసి శరీరామును పశుపక్ష్యాదులకు ఆహారముగా వదులుదును, లేదా నీటిలో ప్రవేశించి ప్రాణములు వదులుదును. ఇట్టివి మహర్షులు కూడా అంగీకరించారు కావున దోషము కాదు. ఈ విధముగా పరిపరి విధములుగా ఆలోచన చేసెను. ఇంతలో హనుమ మరల తెలివి తెచ్చుకొని ..

**వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి**

**తస్మాత్ ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవిత సంగమః**

చనిపోయినచో ఎన్నో దోషములు సంభవించును. బ్రతికి యుండిన సుఖములు బడియ వచ్చును. అందువలన ప్రాణములు ధరించి యుందును అని నిశ్చయించుకొనెను. (ఈ సూక్తి లోకోపకారమైన మహోపదేశము కనుక ఎవ్వరును ఎట్టి పరిస్థితులలోను ఆత్మహత్యకు పాల్పడరాదు). యోగ వాసిష్ఠములోని చూడాలోపాఖ్యానములో వసిష్ఠ మహర్షి రాఘువునికి చెపుతూ జీవునికి సత్వ శేషము అంటే ప్రారబ్ధ కర్మ లో ఇంకా శేషించిన భాగము ఉంటే, అప్పుడు జీవుడు ఆ కర్మ నివృత్తి చేసుకోవడానికి మరొక జన్మ ఎత్తాలి. అందువలన శేషించిన కర్మ పూర్తి అయ్యే వరకు జీవించాలి. కావున ఆత్మ హత్య దోషమని అర్థము. ఈవిధముగా ఆలోచన చేయగా హనుమకు దూరంలోని అశోక వాటిక కనబడెను.

అనంతరము ధైర్యశాలియైన మారుతి తన పరాక్రమమును ప్రకటించుకొనుచు ఇట్లు ప్రకటించుకొనెను. రావణుని హతమార్చి నా పగ తీర్చుకొనెదను. అథవా.. రావణుని సముద్రము మీదుగా ఎత్తుకొనిపోయి పశువును అగ్నికి (ఇమం పశుపతే ఆద్య బద్నామ్యజ్ఞ .. తైత్తరీయ సంహిత) ఆహుతి సమర్పించినట్లు వీనిని శ్రీరామునికి అర్పించెదను. చివరగా అశోకవనమును గాలించుటకు ఉద్యుక్తుడు అవుతూ ధ్యానమగ్నుడాయెను. (ఈ ధ్యాన శ్లోకము నిత్యము ప్రార్థన శ్లోకముగా చదువుకొనదగినది గా గమనించగలరు).

**నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ**
**దేవ్యై చ తస్యై జనకాఽఽత్మజాయై**
**నమోఽస్తు రుద్రే న్ద్ర యమాఽనిలేభ్యో**
**నమోఽస్తు చన్ద్రాఽర్క మరుద్గణేభ్యః**

ఇట్లు ప్రార్థించి శరీరమును చిన్నదిగా చేసుకొని సమస్త దేవతలు సిద్ధిని ఒసగవలసినదిగా ప్రార్థించుచున్నాడు.

**సిద్ధిం మే సంవిధాస్యన్తి దేవాః సర్షిగణా స్త్విహ**
**బ్రహ్మా స్వయమ్భూ ర్భగవాన్ దేవా శ్చైవ దిశన్తు మే**
**సిద్ధిమ్ అగ్ని శ్చ వాయు శ్చ పురుహూత శ్చ వజ్రభృత్**
**వరుణః పాశహస్త శ్చ సోమాఽఽదిత్యౌ తథైవ చ**
**అశ్వినౌ చ మహాత్మానౌ మరుతః శర్వ ఏవ చ**
**సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః**
**దాస్యన్తి మమ యే చాఽన్యే అదృష్టాః పథి గోచరాః**

అప్పుడు హనుమ అశోక వనములో దూకెను

**5.9 హనుమ సీతను గుర్తించుట**

హనుమంతుడు బలముగా కదపబడగా వృక్షముల నుండి ఆకులు, పూలు, పండ్లు పూర్తిగా రాలిపోయి బోసిపోయిన చెట్లు జూదములో పూర్తిగా ఓడిపోయి వస్త్రాభరణములను సైతము కోల్పోయిన జూదరి వలె యున్నవి. **"నిర్ధూత పత్ర శిఖరాః శీర్ణ పుష్ప ఫల ద్రుమాః నిక్షిప్త వస్త్రాఽఽభరణా ధూర్తా ఇవ పరాజితాః "** (జూదరులు మిక్కిలి వ్యసనమునకు లోనగుదురు. వారు వివేక భ్రష్టులై అమూల్యమైన వస్తువులను, తుదకు తమ వస్త్రములను కూడా జూదము నందు ఫణముగా పెట్టుదురు. వాటిని ఓడిపోయినను సిగ్గు పడరు. ధర్మరాజు కూడా ఇట్టి వ్యసనపరుడై తన రాజ్యమును, చివరకు భార్యను కూడా జూదములో ఓడిపోయినాడు. కావున జూదమాడుట ప్రమాదకరం). హనుమ అక్కడ ఆకులతో దట్టముగా యున్న ఒక శింశుపా వృక్షము నెక్కి అటునిటు కలయ చూచెను. అప్పుడు అచట మలినమైన వస్త్రమును ధరించి, ఉపవాసములతో కృశించి, దీనురాలై రాక్షస స్త్రీల మధ్యలో ఉన్న స్త్రీమూర్తిని గాంచెను. జ్వాజ్వాల్యమానముగా ప్రకాశించుచున్న అగ్నిజ్వాలను పొగ కమ్మేసినప్పుడు దానికాంతి స్పష్టముగా గోచరించదు. అట్టి స్త్రీ మూర్తిని గుర్తించవలెను. (ఇప్పుడు హనుమ యుక్తియుక్తముగా తర్కించుకొని ఆమెను గుర్తించుటకై యత్నము చేయుచున్నాడు). ఆమె మలినమైన ఒకే ఒక వస్త్రమును ధరించి యుండెను. దుఃఖియై దీనావస్థలో యున్నది. జడగట్టిన ఆమె కేశపాశము నల్లత్రాచును బోలె కటిప్రదేశము వరకును వ్రేలాడుచుండెను. ఋష్యమూక పర్వతము మీదుగా వెళ్ళుచున్నప్పటి అంగన రూపురేఖలే ఈమె యందు గోచరించుచున్నవి. ఈమె తన శోభలచే పున్నమినాటి వెన్నెలవలె అందరికి ఆహ్లాదము కలిగించునట్లున్నది కావున ఈమె సీతయే అయి ఉండవచ్చు. ఈ విధముగా సీతను చూచి హనుమ ఎంతయో సంతసించెను. ఈమె కొరకే శ్రీరాముడు వాలిని సంహరించెను. నేను సముద్రమును దాటి లంకానగరమును చూచితిని. ఇక శ్రీరాముడు సముద్ర

పరివేష్టితమగు ఈ భూమండలమునే కాదు, జగత్తునంతయు తలక్రిందులు చేసినను సమంజసమే. **(రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాఽఽత్మజా, త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాఽఽప్నుయాత్ కళామ్.14).** రాముని యందు ప్రీతిచే తన శరీరమును నిల్పుకొని యున్నది **(నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్ప ఫల ద్రుమాన్ ఏక స్థ హృదయా నూనం రామమ్ ఏవాఽనుపశ్యతి 25)**. హనుమ సీతను స్పష్టముగా చూడగోరి దృష్టిని అటు ప్రసరింప చేసెను. అప్పుడు ఆయనకు ఆ సమీపముననే భయంకరాకారమైన అనేకమైన రాక్షస స్త్రీలు కనబడిరి. వారు ఎలా ఉన్నారంటే ..

**ఏకాఽక్షీమ్ ఏక కర్ణాం చ కర్ణ ప్రావరణాం తథా**
**అకర్ణాం శంకు కర్ణాం చ మస్తకో చ్ఛ్వాస నాసికామ్**
**అతి కాయో త్తమాఽంగీం చ తను దీర్ఘ శిరో ధరామ్**
**ధ్వస్త కేశీం తథాఽకేశీం కేశ కమ్బళ ధారిణీమ్**
**లమ్బ కర్ణ లలాటాం చ లమ్బోదర పయోధరామ్**
**లమ్బోష్ఠీం చిబుకౌష్ఠీం చ లమ్బాఽఽస్యాం లమ్బ జానుకామ్**
**హ్రస్వాం దీర్ఘాం చ కుబ్జాం చ వికటాం వామనాం తథా**
**కరాళాం భుగ్న వస్త్రాం చ పింగాఽక్షీం వికృతాఽఽననామ్**
**వికృతాః పింగళా: కాళీ: క్రోధనాః కలహ ప్రియాః**
**కాలాఽఽయస మహా శూల కూట ముద్గర ధారిణీః**
**వరాహ మృగ శార్దూల మహిషాఽజఽశివా ముఖీః**
**గజో ష్ట్ర హయ పాదా శ్చ నిఖాత శిరసోఽపరాః**
**ఏక హస్తైక పాదా శ్చ ఖర కర్ణ్యఽశ్వ కర్ణికాః**
**గోకర్ణీ ర్హస్తి కర్ణీ శ్చ హరి కర్ణీ స్తథాఽపరాః**
**అనాసా అతి నాసా శ్చ తిర్య జ్నాసా వినాసికాః**

**గజ సన్నిభ నాసా శ్చ లలాటో చ్ఛ్వాస నాసికాః**
**హస్తి పాదా మహా పాదా గో పాదాః పాద చూళికాః**
**అతిమాత్ర శిరో గ్రీవా అతిమాత్ర కుచోదరీః**
**అతిమాత్రాఽఽస్య నేత్రా శ్చ దీర్ఘ జిహ్వా నఖా స్తథా**
**అజా ముఖీ ర్హస్తి ముఖీ ర్గో ముఖీః సూకరీ ముఖీః**
**హయో ష్ట్ర ఖర వక్త్రా శ్చ రాక్షసీ ర్ఘోర దర్శనాః**
**శూల ముద్గర హస్తా శ్చ క్రోధనాః కలహ ప్రియాః**
**కరాళా ధూమ్ర కేశీ శ్చ రాక్షసీ ర్వికృతాఽఽననాః**
**పిబన్తి స్సతతం పానం సదా మాంస సురా ప్రియాః**
**మాంస శోణిత దిగ్ధాఽంగీ ర్మాంస శోణిత భోజనాః**
**తా దదర్శ కపి శ్రేష్ఠో రోమ హర్షణ దర్శనాః**

ఈ విధముగా హనుమ సీతను గుర్తించుటలో రాత్రి గడచి వేకువ జాము అయ్యెను. ఈమె దుఃఖమును తొలగించుటకు ఏమి చేయవలెనని ఆలోచింప సాగెను. అజ్ఞానము ఆవరించి సద్వస్తువగు ఆత్మ కనబడకుండా చేయు జన్మయే రాత్రి.

### 5.10 రావణుడు అశోక వాటికకు వచ్చుట

మంగళకరమైన చతుర్వాద్య ధ్వనులచే వేకువనే మేల్కొన్న ప్రతాపశాలియైన రావణుడు కామ వికారముచే సీతాదేవిని చూచుటకు అశోక వనమున ప్రవేశించెను. అప్పుడు హనుమ ఆకుల మధ్య నక్కి పరికించి చూచుచుండెను. అప్పుడు సీతాదేవి తొడలతో ఉదరమును, బాహువులతో వక్షస్థలమును కప్పుకొని (ముడుచుకొని) ఏడ్చుతూ కూర్చొనెను. **(ఆచ్ఛా ద్యోదర మూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ, ఉపవిష్టా విశాలాఽక్షీ రుదన్తీ వరవర్ణినీ). వైవాహికో విధిః స్త్రీణాం ఔపనాయనికః స్మృతః** అను స్మృతి వాక్యమును అనుసరించి స్త్రీలకు వివాహము పునర్జన్మ. వివాహ సంస్కార ఫలితముగా సీత ఇక్ష్వాకు వంశమున మెట్టినది. రావణుడు సీతను చూచి "సీతా నీవు భయపడనవసరము

లేదు. **స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః గమనం వా పర స్త్రీణాం హరణం సంప్రమథ్య వా, ఏవం చైత దఽకామాం చ న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి కామం కామః శరీరే మే యథా కామం ప్రవర్తతామ్** బలాత్కారముగా పరస్త్రీలను పొందుట రాక్షసులమైన మాకు స్వధర్మము. (మరి అయితే మానవ కాంతయైన సీత ధర్మములకు విలువ ఈయక పోవడంలో రావణుని నీచ ప్రవృతిని తెలియజేస్తుంది. మన ధర్మము అనుసరిస్తూ పర ధర్మములను గౌరవించాలి. ప్రస్తుత కాలంలో ఇది పాటించబడుట లేదు. మిక్కిలి శోచనీయం) అయినను నేను కామాతురడను, కానీ బలాత్కారముగా నిన్ను తాకను. ఓ మైథిలీ! నీవు అనేకమైన దివ్యమైన సుగంధములు, వస్త్రములు ధరించి నన్ను చేరుము". ఈ విధముగా అనేక విధములుగా రావణుడు తన పరాక్రమమును చూపి, ప్రలోభములను పెట్టి సీతను తన వైపుకు త్రిప్పుకొనుటకు ప్రయత్నము చేసెను.

### 5.11 సీత రావణునికి హితవు పలుకుట

ఆ రాక్షసుని మాటలకు దుఃఖార్తియై, దీనురాలై శ్రీరాముని తలంచుతూ ఒక గడ్డి పరకను అడ్డుపెట్టుకొని ఇట్లు పలికెను. "నా నుండి మనసును మరల్చుకొని నీ వారిపై మనసును నిలుపుకొనుము. పాపము చేసినవాడు సిద్ధిని కాంక్షించుట ఎంత అయుక్తమో నీవు నన్ను కాంక్షించుట అంత అయుక్తము.

**ఆత్మానమ్ ఉపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్**
**అకృతాఽఽత్మానమ్ ఆసాద్య రాజానమ్ అనయే రతమ్**
**సమృద్ధాని వినశ్యన్తి రాష్ట్రాణి నగరాణి చ**
**మిత్రమ్ ఔపయికం కర్తుం రామః స్థానం పరీప్సతా**
**వధం చాఽనిచ్ఛతా ఘోరం త్వయాఽసౌ పురుషర్షభః**
**విదితః స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః**
**తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి**

పరుని భార్యను అనుభవించవలెనని కోరిక కలిగినప్పుడు ఒక్కసారి తన విషయమున గూడ నా భార్యను వేరొకడు బలాత్కరించి చెరబట్టినచో ఎట్లుండును? ఆలోచించుకొనుము. ధృడ మనస్కుడు కాక పాపకార్యములను ఆచరించు రాజును పొందినచో ఎంతటి సమృద్ధములైన రాజ్యములు నశించక మానవు. లోకములో నిలకడ కావాలని కోరినచో రామునితో మైత్రి చేసికొనుము. ఘోరమైన చావు చావకుండుటకైనను రామునితో మైత్రి చేసికొనుము.
రావణునకు సీతమ్మ చేసిన ఈ ఉపదేశము సంసారులకు అందరికి ఉపదేశమే. ఇట్లు పలికిన సీత వాక్కులను విని రావణుడు కోపములో .బ్రతిమాలుచున్న కొలది స్త్రీకి చులకన యగును. నీపై కల్గిన కామముచే నా కోపమును ఆపి వేయుచున్నది.

**వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల నిబధ్యతే**

**జనే తస్మిం స్త్వఽనుక్రోశః స్నేహ శ్చ కిల జాయతే**

ఏ మనుజులపై కామము కలుగునో ఆ మనుజులు శిక్షింపదగిన వారైనను వారిపై దయా స్నేహములు కలుగును. నీవు నన్నాడిన పరుష వాక్యములకు నిన్ను క్రూరముగా సంహరింపవలసి యున్నది సీతా! నీకు సంవత్సరము గడువు ఒసగితిని. ఇంకా నీకు రెండు మాసములు మాత్రమే వ్యవధి యున్నది. అప్పటికి నీవు నన్ను అంగీకరింపనిచో నిన్ను నాకు ప్రొద్దుటి భోజనమునకు వినియోగింతురు అని పరుషముగా మాట్లాడి వెడలిపోయెను. తరువాత రాక్షస స్త్రీలు, సీతకు నయానా, భయానా అనేక రకములుగా రావణుని పొందమని నచ్చచెప్పుటకు ప్రయత్నము చేసిరి. కాని సీత వారి మాటలను నిరాకరించెను. అశోక వృక్షముపై యున్న హనుమ వీరి మాటలను నిశ్చలముగా వినెను.

### 5.12 త్రిజట స్వప్నము

సీతాదేవి ఆ రక్కసుల మాటలకు మిగుల పరితాపము చెందుచు ..

**హా రామేతి చ దుఃఖాఽఽర్తా పున ర్హా లక్ష్మణేతి చ**

**హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామిని**

**లోక ప్రవాదః సత్యోఽయం పణ్డితైః సముదాఽఽహృతః**
**అకాలే దుర్లభో మృత్యుః స్త్రియా వా పురుష స్య వా**
**య త్రాఽహ మేవం క్రూరాభి రాక్షసీభి: ఇహాఽర్దితా**
**జీవామి హీనా రామేణ ముహూర్తమ్ అపి దుఃఖితా**
**ధిగ్ అస్తు ఖలు మానుష్యం ధిగ్ అస్తు పర వశ్యతామ్**
**న శక్యం యత్ పరిత్యక్తుమ్ ఆత్మ చ్ఛన్దేన జీవితమ్**

సీతాదేవి రామా, లక్ష్మణా, కౌసల్యా, సుమిత్రా అనుచు దుఃఖించెను. స్త్రీ, పురుషులలో ఎవ్వరికైనను తాము కోరుకొన్నప్పుడే మరణము సంభవించదు అను ప్రాజ్ఞుల మాట సత్యము. ఇట్టి రాక్ష స్త్రీలచే బాధింపబడుతూ ఒక్క క్షణమైనను జీవించి యుండరాదు. మరల స్వస్థత తెచ్చుకొని నా జీవితము శ్రీరాముని అధీనములోనిది కావున ఈ జీవితమును త్యజించుటకు నాకు అవకాశము లేదు[17]. ఈ విధముగా జానకి అధోముఖియై నిరంతరము కన్నీరు కార్చుచు విలపించుచుండెను. అప్పుడు ఆ రాక్షస స్త్రీలలోని త్రిజట తనకు కలిగిన స్వప్న వృత్తాంతము చెపుతూ శ్రీరాముని విజయము, రాక్షసుల వినాశనం సూచించింది అని చెపుతుంది.

**చన్ద్ర సూర్యౌ మయా దృష్టౌ పాణిభ్యాం పరిమార్జతీ**
**తత స్తాభ్యాం కుమారాభ్యామ్ ఆస్థితః స గజోత్తమః**
**సీతయా చ విశాలాఽక్ష్యా లంకాయా ఉపరి స్థితః**
**పాణ్డు రర్షభ యుక్తేన రథే నాఽష్ట యుజా స్వయమ్**

---

[17] మానవ జన్మను ఇచ్చినది భగవంతుడు, కావున ఇది భగవధీనమైనది. కావున జీవితమును త్యజించుటకు ఎవ్వరికిని అధికారములేదు కావున ఎవ్వరును ఆత్మహత్యకు పాల్పడరాదు.

ఆ స్వప్నములో ఏనుగు అంబారీపై శ్రీరామునితో గూడి సీత ఊరేగుచుండగా, సీత తన పతి యొడినుండి లేచి సూర్యచంద్రులను స్పృశించుచుండుట చూచితిని. **(ఆదిత్య మండలం వాతు, చంద్రమండలం మేవ వా| స్వప్నే గృహ్ణాతి హస్తాభ్యాం రాజ్యం సంప్రాప్నుయాన్మహాత్|| ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాదశైలాగ్ర నానస్పతీనాం|** స్వప్నమున సూర్యమండలముగాని, చంద్రమండలముగాని తన చేతులలో స్పృశించిన మహారాజ్యము ప్రాప్తించును. ధ్రువమండలము, శైలాగ్రమునకు చేరుకొనుట, గజారోహణము తప్పకుండ సంపదలు కల్గును). త్రాగుచు, యెర్రని వస్త్రములు ధరించి, నూనె పూయబడిన దేహముతో గన్నేరు దండలు దాల్చి పుష్పకముపై నుండి రావణుడు పడిపోవుటను స్వప్నములో గాంచితిని. (బలి పశువు మెడలో గన్నేరు దండలు అలంకరించుట ఆచారము). శ్రీరాముడు దివ్యమైన పుష్పక విమానమును ఎక్కి ఉత్తర దిశకు సీతాలక్ష్మణ సమేతుడై వెళ్లెను. (ఈ విషయము అనంతరము శ్రీరాముడు అయోధ్యకు రాజుకాగలడని సూచిస్తున్నది).రావణుడు శిరోముండనం గావించుకుని, నల్లని వస్త్రములు ధరించి, నూనె త్రాగుచు, పిచ్చివాడివలె గాడిదలు కట్టిన రథముపై దక్షిణ దిశకు వెడలెను. రావణుని సుతులు, కుంభకర్ణుడు నూనె పూసిన దేహములతో దక్షిణ దిశకు వెడలిరి. ఒక్క విభీషణుడు మాత్రము దివ్య గజమును అధిరోహించి ఆకాశమునందు యుండెను. ఈ విధముగా త్రిజట తన స్వప్న వృత్తాంతమును తెలిపి రాక్షస స్త్రీలతో సీత యెడల జాగరూకతతో, మర్యాదగా మెలుగుడు, ఆమెను శరణు వేడుడు అని చెప్పింది. అంత సీతకు శుభశకునములు కంబడినవి.

### 5.13 సీత ప్రాణత్యాగమునకు సిద్ధపడుట

సీత మనస్సు రాక్షస రాజైన రావణుడు క్రూరముగా పల్కిన మాటలకు బెదిరినదియై విలపించు చుండెను.

**నై వాఽస్తి దోషమ్ మమ నూనం అత్ర,**
**వధ్యాఽహమ్ అస్యా ప్రియ దర్శన స్య.**
**భావం న చా స్యాఽహ మఽనుప్రదాతుమ్,**
**అలం ద్విజో మన్త్రమ్ ఇవాఽద్విజాయ**
**నూనం మ మాఽంగా న్యఽచిరా దఽనాఽఽర్యః,**
**శస్త్రైః శితై శ్ఛేత్స్యతి రాక్షసేన్ద్రః**
**తస్మి న్నఽనాగచ్ఛతి లోక నాథే,**
**గర్భస్థ జన్తో రివ శల్య కృన్తః**

ఈ భయంకరుడైన రాక్షసుడు ఎట్లయినను నన్ను సంహరించును కావున నేను ఆత్మహత్య చేసుకొనుటలో దోషము లేదు. శ్రీరాముడు రెండు నెలలలోపు రాకున్నచో గర్భములో యున్న బిడ్డ సుఖప్రసవం గాకున్నచో శల్యముతో చేధించునట్లు నన్ను ఈ రాక్షసుడు తప్పక ముక్కలు చేయును. ఈ విధముగా సీత పరిపరి విధములుగా శ్రీరాముని తలచుకొని దుఃఖించుతూ ..

**శోకాఽభితప్తా బహుధా విచిన్త్య, సీతాఽథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా.**
**ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్రమ్, అహం గమిష్యామి యమ స్య మూలమ్**

తన జడనే ఉరిగా వేసుకొని తనువును చాలించెదను అని నిర్ణయించుకొనెను. అప్పుడు మరల ఆమెకు పెక్కు శుభశకునములు కనబడినవి. అప్పుడు సీతకు ఆందోళన దూరమై మనస్తాపము శాంతించెను.

### 5.14 సీతాదేవికి వినబడునట్లు హనుమ రామకథను వినిపించుట

**ఏవం బహువిధాం చిన్తాం చిన్తయిత్వా మహా కపిః**
**సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ**
**తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠ స్తారాఽధిప నిభాఽఽననః**
**రామో నామ విశేషజ్ఞః శ్రేష్ఠః సర్వ ధనుష్మతామ్**

**రక్షితా స్వస్య వృత్తస్య స్వజన స్యాఽపి రక్షితా**
**రక్షితా జీవ లోకస్య ధర్మస్య చ పరంతపః**
**తస్య సత్యాఽభిసంధస్య వృద్ధస్య వచనాత్ పితుః**
**తస్య సత్యాఽభిసంధస్య వృద్ధస్య వచనాత్ పితుః**
**సభార్యః సహ చ భ్రాత్రా వీరః ప్రవ్రాజితో వనమ్**
**జనస్థాన వధం శ్రుత్వా హతౌ చ ఖర దూషణౌ**
**తత స్త్వఽమర్షాఽపహృతా జానకీ రావణేన తు**
**వంచయిత్వా వనే రామం మృగ రూపేణ మాయయా**
**స మార్గమాణ స్తాం దేవీం రామ స్సీతాం అనిన్దితాం**
**ఆససాద వనే మిత్రం సుగ్రీవం నామ వానరం**
**తత స్స వాలినం హత్వా రామ: పర పురంజయః**
**ప్రాయచ్ఛ త్కపి రాజ్యం త త్సుగ్రీవాయ మహా బలః**
**సుగ్రీవేణాఽపి సందిష్టా హరయ: కామ రూపిణః**
**దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వంతి సహస్రశః**
**అహం సంపాతి వచనా చ్ఛత యోజన మాఽఽయతం**

హనుమ పలువిధములుగా ఆలోచన చేసి సీతాదేవి మాత్రమే శ్రద్ధగా వినునట్లుగా మధుర వచనములు పలికెను. ఇక్ష్వాకు వంశజులలో కీర్తిమంతుడు, శౌర్య పరాక్రములు కలవాడు అయిన దశరథుడు కలడు. అట్టి దశరథుని జ్యేష్ఠ కుమారుడు అయిన రాముడు సర్వధర్మములలో శ్రేష్టుడు. తన ధర్మములను తాను రక్షించుకొనుచు, తన వారిని, జీవలోకము నంతను రక్షించువాడు. తండ్రి ఆజ్ఞను అనుసరించి సీతాలక్ష్మణులతో కలసి అరణ్యములకు వెడలెను. అక్కడ పెక్కు రాక్షసులను సంహరించెను. రాముని చేతిలో ఖర, దూషణ, త్రిశురులు హతమైరి. అప్పుడు రావణుడు మాయలేడి సహాయముతో జానకిని అపహరించెను. రాముడు సీతాన్వేషణ చేయుచు సుగ్రీవునితో మైత్రి చేసి వానర

రాజైన వాలిని సంహరించి సుగ్రీవుని రాజును చేసెను. సుగ్రీవుని ఆదేశము మేరకు నేను సీతను వెతుకుచు నూరు యోజనములు సముద్రమును దాటి రాముని వలన విన్న శుభలక్షణ సంపన్నురాలైన సీతను చూచితిని. ఈ విధముగా పలికి హనుమ మిన్నకుండెను. అప్పుడు కేశములచే కప్పబడియున్న సీత చెట్టుపై బాలభానుని వలె వెలుగొందుచున్న మారుతిని గాంచెను. సీతాదేవి తేజోమూర్తియైన ఆ మారుతిని చూడగానే ఒకింత స్పృహ కోల్పోయి ఇది స్వప్నము కాదుకదా అని ఆలోచన చేసెను. అయినను నిద్రలేని నాకు స్వప్నము ఎట్లు వచ్చును? ఇట్లా ఆలోచించి సీత దేవతా సమూహమునకు ఇట్లు ప్రార్థించెను.

**నమోఽస్తు వాచస్పతయే సవజ్రిణే, స్వయమ్భువే చైవ హుతాఽశనాయ చ**
**అనేన చోక్తం య దిదం మమాఽగ్రతో, వనౌకసా త చ్చ తథాఽస్తు నాఽన్యథా**

బృహస్పతికి, ఇంద్రునకు, బ్రహ్మకు, అగ్నిదేవునకు నమస్సులు. ఈ వానరుడు మాటలు తథ్యములు అవుగాక! అప్పుడు నెమ్మదిగా హనుమ చెట్టు దిగి సీతకు నమస్కరించెను (అప్పుడు రాక్షస స్త్రీలు నిద్రలో యుండిరి) సీతాదేవితో హనుమ సాధ్వీ నీవెవరవు? రామపత్నివియే అని నా విశ్వాశము. అప్పుడు ఆమె తన్ను సీతగా చెప్పుకొని, దుష్ట రాక్షసుడైన రావణుడు నన్ను అపహరించి తెచ్చినాడు. ఇంకా నాకు రెండు మాసములు మాత్రమే గడువు యున్నది అనెను. అంత హనుమ రామలక్ష్మణుల కుశల వార్తలు చెప్పెను. అందుకు సీత ఎంతయో సంతోషించి ..

**కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా**
**ఏతి జీవన్తమ్ ఆనందో నరం వర్ష శతా దఽపి**

లోకములో వాడుకలో నున్న సామెత నా కెంతయో శుభకరముగా కనబడుచున్నది. జీవించియున్న మానవునికి నూరేండ్లకైనను ఆనందము కల్గును అను మాట నా విషయములో సత్యమైనది. (ఈ వాక్యము చాలా ముఖ్యమైనది.

పెద్దవారు పిల్లలకు చెప్పవలసినది). అయినను సీతమ్మ మదిలో యున్న చిన్న సంశయమును గూడ తీర్చుటకై రాముని గుణగణములను, పరాక్రమమును, రూప లావణ్యములను అదే విధముగా లక్ష్మణునివి చెప్పగా సీత మారుతిని విశ్వసించెను.

**5.15 సీత కోరికపై హనుమ శ్రీరాముని గుణగణములను వివరించుట**

సీతాదేవి కోరికపై శ్రీరాముని శరీర చిహ్నములను, గుణగణములను ఈ విధముగా వివరిస్తున్నాడు.

**జానన్తీ బత దిష్ట్యా మాం వైదేహి పరిపృచ్ఛసి**
**భర్తుః కమల పత్రాఽక్షి సంఖ్యానం లక్ష్మణ స్య చ**
**రామః కమల పత్రాక్షః సర్వ భూత మనోహరః**
**రూప దాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాఽఽత్మజే**
**రూప దాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాఽఽత్మజే**
**తేజసాఽఽదిత్య సంకాశః క్షమయా పృథివీ సమః**
**బృహస్పతి సమో బుద్ధ్యా యశసా వాసవోపమః**
**రక్షితా జీవలోక స్య స్వజన స్య చ రక్షితా**
**రక్షితా స్వస్య వృత్త స్య ధర్మ స్య చ పరంతపః**
**రామో భామిని లోక స్య చాతు ర్వర్ణ్య స్య రక్షితా**
**మర్యాదానాం చ లోక స్య కర్తా కారయితా చ సః**
**అర్చిష్మాన్ అర్చితోఽత్యఽర్థం బ్రహ్మచర్య వ్రతే స్థితః**
**సాధూనామ్ ఉపకారజ్ఞః ప్రచారజ్ఞ శ్చ కర్మణామ్**
**రాజ విద్యా వినీత శ్చ బ్రాహ్మణానామ్ ఉపాసితా**
**శ్రుతవాన్ శీల సంపన్నో వినీత శ్చ పరంతపః**
**యజుర్వేద వినీత శ్చ వేదవిద్భిః సుపూజితః**
**ధనుర్వేదే చ వేదే చ వేదాంగేషు చ నిష్ఠితః**

**సత్య ధర్మ పరః శ్రీమాన్ సంగ్రహోఽనుగ్రహే రతః**

**దేశ కాల విభాగజ్ఞః సర్వ లోక ప్రియం వదః**

తల్లీ! రామలక్ష్మణుల రూపములను, వారి చిహ్నములను నీకు తెలిసినను నన్నడిగావు కనుక చెపుతున్నాను. రాముడు తామర పూరేకుల నేత్రములు గలవాడు, సమస్త ప్రాణులకు ఆనందమును చేకూర్చువాడు, పుట్టుకతోనే చక్కని దేహ సౌందర్యము, గుణ సంపద గలవాడు. తేజస్సును సూర్యుడివంటివాడు, సహనము నందు భూదేవి, బుద్ధి యందు బృహస్పతి, యశస్సుచే దేవేంద్రుడు. సర్వ ప్రాణులకు రక్షకుడు, శరణాగతి వత్సలుడు, ధర్మ రక్షకుడు, శత్రువులను రూపుమాపువాడు. లోక మర్యాదలను పాటించుతూ ఇతరులచే పాటింప చేయువాడు, నాలుగు వర్ణములను రక్షించువాడు. జ్ఞాన సంపన్నుడు, లోక కళ్యాణమునకై తాను కర్మలను ఆచరించుతూ ఇతరులచే ఆచరింప చేయువాడు. **(యద్యదా చరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే .. భ.గీ. 3 /21 శ్రేష్ఠుడైన పురుషుని ప్రవర్తనని లోకులు పాటింతురు)** సర్వ విద్యా పారంగతుడు, సదాచార సంపన్నుడు, వినయ శోభితుడు, శత్రు భయంకరుడు. మూడు వేదములు, వేదాంగముల యందు నిష్ణాతుడు, వేద పండితులచే పూజింప బడువాడు. బ్రహ్మచర్యా దీక్షితుడు. (వివాహమైన తర్వాత కూడా ఋతుకాలమున తప్ప, స్త్రీతో రమింపకుండుట బ్రహ్మచర్యము. శివ గీత అష్టమాధ్యాయము లో ఈ విధంగా చెప్పారు. స్త్రీ ఋతుస్నానము నాలుగవ రోజున చేయును. ఆ రోజు నుండి పదునారవ రోజు వరకు ఋతుకాలముగా నిర్దేశించబడినది. అప్పుడు మాత్రమే సంతానము కల్గును. మిగిలిన రోజులలో సంతాన ప్రాప్తి ఉండదు. అంటే ఋతుకాలములో స్త్రీ సంగమము వంశాభివృద్ధి కొరకుగానే పరిగణించబడినది). శ్రీరాముడు సకలైశ్వర్య సంపన్నుడు, సత్య భాషణము నందును, ధర్మాచరణము నందును నిరతుడు,

ధర్మ మార్గమున ధనమును ఆర్జించి పాత్రులకు దానము చేయువాడు. దేశకాలములకు అనువుగా ప్రవర్తించువాడు. అందరితోడను ప్రియముగా మాట్లాడు వాడు.

**5.16 సీత కోరికపై హనుమ శ్రీరాముని రూపమును వివరించుట**

శ్రీరాముని ఆత్మ గుణ గుణములను వర్ణించిన తరవాత, హనుమ, శ్రీరాముని రూపమును ఈ విధముగా వర్ణించు చున్నాడు.

**విపులాంసో మహా బాహుః కమ్బు గ్రీవః శుభాననః**
**గూఢ జత్రుః సుతామ్రాక్షో రామో దేవి జనై శ్శృతః**
**దున్దుభి స్వన నిర్ఘోషః స్నిగ్ధ వర్ణః ప్రతాపవాన్**
**సమ స్సమ విభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః**
**త్రిస్థిర స్త్రిప్రలమ్బ శ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః**
**త్రి తామ్ర స్త్రిషు చ స్నిగ్ధో గంభీర స్త్రిషు నిత్యశః**
**త్రి వలీవాం స్త్ర్యవణత శ్చతు ర్వ్యంగ స్త్రి శీర్షవాన్**
**చతుష్కల శ్చతు ర్లేఖ శ్చతు ష్కిష్కు శ్చతు స్సమః**
**చతుర్దశ సమ ద్వన్ద్వ శ్చతుర్దం ష్ట్ర శ్చతుర్గతిః**
**మహౌ ష్ఠ హను నాస శ్చ పంచ స్నిగ్ధోఽష్ట వంశవాన్**
**దశ పద్మో దశ బృహ త్త్రిభి ర్వ్యాప్తో ద్వి శుక్లవాన్**
**షడు న్నతో నవ తను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః**

సీతా మాతా! శ్రీరాముడు విశాలమైన భుజములు, దీర్ఘములైన బాహువులు, శంఖము వంటి కంఠము, సుందరమగు ముఖము, దుందుభి దానిని పోలిన కంఠస్వరం, మెఱయుచున్న దేహచ్ఛాయతో అన్ని అవయవములు సమముగా కలవాడు, నీలమేఘశ్యాముడు.

**1. త్రిస్థర;** వక్షం, మనిబంధము, పిడికిలి స్థిరముగా యున్నవాడు. ఇవి రాజ లక్షణములు,

2. **త్రిప్రలంబ:** కనుబొమలు, బాహువులు, వృషణములు పొడవుగా యున్నవాడు. ఇవి సంపన్నుల లక్షణములు,

3. **త్రిసమః**: కేశాగ్రములు, వృషణములు, జానువులు సమముగా యున్నవాడు. ఇవి రాజ లక్షణములు,

4. **త్రిషుచోన్నత**: ఉదరము, నాభి చుట్టుభాగము, హృదయము ఎత్తుగా గలవాడు. ఇవి రాజ లక్షణములు,

5. **త్రితామ్రః:** నేత్రాంతములు, గోళ్లు, అరచేతులు ఎర్రగా నున్నవాడు. ఇవి సుఖపురుషుని లక్షణములు,

6. **త్రిషుస్నిగ్ధః:** పాదరేఖలు, శిరోరుహములు, లింగము ఈ మూడును నునుపుగా నున్నవాడు. ఇవి భాగ్యవంతుని  లక్షణములు,

7. **త్రిషు గంభీర**: స్వరము, నడక, నాభి ఈ మూడును గంభీరంగా నున్నవాడు. ఇవి ప్రసంశాపాత్రుని లక్షణములు,

8. **త్రివలీవాన్:** కడుపుపై మూడు మడతలు కలవాడు,

9. **త్రవ్యనతః:** స్థనములు. చూచుకములు, పాదరేఖలు లోతుగా యున్నవాడు,

10. **చతుర్వ్యంగః:** నరములు తేలని పాదములు, ఒక్కొక్క వెంట్రుక కల రోమ కూపము, దీర్ఘముగా లేని లింగము, మాంసము కాని పొత్తికడుపు కలవాడు,

11. **త్రిశీర్షవాన్**: మూడు సుడులు గల్గిన శిరస్సు కలవాడు,

12. **చతుష్కలః**: బొటన వ్రేలి మొదట నాలుగు రేఖలు కలవాడు. ఇవి ఎన్ని రేఖలు ఉండునో అన్ని వేదముల యందు ప్రావీణ్యము యుండును,

13. **చతుర్లేఖః:** నుదిటి యందు నాలుగు రేఖలు, పాదము నందు చేతి యందు నాలుగు రేఖలు కలవాడు. లలాటముపై నాలుగు రేఖలు యున్నచో 200 యేండ్లు ఆ పైన, మూడు రేఖలు యున్నచో 100 యేండ్లు, రెండు రేఖలు

యున్నచో 60 యేండ్లు, ఒక రేఖ యున్నచో 20 యేండ్ల లోపు ఆయుర్దాయము యుండును,

14. **చతుష్కిష్కుః** తొంబదియారు అంగుళముల ఎత్తు కలవాడు,

15. **చతుస్సమః:** బాహువులు, జానువులు, ఊరువులు, గండ స్థలములు సమముగా యున్నవాడు,

16. **చతుర్దశసమద్వన్ద్వః:** కనుబొమలు, ముక్కుపుటములు, నేత్రములు, చెవులు, పెదవులు, స్థనాగ్రములు, ముంజేతులు, మణికట్లు, మోకాళ్ళు, వృషణములు, పిరుదులు, చేతులు, పాదములు మడమలు. ఈ పదునాలుగు సమముగా యున్నవాడు,

17. **చతుర్దంష్ట్రః:** దంతములు మెరియుచు గట్టివై, వాడివై, సమములై ఉండువాడు. రెండు పలువరసలలో మధ్యగల నాలుగు దంతములకును పక్కనున్న నాలుగు పండ్లకును 'దంష్ట్రలు' అని పేరు. కాంతి గలవి, నునుపైనవి, పెద్దవి, మొనదేలినవి, సమములు ఐన దంష్ట్రములు మంగళకరములు,

18. **చతుర్గతిః:** సింహము, శార్ధూలము, గజము, వృషభము అను నాలుగు జంతువుల నడక వంటి నడక గలవాడు,

19. **మహౌష్ఠహనునాసః**: పెదవి, దౌడ, ముక్కు, ఎత్తుగా బొద్దుగా యున్నవాడు. ఇవి రాజ లక్షణములు,

20. **పంచస్నిగ్ధః**: చూపులో, దంతములో, చర్మములో, కేశములలో, పాదములలో స్నిగ్ధత కలవాడు,

21. **అష్టవంశవాన్:** వెన్నెముక, చేతివ్రేళ్ళు, కాలివ్రేళ్లు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, లింగము. పొడవైన ఈ ఎనిమిది అవయవములు గలవాడు,

22. **దశపద్మః:** ముఖము, నేత్రములు, పెదవి, అంగుడు, స్థానములు, గోళ్లు, చెవులు, పాదములు. పద్మాకారములగు అవయవములు ఈ పది గలవాడు,

23. **దశబృహత్:** శిరస్సు, లలాటము, చెవులు, మెడ, గుండెలు, ఉదరము, చేతులు, పాదములు, వీపు, హృదయము అను పది అవయవములు పెద్దవిగా యున్నవాడు,

24. **త్రిభిఃవ్యాప్తః:** తేజస్సు, యశస్సు, కాంతి అను ఈ మూడిటిచే అంతటా వ్యాపించినవాడు,

25. **ద్విశుక్లవాన్:** దంతములు, నేత్రములు తెల్లగా యున్నవాడు,

26. **షడున్నతః:** కక్షము లేదా చంక, కక్షి, వక్షస్థలం, ముక్కు, మూపు, నుదురు అను ఈ ఆరు అవయవములు ఎత్తుగా యున్నవాడు,

27. **నవతమః:** కేశములు, గోళ్లు, చర్మము, లింగము, వ్రేళ్ళు, గుంపులు, బుద్ధి, గడ్డము, వెంట్రుకలు అను ఈ తొమ్మిది సూక్ష్మముగా యున్నవాడు,

28. **త్రిభిః వ్యాప్నోతి:** ధర్మార్థకామములను మూడింటిని పూర్వాహ్న, మధ్యాహ్న, అపరాహ్ణవముల యందు అచ్చరించు వాడు.

ఇట్లు సాముద్రిక శాస్త్రములో చెప్పబడిన సర్వ లక్షణములు గలవాడు శ్రీరాముడు. ఇట్టి లక్షణములు గల రామునకు అన్ని విధముల సమానముగా యుండు వాడు లక్ష్మణుడు.

అమ్మా! రామలక్ష్మణులు ఇద్దరు నిన్ను చూడవలెనని చాలా కుతూహలంతో యున్నారు. వారు వానర రాజైన సుగ్రీవునితో మైత్రి చేసుకొని యున్నారు. అమ్మా! హనుమ అను పేరుగల నన్ను ఇచ్చటికి దూతగా పంపినారు. రాత్రివేళ లంకలో ప్రవేశించి రావణుని చూచితిని. శోకములో బాధపడుచున్న నిన్ను చూచితిని. దేవి! నేను రామదూతను. సుగ్రీవ సచివును. కార్యార్థినై వచ్చిన నాతో మాట్లాడుము. అమ్మా! నీవు దిగులు వీడుము. నీకెట్లు ఇష్టమైన అట్లు చేయుము. ఈ విధముగా చెప్పి సీతమ్మకు నమ్మకము కలుగుటకై వినయముతో ఇట్లు పలికెను.

**వానరోఽహం మహాభాగే దూతో రామ స్య ధీమతః**
**రామ నామాఽంకితం చేదం పశ్య దేవ్యఽంగుళీయకమ్**
**ప్రత్యయాఽర్థం తవాఽఽనీతం తేన దత్తం మహాత్మనా**
**సమాఽఽశ్వసిహి భద్రం తే క్షీణ దుఃఖ ఫలా హ్యఽసి**

అమ్మా! నేను వానరుడను. రామ దూతను. రామనామాంకితమగు ఈ అంగుళీయకమును చూడుము. నీకు విశ్వాసము కలుగుటకై శ్రీరాముడు ఒసగిన దీనిని తెచ్చినాను. అశ్వాసము నందుము. నీ దుఃఖము పోవుచున్నది. నీకు మంగళము అగుగాక. అని హనుమ సీతతో విన్నవించి ఊరకుండెను. సీతమ్మ ఆ ఉంగరమును గ్రహించి రామదర్శనము అయినట్లు మిక్కిలి ఆనందించింది.

**5.17 సీతాదేవిచే కాకాసుర వృత్తాంతము, చూడామణి ప్రధానము**

సీతాదేవి ఆనందించినదియై హనుమతో రామలక్ష్మణుల కుశలములు, వారి కార్యసన్నద్ధత గురించి అడిగెను. జనస్థానములో శ్రీరాముడు ఒక్కడే పదునాలుగు వేల మంది రాక్షసులను సంహరించెను. అట్టి పురుష శ్రేష్ఠుడు ఆపదలచే చలించు వాడు కాడు. నాకు ఇంకా రెండు నెలల సమయము మాత్రమే యున్నది. కావున రాముని త్వరగా తీసుకొని వచ్చి నన్ను చెర నుంచి విడిపింపుము అని అనెను. అప్పుడు హనుమ సీతతో నీ అనుమతి అయితే ఇప్పుడే నేను నిన్ను రాముని దగ్గరకు చేర్చగలను అని అనగా సీత రవ్వంత హనుమ శక్తి సామర్థ్యములకు శంకించినను, తరువాత అతని శక్తిని చూసి ఉత్తమ పతివ్రత అయిన సీత అందుకు మృదువుగా నిరాకరించెను.

(ఇక్కడ గమనించితే రావణుడు సీతను బలములో తీసుకొని వచ్చెను కానీ తనంతటగా తానుగా పరపురుషుని స్పర్శ ఇష్టపడదు. ఆధ్యాత్మిక శాస్త్ర దృష్టిలో సీత నిర్ణయము సరియైనదే. పరపురుషుడనగా ఇచ్చట పరధర్మము లేదా పరవృత్తి. అటువంటి పరధర్మము యొక్క భుజములపై కూర్చొని స్వస్థానమునకు వెళ్ళుట యోగ్యము కాదు. గీతలో ఈ పరధర్మ స్వీకారం నిషేధించబడినది.

**శ్లో|| శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్**

**స్వధర్మో నిధనం శ్రేయః పరధర్మో భయావహః**

పరవృత్తి రూప హనుమానుని స్పర్శ సీత స్వీకరించదు. రామ రావణుల వృత్తి సంఘర్షణ జరిగి, రావణ వృత్తిని జయించి, రాముడు తనదైన సీతావృత్తిని స్వీకరింప వలెను. అదియే శ్రేయస్కరమైనది).

అందుకు హనుమ మిక్కిలి సంతోషించి రాముడు గుర్తింపగల ఏదైనా అబిజ్ఞానమును ఒసగమని కోరెను. అప్పుడు సీత గద్గద స్వరములో కాకాసురుని కథను రామునికి గుర్తుగా ఈ విధముగా తెలియ చేయు చున్నది.

**శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా**

**తతో మాంస సమాయుక్తో వాయసః పర్యతుణ్డయత్**

**తమ్ అహం లోష్టమ్ ఉద్యమ్య వారయామి స్మ వాయసం**

**దారయన్ స చ మాం కాక స్త త్రైవ పరిలీయతే**

**న చాఽప్యుపారమ న్మాంసా ద్భక్షాఽర్థీ బలి భోజనః**

**ఆసీనస్య చ తే శ్రాన్తా పున రుత్సంగమ్ ఆవిశమ్**

**క్రుధ్యన్తీ చ ప్రహృష్టేన త్వయాఽహం పరిసాన్త్వితాః**

**బాష్ప పూర్ణ ముఖీ మన్దం చక్షుషీ పరిమార్జతీ**

**లక్షితాఽహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా**

**పరిశ్రమాత్ ప్రసుప్తా శ్చ రాఘవాఽంకే ప్యఽహమ్ చిరం**

**పర్యాయేణ ప్రసుప్త శ్చ మ మాఽంకే భరతాఽగ్రజః**

**స తత్ర పునరే నాథ వాయస స్సముపాగమత్**

**తత సుప్తప్రబుద్ధాం మాం రామాస్యాంకా త్సముత్థితామ్**

**వాయస స్సహసాగమ్య విదధార స్తనాంతరే**

**పునః ర్పున రథోత్పత్య విదధార స మాం భృశమ్**

**స దర్భ సంస్తరా ద్గృహ్య బ్రహ్మణోఽస్త్రేణ యోజయత్**
**స దీప్త ఇవ కాలాఽగ్ని ర్జజ్వాలాఽభిముఖో ద్విజమ్**
**స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి**
**తత స్తం వాయసం దర్భ స్సోఽమ్బరేఽనుజగామ హ**
**అనుసృష్ట  స్తదా కాకో జగామ వివిధాం గతిమ్**
**న శర్మ లబ్ధ్వా లోకేషు త్వా మేవ శరణం గతః**
**మత్కృతే కాక మాత్రేఽపి బ్రహ్మాఽస్త్రం సముదీరితమ్**
**కస్మా ద్యో మాం హరే త్త్వత్తః క్షమసే తం మహీపతే**
**తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్**
**ప్రదేయో రాఘవా యేతి సీతా హనుమతే దదౌ**

"చిత్రకూటమిలో ఒకనాడు నేను అలసి రాముని లొడపై పరుంటిని. అప్పుడు మాంసము నందు ఆసక్తి గల ఒక కాకి నా గుండెలపై గీరుచు కొరికెను. ఈ విధముగా అది నేను ఎంత ప్రయత్నించినను పోకుండెను. ఆ విధముగా అలసి పోతిని. కొంతతడవకు రాముడు నా ఒడిలో పరుండెను. మరల ఆ వాయసము ఎగిరి వచ్చి నా వక్ష స్థలమును గోళ్ళతో గీరగా, నా గుండెల నుండి వచ్చిన రక్త బిందువులతో తడిసి రాముడు మేల్కొనెను. అందుకు రాముడు మిగుల కోపించి అక్కడి ఒక దర్భను (గరిక) బ్రహ్మాస్త్రమున అభిమంత్రించి వాయసముపై వదిలెను. ఇంద్రుని కుమారుడైన ఆ వాయసమునకు ముల్లోకములలో ఎవరును రక్షించ లేకపోయిరి. చివరకు అది తిరిగి రాముని శరణు జొచ్చినది. శరణు పొందిన కాకము ఒక కంటిని మాత్రమే ఆ అస్త్రమునకు ఇచ్చి దాశరథునికి నమస్కరించి వెడలి పోయెను. అట్టి కాకము మీద నాడు బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన రాముడు ఈనాడు నన్ను రక్షించుటలో జాగు యేల?". ఇట్లు చెప్పి వస్త్రములో దాచి

యుంచిన దివ్యమగు చూడామణిని[18] తీసి రామునికి ఒసగమని సీత హనుమకు ఇచ్చెను అట్లా మణిని పుచ్చుకొని హనుమ సీతకు నమస్కరించి వెనుకకు వెళ్ళుటకు ఉద్యుక్తుడాయెను.

**5.18 అశోకవన విధ్వంసము, రాక్షస వధ**

**కార్యే కర్మణి నిర్దిష్టో యో బహూన్యఽపి సాధయేత్**

**పూర్వ కార్య విరోధేన స కార్యం కర్తుమ్ అర్హతి**

**న హ్యేకః సాధకో హేతుః స్వల్ప స్యాఽపి హ కర్మణః**

**యో హ్యర్థం బహుధా వేద స సమర్థోఽర్థ సాధనే**

చేయవలసిన పని పూర్తియైన తర్వాత ఆ పనికి విరోధము కలుగకుండా దానికి సంబంధించిన అనేక కార్యములు చేయగలవాడే నిజమైన కార్యకర్త, సేవకుడు, దూత. హనుమ చేయవలసిన ప్రధమ కార్యము సీతా దర్శనము. ఈ సందర్శన కార్యము రావణాసురుని శక్తి సామర్థ్యములు తెలుసుకొన్నప్పుడే ఆమెను రక్షించుట ద్వారా పూర్ణత చెందును. కావున సీతను చూచుట యను ప్రధమ కార్యమునకు హాని కలుగకుండా రావణ బలాదులను తెలుసుకొనుట వంటి ఇతర కార్యములను చేయుట అవసరమని హనుమ భావన. ఈ ప్రపంచమున పని స్వల్పమైనను ఒకే ఒక్క మార్గము ద్వారా దానిని సాధించుట కష్టము. కాబట్టి కార్యమును సాధించుటకు అనేక ఉపాయములను చూడగలిగిన వాడే సమర్థుడైన సాధకుడు.

ఈ విధముగా హనుమ శత్రు బలము తెలుసుకొనగోరి, యుద్ధము జరిగినచో వారి బలములు తెలియగలవు అని నిశ్చయించుకొనెను. అందుకు రావణునికి

[18] రత్నాకరం నందు పుట్టిన ఈ చూడామణిని సముద్రుడు, వరుణునికి ఇవ్వగా అతడు జనకునికి ఇచ్చెను. జనకుడు ఈ మణిని వివాహకాల సమయమున తన భార్య ద్వారా సీతకు ఇచ్చెను

ప్రీతిపాత్రమైన ఈ అశోక వనము యొక్క ధ్వంసమే మేలు అని ఆలోచించి ఆ వనమును ధ్వంసము చేసెను. అక్కడ కాపలా యున్న రాక్షస స్త్రీలు పరుగు పరుగున సీతమ్మ దగ్గరకు వచ్చి ఆ మహాబలుడైన కోతి ఎవరని అడిగిరి. అందుకు సీత **"అహి రెవ హ్యాహేః పాదాన్ విజానాతి న సంశయః"** (పాము జాడ పామే ఎరుగును. కామ రూపముతో వచ్చిన రాక్షసుడే అనుకొంటిని). ఇచ్చట సీత అసత్యము ఆడ వచ్చునా? హనుమ సీతకు ప్రాణ రక్షకుడు. సత్యము పలికినందువలన అతనికి అపాయము కలుగును కావున అట్లు చెప్పినది. ఇట్లే రాముడు కూడా అయోధ్య నుండి బయల్వెడలునప్పుడు దశరథుడు సుమంత్రుని రథము ఆపుమని అనెను. కానీ రాముడు సందడిలో వినపడలేదని మరునాడు రాజుకు చెప్పమని సుమంత్రునికి చెప్పెను. ఈ విధముగా రాముడు కూడా అసత్యము ఆడినాడు కదా. ఇది దోషము కాదా అను సందేహము వచ్చును. ఇచ్చట గమనించితే తండ్రి ఇచ్చిన సత్యవాక్యమును నిలుప వలెను. దశరథుడు ఆ దేశమునకు రాజు. అట్టి రాజు అసత్య వచనుడు కారాదు. అతని సత్యమును నిలుపుటకై కుమారుడైనను, మంత్రియైనను అసత్యమాడుటలో దోషము లేదు. ఒక గొప్ప సత్యమును నిలబెట్టుటకు అవసరార్థము ఒక అసత్యము చెప్పుటలో దోషము లేదు. కానీ సీత మాత్రము హనుమను కాపాడవలెననే ఆదుర్దాతో, అతని శక్తి సామర్థ్యముల మీద పూర్తిగా నమ్మిక లేక అసత్యము ఆడి తన స్త్రీ సహజమైన బేలత్వమును చాటుకొన్నది. అంతియే గాక అరణ్య కాండలో మారీచుని మాయా అక్రనాదము విన్న తర్వాత రాముని శక్తి సామర్థ్యములపై రవ్వంత అపనమ్మకంతో, సంశయముతో రామునికి సహాయము చేయవలసినదిగా సీత, లక్ష్మణుని ఆదేశించి పరుష పదజాలంతో దూషించి కష్టములను కొనితెచ్చుకొన్నది. అట్టి సంశయమును రావణుడు తనకు అనుకూలంగా ఉపయోగించుకున్నాడు. ప్రస్తుత కాలములో ఎదుటివాని శక్తిని తగిన అంచనా వేయకుండా స్త్రీ స్వతంత్రముగా వ్యవహరించినచో ఇట్టి కష్టములే

తనకు తన కుటుంబమునకు కలుగును. దేశ కాల పరిస్థితులను బట్టి స్త్రీ స్వభావము మారుతుండునని, మెరుపు లోని చాంచల్యము స్త్రీకి సహజము కానీ సీతకు అట్టి దోషములు లేవని అగస్త్య మహర్షి అరణ్య కాండలో శ్రీరామునికి చెప్పి యున్నాడు. కానీ మాయా ప్రభావము వలన సీత కూడా అందుకు అతీతురాలు కాదని తెలియు చున్నది. తరువాత రాక్షస స్త్రీలు రావణుని వద్దకు యేగి ఒక మహావానరము అశోక వనమును ధ్వంసము చేసినదని, అది సీతతో మాట్లాడినదియని చెప్పిరి. ఆ మాటలు విన్న రావణుడు "దీప్తాభ్యా మివ దీపాభ్యాం సార్చిషస్స్నేహ బిందవః" కోపము కలిగిన అతని నేత్రములు నుండి కన్నీటి బిందువులు మండుచున్న దీపముల నుండి మంటతో నూనె బొట్లు పడినట్లు పడెను. వెంటనే రావణుడు హనుమను నిగ్రహించుటకు ఎనుబదివేల కింకరులను నియమించెను. వారిని చూచి తన మహాకాయమును పర్వతములాగా పెంచి తోరణముపై నుండి ఈ విధముగా జయధ్వానము చేసెను. (ఇది జయమంత్రము. నిత్యము చదువుకొన్నచో శత్రుబాధలు లేక విజయము చేకూరును).

**జయ త్యఽతి బలో రామో లక్ష్మణ శ్చ మహా బలః**
**రాజా జయతి సుగ్రీవో రాఘువే ణాఽభిపాలితః**
**దాసోఽహం కోసలేన్ద్రస్య రామ స్యాఽక్లిష్ట కర్మణః**
**హనుమాన్ శత్రు సైన్యానాం నిహన్తా మారుతాఽఽత్మజః**
**న రావణ సహస్రం మే యుద్ధే ప్రతి బలం భవేత్**
**శిలాభి స్తు ప్రహరతః పాదపై శ్చ సహస్రశః**
**అర్దయిత్వా పురీం లంకా మఽభివాద్య చ మైథిలీమ్**
**సమృద్ధాఽర్థో గమిష్యామి మిషతాం సర్వ రక్షసామ్**

మహాబల సంపన్నులైన రామలక్ష్మణులకు జయము. రాముని రక్షణలో యున్న సుగ్రీవునకు జయము. అట్టి రామునకు నేను దాసుడను. శత్రుసైన్యములను దునుమాడ సమర్ధత గల వాయుపుత్రుడనైన నేను హనుమంతుడను. వేయిమంది రావణులు వచ్చినను నన్ను యుద్ధములో ఎదిరింపలేరు. వారిని శిలలతో, వృక్షములతో సకల రాక్షసులను నాశనము చేసి లంకాపురిని మర్ధించి, మైథిలికి నమస్కరించి కార్యమును సాధించి అందరూ చూచుచుండగా వెళ్లెదను. ఈ విధముగా ఘోషణము చేసి గరుత్మంతుని వేగమున వారి నందరిని హతమార్చెను. శత్రువులను చంపుట అను కార్యము చేయువాడను తాను కాదనియు, ఆ కర్మ తనది కాదనియు, దాని వలన కలుగు కష్టనష్టములు తనివి కాదనియు భావించుతూ, అహంకారమును వీడి హనుమ కర్మ చేయుచుండెను. భగవద్గీత లో కూడ శ్రీకృష్ణుడు నిష్కామ కర్మ చేయమని చెప్తాడు. భగవాన్ రమణులు చెపుతూ .. "నేను" అనే అహంకారము ను వదలి మౌనము, శాంతి (limitless contentment) అనే సాధనాలతో అత్మస్వరూపమును ఎరిగి, ఆత్మసాక్షాత్కారము పొంద వలసి ఉన్నది. దీనినే భగవత్ స్వరూపము, భగవత్ సాక్షాత్కారము అనవచ్చు. జీవుని యొక్క సహజ ప్రశాంత స్థితియే"శివము" గా గుర్తించవచ్చు. ధాన్యము యొక్క పొట్టును వేరు చేస్తే, దానినే బియ్యము గా గుర్తించవచ్చు. Similarly, so long as one is bound by karma one remain as "jiva". When the bond of ignorance is broken, one shines as "SIVA", కావున జీవునికి, శివునికి బేధము లేదు. దీనిని సూచించుటకు హనుమ తోరణముపై కూర్చుండెను. మానవునికి విరోధులు ముఖ్యముగా ముప్వురు. అవి నేను స్వతంత్రుడను అనుకొనుట, తనను తాను రక్షించుకోగలను అనుకొనుట, తాను చేయు కర్మలు తనకొరకు అనుకొనుట. ఈ మూడింటిని జయించుటయే విరోధి విజయము. గుమ్మమునకు గల నాలుగు కమ్ములలో హనుమ పై కమ్ముపై నిలిచి యుండును. అదియే తోరణమునకు చిహ్నము. ఆ

తర్వాత యుద్ధమునకు వచ్చిన ప్రహస్తుని కుమారుడైన జంబుమాలినిని, మంత్రి సుతులైన ఏడుగురిని, విరూపాక్ష, యూపాక్ష, దుర్ధర, ప్రఘసు, భాసకర్ణి మొదలగు సేనాగ్ర నాయకులను వారి వారి సైన్యముతో సహా సంహరించెను. అప్పుడు రావణుని ఆజ్ఞ మేరకు అక్షకుమారుడు యుద్ధమునకు బయలుదేరెను. అక్షకుమారునికి హనుమను చూడగానే అతనిపై గౌరవమేర్పడెను. అప్పుడు అతను హనుమ వేగమును, బలమును, పరాక్రమమును నిర్ధారించుకొని హనుమతో యుద్ధమునకు పూనుకొనెను. మహాపరాక్రమముతో పోరాడుతున్న బాలుడైన ఆ అక్షకుమారుడిపై జాలిగల్గినా, శత్రువుపై జాలి గూడదని తలచి, హనుమ అతని పాదములు పట్టుకొని గరుత్మంతుడు పామును కొట్టినట్లు, ఆ అక్షకుమారుడిని పలుమార్లు నేలకేసి కొట్టి చంపెను.

## 5.19 ఇంద్రజిత్తు హనుమల యుద్ధము-హనుమ బ్రహ్మాస్త్రముచే బంధింపబడుట

తరువాత రావణుడు మహాబలశాలి, ఇంద్రుని జయించిన తన కుమారుడైన ఇంద్రజిత్తును పిలిచి దేశకాల విభాగము నెరిగి వివేకముతో నీ అస్త్రబలము, తపోబలముతో విజయము పొందుము అని చెప్పి పంపెను. మహావీరుడగు ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చి హనుమపై అనేకమైన తీక్షణమైన బాణములను తీవ్ర వేగముతో పుంఖాను పుంఖాలుగా వదిలెను. హనుమ తనకు ఆ బాణములు తగులకుండా అతివేగముతో వాటి మధ్య తిరిగెను. వీరిద్దరి మధ్య యుద్ధము భయంకరముగా కొనసాగెను. హనుమను కొట్టుటకు ఇంద్రజిత్తునకు అవకాశము లభించుట లేదు. ఇంద్రజిత్తును కొట్టుటకు హనుమకు అవకాశము లభించుటలేదు. అంత ఇంద్రజిత్తు ఈ హనుమ అవధ్యుడు గా తోస్తున్నది అని అలోచించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. తేన బద్ధ స్తతోఽస్త్రేణ రాక్షసేన స వానరః, అభవన్ నిర్విచేష్ట శ్చ పపాత చ మహీ తలే (ఆ బ్రహ్మాస్త్రమునకు

కట్టుబడిన వాడై హనుమ నిశ్చేష్టుడై భూమిపై పడిపోయెను. కానీ బ్రహ్మ వర ప్రభావము వలన ఆ అస్త్ర ప్రభావము క్షణకాలంలో తొలగిపోయెను. అయినను బ్రహ్మకు తనపై అనుగ్రహమునకు గుర్తుగా మిన్నకుండిపోయెను. ఇందువలన తనకు రావణునితో మాట్లాడే అవకాశము వచ్చునని తలచెను. అంతట అక్కడి రాక్షసులు హనుమను జనపనార త్రాళ్లచేత, వల్కములచేత బంధితుని చేసి రావణుని సముఖమునకు తోడ్కొని పోయిరి. అప్పుడు రాజసభలోని మంత్రులు హనుమను తన రాకకు గల కారసనమేమని అడుగగా, హనుమ తాను సుగ్రీవుని దూతగా వచ్చినానని చెప్పెను.

**నోట్: పూజశ్రీ శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు వారు సుందరాకాండలోని ఈ 48 వ సర్గ పారాయణము చేసినచో శనిగ్రహ దోషము  శమించునని చెప్పియున్నారు.**

**5.20 హనుమ రావణునికి హితమును ఉపదేశించుట**

భీమ పరాక్రముడగు హనుమ రోషముచే ఎర్రబారిన కన్నులతో రావణుని చూచెను. హనుమ అతని తేజస్సుచే మోహము నొందెను.

**అహో రూప మఽహో ధైర్య మఽహో సత్త్వ మఽహో ద్యుతిః**
**అహో రాక్షస రాజస్య సర్వ లక్షణ యుక్తతా**
**య ద్యఽధర్మో న బలవాన్ స్యా దఽయం రాక్షసేశ్వరః**
**స్యా దఽయం సుర లోకస్య సశక్ర స్యాఽపి రక్షితా**

ఆహా! ఏమి రూపము? ఏమి ధైర్యము? ఏమి బలము? ఏమి కాంతి? సర్వ లక్షణములతో ఒప్పుతున్న ఈ రాక్షస రాజు అధర్మవర్తి గాకున్నచో మూడులోకములకు పాలకుడై యుండెడివాడు. అలానే హనుమను చూచి రావణుడు ఇతను మారు రూపమున వచ్చిన నందీశ్వరుడా! లేక బాణాసురుడా! అని అనుకొని అక్కడి మంత్రులతో "ఈతను ఎవరు, ఎచ్చట నుండి వచ్చాడు, ఏమి పని, వనమును పాడు చేయుటకు ఏమి హేతువు, యుద్ధము చేయుట

వలన ఏమి ప్రయోజనము తెలుసుకొనుము" అనెను. అప్పుడు ప్రహస్తుడు హనుమతో తను రాకకు కారణమడిగెను. కాని హనుమ తాను సమాధానము చెప్పుటకు ప్రహస్తుడు తగడని అనుకొని రావణునితోనే, రామ సందేశమును చెప్పుటకు ఉద్యుక్తుడాయెను. హనుమ రావణునితో "నేను వానరుడిని. నీ దర్శనము దుర్లభమని, నీ దర్శనము కొరకై వనమును పాడు చేసితిని. యుద్ధము చేయుటకు రాక్షసులు రాగా దేహ రక్షణకై వారిని ఎదిరించి యుద్ధము చేసితిని. బ్రహ్మ వర ప్రభావము వలన నన్ను ఎట్టి అస్త్రములు బంధించలేవు. నిన్ను చూడవలెనని కోరికతో బ్రహ్మాస్త్రమునకు కట్టుబడితిని. రాజ కార్యముచే, రాముని దూతగా నీ వద్దకు వచ్చితిని. నీకు మేలు కల్గించు కొన్ని మాటలు చెప్పెదను వినుము" అనెను. మహాబలుడగు రావణుని చూచి ఎట్టి తొట్రుబాటు లేక అర్థవంతములగు వాక్యములతో వానరోత్తముడు దశాననుని గూర్చి ఇట్లు పల్కెను.

**రాజా దశరథో నామ రథ కుంజర వాజిమాన్**
**పితేవ బన్ధు ర్లోక స్య సురేశ్వర సమ ద్యుతిః**
**జ్యేష్ఠ స్తస్య మహా బాహుః పుత్రః ప్రియ కరః ప్రభుః**
**పితు ర్నిదేశా న్నిష్క్రాన్తః ప్రవిష్టో దణ్డకా వనమ్**
**లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చాఽపి భార్యయా**
**రామో నామ మహాతేజా ధర్మ్యం పన్థాన మాఽఽశ్రితః**
**తస్య భార్యా వనే నష్టా సీతా పతిమ్ అనువ్రతా**
**వైదేహ స్య సుతా రాజ్ఞో జనక స్య మహాత్మనః**
**స మార్గమాణ స్తాం దేవీం రాజపుత్రః సహాఽనుజః**
**ఋశ్యమూక మఽనుప్రాప్త స్సుగ్రీవేణ సమాగత:**
**తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్**

సుగ్రీవ స్యాఽపి రామేణ హరి రాజ్యం నివేదితమ్
తత స్తేన మృధే హత్వా రాజ పుత్రేణ వాలినమ్
సుగ్రీవః స్థాపితో రాజ్యే హర్యృక్షాణాం గణేశ్వరః
త్వయా విజ్ఞాత పూర్వ శ్చ వాలీ వానర పుంగవ:
రామేణ నిహత స్సంఖ్యే శరే ణైకేన వానర:
స సీతా మార్గణే వ్యగ్రః సుగ్రీవః సత్య సంగరః
హరీన్ సంప్రేషయా మాస దిశ స్సర్వా హరీశ్వరః
తాం హరీణాం సహస్రాణి శతాని నియుతాని చ
దిక్షు సర్వాసు మార్గన్తే హ్యఽధ శ్చోపరి చాఽమ్బరే
వైనతేయ సమాః కేచిత్ కేచిత్ తత్రాఽనిలోపమాః
అసంగ గతయః శీఘ్రా హరి వీరా మహా బలాః
అహం తు హనుమాన్ నామ మారుత స్యౌరసః సుతః
సీతాయా స్తు కృతే తూర్ణం శత యోజన మాఽఽయతమ్
సముద్రం లంఘయి త్వైవ తాం దిదృక్షు రిహాఽఽగతః
భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాఽఽత్మజా
త ద్భవాన్ దృష్ట ధర్మాఽర్థ స్తపః కృత పరిగ్రహః
పర దారా న్మహా ప్రాజ్ఞ నోపరోద్ధుం త్వ మఽర్హసి
న హి ధర్మ విరుద్ధేషు బహ్వాఽపాయేషు కర్మసు
మూల ఘాతిషు సజ్జన్తే బుద్ధిమన్తో భవ ద్విధాః
క శ్చ లక్ష్మణ ముక్తానాం రామ కోపాఽనువర్తినామ్
శరాణా మఽగ్రతః స్థాతుం శక్తో దేవాఽసురే ష్వఽపి
న చాఽపి త్రిషు లోకేషు రాజన్ విద్యేత కశ్చన
రాఘవ స్య వ్యళీకం యః కృత్వా సుఖ మఽవాప్నుయాత్
త త్త్రికాల హితం వాక్యం ధర్మ్య మఽర్థాఽనుబన్ధి చ

మన్యస్వ నర దేవాయ జానకీ ప్రతిదీయతామ్
దృష్టా హీయం మయా దేవి లబ్ధం య దిహ దుర్లభమ్
ఉత్తరం కర్మ య చ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః
లక్షి తేయం మయా సీతా తథా శోక పరాయణా
గృహ్య యాం నాఽభిజానాఽసి పంచాఽఽస్యా మివ పన్నగీమ్
నేయం జరయితుం శక్యా సాఽసురై రఽమరై రఽపి
విష సంసృష్ట మఽత్యర్థం భుక్త మఽన్న మివౌజసా
తప స్సంతాప లబ్ధ స్తే యోఽయం ధర్మ పరిగ్రహః
న స నాశయితుం న్యాయ్య ఆత్మ ప్రాణ పరిగ్రహః
అ వధ్యతాం తపోభి ర్యాం భవాన్ సమఽనుపశ్యతి
ఆత్మన స్సాఽసురై ర్దేవై ర్హేతు స్తత్రాఽప్యఽయం మహాన్
సుగ్రీవో న హి దేవోఽయం నాఽసురో న చ మానుషః
న దానవో న గన్ధర్వో న యక్షో న చ పన్నగః
తస్మాత్ ప్రాణ పరిత్రాణం కథం రాజన్ కరిష్యసి
న తు ధర్మోపసంహారమ్ అ ధర్మ ఫల సంహితమ్
త దేవ ఫలమ్ అన్వేతి ధర్మ శ్చాఽధర్మ నాశనః
ప్రాప్తం ధర్మ ఫలం తావ ద్భవతా నాఽత్ర సంశయః
ఫల మఽస్యాఽప్యఽధర్మ స్య క్షిప్ర మేవ ప్రపత్స్యసే
జనస్థాన వధం బుద్ధ్వా బుద్ధ్వా వాలి వధం తథా
రామ సుగ్రీవ సఖ్యం చ బుధ్యస్వ హిత మాత్మనః
కామం ఖల్వఽహ మఽప్యేకః సవాజి రథ కుంజరామ్
లంకాం నాశయితుం శక్త స్త స్యైష తు న నిశ్చయః
రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్ష గణ సన్నిధౌ

ఉత్సాదన మఽమిత్రాణాం సీతా యై స్తు ప్రధర్షితా
అపకుర్వ న్హి రామ స్య సాక్షా దఽపి పురందరః
న సుఖం ప్రాప్నుయా దఽన్యః కిం పున స్త్వ ద్విధో జనః
యాం సీతే త్యఽభిజానాసి యే యం తిష్ఠతి తే వశే
కాళ రాత్రీతి తాం విద్ధి సర్వ లంకా వినాశినీమ్
త దఽలం కాల పాశేన సీతా విగ్రహ రూపిణా
స్వయం స్కన్ధాఽవ సక్తేన క్షమ మాఽత్మని చిన్త్యతామ్
సీతాయా స్తేజసా దగ్ధాం రామ కోప ప్రపీడితామ్
దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్ట ప్రతోళికామ్
స్వాని మిత్రాణి మంత్రీం శ్చ జ్ఞాతీన్ భ్రాతౄన్ సుతాన్ హితాన్
భోగాన్ దారాం శ్చ లంకాం చ మా వినాశ ముపాఽఽనయ
సత్యం రాక్షస రాజేంద్ర శృణుష్వ వచనం మమ
రామ దాసస్య దూతస్య వానరస్య విశేషత:
సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ సచరాఽచరాన్
పున రేవ తథా స్రష్టుం శక్తో రామో మహా యశా:
దేవాఽసుర నరేన్ద్రేషు యక్ష రక్షో గణేషు చ
విద్యాధరేషు సర్వేషు గంధర్వే షూ రగేషు చ
సిద్ధేషు కిన్న రేంద్రేషు పతత్రిషు చ సర్వత:
సర్వ భూతేషు సర్వత్ర సర్వ కాలేషు నాఽస్తి స:
యో రామం ప్రతి యుద్ధేత విష్ణు తుల్య పరాక్రమం
సర్వ లోకేశ్వర స్యైవం కృత్వా విప్రియ ముత్తమం
రామ స్య రాజ సింహ స్య దుర్లభం తవ జీవితం
దేవా శ్చ దైత్యా శ్చ నిశాచరేంద్ర
గాంధర్వ విద్యాధర నాగ యక్షా:

**రామ స్య లోక త్రయ నాయక స్య**
**స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే**
**బ్రహ్మా స్వయంభూ శ్చతురాఽఽననో వా**
**రుద్ర స్త్రిణేత్ర స్త్రిపురాఽన్తకోవా**
**ఇంద్రో మహేంద్ర స్సుర నాయకో వా**
**త్రాతుం న శక్తా యుధి రామ వధ్యం**
**స సౌష్ఠ వోపేత మఽదీన వాదినః**
**కపే ర్నిశమ్యాఽప్రతిమోఽప్రియం వచః**
**దశాఽఽననః కోప వివృత్త లోచనః**
**సమాఽఽదిశ త్తస్య వధం మహా కపేః**

(సుందర కాండ 51 సర్గ)

మహాతేజశాలి అయిన రథాశ్వగజ బలములు గల దశరథుడు అను రాజు గలడు. సర్వసమర్థుడు, మహాపరాక్రమోపేతుడు, ధర్మానుమార్గానువర్తుడు అగు శ్రీరాముడు అతని పెద్దకొడుకు. తండ్రి ఆజ్ఞానుసారం అతను సోదరుడైన లక్ష్మణుడు. భార్యయైన సీతతో కలసి దండకారణ్యమున ప్రవేశించెను. మహాసాధ్వి అయిన, అతని భార్య అపహరింపబడినది. రామలక్ష్మణులు సీతను వెతుకుచు ఋష్యమూక పర్వతమున ఉన్న సుగ్రీవునితో మైత్రిని చేసుకొని వాలిని ఒకే ఒక్క బాణముతో సంహరించి సుగ్రీవుని వానర, భల్లూకములకు ప్రభువుగా నియమించెను. సుగ్రీవుని ఆనతితో అశేష వానర సేనాని సకల దిశల యందును, భూమండలం నందును, పాతాళమున, ఆకాశమున వెతుకుతున్నారు. వారు మహాపరాక్రములు, అడ్డులేని గమనము గలవారు. నా పేరు వాయు పుత్రుడనైన హనుమంతుడు. సీతాదేవి కొరకై తీవ్రవేగముతో నూరు యోజనముల సముద్రమును లంఘించి లంకకు వచ్చితిని. ఇచ్చట నాకు ఆమె కనబడినది.

ధర్మార్థములను ఎరిగిన వాడివి. తపస్సుచేసి అనేక వరములు పొందిన వాడివి. అట్టి నీవు ధర్మవిరుద్ధముగా నీ మూలమునకే విచ్ఛిత్తి కలుగు పరసతులను బంధించుట తగదు. రామలక్ష్మణుల తీవ్ర బాణములకు ఎదురొడ్డి నిలబడుట ఎవ్వరికిని సాధ్యము కాదు. ముల్లోకములలోను రామునికి కీడు తలబెట్టినవారిని ఎవ్వరు రక్షింపలేరు. అందువలన ధర్మబద్ధముగా జానకిని శ్రీరామునికి అప్పచెప్పుము. సీత నీ పాలిట మృత్యుదేవత సుమా! నీ తపస్సు చేజేతులారా వ్యర్థము చేసుకొనుట ఉచితము కాదు. సుగ్రీవుడు కపీశ్వరుడు, శ్రీరాముడు మానవుడు. నీవు నరవానరుల వలన మరణము లేకుండా వరమును పొందలేదు కావున నిన్ను నీవు రక్షించుకోం జాలవు. ధర్మము, అధర్మము ఎప్పుడును కలసి యుండవు. ధర్మకార్యము వలన అధర్మ కార్యము నశించదు[19]. ఖరదూషణాదుల వధను, వాలి వధను రామసుగ్రీవుల మైత్రిని గుర్తుచేసుకొని నీ హితమును గూర్చి బాగుగా ఆలోచించుము. నేనొక్కడినే నీ లంకను సర్వ నాశనము చేయుటకు సమర్థుడను. కాని నాకు శ్రీరాముని అనుమతి లేదు. సీతాదేవి తేజస్సుతో దగ్ధమైన ఈ లంకా నగరమును చూసి ఇప్పటికైనా తెలివి తెచ్చుకొనుము. సకళత్ర, పుత్ర, మిత్ర, బాంధవ్యుల వినాశనమును కోరి తెచ్చుకొనకుము. నేను రామదూతను. విశేషించి వానరుడను కావున నాకు ఎట్టి పక్షపాతము లేదు. నా సత్య వచనమును ఆలకింపుము. శ్రీరాముడు రుద్రుని వలె సకల లోకములను సంహరించ గలడు మరల సృష్టించ గలడు. శ్రీరాముని ఎదిరించి యుద్ధము చేయుటకు ఏ విధముగానైనను, ఎవ్వరైనను, ఎచ్చటనైనను, ఏ కాలము నందును సమర్థులు కారు. శ్రీరాముని యెడల అపరాధమును జేసిన నీవు జీవించి యుండుట అసాధ్యము. ఈ విధముగా

---

[19] "ఆవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభామ్" అను ఆర్యోక్తి అనుసరించి జనులు పాపకర్మముల నివృత్తి కొరకై కొన్ని దాన ధర్మములు చేయుచుందురు. కాని అట్లు జరుగదు. అనన్య భక్తితో భగవంతుని సేవించిన మాత్రముననే వారు పాప ప్రవృత్తి నుండి బయిట పడుదురు.

హనుమ నిర్భయముగా సహేతుకములైన మాటలు మాట్లాడెను. అప్రియములైన ఆ హితవచనములు వినిన రావణుడు హనుమను చంపుటకు ఆదేశించెను.

**5.21 దూతను వధింప తగదు అని విభీషణుడు రావణునికి హితము చెప్పుట**

రాక్షస రాజైన రావణుడు తలపెట్టిన దూతను సంహరించుట అనే ఇట్టి కార్యమును నివారించుటకై అంతఃశత్రువులను జయించిన వాడు, కర్తవ్య-అకర్తవ్య నిశ్చయము కలవాడు అయిన విభీషణుడు వినమ్రుడై హితకరములైన వచనములు ఇట్లు పలికెను.

**రాజధర్మ విరుద్ధం చ లోక వృత్తే శ్చ గర్హితమ్**
**తవ చాఽసదృశం వీర కపే రఽస్య ప్రమాపణమ్**
**ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ రాజ ధర్మ విశారదః**
**పరావరజ్ఞో భూతానాం త్వ మేవ పరమాఽర్థవిత్**
**గృహ్యన్తే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః**
**తత శ్శాస్త్ర విపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలం**
**తస్మా త్ప్రసీద శత్రుఘ్న రాక్షసేంద్ర దురాసద**
**యుక్తాఽయుక్తమ్ వినిశ్చిత్య దూత దండో విధీయతాం**

"రాక్షసేంద్రా! కోపమును వీడి ప్రసన్నుడవు కమ్ము. చేయదగినది, చేయరానిది ఎరిగిన ప్రభువులు దూతను సంహరించరు. అది రాజ ధర్మమునకు విరుద్ధము. లోకపు తీరులో వింద్యము. నీ వంటి వారు చేయుట తగనిది. అన్నియు తెలిసినవాడవు. పరమార్ధవేత్తవు. నీ వంటి విద్వాంసులు కోపమునకు లొంగరాదు. కావున యుక్తాయుక్తములు ఆలోచించి తగిన దండన విధింపుము". అనెను. రావణుడు విభీషణుని మాటలను విని మిక్కిలి రోషావేషముతో **"న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన"** - పాపాత్ములను చంపుటలో పాపము లేదు కాన

ఈ వానరుని చంపెదను అనెను. అందుకు విభీషణుడు వినమ్రతతో "రాక్షసేశ్వరా! అన్ని దేశములలో, అన్ని జాతులలో దూతలను చంపకూడదని చెప్పుదురు. ఈతను దూతయే కాదు, అక్షకుమారుడు మున్నగువారిని సంహరించుటచే ఈతను శత్రువు. అందుకు సందేహము లేదు. కాని దూతను చంపుట ఆచారము కాదు కావున దూతకు అనేకమైన శిక్షలు విధించవచ్చు. **వైరూప్య మఙ్గేషు కశాఽభి ఘాతో, మౌణ్డ్యం తథా లక్షణ సన్నిపాతః, ఏతాన్ హి దూతే ప్రవదన్తి దణ్డాన్ వధ స్తు దూత స్య న నః శ్రుతోఽపి** - అంగములకు హాని కలిగింప వచ్చును. కొరడాలతో కొట్టించ వచ్చు. జుట్టు గొరిగించ వచ్చు. శరీరముపై వాతలు వేయ వచ్చు. దూత వధ కాకుండా ఈ విధమైన ఏవైనా శిక్షలు విధించవచ్చు. ధర్మార్థములు తెలిసిన వాడివి కావున ఈ కోతిని కాకుండా, ఇట్టి కోతిని పంపిన వాడిని చంపుట యుక్తము. ఈ కోతిని చంపినచో వేరొకడు నూరు యోజనముల సముద్రమును దాటి ఇచ్చటకు రాలేరు, యుద్ధమునకు ఉత్సాహపడుతున్న ఇతనిని పంపిన వారితో యుద్ధము చేయు అవకాశము పోవును" అనెను. అందుకు రావణుడు దేశకాలోచితముగా అలోచించి, కోతులకు తోక ప్రియము కావున దానిని కాల్చివేయుదు అని ఆజ్ఞాపించెను.

**5.22 లంకా దహనము**

రావణుని ఆదేశము కాగానే రాక్షసులు నూలు బట్టలను హనుమ తోకకు చుట్టి నూనెతో తడిపి నిప్పంటించితిరి. అప్పుడు వారు హనుమను పట్టణము అంతయు త్రిప్పిరి. హనుమ - రాత్రిళ్ళు తిరిగి నందు వలన దుర్గములను బాగుగా చూడలేదు. మరొకసారి అన్నియు చూచి వీరి బలమును, బలగములను అంచనా వేయుదునని అలోచించి మిన్నకుండెను. ఈ విషయము తెలుసుకొన్న సీత హనుమకు మంగళము కలుగ వలెనని అగ్నిహోత్రుని ఈ విధముగా ఉపాశించెను.

**యద్యఽస్తి పతి శుశ్రూషా యద్యఽస్తి చరితం తపః**

**యది చా స్త్యేక పత్నీ త్వం శీతో భవ హనూమతః**

**యది కించి దఽనుక్రోశ స్తస్య మయ్యఽస్తి ధీమతః**
**యది వా భాగ్య శేషో మే శీతో భవ హనూమతః**
**యది మాం వృత్త సంపన్నాం త త్సమాగమ లాలసామ్**
**స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః**
**యది మాం తారయే దాఽర్యః సుగ్రీవః సత్య సంగరః**
**అస్మా ద్దుఃఖాంబు సంరోధా చ్ఛీతో భవ హనూమతః**

"నేనే పతి శుశ్రూష చేసిన దానినైనచో, నేను ఆచరించిన తపము యున్నచో, పతివ్రతను అయినచో, నా యందు రామచంద్రునకు దయ యున్నచో, నాకేమైనా భాగ్య శేషము యున్నచో, హనుమ నా పాతివ్రత్యమును గుర్తించిన వాడే అయినచో, నన్ను రామునితో కలుపు వలెనని ఆరాట పడుచున్నచో, సత్యవ్రతుడు, పూజ్యుడు అగు సుగ్రీవుడు నన్నీ దుఃఖము నుండి తరింప జేయువాడైనచో ఓ అగ్నిదేవా! ఈ హనుమను చల్లగా చూడుము". అని ప్రార్థించెను. అప్పుడు హనుమ లాంగూలము దహింపబడుచున్నను బాధ కలుగకపోవుట గమనించి హనుమ ఇట్లు ఆలోచింపసాగెను. "సీతమ్మకు నాపై గల జాలి, రాముని తేజస్సు, మా తండ్రి వాయుదేవునికి అగ్నితో గల స్నేహము వలన నన్ను అగ్ని దహించడము లేదు". వెంటనే హనుమ ఒక్కసారి గర్జించి పైకి లేచి అక్కడి దుర్గములు, భవనములు, మొదలగునవి అన్నియు దహించి వేసెను. వేగముగల హనుమ లంకాపురము నంతయును రుద్రుడు త్రిపురములను భస్మము చేసినట్లు భస్మము చేసెను. ఈ విధముగా అనేకులగు రాక్షసులను చంపి, వనమును పాడు చేసి, రాక్షస భవనములను అగ్నికి ఆహుతి చేసి, మనసులో శ్రీరాముని స్మరించి నిలిచెను.

## 5.23 సీతను గూర్చి హనుమ చింతించుట

లంకయంతయును కాల్చి ఆ లోక యందలి నిప్పును హనుమ సముద్రములో చల్లార్చెను. కొండమీద నుండి జ్వలించుతున్న లంకా పట్టణమును చూచి హనుమ ఇట్లనుకొనెను. అయ్యో! ఈ లంకను కాల్చి నేను ఎంత తప్పు చేసితినో! కోపము ఓడలు తెలియకుండా చేసినది.

**ధన్యా స్తే పురుష శ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముత్థితమ్**
**నిరున్ధన్తి మహాత్మానో దీప్తమ్ అగ్నిమ్ ఇవాఽమ్భసా**
**కృద్ధః పాపం న కుర్యా త్కః క్రుద్ధో హన్యా ద్గురూ నఽపి**
**కృద్ధః పరుషయా వాచా నర స్సాధూన్ అధిక్షిపేత్**
**వాచ్యాఽవాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్**
**నాఽకార్య మఽస్తి కృద్ధ స్య నాఽవాచ్యం విద్యతే క్వచిత్**
**య స్సముత్పతితం క్రోధం క్షమ యైవ నిరస్యతి**
**యథో రోగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే**

వచ్చిన కోపమును బుద్ధితో, నీటితో నిప్పును చల్లార్చినట్లు ఎవరు నిరోధించుకొందురో వారు ధన్యులు, పురుష శ్రేష్ఠులు. కోపము గలవారు ఎవడు పాపము చేయకుండును? కోపము వచ్చిన వాడు గురువులనైనను చంపును. కోపము వచ్చినవాడు పరుషమైన వాక్కులతో పెద్దలను ఆక్షేపించును. కోపము గలిగిన వానికి అనదగిన మాట, అనకూడని మాట తెలియవు. కోపము గలవానికి చేయకూడని పని యుండదు. వచ్చిన కోపమును ఓరిమిచే, పాము జీర్ణమైన చర్మమును (కుబుసము) విడుచునట్లు క్షణికోద్రేకములో వచ్చిన పిచ్చి కోపము సైతము ఓర్పుతో అణచుకొనువాడే యథార్థముగా పురుషుడు[20]. దుర్బుద్ధిని,

---

[20] ఈ సందర్భమున వాల్మీకి మహర్షి హనుమ ద్వారా "కోపాతిరేకమునకు గురియైనవాడు ఎట్టి అనర్థములకు పాల్పడుదురో తెల్పుచు ఎవ్వరును కోపమునకు లోనుకారాదు" అని లోకమునకు చక్కటి సందేశమును

సిగ్గులేనివాడను, పాపాత్ముడను. ఛీ! ఆలోచించకుండా సీతమ్మకు కూడా నిప్పు పెట్టితిని. స్వామి ద్రోహమునకు పాల్పడితిని. సీతమ్మ కూడా తప్పక కాలియే యుండును. అట్లే అయినచో అజ్ఞానుడగు నాచే స్వామి కార్యము నాశనము అయినది. లంకను దహించుతూ సీతమ్మను కాపాడలేక పోయితిని. కార్యము అంతయు పూర్తి అయి కొంచెము మిగిలి యుండగానే ఇంత అనర్థము సంభవించినది. కోతుల చాపల్యమును చూపితిని. సీతమ్మను రక్షింప గలిగి యుండి కూడా రజోగుణముచే ఆగ్రహము వలన రక్షింప లేక పోతిని. సీత నశించినచో రామలక్ష్మణులతో సహా మొత్తము ఇక్ష్వాకు వంశము, సుగ్రీవునితో సహా మొత్తము వానర భల్లూకములు నశింతురు. కోపముచే కార్యము మూల నాశనము చేసితిని. అని పరి పరి విధముల హనుమ దుఃఖించుతూ ప్రాణత్యాగమునకు సిద్ధపడెను. అప్పుడు హనుమకు శుభ శకునములు కనబడెను. అప్పుడు హనుమ సీతా దేవి యొక్క తేజస్సుచే తాను రక్షింపబడినప్పుడు సీతను అగ్ని ఎట్లు దహించగలదు? ఈ విధముగా హనుమ చింతించు చుండగా ఆకాశముంచారణులు ఈ విధముగా పలుకుతున్నారు.

**దగ్ధేయం నగరీ లంకా సాట్ట ప్రాకార తోరణా**

**జానకీ న చ దగ్ధేతి విస్మయోఽద్భుత ఏవ నః**

"కోటబురుజులు, ప్రాకారములు, తోరణములతో సహా లంకా నగరమంతయు దగ్ధమైనది కానీ సీత మాత్రము దగ్ధము కాలేదు" ఇది ఎంతయో ఆశ్చర్యకరం. అమృత తుల్యమైన ఈ మాటలు వినినంతనే హనుమ ఆనందములో స్వస్థత

---

ఇచ్చుచున్నాడు. సుమతికారుడు కూడా ఇదే విషయమును చెప్పెను (తన కోపమే తన శత్రువు, తన శాంతమె తనకు రక్ష దయ చుట్టంబౌ, తన సంతోషమె స్వర్గము, తన ధుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!)

చెంది సీతమ్మను మరల ఒక్కమారు దర్శించి తిరుగు ప్రయాణము చేయుటకు నిశ్చయించుకొనెను.

**5.24 హనుమ మరల సీతను దర్శించి సముద్ర లంఘనము చేయుట**

**తత స్తు శింశుపామూలే జానకీం పర్యవస్థితామ్**
**అభివా ద్యాఽబ్రవీ ద్దిష్ట్యా పశ్యామి త్వా మిహాక్షతామ్**

సుఖముగా యున్న సీతమ్మను చూచుటకు హనుమ మరల అశోక వనమునకు యేగి సీతతో "అమ్మా! అదృష్టవశమున నిన్ను మరల చూడగలిగితిని". అని తిరుగు ప్రయాణమునకు సంసిద్ధుడాయెను. అప్పుడు సీత, హనుమతో "నీ బలము ప్రశంశనీయము. శ్రీరాముని పరాక్రమమునకు అనురూపమగు విధముగా నీవే కార్యమును సాధించవలెను". అని హనుమను ప్రేమపూర్వకంగా సాగనంపెను. ఇక్కడ హనుమ ఆచార్యుడుగా సీతారాముల సయోధ్యకు యత్నించెను. సాధకుడు కర్మయోగముచే పరిశుద్ధమైన అంతఃకరణము గలవాడై ఆత్మావలోకనం నొనర్చి విషయములను, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని కామమును జయించి భగవత్ ప్రాప్తికై అభిముఖుడై ఎగుర ఇందు స్ఫురించును. తరువాత హనుమ శ్రీరామ దర్శనాభిలాషయై అరిష్టమనెడి పర్వతమును అధిరోహించి, శరీరమును పెంచి ఉత్తరాభిముఖుడై ఆకాశముపైకి ఎగిరెను. ఆ వానరోత్తముడు అంగద జాంబవంతాదులు యున్న మహేంద్ర పర్వతము సమీపించుచుండగా గంభీర నాదము చేసెను. అప్పుడు అక్కడ యున్న వానర సమూహము అంతయు హనుమ కార్యము సాధించాడని ఆనందముతో గంతులు వేసిరి. హనుమ వారి వద్దకు వచ్చి దృష్టా సీతా (సీత చూడబడెను) అని సంగ్రహముగా నివేదించెను. తరువాత నెమ్మదిగా హనుమ, అంగద జాంబవంతాదులకు తాను సముద్ర లంఘనము నుంచి సీత కొరకై రావణ భవనములలో అన్వేషణము, రావణాసురుడు కర్కశముగా సీతకు రెండు నెలల గడువు ఒసంగుట, త్రిజటా స్వప్నము, తాను సీతను ఊరడించుట, తాను రావణునికి రామసుగ్రీవుల

సందేశము వినిపించి అతనికి మంచి మాటలు చెప్పుట, లంకా దహనము మొదలగు విషయములన్ని వివరముగా చెప్పి, సీత శోక పరాయణయై యున్నది కావున తదుపరి కర్తవ్యము గురించి రాముని ఆలోచన మేరకు మీరందరు ఆలోచన చేయమని కోరతాడు. సీత జాడ తెలిసినది అనే సంతోషముతో ఆ వానర సమూహము అంతయు కిష్కింధకు వెళ్లి సుగ్రీవునకు ప్రీతిపాత్రమైన మధువనమున ప్రవేశించారు. అందుకు కినుక వహించిన ఆ వనపాలకుడైన దధిముఖుడు రామలక్ష్మణులతో యున్న సుగ్రీవునకు ఈ వృత్తాంతమును తెలియ చేసెను. అందుకు వానర రాజైన సుగ్రీవుడు వారు సీతమ్మను దర్శించి యుండవచ్చును అందు ముఖ్యముగా హనుమయే కార్యసాధకుడు అని తలచి వేగముగా వారిని తోడ్కొని రమ్మని ఆజ్ఞాపించెను. అంత దధిముఖుడు రాజాజ్ఞను అంగదునకు నివేదించెను. వెంటనే హనుమ సాధించిన కార్యముచే గర్వించి, గర్జించుతూ వానరులు రామలక్ష్మణ సుగ్రీవుల కడకు వచ్చిరి. మహాబాహుడగు హనుమ శిరసు వంచి రామునకు నమస్కరించి **"హనూమాం శ్చ మహా బహూః ప్రణమ్య శిరసా తతః, నియతా మఒక్షతాం దేవీం రాఘువాయ న్యవేదయత్, దృష్టా దేవీతి హనుమద్వద నాధామృతోపమమ్** ("నియమశీలయై సీతమ్మ సుఖముగా యున్నది") అని నివేదించెను. అమృత తుల్యమైన ఆ వాక్కులకు రామలక్ష్మణులు పరమానంద భరితులైరి.

### 5.25 హనుమ సీత దేవి సమాచారమును శ్రీరామునకు చెప్పుట

వానరులు అంగదుని ముందుంచుకొని సీతమ్మ రావణాంతఃపురములో నిర్బంధించబడి యుండుటయు, రాక్షస స్త్రీలచే భయపెట్టుచుండుట, సీతమ్మకు రాముని యందు అనురాగము, రావణుడు ఆమెకు రెండు నెలల గడువు ఇచ్చుట మున్నగు విషయములు రామునికి తెలిపి సీత కుశలముగా యున్నదని చెప్పిరి.

అప్పుడు రాముడు సీత విషయమై సవిస్తరంగా చెప్పవలసినదిగా కోరగా, హనుమ సీత యున్న దిక్కుకు నమస్కరించి ఇట్లు చెప్పుట ప్రారంభించెను.
"సముద్రమునకు దక్షిణ తటమున దురాత్ముడైన రాక్షస రాజు రావణుని లంకా నగరము కలదు. నేను నూరు యోజనముల సముద్రమును దాటి అట్టి లంకలో సీతమ్మను చూచుటకు బయిలుదేరితిని. అచట రామా! నీ యందే సర్వమును ఉంచుకొని జీవించుచున్న సీతమ్మను నేను చూచితిని. బహు దుఃఖమును పొంది యున్నది. రావణాంతఃపురమున నిరోధింపబడి రాక్షస స్త్రీలచే రక్షింపబడుచున్నది. ఒంటి జడ దాల్చి దీనురాలై నిన్నే ధ్యానించుతు నేలన పరుండి యున్నది. రావణాసురునుని పొందవలెనని కోరిక లేనిదై, భీతిల్లి మరణించుటకే నిశ్చయించుకొన్నది. అట్టి స్థితిలో నేను సీతను చూచితిని. ఇక్ష్వాకు వంశమును కీర్తించి ఆమెకు నాపై నమ్మకమును కల్గించుకొంటిని. తరువాత మాటలాడి జరిగిన విషయమును అంతయు తెలిపితిని. రామసుగ్రీవుల మైత్రికి ఎంతయో సంతోషించింది. చిత్రకూటమున జరిగిన కాకాసుర వృత్తాంతమును నీకు గురుతుగా చెప్పమన్నది. రామా! సీతమ్మ ఈ మణిని దాచి పదిలంగా నీకు ఈయమని చెప్పినది. మణిశిలల గంధముతో బొట్టు పెట్టిన సంగతి జ్ఞాపకము చేయమన్నది. ఒక మాసము గడిచిన తర్వాత జీవించి యుండను అని చెప్పి యున్నది. రామా! చూచిన దానిని చూచినట్లు వివరించితిని. సముద్రమును దాటుటకు ప్రయత్నము చేయుడు" అని చెప్పి చూడామణిని శ్రీరామునికి సమర్పించెను.
హనుమ తాను వెళ్లి వచ్చిన వృత్తాంతమును వానరులకు, రామునికి తెలియ జేసెను. అందు భేదము గుర్తించాలి. వానరులతో తన విజయములను వర్ణింపక సీతమ్మకు సంబంధించిన వృత్తాంతమును మాత్రమే చెప్పెను. రాముని వద్ద అహంకారము వ్యక్తము కాకుండా వినయముతో రామునికి ఆవశ్యకమగు

విషయమును మాత్రమే చెప్పెను. ఇది హనుమ యొక్క వినయమును, ఉచితజ్ఞతను సూచించు చున్నది.

శ్రీరాముడు ఆ మణిని హృదయమునకు హద్దుకొని సుగ్రీవునితో ఈ మణిని చూడగానే మా తండ్రియైన దశరథుడు, మామగారైన జనకుని చూచినట్లు యున్నది. ఈ మణిని సీత ధరించినప్పుడు ఆ మణి శోభలు ఇనుమడించెను. ఈ మణిని చూచి నేను ఆమెను పొందినట్లుగా భావించుచున్నాను. **"చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి, క్షణం సౌమ్య న జీవేయం వినా తా మఽసితేక్షణామ్"** సీతమ్మ నెలరోజులు బ్రతికినచో చాలా కాలము జీవించునన్నమాట. ఇక ఆమెను చూడక క్షణకాలం జీవింపలేను. హనుమా! ఆమె అన్న మాటలు యథార్థముగా చెప్పుము. రోగికి మందువలె ఆమె మాటలే నాకు జీవనము. **"మధురా మధురాఽఽలాపా కి మాఽఽహ మమ భామినీ, మ ద్విహీనా వరారోహా హనుమన్ కథయస్వ మే"** సీతమ్మ మధురము. ఆమె మాటలు మధురము. ఆమె మాటలు చెప్పుచున్న నీ మాటలు మధురము. ఇంకా సీతమ్మ ఏమనినదో చెప్పుము.

అప్పుడు హనుమ రామునితో, రామా! జానకీదేవి చిత్రకూటమిన జరిగిన కాకాసుర వృత్తాంతము యధాతథముగా నివేదించమన్నది. అస్త్రకోవిదులలో అగ్రగణ్యుడు, మహాబలశాలి అయినా శ్రీరాముడు నా విషయమున కనికరము యున్నచో వెంటనే రావణుని హతమార్చ వలెను. శత్రు భయంకరుడైనట్టి లక్ష్మణుడు అయినను నన్ను రక్షించుటకు ఏల వచ్చుట లేదు? వారు విస్మరించుటకు నాలో ఏమైనా దోషములు యుండవచ్చును. దిగులుగా యున్న సీతతో హనుమనైన నా వీపు ఎక్కినచో శీఘ్రముగా రామలక్ష్మణుల కడకు చేరుతును అని చెప్పాను. కానీ అది ధర్మము కాదని, కాలము ప్రతికూలమగుట వలన ఇదివరలో నిస్సహాయరాలునై రావణునితో తాకబడితిని అని చెప్పెను.

ఇంకను మీ కుశలం అడిగినది అని చెప్పెను. ఇంకను ఈ మహాసముద్రమును దాటుటకు గరుత్మంతునికి, వాయువుకు, హనుమనైన నాకు మాత్రమే సాధ్యము కావున తగు ఉపాయమును ఆలోచింపమన్నది. ఈ కార్యమును సాధించుటకు నీవు ఒక్కడివే చాలును. కానీ అందువలన శ్రీరాముని ప్రతిష్ట పెరగదు అనియు చెప్పెను. శ్రీరామునికి భయపడి వంచనతో రావణుడు నన్ను అపహరించెను. కానీ ఇప్పుడు రావణుని కన్నుగప్పి నన్ను తీసుకొనిపోవుటకు రాముడు ఇష్టపడడు, కావున రణరంగమున రావణుని హతమార్చి నన్ను తీసుకొని వెళ్ళుట శ్రేయస్కరము అనెను. అప్పుడు హనుమనైన నేను సుగ్రీవుని వానర భల్లూక సైనికులలో చాలా అల్పుడను. కావుననే నన్ను దూతగా పంపినారు. నాకన్నా బలవంతులు చాలా మంది కలరు అని చెప్పాను. కావున నీ శోకము త్వరలో తీరును అని అనునయించి వచ్చితిని.

## సుందర కాండ సమాప్తము.

## శ్రీరామ జయరామ జయజయ రామ

హనుమ పలికిన మంగళకరములగు వాక్కులచే సీతమ్మకు మనస్సున శాంతి లభించినట్లే ఈ కాండను చదివిన వారికి మనఃశాంతి, హన్మదనుగ్రహము లభించును. త్వరలో అయోధ్యలో రామునితో పట్టాభిషేకము నొందెదవని హనుమ సీతమ్మతో చెప్పుట చేతను, సీతమ్మ పాతివ్రత్యము చేతను, రావణుడు చనిపోయినాడు. రాముడు రావణుని చంపుటకు నిమిత్తమాత్రుడే అని హనుమ వానరులతో చెప్పుట చేతను రావణ వధ అయినట్లు సీతమ్మకు దుఃఖము తొలగి శాంతి లభించినట్లు భావించవలెను.

# 6.0 యుద్ధ కాండము

## 6.1 శ్రీరాముడు హనుమను ఆలింగనము చేసుకొనుట

హనుమ సముద్రమును దాటి సీతమ్మను చూచి, లంకను చెరచి మరల అనాయాసముగా వెనుకకు వచ్చి శ్రీరామునితో తన సాగర లంఘనమును, సీతాన్వేషణ వృత్తాంతమును యథాతథముగా వివరించాడు. నియమించిన కార్యమును చక్కగా నెరవేర్చుకొని వచ్చినప్పుడు ప్రభువు ఎట్లు ప్రవర్తించ వలెనో వాల్మీకి శ్రీరాముని ద్వారా లోకమునకు తెలియ చేయుచున్నాడు. గురువులను ప్రత్యక్షంగా స్తోత్రము చేయవలెను. మిత్రులను, బంధువులను పరోక్షంలో స్తుతించవలెను. దాసులను, భృత్యులను నియమించిన పని పూర్తి చేసిన వెంటనే ప్రశంసింప వలెను. పుత్రులను ఎన్నటికీ బైటికి ప్రశంసింప రాదు. మనసులోనే అభినందించు కొన వలెను. (ప్రస్తుతము తద్విరుద్ధముగా జరుగుట చూచుతున్నాము). ఈ నియమమును ఎరిగిన శ్రీరాముడు నియమించిన కార్యమును నెరవేర్చిన హనుమను సుగ్రీవుడు, వానరులు చూచుచుండగా ఇట్లు చెప్పు చున్నాడు.

**కృతం హనుమతా కార్యం సుమహ ద్భువి దుష్కరమ్**
**మనసాఽపి య దఽన్యేన న శక్యం ధరణీ తలే**

ఈ భూమండలమున ఎవరును మనసులో కూడా చేయజాలని పనిని, చాలా గొప్ప పనిని హనుమ చేసినాడు. ఈ లోకములో వాయువు సహాయము ఉన్నచో గరుత్మంతుడు సాగరమును దాటగలడు. కానీ హనుమ ఎవరి సహాయము లేకుండా అట్టి దుష్కార్యమును నెరవేర్చినాడు. రావణుని పర్యవేక్షణలో యున్న దుర్భేద్యమైన లంకను పాడు చేయడము హనుమకు తప్ప ఎవ్వరి వలన సాధ్యమయ్యేది కాదు. తన బలమునకు అనుగుణముగా, సేవకుడిగా తాను చేయవలసినది అంతయు చేసినాడు. ప్రభువును సేవించెడి భృత్యులు మూడు

విధములుగా యుందురు. కార్యమును ప్రభువు నియోగించినప్పుడు ఆపనిని చేసి అనిని చేసిన దానికి సంబంధించిన వేరొక పనిని కూడా ప్రభు కార్యమునకు అనుకూలముగునట్లు చేయువారు రాజభృత్యులలో ఉత్తములు. అధికమైన సమర్థత యుండియు నియమించిన కార్యమును మాత్రమే చేయువాడు మధ్యముడు. సామర్థ్యము ఉండియు చేయవలెనని సిద్ధపడియు చేయక, చేయలేక పోయినవాడు అధముడు. హనుమ సీతాన్వేషణ, లంకాదహనము చేసి అందరిని ప్రాణత్యాగము చేయకుండా కాపాడినాడు. హనుమ, సేవకులలో ఉత్తముడు. అతను చేసిన ఉపకారమునకు ఏమి ఇచ్చి ప్రత్యుపకారము చేయగలను?

**ఏష సర్వస్వ భూత స్తు పరిష్వంగో హనూమతః**
**మయా కాల మిమం ప్రాప్య దత్త స్తస్య మహాత్మనః**
**సాగరం తు సమాసాద్య పున ర్నష్టం మనో మమ**
**కథం నామ సముద్ర స్య దుష్పార స్య మహాఽమ్భసః**
**హరయో దక్షిణం పారం గమిష్యన్తి సమాహితాః**
**య ద్యఽప్యేష తు వృత్తాన్తో వైదేహ్యా గదితో మమ**

ప్రత్యుపకారము చేయవలసిన ఈ సమయమున నా వద్ద యున్నది దేహమే. ఇది నాకు అత్యంత ప్రియమైనది. నాకు ఎంతో భోగ్యమైనది. ఈతనికి ఏమి ఇచ్చినను స్వీకరింపడు. ఆనాడు లంకలో చనిపోవుటకు సిద్ధపడిన సీతమ్మను కాపాడినాడు. సీతాసందేశముతో నా ప్రాణములు కాపాడినాడు. ఈ విధముగా రెండు దేహములను కాపాడినాడు. కాన ఈ దేహముతో హనుమను ఆలింగనము చేసుకొనెదని, హనుమను గాడాలింగనం చేసుకొనెను. కాని అగాధమైన ఈ సముద్రమును దాటుట ఎట్లు అని దీర్ఘాలోచనలో పడిపోయినాడు.

### 6.2 సుగ్రీవుడు శ్రీరామునికి ధైర్య వచనములు చెప్పుట

శ్రీరాముడు శోకముతో యుండుట చూచి సుఖదుఃఖములలో మిత్రుడిగా రాముని శోకమును రూపుమాపుటకు సుగ్రీవుడు ఇట్లు శాంత, ధైర్య వచనములు

పలుకుతున్నాడు. "రామా! సామాన్యుని వలెనే నీవు శోకించుట తగదు. సంతాపమును విడువుము. సీతమ్మ జాడ తెలిసినది. శత్రువు స్థావరం తెలిసినది. ఏది చేయరాదో, చేయదగునో నిర్ణయించ శక్తి గల బుద్ధిమంతుడవు. సముద్రమును దాటుట దుర్భరమని శోకింపకుము. అట్టి సముద్రమును దాటి లంకపై దూకి, రావణుని మేమందరము సంహరించ గలము. నిరుత్సాహము సర్వ కార్య వినాశకరము.

**నిరుత్సాహ స్య దీన స్య శోక పర్యాకులాఽఽత్మనః**
**సర్వాఽర్థా వ్యవసీదన్తి వ్యసనం చాఽధిగచ్ఛతి**

ఉత్సాహము లేనివాడు, దీనుడు, శోకముచే కలత చెందిన వాడు కార్యములను సాధింపజాలడు. సర్వార్థములు చెడిపోవును. ఆపదలు చుట్టుముట్టును. సర్వ ప్రయోజనములు నశించును. శోకము వలన నిరుత్సాహము ఏర్పడును. అందువలన దైన్యము వచ్చును. అప్పుడు పొందవలసిన ప్రయోజనము పొందకపోవుట వలన ఆపద వచ్చును. కావున సర్వదా శోకము దూరము చేయదగినది. రామా! మీ ఆజ్ఞచే ఉత్సాహవంతులైన అశేష మా వానర సేనాని సముద్రమును దాటుటయే కాదు అగ్నిలో దూకమన్న దూకేస్తారు. సముద్రమునకు సేతువు కట్టుటకు, లంకను చేరుటకు మీరు ప్రయత్నము చూపవలెను. ఇందుకు అనేకమైన సూచనలు కనబడుతున్నాయి. ఈ విధముగా సుగ్రీవుడు శ్రీరాముని శోకము బాపుటకు ప్రయత్నము చేసెను.

## 6.3 సముద్రమును దాటుటలోని యోగరహస్యము

ఈ సాగరము దుస్తరమైన సంసార రూప సాగరము. అటువంటి సాగరమును దాటి లంకకు పోయి సీతను వెతికి, తిరిగి వచ్చునప్పుడు నియంత్రణలో యున్న ఆ లంకను హనుమాన్ సాధకుడు దహనము గావించెను. అనగా మాయను దహింప చేసెను.

**కింత్వం సంతర్యసే వీర యథాన్య: ప్రాకృత స్తథా,**

**మైవం భూస్త్యజ సంతాపం కృతఘ్న యువ సౌహృదం**

సుగ్రీవుడు, శ్రీరామునితో సీతారూప సాత్విక అనుభూతుల కొరకై సాధారణ మానవుని వలె శోకమును పొందకుము అని చెప్తాడు. శ్రీకృష్ణుడు కూడా ఈ విధముగానే అర్జునునితో శోకము చెంద వద్దని చెప్పాడు.

**మయి సర్వాణి కర్మాణి సన్య స్యాధ్యాత్మ చేతసా**

**నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్య స్వ విగత జ్వరః (3/30 )**

ఈ శ్లోకములో శ్రీకృష్ణుడు అర్జునిడికి సంతాప రహితముగా యుండుమని చెప్తాడు. సుగ్రీవుడు "త్యజ సంతాపః" అంటారు. అంటే సంతాపమును త్యజింపమని పలికెను. సాధనా ఫల ప్రాప్తి నొందనిచో సాధకుని మనోబుద్ధుల సంతాపము వృద్ధి యగును. అటువంటి సంతాపమును దరిచేరనీయరాదు. ఈ దుర్లభమైన సాగరమును దాటుటెట్లు అని చింతించుచున్న రామునితో సుగ్రీవుడు అను చున్నాడు.

**సముద్రం లంఘయిత్వా తు మహా నక్ర సమాకులమ్**

**లంకాం ఆరోహయిష్యామో హనిష్యామ శ్చ తే రిపుమ్**

పెద్ద పెద్ద మొసళ్ళతో (శత్రువులతో) నిండియున్న సాగరమును (సంసారమును) దాటి లంకకు చేరి రాక్షసులను సంహరించ వలెను. సాగరమనగా దుర్గుణములతో కూడిన భవసాగరము. అదియే సంసార సాగరము. లేదా సంసారము. రావణాది రాక్షసులు అనగా చెడ్డ వృత్తులు. వీటిని సాధకుడు సంహరింప వలెను. వసిష్ఠ మహర్షి శ్రీరామునితో, దృశ్యాసక్తియే సంసారము యొక్క మూల రూపము. సంసార అసక్తుడైన వాడు అనుభవించని దుఃఖము అంటూ వుండవు. సమ్యక్ జ్ఞానము జీవుని సంసార వ్యాధికి దివ్యమైన ఔషధము. సంసారమనెడు ఈ వాసనను చేధింపుము అని చెప్తారు. సుగ్రీవుని సంభాషణ ద్వారా వాల్మీకి సాధకుడు తన యందలి చెడ్డ వృత్తులను వదలి ఈ సంసార సాగరమును దాటవలెనని చెప్పాడు.

అయినను రాముడు సీతా శోకమును నియంత్రణలో పెట్టుకోలేక పోయెను. శ్రీరాముడు వాల్మీకిచే రూపొందించబడిన ఆదర్శ పురుషుడు. పూర్వపు అనుభూతులు ప్రాప్తించక పోయినచో సాధకుడు గాబరా చెందును. ఈ సీతా శోకమున యున్న యోగ రహస్యము ఇదియే. పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవానంద సరస్వతి రామ శోకము గురించి ఈ విధముగా చెప్పెను. "**రామః పరాత్మా ఫై తతః స్వానుభూతిమ్ వియోగతః, ప్రాప్తో దీన దశాం దుఖిః సుశోచ విరహాతురః"** ఈ సీతాశోకము చూచినచో రాముడు అతి సాధారణ మానవునివలె వర్ణింపబడినాడు. మంచి ఎవరు చెప్పిన వినాలనే శృతి వాక్యమును శ్రీరాముడు పాటించి ఆదర్శ పురుషుడు అయ్యాడు. కానీ రావణుడు తనకు నచ్చినట్లు చెప్పే వారి మాటలే విని, మంచి మాటలు స్వీకరింపక పతనమును కోరి తెచ్చుకొన్నాడు.

## 6.4 శ్రీరాముని కోరికపై, హనుమ లంక యొక్క రక్షణ వ్యవస్థను వివరించుట

శ్రీరాముడు నీతి శాస్త్రమును అనుసరించి తాము దండెత్తవలసిన రాజ్యము యొక్క దుర్గములను, రక్షణ విధానమును తెలుసుకోనుయుటకై అందుకై చూచి వచ్చిన హనుమతో భౌతిక సాధనముతో సముద్రమును దాటుటకు ప్రయత్నము చేసేదెము. అలాకానిచో వేగముగా సముద్రమును దాటునట్లు చేయగలను. కావున అంతకు ముందు లంక యొక్క రక్షణ వ్యవస్థను సవివరముగా ఉన్నది ఉన్నట్లుగా చూచినావు గనుక చెప్పవలసినదిగా అడుగుతాడు. అప్పుడు హనుమ రామునితో "రామా! రాక్షసులు రావణుని యెడల మిక్కిలి భక్తి విశ్వాసములు గలవారు, పరాక్రమ మంతులు, లంక యొక్క సమృద్ధి అనవధికము, సమగ్రము, భయంకరం. వాని సేన చక్కని విభాగములతో అమర్చబడినది. ఆ బలముల సంఖ్య అత్యధికం. లంకలో జనులు హర్షముతో, ఆనందముతో, నిర్భయులై యున్నారు. వారికి ఏ విధమైన మానసిక తాపములు లేవు. రథ, గజ,

తురగములతో సైన్యము అత్యధికముగా యున్నది. దుర్భేధ్యమైన ద్వారములు, ప్రాకారములు, అగడ్తలు, ద్వారముల వద్ద బాణములను, శిలలను చిమ్ము యంత్రములు, శతఘ్నులతో రక్షణ వ్యవస్థ బలముగా యున్నది గావున ప్రవేశించుటకు శక్యము కానిది. పట్టణ ప్రాకారము సువర్ణ మయము, మణులు, వైడూర్యములు, పగడములు ముత్యములు ప్రాకారమును అమర్చ బడినవి. నాలుగు ద్వారముల వద్ద సంక్రమములు యున్నను ఉత్తర ద్వారము వద్ద యున్న సంక్రమము మహా ధృడమైనది. రావణుడు ఎల్లవేళలా యుద్ధమునకు సంసిద్ధుడై యుండును. ద్యూతాది వ్యసనములకు లోనుకాకుండా అప్రమత్తముతో ఎల్లప్పుడూ సైన్యమును పర్యవేక్షించు చుండును. లంక త్రికూట పర్వతమున యున్నది. అందువలన అక్కడకు చేరుకొనుట చాలా కష్టసాధ్యము. ఆ పట్టణమునకు నాడి దుర్గము, పర్వత దుర్గము, వన దుర్గము, కృత్రిమ దుర్గము అను నాలుగు దుర్గములు కలవు. (ప్రకృతి సిద్ధములైన పంచ దుర్గములు ఐన జల దుర్గము, పర్వత దుర్గము, వృక్ష దుర్గము, ఐరిణ దుర్గము లేదా చౌటి పర్రలతో కూడిన దుర్గము, దానవ దుర్గము లేదా ఎడారి దుర్గము-అనునవి అయోధ్యలో కలవు. ఈ దుర్గములను రాజు సమయోచితముగా ఉపయోగించుతూ ఆత్మ రక్షణ చేసుకొని వలెను. ఈ దుర్గములను రాజు సమయోచితముగా ఉపయోగించుతూ ఆత్మ రక్షణ చేసుకొని వలెనని శ్రీరాముడు, భరతునికి రాజ ధర్మములను అయోధ్యకాండలో ఉపదేశిస్తాడు. కానీ ఇక్కడ హనుమ లంకలో నాలుగు దుర్గములు మాత్రమే ఉన్నవి అని చెపుతాడు). అవికాక శిల్పులచే నిర్మింపబడిన ప్రాకార పరిఘాధులు యున్నవి. సముద్రమునకు దూరముగా యుండుటచే అక్కడికి నౌకామార్గము లేదు. తూర్పు ద్వారము వద్ద అయుత సంఖ్యలో అనగా పదివేల మంది రాక్షసులు, దక్షిణ ద్వారము వద్ద నియత సంఖ్య గల సైన్యము అనగా ఏబది వేలమంది, పశ్చిమ ద్వారమున లక్ష రాక్షస సైన్యము, ఉత్తర ద్వారము వద్ద కోటి మంది సైన్యము, ఇక మధ్య భాగమున

ఎవరును ఎదిరింప శక్యము కాని నూరువేల రాక్షసులు కోటి సంఖ్య గల సైన్యము  రథ, గజ, తురగ, పదాతి దళములతో సర్వాయుధ ధారులై యుద్ధమునకు సన్నద్ధముగా యుందురు.  నేను నా శక్తి కొలది చాలా మందిని అంతమొందించి రక్షణ వ్యవస్థను ఛిద్రము చేసితిని. మనము ఏదోవిధముగా సముద్రమును దాట వలెను. దాటితిమా మన వానరులు లంకను అంతమొందించుట నిశ్చయము. అంగదుడు, ద్వివిదుడు, మైందుడు, జాంబవంతుడు, పనసుడు, నలుడు, నీలుడు ఎగిరి లంకకు చేరుకోగలరు. మిగిలిన వారు చేరలేకపోయినను లంకా నగరమును నాశనము చేయగలరు. రామా! నీ ఆజ్ఞ కొరకు వానర సైన్యము సర్వ సన్నద్ధముగా యున్నది" అని చెప్పెను. అప్పడు రాముడు, ఇది ఎంత పని. ఇప్పుడు సూర్యుడు ఆకాశ మధ్యమము యున్నాడు. ఇది "విజయము" అను ముహూర్తము, చాలా శ్రేష్టమైనది, ఈనాడు ఉత్తర ఫల్గుణి నక్షత్రము. ఫాల్గుణ పూర్ణిమ. నాకు సాధన తార. మంచి శుభ శకునములు కనబడుతున్నవి కావున సుగ్రీవునితో ప్రయాణమునకు సన్నద్ధము కావలెనని నిర్ణయించాడు. అందుకు లక్ష్మణ సుగ్రీవునితో సహా  అందరూ వానరులు హర్షించారు.

## 6.5 శ్రీరాముడు వానర సేన ప్రస్థాన విధానము నిర్దేశించుట, వానర సేనల యుద్ధ యాత్ర

రాముడప్పుడు ఇట్లు చెప్పు చున్నాడు. నీలుడు సేనానాయకుడు, సైన్యమునకు మార్గదర్శనం చేయవలెను. అతనితో నూరువేల మంది సైన్యము ఉండవలెను. మార్గమున జలము, ఫలములు తో కూడి యుండవలెను. రాక్షసుల యెడల అప్రమత్తతో యుండవలెను. కిష్కింధలో దుర్బలమైన సైన్యమును ఉంచి పరాక్రమము గలవారు ప్రయాణము కావలెను. గజుడు, గవయుడు, గవాక్షుడు సైన్యము ముందు నడువ వలెను. ఋషభుడు సైన్యమునకు దక్షిణ భాగమున,

దుర్ధర్షుడు, గంధమానుడు ఎడమ వైపు, నేను (శ్రీరాముడు) హనుమంతునిపైన, లక్ష్మణుడు అంగదుని పైన అందరికి కన్పించుతూ సైన్యమునకు హర్షమును కల్గించుదుము. జాంబవంతుడు, సుషేణుడు, వేగదర్శి సైన్య మధ్య భాగమున ఉందురు. రాముడు ఇట్లు ఆజ్ఞాపించగా అందరూ హర్షాతిరేకములు చేసిరి. రాముని ఆజ్ఞానుసారము అందరూ పల్లెలకు, పట్టణములకు ఉపద్రవములు కల్గించకుండా దక్షిణ దిక్కుకు ప్రయాణము సాగించిరి.

శుక్రుడు మేష రాశి యందు యున్నాడు. జన్మరాశి రామునకు కర్కాటకము, మేషరాశి నందు శుక్రుడు దశమ స్థానమున యుండుట వలన శుభప్రదము బృహస్పతి మొదలగు గ్రహములు ఆయా రాశులలో అనుకూలముగా యున్నవి. రామునకు యుద్ధయాత్రకు బయిలుదేరునాటికి ముప్పది ఆరు సంవత్సరముల వయస్సు. అందుచే గురువు సింహ రాశిలోను, శని మకర రాశిలోను, శని కేతువులు జన్మరాశికి షష్టమ స్థానములోను, పంచమమగు వృచ్చికమున కుజుడు, చంద్రుడు నవమములోను, సూర్యుడు అనుకూలురు. రాహువు మిధున రాశిలో యుండుటచే కొద్దిగా బాధను కల్గించినను మొత్తము మీద రామునకంతయు గ్రహ బలము బాగుగా యున్నది. రాక్షసులకు ప్రతికూలంగా యున్నది. ఈ విధముగా వానర లక్ష్మణ సమేతుడై శ్రీరాముడు సమరోత్సాహముతో దక్షిణ సముద్రమున యున్న మహేంద్ర పర్వతమును సమీపించిరి. సముద్రము యొక్క ఆవలి ఒడ్డు కానరానిదై అపారంగా యుండెను. శ్రీరాముని అనుమతితో సుగ్రీవుడు వానర సేనలను సాగర తీరము నందు నిలిపెను. సీతావియోగముచే శ్రీరాముని దుఃఖము అధికమయ్యేను.

**న మే దుఃఖం ప్రియా దూరే న మే దుఃఖం హృతేతి చ**

**ఏత దేవాఽనుశోచామి వయోఽస్యా హ్యఽతివర్తతే**

**వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మా మఽపి స్పృశ**

**త్వయి మే గాత్ర సంస్పర్శ శ్చన్ద్రే దృష్టి సమాగమః**

సీతమ్మ యవ్వనము రోజు రోజుకి గడచి పోవుచున్నదని, ఆమెను స్పృశించి, తనను స్పృశించమని వాయువును, చంద్రుడిని ప్రార్థించుచున్నాడు. యుద్ధ కాండము నందలి రెండు, మూడు, ఐదవ సర్గలు ఇట్టి సీతా శోకముచే నిండి శ్రీరాముడు అతి సాధారణ మానవుని వలె వర్ణింపబడినాడు.

## 6.6 రావణుడు యుద్ధమునకై మంత్రాలోచన

హనుమ లంకానగరమున ఒనర్చిన ఘోరకృత్యములకు రావణుడు ఎంతయో ఖిన్నుడయ్యెను. పిమ్మట సిగ్గుతో తలవంచుకొనినవాడై రాక్షసులతో ... "ఎవరును ప్రవేశింప వీలుకాని లంకానగరములో ఒక వానరుడు జానకిని దర్శించి అనేక విధములుగా లంకానగరమును అల్లకల్లోలం చేసెను. కావున ఇప్పుడు మీ క్షేమముకై చేయవలసిన కర్తవ్యమును తెలుపుడి. (ఇక్కడ రావణుడు తన అపరాధమును కప్పి పుచ్చుకొనుచు తాను ప్రజల కోసమే అని అంటున్నాడు). శ్రీరాముడు మన లంకానగరముపై దాడి చేయుటకు వేలకొలది వానరులతో రాబొవుతున్నాడు. అతను తన బలముతో గూడి యుక్తియుక్తముగా సాహసము చేసి, తన పరాక్రమముతో సేతువును నిర్మించిగాని, జలములను ఇంకించి గాని సముద్రమును దాటగలడు. కావున తగిన సూచనలు చేయుడు". అనెను. అప్పుడు రాక్షసులు తమ తమ వైభవములను, పరాక్రమములను ప్రస్తుతించుకొని, రావణుని పరాక్రమమును గుర్తు చేసి, ఇంద్రజిత్తు యొక్క పరాక్రమమును గుర్తు చేసి రాముడు నీకు సరిసాటి కాదని చెపుతూ ఇంద్రజిత్తు ఒక్కడే ససైన్యముగా శ్రీరాముని హతమార్చగలడని రావణునికి విన్నవించిరి. ప్రహస్తుడు మున్నగు వారు ఎవరికీ వారే తానొక్కడినే రాముని జయించగలమని ప్రగల్బములు పలికిరి.

## 6.7 విభీషణుని ఉపదేశము

రాక్షసుల యొక్క సమరోత్సాహమును చూచి విభీషణుడు వినమ్రముతో ఇట్లు పలికెను.

"రాజనీతిని అనుసరించి ముందుగా సామ, దాన, భేదోపాయములను ప్రయోగించవలెను. ఈ మూడిటితో శత్రువిజయము లభించనప్పుడు చివరిదైన దండోపాయమును చేపట్టవలెను. శత్రువులు ఇంద్రియ సుఖములకు లోనై జాగరూకులు కానివారి పైనను, విరక్తులై రాజ్యపాలన పైన శ్రద్ధ చూపనప్పుడు, సామంత రాజులు వలన చిక్కులు పాలైనప్పుడు, దైవ వశముచే సంపదలు కోల్పోయిన వారిమీదను, రాజ్య పాలన బాలుర మరియు వృద్ధుల చేతిలో యున్నప్పుడు మంత్రులతో సంప్రదించి యుద్ధము చేసి విజయము సాధించవచ్చును. (ఇరువది రకముల శత్రువులతో సంధి చేసుకొనుటకు అంగీకరింప కూడదని కామందక నీతిశాస్త్రము చెప్పుచున్నది అవి వరుసగా .. బాలుడు, వృద్ధుడు, దీర్ఘరోగి, జ్ఞాతులచే వెలివేయబడినవాడు, పిరికివాడు, పిరికి పరిజనము గలవాడు, లోభము కలవాడు, లోభముగల పరిజనము గలవాడు, ప్రజల యొక్క అనురాగము కోల్పోయినవాడు, విషయభోగములపై ఆసక్తి గలవాడు, మంత్రిమండలిలో భిన్నాభిప్రాయము ఉన్నప్పుడు, దేవతలను, బ్రాహ్మణులను నిందించువాడు, దైవము ప్రతికూలంగా యున్నప్పుడు, అంతయు దైవమే చేయునని పౌరుషమును వదలినవాడు, కరువు, అపపదలు ముంచెత్తినవాడు, సైన్యములో కలతలు ఉన్నవాడు, తన దేశములో తాను లేనివాడు, పెక్కుమంది శత్రువులు ఒక్కమారు చుట్టినవాడు, మరణము ఆసన్నమైనవాడు, సత్యధర్మములను వీడినవాడు) కానీ శ్రీరాముడు కామక్రోధములను జయించి అజేయుడై, యుద్ధమునకు సన్నద్ధుడై యున్నాడు. దుస్సాధ్యమైన సముద్రమును లంఘించి హనుమ లంకకు చేరెను కావున ఈ విషయము కూడా ఆలోచించవలసినది".

**కిం చ రాక్షస రాజస్య రామేణాఽపకృతం పురా**
**ఆజహార జనస్థానా ద్యస్య భార్యాం యశస్వినః**
**ఖరో యద్యఽతివృత్త స్తు రామేణ నిహతో రణే**
**అవశ్యం ప్రాణినాం ప్రాణా రక్షితవ్యా యథా బలమ్**
**అ యశస్య మఽనాయుష్యం పర దారాఽభిమర్శనం**
**అర్థ క్షయ కరం ఘోరం పాపస్య చ పునర్భవం**
**త న్నిమిత్తం వైదేహీ భయం నః సుమహా ద్భవేత్**
**ఆహృతా సా పరిత్యాజ్యా కలహాఽర్థే కృతే న కిమ్**

ఇంతకు రాముడు, రావణునికి చేసిన అపరాధము ఏది? మనప్రభువే జగత్ప్రసిద్ధుడైన రాముని భార్యను అపహరించెను. ఖరుడు రాముని వధించుటకు సిద్ధపడినప్పుడు, రాముడు ప్రాణాపాయస్థితి కలిగినది కావున తనను తాను రక్షించుట కొరకై రాముడు ఖరుని సంహరించెను. పరస్త్రీని తాకుట వలన కీర్తిప్రతిష్టలు దెబ్బతినును. ఆయువు క్షీణించును, సమస్త సంపదలు హరించును, అట్టి పాపాత్మునకు నీచ జన్మ ప్రాప్తించును. కావున అపహరించిన సీతాదేవిని వారికి అప్పగించుట సముచితము. రావణుడు విభీషణుని పలుకులు విని తన భవనములోనికి వెళ్లెను. పిమ్మట విభీషణుడు రావణ భవనమునకు ఏగి మృదువుగా ఇట్లు విన్నవించాడు. "అన్నా! సీతమ్మను తెచ్చిన దగ్గరనుంచి అనేకమైన అశుభ సూచనలు గోచరించుచున్నవి. కావున నీకు సమ్మతి యైనచో శ్రీరామునికి సీతను అప్పగించుము. అదియే మన తప్పిదములకు ప్రాయశ్చిత్తము" అందుకు రావణుడు క్రోధావేశుడై మైథిలిని అప్పగించుటకు ఇష్టపడక సోదరుడిని అచట నుండి పంపివైచెను.

## 6.8 కుంభకర్ణుని ధర్మ వచనములు

విభీషణుని ఉపదేశముచే వ్యాకులుడైన రావణుడు, మరునాడు ముఖ్యులైన మంత్రులతో, మహావీరులతో, మిత్రులతో లోతుగా ఆలోచించ దలచి వారినందరిని తన ఆలోచనామందిరమునకు పిలిచెను. విచ్చేసిన వారందరితో ఇట్లు పలికెను. "ధర్మము, అర్థము, కామము సాధించుచున్నప్పుడు కొన్ని విషమ పరిస్థితులు సంభవించును. ఏది సేవింప వలెనో, ఏది సేవింపరాదో నిర్ణయించుకొనుట కష్టము. మీరందరు సమర్థులు, లాభము;నష్టము, హితము;అహితము, ప్రియము;అప్రియము అనువాటిని వివేకించి ఎరుగ గలవారు కావున మనము ఏమి చేయవలెనో నిర్ణయించుడి" అని అడిగెను. రాముని భార్యను లంకకు తీసుకొని రాబడినది. కుంభకర్ణుడు ఇప్పుడే నిద్ర నుండి లేచివచ్చినాడు కావున అతనికి కూడా తెలియ చెప్పుటకు మరల చెప్పుచున్నాను. ఆమె నాతో కూడి భోగములు అనుభవించుటకు ఇష్టపడుట లేదు. ఆమెను చూచి కామపరవశుడనైతిని. ఆ కామముచే క్రోధము, హర్షము కలుగు చుండును. శోకము, సంతాపము విడువక బాధించుటచే మనసు చెదిరిన వాడనై యున్నాను. ఆమె నన్ను ఒక సంవత్సరము గడువు ఇమ్మని కోరినది[21]. అందుకు అట్లే అని ప్రతిజ్ఞ చేసితిని. దుర్లభమైన సముద్రమును దాటి ఒక కోతి మహత్తరమైన యుద్ధము చేసినది. ఒక మనుష్యుని వలన నాకు భయము లేదు. కాని కార్యములు ఎట్లుండునో, ఏమి జరుగునో తెలియ రాకున్నది.

---

[21] ఇచ్చట రావణుడు సభాసదుల ఎదుట తన ఔదార్యమును ప్రకటించుకొనుచు బొంకుచున్నాడు.

**శృణుమైథిలి! మధ్వాక్యం మాసాన్ ద్వాదశ భామిని! కాలేనాఽనేన నాఽభ్యేషి యది మాం చారుహాసిని!**
**తతస్త్వామ్ ప్రాతరాశార్థం సూదా: చేత్స్యంతి లేశశః** (అరణ్య కాండ సర్గ 56 శ్లోకములు 24 - 25 )

ఓ! మైథిలి నా మాట వినుము. నీకు పండ్రెండు మాసములు గడువును ఇచ్చుచున్నాను. ఈ లోపల నా యెడల సుముఖురాలివి గాకున్నచో గడువు తీరిన మరునాడే ప్రాతఃకాల భోజనమునకై వంటవారు నిన్ను ముక్కలు ముక్కలుగా చేయుదురు.

రామలక్ష్మణులు సుగ్రీవుడు మొదలగు వానర సేనలతో సముద్రము ఆవల యున్నారు. సీతమ్మను వారికి ఒసగ రాదు. రామలక్ష్మణులను ఇరువురిని సంహరింపవలెను. అందుకు ఏమి చేయవలెనో బాగుగా ఆలోచించుడి" అని రావణుడు పలికెను. కామాతురుడైన రావణుని మాటలను విని కుంభకర్ణుడు మిక్కిలి క్రుద్ధుడై ఇట్లు పలికెను.

**యదా తు రామస్య సలక్ష్మణస్య, ప్రసహ్య సీతా ఖలు సా ఇహాఽఽహృతా**
**సకృత్ సమీక్ష్యైవ సునిశ్చితం తదా, భజేత చిత్తం యము నేవ యామునం**
**సర్వ మేత న్మహా రాజ కృత మఽప్రతిమం తవ**
**విధీయేత సహాఽస్మాభి: ఆదావే వాఽస్య కర్మణ:**

ప్రభూ! (అన్నా!) రామలక్ష్మణులను వంచించి, వారి ఆశ్రమము నుండి సీతాదేవిని అపహరించి తీసుకొని రాకముందే మాతో ఒకసారి సంప్రదించి నిర్ణయించుకొనిన బాగుండెడిది. నీవు సీతాహరణాది కృత్యములను ముందు వెనుక ఆలోచించక చేసితివి. ఇప్పుడు దానిని గూర్చి చర్చించుట గతజలసేతు బంధనము వంటిదే కదా! (నీరంతయు ప్రవహించి పోయిన పిమ్మట దానికి అడ్డుకట్ట వేయుట వృధా కదా) నిశ్చయాత్మక బుద్ధిగల ప్రభువు రాజకార్యమును బాగుగా ఆలోచించి నిర్వహించినట్లయితే తర్వాత పశ్చాత్తాపము పడవలసిన పని యుండదు. యుక్తాయుక్తములు ఎరుగని వాడే ముందుగా చేయవలసిన కార్యములను తర్వాత, తరువాత చేయవలసిన పనులు ముందుగా చేయుదురు. నేనే బలవంతుడిని అని విర్రవీగుచు తొందరపాటుతో వ్యవహరించెడి చపలచిత్తుని లోపములను శత్రుపక్షము వారు గమనించి వానిని దెబ్బతీయుదురు. ఇప్పటివరకు శ్రీరాముడు నిన్ను చంపకుండుట నీ అదృష్టముగా భావింపుము. అయినను మహారాజా! నీవు దుఃఖితుడవు కాకుము. నేను వారిని అందరిని సంహరించి నీకు మోదము కలుగ జేతును. నా చేతిలో రాముడు

మృత్యుముఖమున చేరిన పిమ్మట సీత నీకు శాశ్వతముగా వశమగును అని రావణునికి స్వాంతన వాక్యములు పలికెను.

## 6.9 కుంభకర్ణుడు-యోగరహస్యము

రావణుని సోదరుడైన కుంభకర్ణుడు గొప్ప సమర్థశీలుడు, పరాక్రమము, వివేకము కలవాడు. తీవ్ర తపస్సుచే బ్రహ్మను ప్రత్యక్షము చేసుకొనినాడు. బ్రహ్మను ఈ ప్రపంచ వ్యవహారములకు దూరముగా యుండవలెనని కోరుటకు బదులుగా అన్ని వేళలా నిద్రను ప్రసాదించమని కోరినాడు. (కుంభకర్ణుని వృత్తాంతము ఉత్తర కాండము లో వివరించబడింది. ఈ కాండము లో శ్రీరామునికి, విభీషణుడు ద్వారా కుంభకర్ణుని వృత్తాంతము చెప్పబడింది) భోగాలు-భోగసాధనాలు మరియు బలానికి నిలయమైన భగవంతుని జాగృతి పరచకుంటే మనమేమి పొందగలం? లోకమెప్పుడు నిద్రిస్తూ వుంటుంది. నిద్రించేవాడు ఎవరినైనా ఎప్పుడైనా జాగృతపరచగలడా? జ్యోతి స్వరూపుడైన పరమాత్మ జాగరూకుడుని మాత్రమే మేల్కొల్పగలడు. **'జాగృవాంసః సమింధతే'** అని మంత్రం. దీనినే ఋగ్వేదం మరియు కఠోపనిషత్తు. **'దివేదివ ఈడ్యో జాగృవద్భిః'** అని ప్రబోధించాయి. భగవద్గీత కూడా- **యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః** ''ప్రాణులన్ని నిద్రించే సమయంలో యోగులు మేల్కొని యుంటారు. యోగులు నిద్రించే సమయంలో ప్రాణులు నిద్రిస్తాయి'' అని ఇదే విషయాన్ని సమర్థించింది. సామాన్య జనులు భోగానుభవం నుండి బయటపడలేరు. వారి జీవితమంతా ఆహార పానీయాది సామగ్రిని సమకూర్చుటయందే గడిచిపోతుంది. కాని ఎవరీ శరీరాన్ని ఇచ్చాడో అతడే దీనిని రక్షణ చేసే సామగ్రిని కూడా తప్పక ఇస్తాడని జ్ఞానికి మాత్రమే తెలిసియుంటుంది. అతనిని ఈ జన్మలోనే తప్ప మరో జన్మలో పొందడం మాత్రమే సాధ్యపడదు.

కుంభకర్ణుడు జ్ఞాని. అందుచే వాల్మీకి వాని నామమును "కుంభకర్ణుడు" (కుంభము వంటి కర్ణములు కలవాడు) అని పేరిడెను. శ్రవణము ద్వారానే జ్ఞానమును గ్రహించెడి వాడు. మంచి ఆలోచనలు యున్నప్పటికీ కుంభకర్ణ సాధకుడు ఇతరుల ప్రోద్బలంతో తన సత్కర్మను విడిచి చెడు కర్మను ఆచరించెడి వాడు. భవసాగరమును దాటగల సమర్థుడు. చెడ్డ ఆలోచనలు విను స్వభావము గలవాడు గనుక రావణునికి సహకరించెదనని మాట ఇచ్చెను.

## 6.10 సీతను బలాత్కారముగా అనుభవింపుమని మహాపార్శ్వుడు రావణునికి తెలుపుట

మహాబలుడగు మహాపార్శ్వుడు రావణునితో ఇట్లు విన్నవించెను.

తేనె త్రాగవలెనన్న ఉత్సాహముతో మృగములతో, క్రూర జంతువులతో నిండి యున్న అరణ్యమునకు వెళ్లి అవకాశము లభించినను తేనె త్రాగకుండా ఆలోచించువాడు మూర్ఖుడు. ఆలాగుననే దుష్కరమైన సీతాపహరణము తరువాత కూడా ఆలోచించుతూ ఆమెను భోగించకుండా యుండుట మూర్ఖత్వము.

**ఈశ్వర స్యేశ్వర: కోஉస్తి తవ శత్రు నిబర్హణ**
**రమస్వ సహ వైదేహ్యా శత్రూ నాஉஉక్రమ్య మూర్ధసు**
**బలాత్ కుక్కుట వృత్తేన వర్తస్వ సుమహాబల**
**ఆక్రమ్యాஉஉక్రమ్య సీతాం వై తథా భుంక్ష్వ రమస్వ చ**

శత్రుసూదనా! సర్వనియంతవు. మిమ్ములను నియమించు వాడు లేడు. తమరు స్వయముగా ఈశ్వరులు. మీకు ఈశ్వరులు ఎవరు? శత్రువులను నష్టపరచి మీరు సీతను పొందండి. కుక్కుటము వలె సీతతో ప్రవర్తించండి. బలముచే పదే పదే ఆక్రమించి అనుభవింపుము. కోరిక తీరిన తరువాత ఏ ప్రమాదము వచ్చినను

వాటినన్నింటిని మీరు సమర్థముగా ఎదుర్కొనగలరు. అంతియే గాక మహాబలశాలురైన కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు యొక్క అండదండలు గలవు.

## 6.11 రావణునికి బ్రహ్మ శాపము, అందు యోగ రహస్యము

మహాపార్శ్వుడు ఇట్లు నుడివిన తరువాత లంకేశ్వరుడు సంతోషించి ఈ విధముగా వచించెను. "బ్రహ్మదేవుని అనుగ్రహమును నేను ఆకాశమార్గమున పోవుచుండగా పుంజికస్థలయను అప్సరస అగ్నిజ్వాలవలె మెరయుచు ఆకాశమార్గమున పోవుట చూచితిని. అప్పుడామె నాకు భయపడి మబ్బులచాటున దాగికొని వెళ్ళుచుండెను. అంతట నేను ఆమెను వివస్త్రను గావించి, బలవంతముగా అనుభవించితిని. పిమ్మట ఆమె బ్రహ్మ భవనమునకు వెళ్లగా, బ్రహ్మ కుపితుడై ఇక నుంచి నేను ఎవరినైనా బలవంతముగా అనుభవించినచో నా శిరస్సు నూరు ముక్కలు అగునని శాపము ఇచ్చినాడు. ఆ శాపమునకు భయపడి నేను ఆమెను బలవంతముగా అనుభవించుటకు పూనుకొనుట లేదు. వెనుక రంభను బలాత్కరించినప్పుడు రావణునకు నలకూబరుడు కూడా ఇట్టి శాపమునే ఇచ్చెను. కానీ అతడు తక్కువ వాడని అనాదరించి రావణుడు మరల పుంజికస్థలను బలాత్కరించెను. ఇప్పుడు బ్రహ్మ శాపము ఇచ్చినాడు కావున ఇది అనుల్లంఘనీయము. సముద్రము వంటి వేగము, వాయువు వంటి గమనము గలవాడను. ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు కూడా నన్ను ఎదిరింపజాలరు. రాముడు నా సామర్థ్యమును ఎరుగడు అని ప్రగల్భములను పలికినాడు.

రావణుడు అహంకారంతో కూడిన, వివేకము లేని సాధకుడు. పరస్త్రీ అనగా సాధకుడు తన వృత్తిని లేదా ధర్మమును విడచి పరవృత్తిని స్వీకరించుట. రావణునికి మండోదరి వృత్తి స్వధర్మము. సీతావృత్తి పరధర్మము. సీతావృత్తిని బలాత్కారముగా గ్రహించినచో, రావణ ధర్మము విఘటనము చెంది నూరు ముక్కలగునని ఆంతర్యము. **పిండే పిండే మథిర్భిన్న:** ప్రతి వ్యక్తి యొక్క పద్ధతి, బుద్ధి, ధారణ మరియు ధర్మము ప్రత్యేకముగా యుండును. తన ధర్మము

ననుసరించియే సాధన చేయవలయును. పరధర్మ సేవన చేసినచో సాధకుడు నూరు భాగములై అధఃపతనము చెందును. **"వివేక భ్రష్టానాం భవతి విని పాతః శతముఖా"**

## 6.12 విభీషణుడు, రావణునికి శ్రీరాముని పరాక్రమమును తెలుపుట

మహాపార్శ్వుడు, కుంభకర్ణుడు మొదలగువారి ప్రగల్బ వచనములు, రావణుని శాప వచనములు విన్న తర్వాత ఇట్లు అర్థవంతమైన హిత వచనములు విభీషణుడు పలికెను. పర్వత శిఖరముల వలె మహోన్నతులు, కోరలు నఖములు ఆయుధములుగా గలవారు ఐన వానర ప్రముఖులు. శ్రీరాముని యొక్క బాణములు వజ్రాయుధము వలె తిరుగులేనివి. కావున వారు లంకా నగరంపై విరుచుకొని పడకముందే సీతాదేవిని శ్రీరామునికి అప్పగించుట ఎంతయేని సముచితము. ఇంకను బీరములు పలికిన వీరందరూ శ్రీరాముని ఎదుర్కొనలేరు. అంతియేగాక రావణుడు వ్యసనములకు బానిస అయ్యి యున్నాడు. మహాపార్శ్వుడు, కుంభకర్ణుడు మొదలగువారి ప్రగల్బ వచనములు, రావణుని శాప వచనములు విన్న తర్వాత ఇట్లు అర్థవంతమైన హిత వచనములు విభీషణుడు పలికెను. పర్వత శిఖరముల వలె మహోన్నతులు, కోరలు నఖములు ఆయుధములుగా గలవారు ఐన వానర ప్రముఖులు. శ్రీరాముని యొక్క బాణములు వజ్రాయుధము వలె తిరుగులేనివి. కావున వారు లంకా నగరంపై విరుచుకొని పడకముందే సీతాదేవిని శ్రీరామునికి అప్పగించుట ఎంతయేని సముచితము. ఇంకను బీరములు పలికిన వీరందరూ శ్రీరాముని ఎదుర్కొనలేరు. అంతియేగాక రావణుడు వ్యసనములకు బానిస అయ్యి యున్నాడు. అందుకు ఇంద్రజిత్తు, విభీషణుని తీవ్ర పదజాలములతో దూషించెను. ఇంద్రజిత్తు మాటలను విని విభీషణుడు ఇంద్రజిత్తునితో నీవు బాలుడవు, నీకు బుద్ధి బలము చాలదు. నీవు ఇట్లు అర్థరహితముగా పలుకుట

వలన ఆత్మవినాశనము తప్పదు. శ్రీరాముని బాణములు బ్రహ్మదండము (బ్రహ్మదండమనగా ప్రళయకాలము నందు అగ్నిజ్వాలలతో ప్రభవించెడి తోక చుక్క, విశ్వామిత్రుని అస్త్ర, శస్త్రములను నిలువరించిన వసిష్ఠుని చేతిలోని బ్రహ్మదండము) వలె నిప్పులు గ్రక్కునవి, తేజోవంతమైనవి, మృత్యుదేవతకు ప్రతిరూపములైనవి. యమపాశములవలె ప్రాణాంతకమైనవి. అట్టి రాముని శరములకు రణరంగమున ఎవ్వరు తట్టుకొనలేరు. అప్పుడు రావణుడు మిక్కిలి కోపముతో సకల లోకముల యందలి దాయాదుల స్వభావములను నేను ఎరుగుదును అని దురుసుగా పలికెను. శత్రువులతో కలసి హాయిగా జీవించవచ్చు. పగబట్టిన పాముతో కలసి హాయిగా ఉండవచ్చు. శత్రుపక్షపాతి అయిన సోదరుడని పేరుతో శత్రుత్వమును సాగించెడి సహజ శత్రువుతో జీవించుట దుశ్శకము. జ్ఞాతులు సహజ శత్రువులు. శత్రువు కంటే, సర్పము కంటే ప్రమాదకరమైనవారు. కనుక సహజ శత్రువులను దూరముగా యుంచవలెను. నీవు గూడ జ్ఞాతివి అగుటచే ఇప్పుడు నాకు ఆపద కలుగుటచే నన్ను దెబ్బ తీయుటకు ప్రయత్నించు చున్నావు. ఏనుగుకు ఏనుగే శత్రువైనట్లు జ్ఞాతుల వలననే ప్రమాదము. తామరాకుపై నీటిబొట్లు ఎంతసేపు యున్నను దానిని అంటుకొననట్లే నీవు నాతో ఎంతసేపు స్నేహము నటించినను, నీకు నాపై మనసులో స్నేహము కలుగదు. అప్పుడు విభీషణుడు, రాజా! మనసునకు నచ్చినట్లు మాటలాడెడి వారు అనేకులుగా యుందురు కానీ మేలు కలిగించెడి వారు ఎక్కడోగాని లభింపడు. నీవు ఇప్పుడు కాలిపోవుచున్న ఇంటిలో యున్నట్లు మృత్యుముఖంలో యున్నావు. రామబాణ ప్రవాహములో కొట్టుకొని పోవక తప్పదు. అని చెప్పి విభీషణుడు వెళ్లెను.

### 6.13 శరణాగతి

భగవంతుని చేరడానికి ముఖ్యమైన అడ్డంకి అహంభావం. ఆ అహంకారాన్ని వీడి శరణు వేడితే ఆ భగవంతుడే దిగివచ్చి, భక్తుని వశమౌతాడు. సంపూర్ణ శరణాగతి

పొందడమే ఆయన్ని చేరే సూటిమార్గం అని చెప్పే కథే గజేంద్రమోక్షం. అజ్ఞానముచే ప్రత్యక్షంగా కనబడే శరీరమునకు, శరీర సౌఖ్యమునకు కావలసిన వాటినే మనస్సు కోరుకొనును. ఇట్టి కోరికలని కామము అందురు. కామములలో ఎక్కువగా మానవుడిని లొంగదీసుకొనెడివి స్త్రీకి పురుషుని విషయమున, పురుషునకు స్త్రీ విషయమున కలిగే కామము. అయితే అట్టి కామములు శాస్త్ర విహితముగా యుండవలెను. అజ్ఞానముచే కలిగిన అహంకారము వలన శరీరమే తాను అనుకొనుట, శరీరమునకు సంబంధించినవి అన్నియు తనవి అనుకొనుచు, శరీరమునకు సంబంధించిన సుఖమును పొందవలెనని మనస్సు ఆరాట పడును. అట్టి మనస్సును వశపరచుకొనుటకు మానవుడు ప్రయత్నింప వలెను. శ్రీరామాయణము వాచ్యార్థమైన రామచరితములో ఆత్మ, పరమాత్మల కథను, మనసును జయించవలసిన విధానమును నిరూపించింది. అందుకనే శ్రీరామాయణము వేదము. మనస్సును జయించి మానవుడు పురుషార్థమును పొందుటకు, ఎవరు ఇట్టి భవసాగరమును దాటుటకు సమర్థులో యోచించి శరణాగతి పొందవలెను. భగవంతుని పొందుటకు ఎన్నియో ఉపాయములు యున్నవి. భగవంతునికి ప్రీతి కలుగునట్లు ధర్మబద్ధముగా జీవించుట, అహంకారము వీడుట మొదలగునవి. కానీ ఇవి అన్నియు ఆచరణలో కష్టము. అన్నింటికన్నా ప్రధాన ఉపాయము భక్తి, శరణాగతి. శరణాగతియే అన్నింటికన్నా ముఖ్యము. అదియే సర్వ ఉపనిషత్ సారము. శరణాగతిని పొందవలసిన వాడు రాముడే. కానీ ఒక సందేహము వచ్చును. రాముడు మానవుడు కాన ఎట్లు శరణాగతి చేయగలడు? రాముడు సత్యనిష్ఠాగరిష్ఠుడు అయినందున సర్వ సమర్థుడు అని ఇంతకు ముందు చర్చించుకొన్నాము. రావణ సంహారానంతరము బ్రహ్మరుద్రఇంద్రాదులు శ్రీరాముని విష్ణు స్వరూపముగా గుర్తించేంత వరకు శ్రీరాముడు మానవుడిగానే ప్రభవిల్లాడు.  శరణాగతికి పూర్తి నమ్మకము,

విశ్వాసము ముఖ్యము. అట్టి నమ్మకము కలిగిన రాయి, రప్ప, చెట్టు, చేమ అన్నియు శరణాగతి చేయగలవు. మూఢ భక్తితో గ్రామీణులు, ఆదివాసీలు అలాగుననే చేయుదురు. శరీరభావము తనది కాదు అనుకున్నప్పుడు అన్నియు శరణాగతికి సమర్థములే. ఉదాహరణకు పూర్తి నమ్మకంతో మనము కొలుచుచున్న గురుస్వరూపులైన సాయిబాబా, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, మధ్వాచార్యులు గాని, క్రిస్టియన్లు కొలుచుచున్న ఏసుక్రీస్తు కానీ, ముస్లింలు కొలుచుచున్న అల్లా కానీ బౌద్ధము ఆరాధించుచున్న బుద్ధుడు కానీ శరణాగతి చేయదగినవారే. ప్రతి అణువు నందు వ్యాప్తమై యున్న బ్రహ్మయే సత్యము, దానిని తెలుసుకొనుటయే ముక్తికి ఉపాయము అని వేదకాలపు మహర్షులు, ఎకైక మాత్రుడైన పరమాత్మ భజనయే ఉన్నతికి మార్గమని అదియే సత్యమని త్రేతాయుగ, ద్వాపరయుగంలలో, ఆత్మయే సత్యము కఠోరమైన తపస్సు ద్వారా ఆత్మ సుదర్శనం అగునని మహావీరుడు, నిర్వాణము ద్వారా ఉన్నత స్థితి పొందవచ్చని గౌతమ బుద్ధుడు, ప్రార్థన వలన ఈశ్వరుడుని పొందవచ్చని జీసస్, సర్వాంతర్యామి అయిన అల్లా తప్ప వేరొక భగవంతుడు లేడని మహమ్మద్ ప్రవక్త, బ్రహ్మమే సత్యం, జగత్తు మిథ్య. జీవునకు, బ్రహ్మమునకు భేదం లేదు అని ఆది శంకరాచార్యులు, రామ నామమే స్థిరమైనది అని సంత్ కబీర్ దాస్, ఒక్క ఓంకారమే శాశ్వతమైనది. అది సద్గురు అనుగ్రహము వలననే సిద్ధిస్తుంది అని నానక్, నిత్యుడు, శాశ్వతుడు, అమర్త్యుడు అయిన భగవంతుని ప్రార్థించుమని,ఆ పరమాత్మ శాశ్వత నామమే "ఓం" అని దయానంద సరస్వతి, ఇంకా అనేక మంది గురువులు బోధించారు. **తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!, తత్ప్ర సాధాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్** (భ.గీ.18/62) హే భారతా! సంపూర్ణ భావంతో ఈశ్వరుడుని శరణు పొందు. ధ్యానం హ్రుదయం లో చేయండి. ఇది తెలిసి కూడా గుడి, మసీదు, చర్చి

లేదా ఇతరత్రా వెతకడం, సమయాన్ని వృథా చేయడమే. (స్వామి అడగడానంద "యథార్థ గీత” నుంచి సేకరణ).

హిందూ మతము వేదకాలం నుంచి కొనసాగుతున్న ఒక మహావృక్షము లాంటిది. ఇతర మతాలు, ధర్మాలు ఆ మహావృక్షమునకు కొమ్మలు లాంటివి. అశాశ్వతమైన అట్టి కొమ్మలను చూచి వృక్షమూలము అసూయ పడునా? ద్వేషించునా? ద్వేషించినచో భగవత్ సాన్నిధ్యము కలుగునా? అహంకారం, ద్వేషము,అసూయ లేనప్పుడు అందరూ భాగవుతులుగా గోచరిస్తారు.

శ్రీరామాయణములో శ్రీరామునికి ఏ వర్ణము నందు కానీ, వర్గము నందు కానీ బేధభావము లేదు. మానవులను (తక్కువ జాతియైన శబరి, గుహుడు తో సహా), పశుపక్ష్యాదులు, వానరులను, తిర్యక్కులను, రాక్షసులను ఒకే విధముగా చూచారు. నేటి సమాజములో అట్టి బేధభావము నాశనము చేసి రాముని ఆదర్శముగా తీసుకోవలసిన అవసరము ఎంతైనా యున్నది. అహంకారం, ద్వేషము,అసూయ లేకుండా తాను నమ్మిన పరమాత్మ/గురువును శరణు పొందుటయే శరణాగతి లక్షణము.

## 6.14 విభీషణ శరణాగతి

యుద్ధకాండలోని విభీషణ శరణాగతి వేద సారమగు ఉపనిషత్తు. రక్షణమునకు శరణాగతియే సాధనమని విభీషణుడు నిరూపించాడు.

విభీషణుడు ఎంత ప్రయత్నించినను రావణునకు తన హితవాక్యములు రుచించలేదు. అప్పుడు విభీషణుడు సోదరులను, భార్యాబిడ్డలను, పరివారమును, లంకను వీడి రాముని శరణాగతాభిలాషియై ఆకాశమునకు ఎగిరి వానరులు విడిది చేసి యున్న సముద్ర తీరమునకు అనలుడు, శరభుడు, సంపాతి, ప్రఘసుడు అను నలుగురు సచివులతో కలసి వచ్చి ఆకాశములో నిలబడెను. రామరక్షణమున జాగరూకులై యున్న వానరులు అందరూ ఒక్కసారే

చూచిరి. రాముని యందు ప్రేమ అందరికి సమానమే. ఆ సన్నివేశమును చూచిన సుగ్రీవునకు శంక కలిగినది. సుగ్రీవుడు మనస్సులో అతను దూత కాదని, శత్రువే అని నిశ్చయించుకొని హనుమంతాది వానరులతో వచ్చినవాడు మనలను చంపుటకు వచ్చినాడు కావున జాగరూకతతో యుండవలసినదిగా ఆదేశించెను. అంత విభీషణుడు సుగ్రీవాది వానర యోధులను చూచి బిగ్గరగా ఇట్లు నుడివెను.

**రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః**
**తస్యాఽహమ్ అనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః**
**తేన సీతా జనస్థానా ద్ధృతా హత్వా జటాయుషమ్**
**రుద్ధా చ వివశా దీనా రాక్షసీభిః సురక్షితా**
**తమ్ అహం హేతుభి ర్వాక్యై ర్వివిధై శ్చ న్యదర్శయమ్**
**సాధు నిర్యాత్యతాం సీతా రామా యేతి పునః పునః**
**న చ స ప్రతిజగ్రాహ రావణః కాల చోదితః**
**ఉచ్యమానో హితం వాక్యం విపరీత ఇవౌషధమ్**
**సోఽహం పరుషిత స్తేన దాస వచ్చాఽవమానితః**
**త్యక్త్వా పుత్రాం శ్చ దారాం శ్చ రాఘవం శరణం గతః**
**సర్వ లోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే**
**నివేదయత మాం క్షిప్రం విభీషణమ్ ఉపస్థితమ్**

"మిగుల క్రూరుడైన రాక్షస రాజైన రావణునికి నేను తమ్ముడను. విభీషణుడను. దండకారణ్యము నుండి సీతాదేవిని అపహరించి, తనకు అడ్డుగా వచ్చిన జటాయువును సంహరించెను. నిస్సహాయురాలైన ఆ సాధ్వి ప్రస్తుతము రాక్షస స్త్రీల కాపలాలో నిర్బంధములో యున్నది. నేను సీతాదేవిని సాదరముగా అప్పగించమని అనేకములైన వచనములు యుక్తియుక్తముగా హితము చెప్పితిని. వాటినన్నింటిని పెడచెవిన పెట్టి నన్ను పరుషముగా దూషించాడు. అట్టి దురుసుతనమును సహింపలేక నేను భార్యాపుత్రులను వీడి రఘువీరుని శరణు

జొచ్చుటకై వచ్చితిని. సమస్త లోకములకు రక్షకుడు, పరమాత్ముడు అయిన శ్రీరామచంద్ర ప్రభువునకు విభీషణుడు శరణు గోరి తమ సమీపమునకు వచ్చి యున్నాడు" అని వెంటనే విన్నవించుడు. అప్పడు సుగ్రీవుడు త్వరగా రాముని యొద్దకు యేగి శత్రు పక్షము వాడైన విభీషణుడు వచ్చి యున్నాడు కావున తగిన వ్యూహ రచన చేసి ఆలోచన చేయవలసినదిగా విన్నవించాడు. శ్రీరాముడు సుగ్రీవుని ప్రేమను ఎరిగిన వాడు. విభీషణుడు తన యందు ధృడమైన విశ్వాసముతో ఉన్నాడని గుర్తించాడు. ప్రేమచే సుగ్రీవాదులు కాదనుచున్నారు కనుక వారిని అంగీకరింప చేసి వారి చేతనే చెప్పించవలెనని తలఁచెను. అప్పుడు శరణాగతవత్సలుడుగా వాసిగాంచిన శ్రీరాముడు సుగ్రీవుని మాటలను విని అక్కడే చేరువలో యున్న హనుమదాది వానర ప్రముఖులతో ఇట్లు నుడివెను.

**య దుక్తం కపి రాజేన రావణాఽవరజం ప్రతి**
**వాక్యం హేతుమ దఽత్యఽర్థం భవద్భిరఽపి త చ్ఛ్రుతమ్**
**సుహృదా హ్యఽర్థ కృచ్ఛ్రేషు యుక్తం బుద్ధిమతా సతా**
**సమర్థే నాఽపి సందేష్టుం శాశ్వతీం భూతి మిచ్ఛతా**

"రావణుని తమ్ముడైన విభీషణుని గూర్చి, సుగ్రీవుడు సహేతుకంగా పలికిన మాటలు త్రోసిపుచ్చరానివి. కావున సందర్భమును అనుసరించి ఒక మిత్రుడు చెప్పినాడు గదా యని తక్కిన వారు మిన్నకుండరాదు. ప్రజ్ఞాశాలియు, సత్పురుషుడు, శ్రేయస్సును గోరువాడు, సమర్థుడు ఐన మిత్రుడు కార్యసంకటములు ఏర్పడినప్పుడు (సమస్యలు ఎదురైనప్పుడు) తగు సూచనలను అందించుట యెంతయేని యుక్తము. కనుక మీ ఆలోచనలను నిస్సంకోచముగా తెల్పుడు". అనెను. రాముడిట్లు అడుగగానే వానరులు తమ తమ అభిప్రాయములు తెలియ జేసినారు. అంగదుడు విభీషణుడు శరణాగతుడే గాని, శత్రుపక్షము నుండి వచ్చినాడు గావున శంకింప వలయును అని అన్నాడు.

జాంబవంతుడు ఇంతకు మునుపు ఎప్పుడు రాకుండా సమయము కాని యుద్ధ సమయములో వచ్చినాడు గావున  శంకించ వలెను అని అన్నాడు.

## 6.15 శరణుగోరినవానికి ఆశ్రయము ఇచ్చుటయే యుక్తమని హనుమ పలుకుట

సకల శాస్త్ర కోవిదుడైన హనుమ ఈ విధముగా చెప్పు చున్నాడు. సకల శాస్త్రములను అభ్యసించుట వలన చక్కని సంస్కారము అబ్బినవాడైన హనుమ అర్థవంతములైన మధుర వచనములను సంక్షిప్తముగా ఇట్లు పలికెను.

**న భవన్తం మతి శ్రేష్ఠం సమర్థం వదతాం వరమ్**
**అతిశాయయితుం శక్తో బృహస్పతి రఽపి బ్రువన్**
**న వాదా న్నాఽపి సంఘర్షా న్నాఽధిక్యా న్న చ కామతః**
**వక్ష్యామి వచనం రాజన్ యథాఽర్థం రామ గౌరవాత్**
**అర్థాఽనర్థ నిమిత్తం హి య దుక్తం సచివై స్తవ**
**తత్ర దోషం ప్రపశ్యామి క్రియా న హ్యుపపద్యతే**
**ఋతే నియోగా త్సామర్థ్యమ్ అవబోద్ధుం న శక్యతే**
**సహసా వినియోగో హి దోషవాన్ ప్రతిభాతి మే**
**చార ప్రణిహితం యుక్తం య దుక్తం సచివై స్తవ**
**అర్థ స్యాఽసంభవా త్తత్ర కారణం నోపపద్యతే**
**అదేశ కాల సంప్రాప్త ఇత్యఽయం య ద్విభీషణః**
**వివక్షా చాఽత్ర మేఽస్తియం తాం నిబోధ యథా మతి**
**స ఏష దేశః కాల శ్చ భవ తీహ యథా తథా**
**పురుషాత్ పురుషం ప్రాప్య తథా దోష గుణావఽపి**
**దౌరాత్మ్యం రావణే దృష్ట్వా విక్రమం చ తథా త్వయి**
**యుక్త మాఽఽగమనం తస్య సదృశం తస్య బుద్ధితః**
**అజ్ఞాత రూపైః పురుషైః స రాజన్ పృచ్ఛ్యతామ్ ఇతి**

**యదుక్త మఽత్ర మే ప్రేక్షా కాచి దఽస్తి సమీక్షితా**
**పృచ్ఛ్యమానో విశంకేత సహసా బుద్ధిమాన్ వచః**
**తత్ర మిత్రం ప్రదుష్యేత మిథ్య పృష్టం సుఖాఽఽగతమ్**
**అశక్యః సహసా రాజన్ భావో వేత్తుం పరస్య వై**
**అన్తః స్వభావై ర్గీతై స్తై ర్నైపుణ్యం పశ్యతా భృశమ్**
**న త్వఽస్య బ్రువతో జాతు లక్ష్యతే దుష్ట భావతా**
**ప్రసన్నం వదనం చాఽపి తస్మా న్మే నాఽస్తి సంశయః**
**అశంకిత మతిః స్వస్థో న శఠః పరిసర్పతి**
**న చాఽస్య దుష్టా వాక్చాఽపి తస్మా న్నాఽస్తి హ సంశయః**
**ఆకార శ్ఛాద్యమానోఽపి న శక్యో వినిగూహితుమ్**
**బలా ద్ధి వివృణో త్యేవ భావ మఽన్తర్గతం నృణామ్**
**దేశ కాలో పపన్నం చ కార్యం కార్య విదాం వర**
**స్వ ఫలం కురుతే క్షిప్రం ప్రయోగేణాఽభిసంహితమ్**
**ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యా వృత్తం చ రావణమ్**
**వాలిన శ్చ వధం శ్రుత్వా సుగ్రీవం చాఽభిషేచితమ్**
**రాజ్యం ప్రార్థయమాన శ్చ బుద్ధి పూర్వమ్ ఇహాఽఽగతః**
**ఏతావ త్తు పురస్కృత్య యుజ్యతే త్వఽస్య సంగ్రహః**
**యథా శక్తి మయోక్తం తు రాక్షసస్యాఽఽర్జవం ప్రతి**
**త్వం ప్రమాణం తు శేషస్య శ్రుత్వా బుద్ధిమతాం వర**

రామా! నీవు గొప్ప ప్రజ్ఞాశాలివి, సర్వ సమర్థుడవు. నేను వాక్చాతుర్యమును ప్రకటించుటకు గాని, ఇతరులతో పోటీపడి బుద్ధిమంతుడను అని స్వాభిమానమును ప్రకటించుకొనుటకు గాని, ఏ విధమైన ప్రయోజనములు ఆశించి

గాని కాకుండా ప్రస్తుత కార్యము యొక్క ప్రాముఖ్యమును దృష్టిలో పెట్టుకొని యదార్ధములను పలుకుచున్నాను.

ఎవరినైనను రాజ కార్యము నందు నియోగించనిదే వారి సామర్ధ్యమును తెలుసుకొనే వీలు కాదు. కొత్త వారికి కార్య భారమును అప్పగించుటయు సరికాదు. కావున విభీషణుని విషయమున ఈ ధర్మ సూత్రము వర్తించును.

గూఢచారుల ద్వారా ఈయన యొక్క గుణదోషములను నిర్ణయించుట యుక్తమని తెలిపి యున్నారు. దూర ప్రదేశములు యందున్న శత్రువుల వృత్తాంతము తెలుసుకొనుటకు గూఢచారులను నియుక్తము చేయవచ్చు కానీ సమీపాన యున్న వారి విషయములో దీనివలన ప్రయోజనము శూన్యము. విభీషణుడు ఇచ్చటికి వచ్చుట దేశకాలానుగుణము కాదని చెప్పి యున్నారు. కానీ వాస్తవముగా ఇదియే తగిన సమయము. రావణుని లోని మరియు నీలోని గుణదోషములను ఎరిగి యున్నాడు గనుక విభీషణుడు ఇచ్చటికి వచ్చుట సమంజసమే మరియు ఇది అతని బుద్ధి కుశలతను నిదర్శనము. అపరిచితులైన వ్యక్తుల ద్వారా ఇతని వృత్తాంతము తెలుసుకొనే వలెననే సూచన ప్రయోజన కారము కాదు ఏలనన అపరిచితులైన వ్యక్తులు అనువుగాని విధముగా ప్రశ్నించినచో అతని మనస్సు చివుక్కుమని మనకు సహాపడుటకు విముఖుడు కావుట వలన మనము ఒక మంచి మిత్రుని కోల్పోవుదము. అంతియే గాక క్షణ కాలములో అతని యొక్క భావములను పసిగట్టుట అశక్యము. అతని ముఖము ప్రసన్నముగా యున్నది గావున అతని మాటలలో ఎట్టి కపటము కనబడుట లేదు కావున సందేహించ వలసిన పని లేదు. ప్రయత్నపూర్వకంగా మనోభావములను దాచుకొనుటకు ప్రయత్నించినను అవి ముఖకవళికలలో బయిట పడును. అవి కనబడుట లేదు. కార్యములను చక్కగా దేశకాలములకు అనుగుణముగా ఆచరించినచో అవి వెంటనే సత్ఫలితములు ఇచ్చును. రావణుని మిథ్యాప్రవర్తనను, మీ కార్యదక్షతను, వాలిని వధించి సుగ్రీవుని పట్టాభిషేకము

చేసిన విషయము ఎరింగియే యున్నాడు కావున ఇతను తనకు రాజ్యలాభము కలుగునని ఇచ్చటికి వచ్చి యుండవచ్చు".
ఈ విధముగా విభీషణుని సరళ స్వభావమును, నిర్దోషిత్వమును హనుమ రామునికి తెలియజేసి కార్యభారమును మీకు (రామునికి) నచ్చిన విధముగా ఆచరింపుమని చెప్పెను.
శరణాగతి చేయువారికి **"స ఏష దేశః కాల శ్చ భవతి"** అని హనుమ చెప్పిన మాట పరమ ప్రమాణము. శరణాగతి పొందుటకు దేశకాలములతో నిమిత్తము లేదు. రజస్వల అయిన ద్రౌపదిని సభలోకి ఈడ్చుకొని రాబడినప్పుడు, అర్జునుడు ఏమి చేయలేని స్థితిలో యుద్ధభూమిలో ఉన్నప్పుడు, గజేంద్రుడు చివరి సమయములో, రాముని బ్రహ్మాస్త్రము వెంటాడుచుండగా కాకిని శరణాగతి చేయలేదా! అందుచేత శరణు పొందుటకు ధృడమైన విశ్వాసము ముఖ్యము గాని దేశకాలములు కాదు. ఇక రాముడు తన నిర్ణయము తెలియజేయుచున్నాడు.

## 6.16 విభీషణునికి శరణాగతి నిర్ణయము శ్రీరాముడు ప్రకటించుట

శ్రీరాముడు సుగ్రీవాదుల యొక్క మాటలకు ఎట్టి వికారములుకు లోను కాకుండా హనుమ వచచనములకు ప్రసన్న చిత్తుడయ్యెను. ఆ మహాత్ముడు స్థిరచిత్తములో తనలోని భావములను ఇట్లు వెల్లడించెను.

**మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కథం చన**
**దోషో యద్యఽపి తస్య స్యాత్ సతామ్ ఏత దఽగర్హితమ్**
**న సర్వే భ్రాతర స్తాత భవంతి భరతోపమా:**
**మద్విధా వా పితు: పుత్రా సుహృదో వా భవద్విధా:**
**సుదుష్టో వాఽప్యఽదుష్టో వా కిమేష రజనిచర:**
**సూక్ష్మ మఽప్యఽహితం కర్తుం మమాఽశక్త:కథంచన**
**పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృధివ్యాం చైవ రాక్షసాన్**

**అంగుళ్యఽగ్రేణ తాన్ హన్యా మిచ్ఛన్ హరి గణేశ్వర**
**బద్ధాఽంజలి పుటం దీనం యాచంతం శరణాఽఽగతం**
**న హన్యా దాఽఽనృశంసాఽర్థ మఽపి శత్రుం పరంతప**
**ఆర్తో వా యది వా దృప్త: పరేషాం శరణాగత:**
**అపి ప్రాణాన్ ప్పరిత్యజ్య రక్షితవ్య: కృతాత్మనా**
**న చే ద్భయా ద్వా మోహా ద్వా  కామా ద్వాఽపి న రక్షతి**
**స్వయా శక్త్యా యథా సత్త్వం త త్పాపం లోక గర్హితం**
**వినష్ట: పశ్యత స్తస్యా రక్షిణ శ్శరణాఽఽగత:**
**ఆదాయ సుకృతం తస్య సర్వం గచ్ఛే దఽరక్షిత:**
**సకృదేవ ప్రపన్నాయ తవాఽస్మీతి చ యాచతే**
**అభయం సర్వ భూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ**

మిత్ర భావములతో (శరణుగోరి) నా కడకు వచ్చిన వానిని ఏది ఏమైనను త్యజింపను (నిరాకరింపను). ఒకవేళ అతనిలో దోషమేమి యున్నను దానిని పట్టించుకొనరాదు. సత్పురుషులు దోషులకు ఆశ్రయమిచ్చుట తప్పు కాదు. ఇక్కడ హనుమ విభీషణునిలో దోషములు కనబడుట లేదు కావున స్వీకరించ వచ్చు అన్నాడు కాని శరణాగతుడు గనుక స్వీకరింపవలెను అని రాముని భావము. శరణాగతిలో దోషములు ఎంచరాదు. అంతియే గాకుండా అతను శరణాగతుడు అనకుండా మిత్రుడు అన్నాడు. వానిని వదలను అని అనకుండా వదలలేను, వదలుటకు నాకు శక్తి చాలదు అన్నాడు. రాముని శరణాగత రక్షణ **న త్యజేయం కథం చన** ఏమైనను వదలలేను అనుటలో తెలియు చున్నది. నిర్మల హృదయులైన జ్ఞాతులు తమ బంధువులను హితైషులుగానే భావింతురు. కాని సహజముగా జ్ఞాతి అయిన విభీషణుని రావణుడు శంకించినాడు. యీతడు మనలను వదలడు. మనము అతని కులము వారము కాము. వారి రాజ్యముపై మనకు ఆశ లేదు. యీతడు మన సహాయముతో రావణుని రాజ్యమును

పొందవలెనని కోరి యుండవచ్చు. రక్షణకై మన వద్దకు వచ్చినాడు. కనుక ఈతనిని స్వీకరింప వచ్చును. ప్రపంచములో భరతుని వంటి పుత్రులు యుండరు. తండ్రికి నా వంటి పుత్రులుండరు. సుగ్రీవుని వంటి మిత్రులు ఉండరు. (రామాయణములో మనకు ముగ్గురు సోదరులు కనబడును. ఒకటి రామలక్ష్మణభరతశత్రుఘ్నులు - పరస్పరానురాగముతో అన్యోన్యముతో ప్రపంచమునకు ఆదర్శులైనారు, వాలిసుగ్రీవులు - వాలి తమ్ముడి వచనములపై అపనమ్మకంతో అతని దోషము ఏమియులేకున్నను, కుశ్చిత బుద్ధితో రాజ్యమును అపహరించినాడు అనే అనాలోచనతో రాజ్య బహిష్కరణయే గాకుండా,చంపవలెనని కూడా తీవ్ర ప్రయత్నాలు చేసినాడు. రావణకుంభకర్ణవిభీషణులు పరస్పర విరుద్ధ భావములు గలవారు. రావణుని అహంకారము, కామము వలన సర్వ రాక్షస జాతి నాశనమునకు కారణమైనాడు. సోదరుల అభిప్రాయమునకు రావణుడు విలువ నీయలేదు. ఇంకను సుగ్రీవుని మాటలలోని మర్మమును ఎరిగిన రాముడు శరణాగతుడైన విభీషణుని తప్పక రక్షించవలెనని నిశ్చయించుకొని మేలైన వచనములు చెపుతూ ... సుగ్రీవా! ఈ రాక్షసుడు దుష్టుడైనను, దుష్టుడు గాకున్నను, ఏవిధముగా నైనను, ఏకొంచెముగా నైనను నాకు కీడు చేయగలడా? వానరేంద్రా! నేను తలచుకొన్నచో ఈ లోకమున గల పిశాచములు, దానవులను, యక్షులను, రాక్షసులను కొన గోటితోనే మట్టుపెట్టెదను. అయినచో నీవెందుకు లంకలో యున్న ఒక రాక్షసుని చంపక ఊరకుంటివి అందువేమో! **ఇచ్ఛన్** సంకల్పించినచో చంపగలను. కానీ వారిని ధర్మ మార్గమున నడచునట్లు చేయుటయే నా ప్రయత్నము. శత్రువైనను అంజలి ఘటించి, దీనుడై శరణు జొచ్చి, అనుగ్రహింపుమని ప్రార్థించినచో అతనికి హాని చేయరాదు. శత్రువు ఆర్తుడైనను, గర్వించినవాడైనను, తన ప్రతిపక్షం వారిని శరణు జొచ్చినప్పుడు వారు నిశ్చయ బుద్ధితో తమ ప్రాణములను ఒడ్డియైనను అతనిని కాపాడవలెను.

భయపడిగాని, ఆపద్ధర్మమును ఎరుగక గాని, స్వార్ధబుద్ధితో గాని, శక్తిగలవాడై యుండియు ఏదేని నెపముతో ఆ శరణు జొచ్చిన వాడిని రక్షింపనిచో అతడు ఈ లోకమున నిందలపాలగుటయే గాక మీదు మిక్కిలి నరక బాధలను గూడ పొందును. శరణు జొచ్చిన వానిని రక్షింపకుండా యుండినచో ఆ శరణాగతుడు నష్టపోవుటయే గాక ఇతని సమస్త సుకృతములను తీసుకొనిపోవును. అనగా శరణాగతుని రక్షింపని వారియొక్క సుకృతములన్ని నశించును. శరణాగతులను రక్షింపకుండుట మహాదోషము. "నేను నీవాడను" అని పలుకుచు ఎవ్వరైనను ప్రపత్తితో నన్ను శరణుగోరినచో వారికి (సకల ప్రాణులకు) అభయమిత్తును (వారిని రక్షింతును) ఇది నా వ్రతము. అందుకు సంతృప్తి చెందిన సుగ్రీవుడు, రాముని ఆనతిపై విభీషణుని సమాగమునకు త్వరపడెను.

### 6.17 విభీషణుడు రావణుని బల సంపదలు తెలుపుట

శ్రీరాముడు అభయము ఒసగినాడని తెలియుట తోడనే విభీషణుడు, రామదాస్యము లభించిందనే మహా ఆనందముతో ఆకాశము నుండి నిలబడి సాష్టాంగము ఒనర్చినాడు. తనను ఆదరించి, తన యందు యున్న ప్రేమను ప్రకాశింప జేసినప్పుడు ఆనందము పట్టలేక ఆర్తితో పాలు త్రాగెడి శిశువు తల్లి పాలిండ్లమీదనే పడినట్లు రాముని పాదములపై పడినాడు. **సర్వలోక శరణ్యాయ శ్రీరాఘువాయ మంగళం**. రాముడు శరణాగతి చేయుటకు తగిన గుణములు గలవాడు. విభీషణుడు శ్రీరామునితో ఇట్లు చెప్పుచున్నాడు. రామా! నేను రావణుని తమ్ముడను. ఇట్లు అనుటచే భగవత్ప్రాప్తికి వలసిన యోగ్యత తనకు లేదేమోనని సూచించాడు. రావణుడు నన్ను అవమానించాడు. లోకములోని సకల ప్రాణులకు నీవే శరణమని, రక్షింప సమర్థుడని ఎరిగి నిన్ను శరణు పొందినాను. రావణునికి అతని అహంకారము వలన ఈ భాగ్యము కలుగలేదు. నీకంటే వేరొకటి పొందుటకు వేరే ఏమి లేదని జన్మభూమిని, మిత్రులను, కుటుంబమును, సకల సంపదలను వదలి వచ్చినాను. అప్పుడు రాముడు మృదుమధురంగా,

ఓదార్చుతూ రాక్షసుల యొక్క బలాబలముల గురించి యథాతథముగా తెలియ చేయ వలసినదిగా అడుగుతాడు.

రాముడట్లు అడుగగానే విభీషణుడు రావణుని బలమును చెప్పుటకు ఆరంభించెను. రావణునకు సర్వావధ్యత్వము అనగా ఎవరి చేతను చావులేకుండా బ్రహ్మ వరమును ఒసగినాడు. గంధర్వులు, అసురులు, రాక్షసులు మొదలగు సర్వ భూతములచే అతడు అవధ్యుడు. రావణునికి తమ్ముడు, నాకు అన్న అయిన కుంభకర్ణుడు మహాయోధుడు, మహాబలశాలి. ప్రహస్తుడు రావణుని సేనాధిపతి. అతడు కుబేరుని సేనాధిపతియైన మణిభద్రుని ఓడించెను. ఇంద్రజిత్తు యుద్ధసమయము నందు చేతి వ్రేళ్ళకు బలమైన తొడుగులు దాల్చును. అతని కవచము అభేధ్యము. యుద్ధములో అతడు ఎదుటి వారికి కనబడకుండా మాయమగును. యుద్ధ సమయములో అదృశ్యుడై అగ్నిహోత్రుని హోమముచే తృప్తి పరచి వచ్చి శత్రువులను చంపును. ఇంకా రావణుని సైన్యములో ఇంద్ర, యమ, వరుణాది లోకపాలకులతో సమానులగు మహోదరుడు, మహాపార్శ్వుడు, అకంపనుడు మొదలగు వారున్నారు. అంతియే గాక కోట్లకొలది రాక్షసులు కామరూపులు, రక్తమాంసములను భక్షించువారు. రావణుడు లోకపాలకులను, దేవతలను జయించెను.

**ఏవ ముక్త స్తు సౌమిత్రి రఃభ్యషించ ద్విభీషణమ్**

**మధ్యే వానర ముఖ్యానాం రాజానం రామ శాసనాత్**

అందుకు రాముడు సంతసించి, రావణుని శక్తిసామర్థ్యములను బాగుగా వివరించితివి. రావణుని, అతని బంధుమిత్రులను, ప్రహస్తుడుతో సహా అందరి యోధులను రణభూమికి బలి ఇచ్చి నిన్ను లంకకు రాజును చేసెదను అని చెప్పి లక్ష్మణునితో సముద్ర జలమును తెప్పించి, ఆ సముద్ర జలముతో విభీషణుని లంకకు రాజుగా అభిషేకము చేసెను.

రావణ రాజ్యమును విభీషణుడు కోరలేదు. అతడు కోరినది రామకైంకర్యమే. శత్రుపక్షము నుండి వచ్చినాడు, శంకింపదగినవాడు అని అనుకొనిన వాడు రాజుగా మారినాడు. ఇది రాముని కటాక్షము. ఇదియే శరణాగతి యొక్క విశేషము. రాముడు ఇంకను సైన్యముతో సముద్రమును దాటలేదు, యుద్ధము చేయలేదు, రావణుని చూడలేదు, చంపునో లేదో తెలియదు, ముందే విభీషణునికి పట్టాభిషేకము చేసినాడు. ఇది రాముని సర్వ శక్తిత్వమును ప్రకాశింప చేసినది.

## 6.18 శ్రీరాముడు సముద్రునిపై బ్రహ్మాస్త్రమును సంధించుట

హనుమ, సుగ్రీవుడు విభీషణునితో ఈ సాగరమును దాటుటకు అశక్యముగా యున్నది గావున తగిన ఉపాయము సూచించుమని కోరెను. సుగ్రీవుడు ఇట్లు పలుకగానే విభీషణుడు తనకు తెలిసిన ఉపాయము శరణాగతియే గావున రామచంద్రప్రభువు సముద్రుని శరణాగతి చేసినచో సముద్రుడు తప్పక దారి ఇచ్చునని అంతియేకాక ఇక్ష్వాకు ప్రభువుల వలన తనకు కలిగిన మేలును గుర్తు పెట్టుకొని అయినా సముద్రుడు సహాయము చేయునని సూచించాడు.

అన్ని ఉపాయములు కంటే శరణాగతి తప్పక ఫలమును ఇచ్చెడిదే కానీ ఎవరు ఎవరిని చేయవలెను అను నియమము యున్నది. శ్రీరాముడు సర్వసమర్థుడు కనుక విభీషణుని శరణాగతి ఫలించింది. అంతియేగాక శ్రీరామునికి తనను తాను రక్షించుకోవడమే గాక సకల లోకములను రక్షించు సామర్థ్యము కలదు. సముద్రుని శక్తి శ్రీరాముని శక్తితో ఏ విధముగానూ సరిపోలదు. అటువంటప్పుడు శ్రీరాముడు సముద్రుని శరణాగతి చేయుట ఏ విధముగానూ సమర్థనీయము, ఆచరణ సాధ్యము కాదు. అయినను సుగ్రీవుని కోరిక మేరకే (సుగ్రీవుని చిన్నబుచ్చడము ఇష్టములేక) రాముడు సముద్రుని శరణు పొందుటకు నిశ్చయించుకొనెను. అప్పుడు రాముడు చిన్నచిన్న గులక రాళ్లతో, గండ్ర ఇసుకతో నిండిన సముద్ర తీరము నందు నేలపై దర్భలు పరచుకొని సముద్రునకు నమస్కరించి పరుండెను. సర్వలోకములను రక్షించు సమర్థుడైన రాముడు, లోకులందరిచే రక్షణకై

నమస్కరింపబడువాడైన రాముడు తన రక్షణకై సముద్రునకు నమస్కరించి ప్రాయోపవేశము చేయ సిద్ధపడెను. **ఏవ ముక్తః కుశాఽఽస్తీర్ణే తీరే నద నదీపతేః సంవివేశ తదా రామో వేద్యా మివ హుతాశనః** ఈ విధముగా మూడు రాత్రులు ఉపాసించెను. శరణాగతి స్వరూపమును లోకమునకు విశదీకరించుటకై ఆ విధముగా ఉపాశించినాడు గాని శక్తిలేక గాదు. మూడు రాత్రులు అయినను సముద్రుడు రాకపోవుటచే రాముడు క్రుద్ధుడాయెను.

**ప్రశమశ్చ క్షమా చైవ ఆర్జవమ్ ప్రియవాదితా,**
**అసామర్థ్యం ఫలన్త్యేతే నిర్గుణేషు సతాం గుణాః**
**ఆత్మ ప్రశంసినం దుష్టం ధృష్టం విపరిధావకమ్**
**సర్వత్రో త్సృష్ట దణ్డం చ లోకః సత్కురుతే నరమ్**
**న సామ్నా శక్యతే కీర్తి ర్న సామ్నా శక్యతే యశః**
**ప్రాప్తుం లక్ష్మణ లోకేఽస్మిన్ జయో వా రణ మూర్ధని**
**చాపమ్ ఆనయ సౌమిత్రే శరాం శ్చాఽఽశీ విషోపమాన్**
**సాగరం శోషయిష్యామి పద్భ్యాం యంతు ప్లవంగమా:**
**అద్యాఽక్షోభ్య మఽపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరమ్**

సత్పురుషులు మంచి గుణములు గలిగి యుందురు. ఓరిమి, ఇంద్రియ నిగ్రహము, మనోవాక్కాయములలో ఋజుత్వము, ప్రీతీ గలిగించు మాటలు వారికి సహజముగా యుండును. కానీ గుణహీనులు ఆ సత్పురుషుల మంచి గుణములను లెక్కజేయరు. వారిని అసమర్థులుగా జూతురు. చూడుము సముద్రుని గర్వము. క్రోధము లేకుండా ఎదుటి వారి అపరాధమును ఓర్చుకొనుచు ఎదుటి వారి మనసును అనుసరించి మాయలేక ప్రియముగా మాటలాడెడివాడిని అసమర్థులు అని తలతురు. ఎవడు తనను తాను స్తోత్రము చేసుకొనుచు తన గొప్పలు తానే చెప్పుకొనుచు ఇతరులను వంచించుతూ

దయలేని వాడై తన దుష్టవ్యాపారములచే అందరూ తనను చూచి పారిపోవునట్లు చేయుచుండునో, మంచివారిని చెడ్డవారిని కూడా ఎవడు హింసించుచుండునో వానిని లోకము గౌరవించును. మంచి మాటలచే కీర్తి, యశస్సు రాదు. పరాక్రమముచేతనే అది సిద్ధించును. లక్ష్మణా! నేను ఓర్చి నిరీక్షించుట వలన సముద్రుడు నన్ను చేతగాని వానిగా తలచుచున్నాడు. సౌమిత్రీ! నా ధనస్సును, విషసర్పముల వలే భయంకరములైన నా బాణములను అందించుము. క్షణములో ఈ సముద్రమును శుష్కింప చేయుదును. అప్పుడు వానరులు అందరూ నడచియే వెళ్ళగలరు. సముద్రము ఎన్నడూ శుష్కింపదు అనునది లోక ప్రశిద్ధి. దానిని వమ్ము చేసెదను. ఇట్లు పలికి రాముడు కోదండము చేపట్టి ప్రళయకాలములో ప్రజ్వరిల్లుచున్న అగ్నివలె ఎవ్వరిచేతను చేరుటకు శక్యము కానివాడై వజ్రము లాంటి బాణములను సముద్రములోనికి వదిలెను. అప్పుడు మొసళ్ళు, తిమింగలములు మున్నగు భీకర సత్వములతో నిండిన ఆ మహాసముద్రము క్షోభించెను. లక్ష్మణుడు వారించినను ఆపకుండా శ్రీరాముడు అమోఘమైన శరమును సంధించి బ్రహ్మాస్త్ర మంత్రమును పాటించుతూ వింటినారిని లాగెను. అంతటా భూమ్యాకాశములు బ్రద్దలగుచున్నట్లు లోకమంతయు కంపించెను. ఆ మహాసముద్రము తన పరిధిని ధాటి ఒక యోజన పర్యంతము అతిక్రమించెను. సముద్రము కొన్ని యోజనముల వరకు లోలోపలకు పోసాగెను. అప్పుడు సముద్రుడు మధ్యభాగమున ఒక్కసారి పైకెగసి రాముని సమీపమునకు చేరి దోసిలి యొగ్గి ఇట్లు విన్నవించెను. "నేను జలములకు స్థానమగు సముద్రమును. అగాధముగా యుండుట నా స్వభావము. దాటుటకు శక్యము గాకుండా యుండుట నా లక్షణము.లోతు తగ్గి మెత్తగా యున్నచో అది నా స్వభావమునకు విరుద్ధము. ఒక కోరిక వలన గాని, లోభము వలన గాని, భయము వలన గాని నేను అగాధములగు జలములను మెరకగా చేయజాలను. కావున సేతువును నిర్మాణము చేసి నన్ను దాటవలెను. అట్టి సేతు

నిర్మాణమునకు ఎట్టి విఘ్నములు కలుగకుండా చేయగలను. నాకు ఉత్తరపు దిక్కున పవిత్రము అయిన ధ్రువకల్పము అనేది ప్రదేశము యున్నది. అక్కడ క్రూరకర్మలు చేయువారు పెక్కు గలరు. వారిపై నీ బాణమును ప్రయోగించుము. నీ సేనలో "నలుడు" అను వాడు విశ్వకర్మ కుమారుడున్నాడు. అతడు సముద్రముపై సేతువును నిర్మింపగలడు. దానిని నేను నిలిచి యుండేటట్లు చేయగలను" అని చెప్పిప్పి సముద్రుడు అంతర్ధానము అయ్యాడు.

## 6.19 సముద్రముపై సేతువును నిర్మించుట

సముద్రుడు చెప్పిన పిమ్మట నలుడు రామునితో ఇట్లు పలికెను. “మందర పర్వతము నందున్న మా తల్లిని ప్రేమించి ఆమె యందు తన అంశచే నేను జనియించగా మా తల్లికి విశ్వకర్మ వరమొసగినాడు కావున నేను సేతువును నిర్మింప గలను. అందుకు వానరులందరూ సేతువు నిర్మాణమునకు సహకరింతురు" అని చెప్పగనే శ్రీరాముడు సేతువు నిర్మాణమునకు ఆజ్ఞాపించెను. అంత పర్వత సదృశులైన వానరులు అడవులలోని అనేక రకములైన చెట్లు, పెద్ద పెద్ద పాషాణములు, పర్వతములు సముద్రములో పడవైచిరి. కొందరు నూరు యోజనముల సముద్రముపై మార్గ నిర్దేశము చేయుచు సూత్రము కట్టిరి. పర్వత శిఖరములను మొదలగు వాటిని ఎత్తి పడవైచి మధ్యలో కర్రలను, గడ్డి మొక్కలను వేసి బంధించిరి. నిర్మాణము మొదలిడిన మొదటి రోజున పదునాలుగు యోజనములు, రెండవ రోజున ఇరువది యోజనములు, మూడవ రోజున ఇరువది ఒక్క యోజనములు, నాలుగవ రోజున ఇరువది రెండు యోజనములు ఐదవ రోజున ఇరువది మూడు యోజనములు నిర్మాణము చేసిరి. ఈ విధముగా నూరు యోజనముల పొడవు, పది యోజనముల వెడల్పుతో సేతు నిర్మాణము

సమాప్తము చేసిరి. అది ఆకాశమున స్వాతి పథము[22] వలె దర్శనీయముగా యుండెను. విభీషణుడు సచివులతో గూడి గదాపాణియై సముద్రము ఆవల శత్రుపక్షము నుండి కాపాడు చుండెను. సేతువు పూర్తి అయిన పిమ్మట రాముడు హనుమ భుజములపై, లక్ష్మణుడు అంగదుని భుజములపై కూర్చుని ధనుర్ధారియై సేనకు అగ్రభాగమున నిలిచి ముందుకు సాగెను.

### 6.20 రామసేతువు ఎక్కడ ఉన్నది?

Dr. Vedhavyasa, IAS, తన "శ్రీరామ చరితామృతము" గ్రంథములో రామాయణములోని లంకకు, ప్రస్తుతము మనకు కనిపించే సింహాళ ద్వీపమైన శ్రీలంకకు సంబంధము లేదని పరిశోధనాత్మక చారిత్రాత్మక ఆధారములతో నిరూపించారు. అవి ఒక్కసారి గమనిద్దాము. రామాయణములో ఎక్కడ "సింహాళము" అనే పేరు కనబడదు. వ్యాస మహర్షి రచించిన సంస్కృత భాగవత పురాణములో సింహాళము వేరుగాను, లంక వేరుగాను వర్ణించబడినది. వాల్మీకి రామాయణము కిష్కింధ కాండ నాలుగవ సర్గలో సుగ్రీవుడు సీతను వెతుకుట కోసము హనుమాధులను దక్షిణ దిక్కుకు పొమ్మనెను. దక్షిణము నకు పోవు మార్గము తెలియ జేస్తూ వింధ్య పర్వత శ్రేణి మొదలుకొని దక్షిణ దిక్కుగా కన్యాకుమారి అగ్రము వరకు చేరవలెను. ఆ తర్వాత నూరు యోజనముల సముద్రమును దాటిన తర్వాత లంకకు చేరవచ్చును. దక్షిణ సముద్రము తాకు చోట మహేంద్రగిరి అను పర్వతము గలదు. హనుమ లంకకు ఆ పర్వతము

[22] సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాదులు ఆకాశమున పయనించు మార్గములను వాయు పురాణము మూడు విధములుగా పేర్కొనుచున్నది అవి క్రమముగా ౧. ఉత్తర మార్గము (అశ్వని, భరణి, కృత్తిక - నాగవీధి, రోహిణి, మృగశిర, ఆరుద్ర - గజవీధి, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష - ఐరావతా వీధి), ౨. మధ్య మార్గము (మఖ, పుబ్బ, ఉత్తర - అర్షభి వీధి, హస్త, చిత్త, స్వాతి - గోవీధి, విశాఖ, అనురాధ, జ్యేష్ఠ రాజగవీధి), 3. దక్షిణ మార్గము (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ - అజవీధి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం - మార్గీ వీధి, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి - వైశ్వానరీ వీధి)

నుంచియే మొదలిడెను. దానిని బట్టి చూడగా పోవలసిన దారిలో మహేంద్ర పర్వతము ముఖ్యమైన కొండ గుర్తు. పశ్చిమ కనుమలలో అరేబియా సముద్రము తీరము పొడవునా గల పర్వత పంక్తులలో మహేంద్ర పర్వతమే ఆఖరిది. దీనికి జరిగిన ముందు సంఘటనలు జాగ్రత్తగా పరిశీలించినట్లయితే శ్రీరాముడు వాలి వధ తర్వాత ప్రస్రవణ పర్వతము (గిరి) వద్ద నాలుగు నెలలు ఒక కొండ గుహలో యున్నాడు. ఇది కిష్కింధకు పశ్చిమముగా అనగా కర్ణాటక రాష్ట్రములోని హోస్పెటకు ఎనిమిది మైళ్ళ దూరములో పదిహేను డిగ్రీల ఉత్తరముగా ప్రస్రవణగిరి అంచులు యున్నవి. ఈ కొండల్లో ఉత్తరంగా యున్న పర్వత శ్రేణిని "వింధ్య పర్వత శ్రేణి" అని పేరు. దీనిని బట్టి చూడగా పశ్చిమ కనుమలను నాలుగు భాగాలుగా చేయగా పదిహేను డిగ్రీల ఉత్తర కొండలను వింధ్య పర్వత శ్రేణి అని, పదిహేను డిగ్రీల దక్షిణంగా పాలఘాట్ లోయల వరకు కొండలను సహ్యాద్రి శ్రేణి అని, పాలఘాట్ నుండి తామ్రపర్ణి నది వరకు వరకు గల కొండలు మలయ పర్వత శ్రేణి అని తామ్రపర్ణి నది నుండి దక్షిణ సముద్రము వరకు వ్యాపించి యున్న పర్వత శ్రేణులకు మహేంద్ర పర్వత శ్రేణి అని చెప్పబడినది. ఈ మహేంద్ర పర్వతము కన్యాకుమారి వద్ద నుండి సముద్రములో కలియు చున్నది. ఇక్కడ నుండి నూరు యోజనములు రావణ పాలిత లంక. నూరు యోజనములు దూరము అనగా ఎంత? జ్యోతిష శాస్త్రము మరియు ఖగోళ గణిత శాస్త్రము లలో తెలిపిన మానమును బట్టి ఒక్క యోజనము 4.92 మైళ్లకు సమానము. అంటే నూరు యోజనములు 492 మైళ్లకు సమానము. భూమధ్య రేఖ నుండి కన్యాకుమారి అగ్రము ఎనిమిది డిగ్రీల దూరములో కలదు. కావున ఒక డిగ్రీకి అరువది తొమ్మిది (69 ) మైళ్ళు కాబట్టి కన్యాకుమారి నుండి 552 మైళ్ళ దూరములో భూమధ్య రేఖ కలదు. కావున లంక ఈ భూమధ్య రేఖకు ఉత్తరంగా ప్రారంభమై అక్కడ నుండి దక్షిణంగా వ్యాపించి యున్నది. కాని ఇప్పటి శ్రీలంక అనే సింహళ దేశము

కన్యాకుమారి అగ్రమునకు తిన్నగా దక్షిణముగా గాకుండా కొంచెము తూర్పుగా (ఆగ్నేయముగా) యున్నది. ఇంతే గాక యుద్ధకాండము నాలుగవ సర్గలో దండయాత్రకు సంబంధించిన వివరణ ఇస్తూ శ్రీరాముడు వానర సేనతో కిష్కింధ నుండి పశ్చిమంగా ప్రయాణము చేసి దక్షిణంగా యున్న సహ్యాద్రి పర్వత శ్రేణిని, అక్కడ నుంచి దక్షిణంగా మహేంద్ర పర్వతములను దాటి సముద్ర తీరమునకు చేరెను అని చెప్తారు. అక్కడ నుంచి నలుడు తిన్నగా నూరు యోజనముల సేతువును నిర్మిస్తాడు. ఈనాటి రామేశ్వరము వద్ద కొండలుగాని, మహేంద్రగిరి పర్వత శ్రేణులు గాని లేవు. కావున శ్రీరాముడు నిర్మించిన సేతువు ఈనాటి రామేశ్వరము వద్ద కాదు. ఎందుకనగా రామేశ్వరము నుంచి సింహాళమునకు దూరము ఏబది మైళ్ళ లోపే. జ్యోతిష్య శాస్త్ర గ్రంథములు చూడగా ఆర్యభట్టు, వరాహమిహరుడు, బ్రహ్మగుప్తులు లంకాపట్టణము భూమధ్యరేఖ వద్దనే యున్నట్లు వర్ణించబడినది. ఈ లంకాద్వీపము నిరక్షర రేఖకు సరిగ్గా నెత్తిమీద యున్నది. ఈనాటి సైన్సు లెక్కల ప్రకారము గ్రీన్విచ్ కు తూర్పుగా 77 డిగ్రీల వద్ద కన్యాకుమారి, ఉజ్జయిని, ఢిల్లీ యుండును. ప్రాచీన జ్యోతిష్యులు ఈ రేఖను "లంక రేఖ" గా చెప్పిరి. రావణాసురుని లంక రామాయణ కాలం తర్వాత జగత్ప్రళయము సంభవించి సముద్రములో మునిగిపోయినది. కాలానుగుణంగా యున్న నానుడిని బట్టి శ్రీరాముని ఆజ్ఞచే హనుమ సువర్ణమైన లంకను త్రేతాయుగము తర్వాత సముద్ర గర్భములో ముంచివేసెను. జంబూద్వీప నవ వర్షములు ఈ క్రింద యీయబడిన రేఖాచిత్రము ద్వారా సూచించబడినది.

Note: ఈ రేఖా చిత్రం యొక్క పిడిఎఫ్ క్రింద అటాచ్ చేయబడినది.




## 6.21 సేతు నిర్మాణములోని యోగ రహస్యము

రావణుని యుద్ధ సన్నాహములను చూచినవాడై ఇటు రాముడు కూడా తగినట్లుగా యుద్ధసన్నాహము ప్రారంభించెను. ముందుగా సాగరమును దాట వలెను. ఇది భవ సాగరము. ధ్యాన మార్గము ద్వారా సాధించుటకై రాముడు దక్షిణ సాగర తీరము నందు కుశాసనముపై ఆసీనుడై మూడు దినములు, మూడు రాత్రుళ్ళు గహన ధ్యాన సమాధి అవస్థ యందు గడిపెను. అయినను మనస్సు శాంతించలేదు. భగవద్గీత షోడశోధ్యాయములో సాధకుని సత్వగుణము భగవానుడు ఈ విధముగా తెలియ జేయుచున్నాడు.

**అభయం సత్వసంశుద్ధి ర్ జ్ఞానయోగవ్యవస్థితిః**
**దానందమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్||**
**అహింసా సత్యమక్రోధ స్త్యా గశ్శాన్తిరపై శునమ్**
**దయాభూతే ష్వ లోలత్వం మార్దవం హ్రీరచాపలమ్||**
**తేజస్సమా దృతిశ్శౌచమద్రోహోనాతిమానితా**
**భవంతిసంపదందైవిమభిజాతస్యభారత ||**

భయము లేకుండుట, అంతఃకరణశుద్ధి, జ్ఞానయోగమునందుట, దానము, బాహ్యేంద్రియనిగ్రహము, ఇతరుల యందు దోషములను చూడకుండుట, దయకలిగి యుండుట, విషయముల యందు ఆసక్తి లేకుండుట, మృదుత్వము, ధర్మవిరుద్ధమగు కార్యములు చేయకుండుట, చంచల స్వభావము లేకుండుట, జ్ఞానయజ్ఞము, శాస్త్రాదుల అధ్యయనము, తపస్సు, రుజుత్వము, ఏప్రాణికి బాధ జేయకుండుట, నిజము పలుకుట, కోపములేకుండుట, త్యాగబుద్ధి కలిగి యుండుట, శాంతి స్వభావము, ప్రతిభ, బ్రహ్మతేజస్సు, ఓర్పు, ధైర్యము, బాహ్యాంతర శుచిత్వము, ఎవనికిని ద్రోహము చేయకుండుట, స్వాతిశయము లేకుండుట ఇవన్నియు సద్గుణములు. సాధకుడు ఈ ఇరువది ఆరు సద్గుణములను అలవరచుకొనవలెను. పట్టువదలని ప్రయత్నముచే చివరకు రాముని మనస్సు శాంతించి సమాధి అవస్థను పొందెను. అయినను సంసార రూప సాగరమును దాటలేక పోయెను. రాముడు తన ధనుస్సు యందు బాణమును ఎక్కుపెట్టి సంసార రూప సాగరమును వధించుటకై సిద్దపడెను అయినచో ఆ ధనస్సు, శరములనగా ఇవి ఎట్టివి? ఎటువంటి సాగరముపై వాటిని వదలవలెను. **"ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే"** (సాధనారూప) ప్రణవ రూప ధనుస్సుతో ఆత్మరూప శరమును ఎక్కుపెట్టి బ్రహ్మరూప లక్ష్యముపై గురిపెట్ట వలెను. రాముడు ఆ విధముగా చేయ దలఁచెను. దానితో సంసార రూప సాగరము భీతి నొంది రాముని చరణములపై పడెను. అనగా రాముడు సంసార

సాగరమును జయించెను. ఇక అట్టి సాగరముపై వారధి కట్టి వానర సేనతో సహా దాటవలసి యున్నది. ఏ వారధి? ఎటువంటి వానరులు? ఏ లంకపై ఆక్రమణ చేయుదురు?

పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవానంద సరస్వతి మాటలలో ...

**సేతుం బధ్వా సుజలధౌ సాధనాశ్మ భిత్కటైహ్,**
**తతోభవాబ్ధి ముల్లంఘ్య దీప జ్ఞానాగ్నినాభృశమ్.**
**సూక్ష్మే దెహాఖ్యలంకాంచ దగ్ధవోపనిషధ స్రతః,**
**కామక్రోధాది రక్షామ్సి హత్వాబుద్ధే సహస్రతః.**

అంతర్యమేమన, సాధనా రూప రాళ్ళ ద్వారా వారధి కట్టి సంసార రూప సాగరమును దాటవలెనని, తన వృత్తి రూప వానరులను సేతువుపై నడిపి మాయారూప లంకలో నివసించెడి కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యాది రాక్షసులను సంహరించవలెనని రాముడు తలంచెను. ప్రారంభమున రాముడు సాగరముపై బాణమును వేయుదమనుకొనుసరికి సంసార రూప సాగరము రామునికి వశమై శరణు వేడెను. క్రోధ రూప బాణమునకు గాక, సాధనారూప రాళ్లతో వారధి కట్టి లంకను ఆక్రమించుమని చెప్పెను. నలుడను ఇంజినీరు ఆ వానరులలో ఒకడు. **"అనల" అనగా అగ్ని. అనలము కానిది "నల" అగ్ని లేదా తేజస్తత్వమునకు మనకు క్రింద నున్న అపతత్వ సాధకుడు నలుడు. అపతత్వ మనగా అణురచనావస్థ లేదా ఎలక్ట్రానిక్ అవస్థగా చెప్పవచ్చు.** అనేక ఎలెక్ట్రానుల సాపేక్ష సంధానము ద్వారా పరమాణువు తయారగును. ఆ పరమాణువే వస్తు రూప జడ జగత్తుకు మూలము. విస్తారమైన జడజగత్తు యొక్క మూలావస్థయే అపతత్వము. సాధనా రూప రాళ్ళలోనే భవసాగరము దాటవలెను. అపతత్వము ద్వారానే జగత్తు నందలి సాధనలు ప్రారంభమగును. రామరూప సాధకుడు భవ సాగరమును దాటుటకు నలుడను అపతత్వ ఇంజినీరు

సాధనారూప రాళ్లతో సేతువును నిర్మించును. రామాయణము నందు ఎటువంటి యోగ విజ్ఞాన రహస్యము దాగి యున్నదో ఉత్కృష్ణ సాధనానుభవము ద్వారాను, పరిణామము చెందిన బుద్ధి ద్వారాను అటువంటి రహస్యములు అవగాహనకు వచ్చును. ఈ ఆంతర్యము సాధారణ సమాజమునకు ప్రకటితమవాలి. మహాపరాక్రముడు, తేజస్వి అయిన నలుడు సంసార సాగరమును దాటుటకు వారధిని నిర్మించిన మహాసాధకుడు.

ఐదు దినములలో ఈ సేతువు నిర్మింపబడెను. పంచతత్వముల ద్వారానే ఈ ఘటన లేదా కార్యము గావించబడెను. పంచతత్వ సాధనతో ఈ ఐదు దినముల ప్రణాళిక రచించిరి. దానిపై వృత్తి రూప వానరులు దాటుట ప్రారంభించిరి. రాముడు సంతోషించెను. అటువంటి సేతువును రాక్షస వృత్తులు ఆటంక పరచకుండా విభీషణుడు ఆవలి వైపున తన సత్ వృత్తి రూప శూలముతో నిలుచుండెను. ఇదియే ఈ సేతువు నిర్మాణములోని యోగ రహస్యము.

## 6.22 సీతను సరమ ఊరడించుట

వానర రాజగు సుగ్రీవుడు ఫల, మూల, జలములు అధికముగా గల లంకా సముద్ర తీరమున సేనలను నిలిపెను. సేనాసహితముగా శ్రీరాముడు సముద్రమును దాటినపుడు రావణుడు శుక, సారణులను తన ఇరువురు మంత్రులతో వానర సేన యందు ప్రవేశించి వారి శక్తి, వారిలో ముఖ్యులు మొదలగు వివరములు తెలుసుకొనుమని ఆదేశిస్తాడు. వారు వానర సేనను ప్రవేశించగానే విభీషణుడు గుర్తు పట్టి వారిని శ్రీరాముడికి అప్పచెప్తాడు. వారి యొక్క దీనాలాపన విని సర్వ ప్రాణుల హితకారుడైన శ్రీరాముడు ఇట్లు పలికెను.

**పృచ్ఛమానౌ విముం చైతౌ చారౌ రాత్రించరా ఉభౌ**

**శత్రు పక్షస్య సతతం విభీషణ వికర్షణౌ**

విభీషణా! ఈ ఇద్దరు రాక్షసులు రావణుని చారులు. ఇచటి రహస్యములను తెలుసుకొని శత్రు పక్షము నందు తగవు పెట్టుటకై ప్రయత్నించు చున్నారు. వీరి

గుట్టు తెలిసినది గావున వదిలి వేయుము. అంతట వారు శ్రీరామునికి జయము పలికి లంకాపురమునకు వచ్చి రావణునితో ఇట్లు పలికిరి.

**యాదృశం తస్య రామస్య రూపం ప్రహరణాని చ**
**వధిష్యతి పురీం లంకాం ఏక స్తిష్ఠన్తు తే త్రయః**

రాక్షసేశ్వరా! శ్రీరాముని రూపము, అతని అస్త్ర శస్త్రములు చూడ ఈ లంకాపురము నంతయు అతనొక్కడే భస్మీభూతము చేయగలడని తెలియుచున్నది. వానరులందరూ ఇప్పుడు యుద్ధమునకై ఉత్సుకతతో యున్నారు. కావున శ్రీరామునకు సీతను అప్పచెప్పి సంధి చేసుకునుడని శుకసారణులు చెప్పిరి. అప్పుడు రావణుడు ...

**యది మామ్ అభియుంజీరన్ దేవ గన్ధర్వ దానవాః**
**నైవ సీతాం ప్రదాస్యామి సర్వ లోక భయా దఽపి**

"దేవతలు, గంధర్వులు, దానవులు నాతో యుద్ధమొనర్చుటకు వచ్చినను, లోకమంతయు భయమును చూపసాగినను నేను సీతను ఇవ్వను" అని నిశ్చయముగా చెప్పెను. తదుపరి రావణుడు మహాబలవంతుడు, మహామాయావి, మాయావిశారదుడు అగు విద్యుత్ జిహ్వ ను వెంట పెట్టుకొని సీత ఉన్న ప్రమాదానవనమునకు పోయి మాయ ద్వారా సీతను మోహ పెట్టుటకై శ్రీరాముని మాయా శిరస్సును తీసుకొని వెళ్లి, శ్రీరాముడు ఇక లేడు గావున వశము కమ్మని సీతతో రావణుడు పలికి వెళ్లిపోయెను. రావణుడు వెళ్ళిపోగానే మాయాశిరస్సు అదృశ్యమయ్యేను. అప్పుడు "సరమ" (సరమ శైలూషుడు అను గంధర్వుని కుమార్తె, విభీషణుని భార్య. సీతాదేవికి సన్నిహితురాలు) అను రాక్షసి సీతకు ధైర్యము నూరిపోయుచు ఇట్లు పలికెను.

**న శక్యం సౌప్తికం కర్తుం రామస్య విదితాత్మనః**
**వధ శ్చ పురుష వ్యాఘ్రే తస్మి న్నై వోపపద్యతే**

శ్రీరాముడు ఆత్మజ్ఞుడు. వారు సర్వజ్ఞుడైన పరమాత్మ. నిద్రించుచున్న వారిని వధించుట ఎవనికిని ఏవిధముగాను సంభవము గాదు. పురుష సింహుడగు శ్రీరాముని విషయమున ఈ ప్రకారమైన వధను గూర్చిన సంగతి యుక్తియుక్తముగా లేదు. రావణుని బుద్ధి, కర్మ రెండును చెడ్డవి. అతడు సమస్త ప్రాణులకును విరోధియు, కౄరుడును, మాయావియు అయి ఉన్నాడు. అతడు మీపై (సీతపై) ఈ విధమైన మాయను ప్రయోగించెను. నేను స్వయముగా లక్ష్మణ సహితుడగు శ్రీరాముని దర్శనము గాంచితిని. వారు సముద్ర తీరమున బస చేసి సుసంఘటితములైన తమ సేనలతో సురక్షితముగా యున్నారు. రావణుని వచనములచే బాధ నొందిన సీతకు సరమ తన పలుకులచే ఆహ్లాదమును కలుగ చేసెను. పిమ్మట శత్రునగరముపై విజయమును పొందు మహాబాహువగు శ్రీరాముడు శంఖధ్వని మిశ్రితమగు గొప్ప భేరి శబ్దములో లంకపై ఆక్రమణము సల్పెను. ఆ భేరినాధమును విన్న రావణుడు మంత్రులనందరిని ఉద్దేశించి చెపుతూ .. "రాముని పరాక్రమములను గూర్చి వింటిమి అలాగే మీరు కూడా వీరులు అని చెప్పెను". అప్పుడు మాల్యవంతుడు (రావణుని బంధువు) ఈ ప్రకారముగా చెప్పెను.

**సంధధానో హి కాలేన విగృహ్ణం శ్చ అరిభి స్సహ**
**స్వపక్ష వర్ధనం కుర్వన్ మహ దైశ్వర్య మఽశ్నుతే**
**ధర్మో వై గ్రసతేఽధర్మం తతః కృత మఽభూ ద్యుగమ్**
**అధర్మో గ్రసతే ధర్మం తత స్తిష్యః ప్రవర్తతే**
**త త్తు మాల్యవతో వాక్యం హిత ముక్తం దశాననః**
**న మర్షయతి దుష్టాత్మా కాలస్య వశమాగఽఽతః**

సమయానుసారము అవసరము గలిగినప్పుడు శత్రువులతో గూడ సంధి, విగ్రహము చేయువాడును, తన పక్షము యొక్క అభివృద్ధి యందు లగ్నమై యుండు వాడును గొప్ప ఐశ్వర్యమును పొందగలడు. కావున రావణా!

శ్రీరామునితో సంధి చేసుకొనుటయే నాకు ఉత్తమముగా తోస్తున్నది. ఎవతెకొరకై నీపై ఆక్రమణ జరుగుచున్నదో అట్టి సీతను రామునికి ఇచ్చివేయుము. కృతయుగము వచ్చినప్పుడు ధర్మము బలముగలదై అధర్మమును కబళించి వేయును. కలియుగములో అధర్మమే ధర్మమును అణచి వేయును. దుష్టాత్ముడైన రావణుడు కాలమునకు వశమగుతున్నాడు. కావున మాల్యవంతుడు చెప్పిన హిత వచనములు రావణుడు సహించ కుండెను. తదుపరి మంత్రులతో కూడి రావణుడు పరస్పరము విచారణ చేసి తత్కాలమున లంక యొక్క రక్షణను గూర్చిన ఏర్పాటు చేసెను.

## 6.23 శ్రీరాముని యుద్ధ వ్యూహము

శ్రీరాముడు సమస్త వానరసేనతో సహా లంకలో విడిది చేసిన తర్వాత యుద్ధ వ్యూహము గురించి ఆలోచన చేయ సాగిరి. అప్పుడు విభీషణుడు ఈ విధమైన సూచన చేసెను. "నాతో (విభీషణుడు) వచ్చిన నలుగురు రాక్షసులు నా ప్రేరణచే పక్షులుగా మారి లంకకు వెళ్లి వారు చూచి వచ్చిన విషయము వివరించెదను. తూర్పు ద్వారము వద్ద ప్రహస్తుడు, దక్షిణ ద్వారము వద్ద మహోదర మహాపార్షులు, పశ్చిమ ద్వారము వద్ద ఇంద్రజిత్తు, రావణుడు స్వయముగా ఉత్తర ద్వారము వద్ద, పట్టణ మధ్యమమున విరూపాక్షుడు అశేష సేనానితో యున్నారు. రావణుడు కుబేరునితో యుద్ధమునకు వెడలినప్పుడు అరువది వేల మంది మాహావీర్యులైన సైన్యము యున్నది. అప్పటి బలము కంటే ఈనాడు రావణుడు సిద్ధపరచిన సైన్యము చాలా అధికముగా యున్నది" అని చెప్పెను. శ్రీరాముడు అప్పుడు విభీషణుని సూచనతో ఈ విధముగా యుద్ధ వ్యూహమును రచించెను. అనేక వానరులతో కూడి నీలుడు లంక యొక్క తూర్పు ద్వారము వద్ద ప్రహస్తుని, అంగదుడు దక్షిణ ద్వారము వద్ద మహాపార్షుని, మహోదరుని, హనుమ పడమటి ద్వారమును, రావణుని వధకై ధృడ నిశ్చయముతో నున్న నేను (శ్రీరాముడు)

లక్ష్మణునితో కూడి ఉత్తర ద్వారమును కబళించవలెను. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు నగరము యొక్క మధ్య భాగమును ఆక్రమించ వలెను. వీరందరూ మహావీర్యులైన అనేక మంది వానర భల్లూక సేనలతో అప్రమత్తముగా యుండవలెను. యుద్ధము జరుగుతున్నంతసేపూ వానరులలో ఎవ్వరును మనుష్య రూపమును స్వీకరించరాదు. రాక్షసులు గూడ కామరూప ధారులే కానీ వారి దృష్టిలో నర, వానరములు హీనమైనవి. అందులోనూ వానర రూపము చాలా నిక్రుస్టమైనదిగా వారు భావించెదరు. అందుచే మనవారు గుర్తించుటకు వానరులు వానర రూపములోనే యుండవలెను. మేము ఏడుగురము నేను (శ్రీరాముడు), లక్ష్మణుడు, విభీషణుడు మరియు వారి నలుగురు మంత్రులు తప్ప ఎవ్వరును మానవ రూపములో యుండరాదు.

**ఏకో హి కురుతే పాపం కాల పాశ వశం గతః**

**నీచే నాత్మాఽఽపచారేణ కులం తేన వినశ్యతి**

కాల పాశమున బంధింపబడిన ఏ ఒకానొకడో పాపము చేయుచున్నాడు కానీ ఈ నీచుని స్వకీయ దోషముచే కులమంతయు నశించి పోవుచున్నది.

## 6.24 శ్రీరాముడు వానర సేనలతో కూడి సువేల పర్వతమును చేరుట, సుగ్రీవుని యెడల శ్రీరాముని వాత్సల్యము

ఈ విధముగా సైన్య విభాగము చేసి సువేల పర్వతమును ఎక్కి లంకనంతయును చూడవలెనని సంకల్పించెను. ఇట్లు ఆలోచించి చిత్రములగు సానువుల గల సువేల పర్వతమును లక్ష్మణ, సుగ్రీవ, జాంబవంత, హనుమ ఇత్యాది మహావీరులతో కూడి అధిరోహించిరి. ఆ రాత్రి యంతయు వారు ఆ పర్వత శిఖరముననే యుండి లంకానగర శోభను తిలకించిరి. సువేల పర్వత శిఖరమున నిలిచి రెండు యోజనముల విస్తారము గల ఆ పట్టణమును వానరులతో గూడి రామలక్ష్మణులు చూచిరి. ఆ పట్టణము విశ్వకర్మచే నిర్మింపబడినది. సువేలమున నిలచిన వీరికి త్రికూట పర్వతమున నిలచిన రావణుడు కనబడెను. అతను సంధ్యాకాలమందలి

నల్లని మేఘము ఆకాశములో నిలిచినట్లున్నది. వానర రాజైన సుగ్రీవుడు ఇతర వానరములతో చెప్పకుండా రోషావేశుడై పర్వతాగ్రము నుండి ఎగిరి గోపురాగ్రమున దూకి రావణుని ఎదుట నిలిచెను. అంతే ఆవేశముగా అతని తలపై నున్న కిరీటమును క్రింద పడవైచెను. అప్పుడు రావణుడు సుగ్రీవుని చేతులతో పట్టుకొని క్రింద పడవైచెను. సుగ్రీవుడు నిలపడి బంతిలాలేచి ఒకరినొకరు పెనుగులాడుకొని బాహుయుద్ధమును చేసిరి. ఇంతలో రావణుడు తన మాయాబలమును ప్రదర్శించుటకు ప్రారంభించెను. అది గమనించి సుగ్రీవుడు వానిని వంచించి ఆకాశమున ఎగిరి రాముని వద్దకు వచ్చి నిలబడెను. అప్పుడు రాముడు నీవు సాహసివే అయినను ప్రభువులు ఇట్లు చేయరాదు అని చెప్పెను.

**త్వయి కించి త్సమాఽఽపన్నే కిం కార్యం సీతయా మమ**
**భరతేన మహా బాహో లక్ష్మణేన యవీయసా**
**శత్రుఘ్నేన చ శత్రుఘ్న స్వ శరీరేణ వా పున:**

నీవేమైనా అయినచో నాకు సీతమ్మతో ఏమి పని? భరతుడు గాని, శత్రుఘ్నుడు గాని, లక్ష్మణుడు గాని ఎందుకు? నీవు లేనినాడు నా శరీరమే అక్కరలేదు. ఇది శ్రీరామునికి వానరుడైన వానితో గల మైత్రీ బంధమును సూచించును. **"ఆత్మానం సర్వదా రక్షేత్ దారైరపి, ధనైరపి"** భార్యను, ధనమును త్యజించి అయినను శరీరమును కాపాడుకొనవలెను. ధర్మాచరణమునకు మొదటి సాధనము శరీరమే! మిత్రుడు లేనిచో అట్టి శరీరము కూడా కాదనుకొనినాడు. ఇంకను ఇట్లు చెప్పుచున్నాడు. "సుగ్రీవా! నేను మనసులో ఇట్లు నిశ్చయించుకున్నాను. నీవు మహేంద్రునితో సమానమైన పరాక్రమము కలవాడివని ఎరుగుదును. కానీ భయముచే శంకించితిని. ఒకవేళ నీవు మరలి రాకపోయినచో రావణుని పుత్రులతో, సైన్యముతో సహా చంపి విభీషణుని రాజుగా చేసి అయోధ్య యందు భరతుని రాజుగా నిలిపి నేను శరీరము త్యాగము చేయదలచుకొన్నాను. నీవు

లేని నాకు ఈ దేహము ఏల?" అప్పుడు సుగ్రీవుడు రామునితో రామా! రావణుని చూడడముతో నాలోని ఆవేశమును ఆపుకొనలేకపోతిని. నేను ఒక వ్యక్తిగా యుండుటకు నీ దాస్యమే కదా! మన్నింపుము అని అనెను. తరువాత పర్వతమును దిగి యుద్ధమునకు సన్నద్ధమైరి.

## 6.25 అంగద రాయబారము

మహానుభావుడైన ధనుర్ధరుడగు శ్రీరాముడు విశాలమైన సేనతో గూడి శుభముహూర్తమున లంకాపురము వైపునకు ముందుకు సాగెను. శ్రీరాముడు సేనను యధాస్థానమున నిలబెట్టి చేయవలసిన కర్తవ్యమును గురించి అందరితో ఆలోచించెను. ముందుగా యుద్ధమునకు సిద్ధపడుట తగదని దూతచే వర్తమానము పంపుట రాజధర్మమని శ్రీరాముడు నిశ్చయించెను. అప్పుడు అంగదుని పిలిచి రాముడిట్లు చెప్పెను. సౌమ్యా! అంగదా! నీవు భయము చెందకుండా ఈ ప్రాకారములను దాటి లంకలో ప్రవేశింపుము. నా మాటగా రావణునితో ఇట్లు చెప్పుము.

**భ్రష్ట శ్రీక గతైశ్వర్య ముమూర్షో నష్ట చేతనః**
**ఋషీణాం దేవతానాం చ గన్ధర్వాఽప్సరసాం తథా**
**నాగానా మఽథ యక్షాణాం రాజ్ఞాం చ రజనీచర**
**య చ్ఛ పాపం కృతం మోహా దఽవలిప్తేన రాక్షస**
**నూన మఽద్య గతో దర్పః స్వయమ్భూ వరదాన జః**
**యస్య దణ్డ ధర స్తేఽహం దారా హరణ కర్శితః**
**దండం ధారయమాణ స్తు లంకా ద్వారే వ్యవస్థితః**
**పదవీం దేవతానాం చ మహర్షీణాం చ రాక్షస**
**రాజర్షీణాం చ సర్వేషాం గమిష్యసి మయా హతః**
**బలేన యేన వై సీతాం మాయయా రాక్షసాఽధమ**
**మా మఽతిక్రామయిత్వా త్వం హృతవాం స్త ద్విదర్శయ**

**అరాక్షస మిమం లోకం కర్తాఽస్మి నిశితైః శరైః**
**న చే చ్ఛరణ మఽభ్యేషి మా ముపాదాయ మైథిలీమ్**
**ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠః సంప్రాప్తోఽయం విభీషణః**
**లంకై శ్వర్యం ధ్రువం శ్రీమానఽయం ప్రాప్నో త్యఽకణ్టకమ్**
**న హి రాజ్య మఽధర్మేణ భోక్తుం క్షణ మఽపి త్వయా**
**శక్యం మూర్ఖ సహాయేన పాపే నాఽవిదితాఽఽత్మనా**
**యుధ్యస్వ వా ధృతిం కృత్వా శౌర్య మాఽఽలమ్బ్య రాక్షస**
**మ చ్ఛరై స్త్వం రణే శాన్త స్తతః పూతో భవిష్యసి**
**య ద్యాఽఽవిశసి లోకాం స్త్రీన్ పక్షి భూతో మనోజవః**
**మమ చక్షు ష్పథం ప్రాప్య న జీవ న్ప్రతి యాస్యసి**
**బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతామ్ ఔర్ధ్వదేకికమ్**
**సుదృష్టా క్రియతాం లంకా జీవితం తే మయి స్థితమ్**

“రావణా! నీ రాజ్యలక్ష్మి నీ నుండి తొలగి పోవుచున్నది. నీ నియమంగా శక్తి పోయినది. చనిపోవదలచి యున్నావు. చైతన్యము పోయినది. పూర్వము గర్వముతో ఋషులకు, దేవతలకు, గంధర్వులకు, అప్సరసలు, యక్షులకు బాధలు కలిగించి కలిగించి పాపము చేసి యుంటివి. బ్రహ్మ వరము ఇచ్చినాడనే గర్వము ఇప్పుడు తొలగి పోవుచున్నది. ఎవరి భార్యను అపహరించినావో అతడు దండధరుడై నిన్ను శిక్షించుటకు లంకాద్వారమున నిలిచి యున్నాడు. ఏ బలము చూచుకొని నన్ను లెక్కచేయక మాయతో నేను తొలగిపోవునట్లు చేసి సీతను అపహరించి తెచ్చితివి? నీ బలమెట్టిదో యుద్ధరంగమున నా ఎదుట చూపుము. నీవు వెంటనే సీతను తీసుకొని వచ్చి నన్ను శరణు పొందుము. లేనిచో ఈ లోకములో నా వాడి బాణములతో ఈ లోకములో రాక్షసులు లేకుండా చేసెదను. అధర్మముతో ఒక్క క్షణమైనను నీవు రాజ్యము అనుభవించజాలవు.

కామరూపముతో మూడు లోకములలో నీవు ఎచ్చటికే ఎగిరినను నీవు బ్రతుకుట అసాధ్యము. నీ తరువాత నీ శ్రాద్ధకర్మలు పెట్టుటకు కూడా ఎవ్వరు మిగిలి ఉండరు. నీ శ్రాద్ధము నీవే నిర్వర్తించుకొనుము. నీ జీవితము నా అధీనమున యున్నది . చివరిసారిగా లంకను, నీవారిని ఒక్కసారి చూచుకొనుము" అని ఇట్లు సందేశము ఇచ్చెను.

ఆ సందేశమును తీసుకొని అంగదుడు ఆకాశములోనికి ఎగిరి ఒక్క ముహూర్తములో మంత్రులతో కొలువు తీరియున్న రావణ మందిరమును చేరి తాను వాలి సుతుడనైన అంగదుడనని, రాముని దూతనని చెప్పి, ఏ ఒక్కటి ఒదలకుండా రావణునకు రామ సందేశమును విన్పించెను. అందుకు క్రుద్ధుడైన రావణుడు ఈ రామదూతను సంహరింపుమని ఆజ్ఞ ఈయగా భయంకరులైన నలుగురు రాక్షసులు అంగదుని పట్టుకొనిరి.బలశాలియైన అంగదుడు వేగముగా వారిని నొక్కిపట్టి ప్రాకార పైభాగమునకు ఎగిరి, ప్రాకార శిఖరమును తన పాదముతో పడదోసి, అంతరిక్షము నుండి ఆ రాక్షసులను పడవేచెను. సమస్త వానరులకు ప్రీతి చేయుచు అంగదుడు వానరసేన మధ్య యున్న శ్రీరాముని చెంతకు చేరెను. అంగదుని వైఖరిని జూచి విషయము గ్రహించిన శ్రీరాముడు యుద్ధము అనివార్యమని నిర్ణయించుకొనెను.

## 6.26 లంకపై వానరయోధుల దండయాత్ర, నాగపాశ బంధ విముక్తి

శ్రీరాముడు, రాక్షసులచే పీడింపబడుతున్న సీతను మరల మరల తలంచుకొనుచు ధర్మాత్ముడగు శ్రీరాముడు శత్రువులగు రాక్షసులను వధించుటకై వానరులకు ఆజ్ఞ ఒసగెను.

**జయ త్యఽతి బలో రామో లక్ష్మణ శ్చ మహా బలః**

**రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాఽభి పాలితః**

**ఇత్యేవం ఘోషయన్త శ్చ గర్జన్త శ్చ ప్లవంగమాః**

**అభ్యధావన్త లంకాయాః ప్రాకారం కామ రూపిణః**

కామరూపులైన ఆ వానరులు తిరుగులేని పరాక్రమశాలియైన శ్రీరామునికి జయము, మిక్కిలి బలవంతుడైన లక్ష్మణునికి జయము. శ్రీరాముని అనుగ్రహమునకు పాత్రుడైన వానర రాజైన సుగ్రీవునికి జయము అని జేజేలు పలుకుతూ, సింహగర్జనలు చేయుచు లంకాపుర ప్రాకారములు మీద విరుచుకు పడిరి. మిక్కిలి బలశాలియైన 'కుముదుడు' పదికోట్ల మంది వానర యోధులతో ఈశాన్య దిశను, 'శతవలి' ఆగ్నేయ దిశను, 'సుషేణుడు' నైరుతి దిశను, సుగ్రీవుడు వాయువ్య దిశను ఆక్రమించిరి. (ఇచ్చట శ్రీరాముడు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తర ద్వారముల వద్ద ఎవరు ఉండాలని నిర్దేశించారు. ఇప్పుడు ఆయా కోణములందు (మూలలు) మిగిలిన వీర్యవంతులైన వానరులు వారికి అండగా యున్నారు. అంతియే గాక ఇంద్రజిత్తు లంకా నగరము యొక్క పశ్చిమ ద్వారమును, రావణుడు ఉత్తర ద్వారములను రక్షించుతున్నారు. కావున వారి ఇరువురి దృష్టి వాయువ్యముపై పడును కాన ఈ దిశ యందు దండెత్తు బాధ్యత సుగ్రీవునకు శ్రీరాముడు అప్పచెప్పెను). అప్పుడు జరిగిన వానర, రాక్షసుల సమరం దేవాసుర సమరమును పోలి యున్నది. వారి యుద్ధముచే ఆ ప్రాంతమంతయు రాక్షసుల, వానరుల రక్తమాంసములతో బురదగా యుండెను. ఈ విధముగా వానరులు రాక్షసులతో యుద్ధము చేయుచుండగా ఒకరిపై ఒకరు జయించవలెననెడి పట్టుదల ఎక్కువ అగుచుండెను. వాలిపుత్రుడగు అంగదుడు ఇంద్రజిత్తుతో తలపడెను. ఇంద్రజిత్తు అంగదుని గట్టిగ గదతో మోదగా, అంగదుడు కోపించి వాని రథమును గుఱ్ఱములు సారధితో సహా కూల్చెను. లక్ష్మణుడు విరూపాక్షుని, శ్రీరాముడు అగ్నికేతువు, రష్మికేతువు, సుపతఘ్నుడు, యజ్ఞకోపుడు లను సంహరించిరి. అందుకు ఇంద్రజిత్తు క్రోధముతో రామలక్ష్మణులను నాగాస్త్రముచే బంధించెను. రామలక్ష్మణులు అవతార పురుషులు. వారు మృత్యువుకే మృత్యుదేవతలు. అట్టివారిని ఎవరు

బంధింపగలరు? వారు మానవరూపములో యున్నారు గావున బంధితులైనారు. ఇంకను ఇంద్రజిత్తు అనేకమైన పదునైన శరములు శ్రీరామునిపై ప్రయోగించెను. అవి ఏవనగా ..

**రుక్మ పుంఖైః ప్రసన్నాగ్రై రధో గతిభి రాఽఽశుగైః**
**నారచై రఽర్ధనారాచై ర్భల్లై రంజలికై రఽపి**
**వివ్యాధ వత్ సదన్తై శ్చ సింహ దంష్ట్రైః క్షురై స్తథా**

నారాచములు (సూటిగా నుండి వర్తులాకారము గలవి), అర్ధనారాచములు (మధ్యభాగమున నారాచమువలె యుండునవి), భల్లములు (గండ్రగొడ్డలి వంటి మొనలు కలవి), అంజలికములు (దోసిళ్లవంటి అగ్ర భాగములు గలవి), వత్సదంతములు (దూడల దంతములు వంటి అడుగు భాగములు గలవి), సింహ దంష్ట్రములు (సింహముల కోరల వంటి అగ్రభాగములు గలవి), క్షురములు (కత్తుల వంటి మొనలు గలవి) అను వివిధములగు బాణములచే శ్రీరాముని గాయపరచెను. అంత ఇంద్రజిత్తు సంతోషాతిరేకమున లంకానగరమును ప్రవేశించెను. అంత రావణుడు సంతోషముతో త్రిజట మొదలగు వానర స్త్రీలతో సీతను పుష్పక విమానము ద్వారా యుద్ధభూమికి తీసుకొని వెళ్లి రామలక్ష్మణులను చూపమని ఆజ్ఞాపించెను.

## 6.27 అస్త్ర బంధితులై యున్న రామలక్ష్మణులను గాంచి సీతాదేవి తల్లడిల్లుట

సీత రామలక్ష్మణులను చూచి అయ్యో! నన్ను ఇదివరకు ఋషులు, పెద్దలు నీ చేతిలో, కాళ్లలో పద్మ రేఖలున్నాయి కావున నీవు సౌభాగ్యవతివి, మహాసామ్రాజ్యమునకు పట్టమహిషివి, వీరులైన పుత్రులను పొందుదవు అని అన్నారు. కానీ అవి అన్నియు నిష్ప్రయోజనములు అయినవి అని దుఃఖించెను. సీత వారి దేహములను చూచి దుఃఖించగా, త్రిజట సీతను అనునయిస్తూ శ్రీరాముడు జీవించియే యున్నాడు అని చెప్పెను. త్రిజట సీతకు చెపుతూ

అమ్మా! నీవు పుష్పక విమానము లో కొనిరాబడినావు అనగా పుష్పకము సౌభాగ్యవతులు కానీ వారు ఎక్కుటకు అనర్హులు కావున నీ పతి జీవించియే యున్నాడు అని గమనించుము. నాగపాశముచే బంధింపబడిన రామలక్ష్మణుల శరీరములు, అంగప్రత్యంగములు బాణములచే నిండియుండుట చూచి సుగ్రీవుడు దీనత్వమును వహించెను. అప్పుడు విభీషణుడు వానర రాజులో స్వస్థత చెందమని, దుఃఖము పడవలదని చెప్పెను.

**పర్యవస్థాప యాఽఽత్మాన మఽనాథం మాం చ వానర**
**సత్య ధర్మాఽనురక్తానాం నాఽస్తి మృత్యు కృతం భయమ్**

సత్యముపై విశ్వాసము గల వారికిని, ధర్మనిరతులకు మృత్యు భయముండదు. తన శరీరము యొక్క ధృఢత్వము చేతను, అకుంఠిత శక్తి చేతను శ్రీరాముడు మూర్ఛ నుండి తేరుకొని సోదరుడైన లక్ష్మణుని చూచి దుఃఖించెను. అప్పుడు రెండు ఘడియలలో మహాబలశాలియగు గరుత్మంతుడు అచటికి వచ్చెను. అతని రాకతోనే మహాబలవంతమైన బాణరూపమున యున్న ఆ సర్పరాజములు పారిపోగా రామలక్ష్మణుల గాయములన్నియు సమసి పోయి వారి శరీరములు సుందర కాంతితో ఆరోగ్యవంతములై అలరారెను. గరుత్మంతుడు రామలక్ష్మణులను రోగరహితులను చేసి వారికి ప్రదక్షణ చేసి వాయువేగమున వెడలి పోయెను.

## 6.28 నాగపాశ బంధములోని యోగ రహస్యము

సువేల పర్వతము యొక్క శిఖరము (ఉచ్ఛ అవస్థ) పై ఆరూఢుడై భగవానుడైన రాముడు మాయారూప లంకను ఏ విధముగా నష్టపరచ వలెనో సంకల్పించుకొనెను. అదృశ్య రూపములో రావణుడి పుత్రుడైన ఇంద్రజిత్ రాముని సేనలో శస్త్ర వర్షమును గురిపించెను. ఏ మంత్రముతో అతడు రాముని సేనపై శస్త్ర వర్షమును గురిపించెను? **"మన నాత్ త్రాయతే ఇతి మంత్రః"** అని మంత్ర

పదానికి నిర్వచనం. మననము చేసిన కొలదీ రక్షించే దాన్ని మంత్రం అంటారని దీని అర్థం. 'నిరంతర శ్రవణ, స్మరణ, మననాల వలన ఉపాసకుని రక్షిస్తూ చివరకు ఉపాస్యదేవతా స్వరూపంగా మార్చగలిగే వర్ణ సంపుటాన్ని' (అక్షరాల కూర్పును) 'మంత్రం' అనవచ్చును. ఏ మంత్రమైనా అక్షరాలతోనే రూపొందింపబడుతుంది. ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క ప్రత్యేకమైన ధ్వని, ఒక్కొక్క ప్రత్యేకమైన అర్థం వుంటాయి. ధ్వని-నాదాత్మకమైతే, అర్థం-జ్ఞానాత్మకం. అమ్మవారు 'నాదరూపిణీ' 'జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ' గూడా కాబట్టి – సర్వమంత్రాలు అమ్మవారి స్వరూపమే అవుతాయి. అంతేకాకుండా మనస్సు నందలి శక్తిని రక్షించునదియే మంత్రము. మనస్సు బలమైనది అయినచో అన్నియు ప్రాప్తించుకొనవచ్చును. **"మన ఏవం మనుష్యాణాం కారణం బంధమోక్షయోః"**. బంధనము లేదా మోక్షము అనేది మనస్సు యొక్క స్థితిని బట్టి ఉంటుంది." కేవలం శారీరిక యాంత్రిక భక్తి సరిపోదు; మనస్సుని భగవత్ ధ్యాస లో నిమగ్నం చేయాలి. మంత్రం విషయములో రామాయణ కాలము నందు కూడా మూర్ఖమైన కల్పనలు యున్నవి. మంత్ర సిద్ధులు, మోసముతో కూడిన మాయాజాలం అతిధిగా గల కల్పనలతో సమాజము భ్రష్టమయ్యెను. వాస్తవికమైన శారీరక, మానసిక బలము సమాజము నందు ఉత్పన్నమవాలి. దేశములోని మానసిక బానిసత్వము నిర్మూలింపబడి జ్ఞానమయము కావాలి. ఇంద్రియములను సంయమము నందుంచి ఆత్మజ్ఞానము పొందవలెననెడి కోరిక గల ఆధ్యాత్మిక సాధకుడు ఇంద్రజిత్. ఇంద్రియ దమనమము వలన సంయమము నొందిన మనస్సును, ధ్యానము, సమాధులకై ఉపయోగించి ఆత్మజ్ఞానము వైపు పురోగించవలెను. అట్లుగాక ఇంద్రియములను అణచి ఆత్మజ్ఞానము పొందామనుకొన్న సాధకులు తమ అజ్ఞానపు చీకట్లలో చిక్కుకొన్నట్లే. వారు అంధులని చెప్పవచ్చు. తమ దోషములను కండ్ల నుండి, మనస్సు నుండి చూడక అదృశ్యముగా యుంచి తమ అజ్ఞానమయ అవస్థ యొక్క కర్మ రూప బాణములను బ్రహ్మ వైపు గురిపెట్టువాడు. అదృశ్యముగా

శరవర్షమును కురిపించు ఇంద్రజిత్ వంటి వాడు. సాధక రాముడు తన యందు అంతర్గతమై యున్న ఇంద్రజిత్ మాయాజాలమును పసిగట్టి, ఏ స్థానము నుండి శరవర్షము కురియుచున్నదో నిర్ధారణ చేసి ఆ స్థానంపై తన రామ బాణ వర్షమును పంపించుటలో ఇంద్రజిత్ పరారగును. కానీ ఇంద్రజిత్ బహు మాయావి. రాక్షస వృత్తి రూపమగుట వలన రామలక్ష్మణులను మట్టుబెట్టవలెనని యోచనతో మరియొక శక్తివంతమైన మాయాస్త్రము అనగా నాగాస్త్రమును ప్రయోగించెను. నాగాస్త్ర ప్రభావము వలన రామలక్ష్మణులు బందీలైరి. గరుత్మంతుడు అక్కడకు వచ్చి వారిరివురిని బంధవిముక్తులను చేసెను. నాగపాశమనగా కుండలిని జాగృత్త అవస్థ. నాగపాశమున పుట్టిన విషమువలె కుండలిని జాగృత్త ఆ సమయమున అత్యంత తాపము ఉత్పన్నమగును. కుండలిని జాగృతము తర్వాత సాధకుని శరీరము, మనస్సు శుద్ధమై బలవర్ధకమగును. అందుండి సాధకునకు ఉత్కృష్ణ జ్ఞానము ప్రాప్తించును. ఆ అవస్థ నుండి మరింత పురోగతి సాధించుటకై ఉన్నతమైన వాయుతత్వ అవస్థమును పొందాలి. ఈ వాయుతత్వ అవస్థకు చిహ్నము గరుత్మంతుడు. నాగపాశము లేదా సర్పముపై గరుత్మంతుడు విజయం సాధించును. అదేవిధముగా వాయుతత్వ అవస్థ ప్రాప్తించినచో కుండలిని జాగ్రత్త అవస్తయూ శాంతించును. మరియొక కోణములో గరుత్మంతుడు విష్ణువు యొక్క వాహనము. రాముడు విష్ణు అవతారంగా భావింతురు. పూర్వపు జన్మ వాహనమైన గరుత్మంతుని సహాయము స్వీకరించడమైనది. ఈ విధముగా సాధనా పరంపర అనేక జన్మల కర్మగతి నుండి ఉద్భవించును.

## 6.29 రాక్షస వీరులలోని ముఖ్యులు మరణించుట

నాగాస్త్రబంధము రామలక్ష్మణులకు విడిపోయినదనే ఆనందముతో వానరులు గర్జించిన ధ్వని రావణుడు వినెను. నాగాస్త్ర బంధనము విడిపోయినదని తెలుసుకొన్నాడు. తరువాత జరిగిన యుద్ధములో లక్ష్మణునిచే విరూపాక్షుడు,

శ్రీరామునిచే అగ్నికేతువు, రశ్మికేతువు, సుప్తఘ్నుడు, యజ్ఞకోపుడు, హనుమచే ధూమ్రాక్షుడు, అకంపనుడు, అంగదునిచే వజ్రదంష్ట్రుడు వధింపబడిరి. అప్పుడు లంకాపురము నలువైపులా శత్రుసైన్యము చుట్టుముట్టెను. అది చూచి రాక్షసరాజగు రావణుడు తన హితైషియు, యుద్ధ కళాకోవిదుడు అగు ప్రహస్తునితో శీఘ్రమే సైన్యమును తీసుకొని వెళ్లి విజయమునకు బయిలుదేరుమని చెప్పెను. అప్పుడు సేనాపతియగు ప్రహస్తుడు శుక్రాచార్యుడు అసుర రాజగు బలికి సలహా ఇచ్చినట్లు రావణునికి తన అభిప్రాయము ఇట్లు తెలియ జేసెను.

**రాజన్ మన్త్రిత పూర్వం నః కుశలైః సహ మన్త్రిభిః**
**వివాద శ్చాఽపి నో వృత్తః సమఽవేక్ష్య పరస్పరమ్**
**ప్రదానేన తు సీతాయాః శ్రేయో వ్యవసితం మయా**
**అప్రదానే పున ర్యుద్ధం దృష్ట మేతత్ తథైవ నః**

రాజా! ఇదివరలో ఈ విషయము గూర్చి మంత్రిమండలిలో చర్చించి యుంటిమి కానీ భేదాభిప్రాయములు తలయెత్తినవి. సీతను తిరిగి రామునకు ఇచ్చివేయుటచేతనే మనకు శ్రేయస్సు కలుగుననియు, ఇవ్వనిచో యుద్ధము తప్పక జరుగుననియు నాకు మొదట నుండి నిశ్చితాభిప్రాయము కలదు. ఆ అభిప్రాయము ప్రకారమే ఇప్పుడు యుద్ధరూప సంకటము ప్రాప్తించింది. కానీ ఇంతకుముందు ప్రహస్తుడు పదునాలుగవ సర్గలో ఈ విధముగా తెలియ జేసినాడు.

**నిశమ్య వాక్యం తు విభీషణస్య, తత: ప్రహస్తో వచనం బభాషే**
**న నో భయం విద్మ న దైవతేభ్యో, న దానవేభ్యో ప్యఽథ తవా కుతశ్చిత్**
**న యక్ష గంధర్వ మహోరగేభ్యో, భయం న సంఖ్యే పతగోత్తమేభ్య:**
**కథం ను రామా ద్భవితా భయం నో, నరేంద్ర పుత్రా త్సమరే కదాచిత్**

దేవతల వలన గాని, దానవుల నుండి గాని, యక్ష, గంధర్వుల నుండి గాని, గరుత్మంతుడు మొదలగు పక్షీంద్రముల వలన గాని మనకు ఎట్టి భయములేదు అట్టిచో ఒక మానవమాత్రుడైన శ్రీరాముని వలన భయమెందుకు?

సత్యము ఎల్లప్పుడూ ఒకే విధముగా యుండును. దేశకాల పరిస్థితులను బట్టి మారదు. కానీ ఇచ్చట ప్రహస్తుడు సమయానుకూలంగా చెపుతున్నాడు. అటువంటి వారి యెడల రాజు కడు జాగరూకతతో యుండవలెను. కానీ రావణుడు అహంకారి, మూర్ఖుడు.

రావణాజ్ఞచే ప్రహస్తుడు యుద్ధమునకు వెడలగా భయంకర వేగశాలి యగు మహాకపి యైన నీలుడు ప్రహస్తుని సంహరించెను. ప్రహస్తుని మరణవార్త విని రావణుడు శోకముతో వ్యాకులమై తానే యుద్ధభూమికి వెడలెను.

## 6.30 రావణుని శక్తిచే లక్ష్మణుడు మూర్ఛ నొందుట

రావణుడు స్వయముగా గొప్ప సేనతో యుద్ధమునకు వచ్చుట చూచి శ్రీరాముడు విభీషణునితో ఆ వచ్చువారెవరని అడిగెను. అంత విభీషణుడు అందులోని ముఖ్యులైన అకంపనుడు, ఇంద్రజిత్తు, అతిరథుడు, అతికాయుడు, మహోదరుడు, పిశాచుడు, త్రిశిరసుడు, కుంభ నికుంభులు, నరాంతకుడు మొదలగు రాక్షస ప్రముఖులను గురించి చెపుతూ భూతములతో వచ్చుచున్న రుద్రుని వలె వచ్చువాడు రాక్షస రాజైన రావణుడు అని చెప్పెను. రాముడు రావణుని చూడగనే మహాతేజస్సుతో యున్న అతనిని చూచి ఆశ్చర్యము నొంది ఈ నాటికి ఈ పాపాత్ముడు నా కంట పడినాడు కావున నా మనసులో కలిగిన కోపమును వీనిపై చూపెదను అని విల్లు ఎత్తి సంధించి నిలిచెను. అప్పుడు రావణుడు మహాసర్పము వంటి మృత్యుతుల్యమైన ఒక బాణమును సుగ్రీవునిపై ప్రయోగించగా అతను నిలబడెను. వానర ప్రముఖులు పెద్ద పెద్ద పర్వతములతో రాగా వాటిని రావణుడు భగ్నము చేసెను. పెద్ద చేప సముద్రములోకి

చొచ్చుకుపోయినట్లు వానర సైన్యము అనెడి సముద్రములోకి రావణుడు ప్రవేశించుచున్నాడు. రావణుని చూచి సుగ్రీవుడు ఒక పెద్ద పర్వత శిఖరమును పెళ్ళగించి రావణునిపైకి విసరగా దానిని రావణుడు చిన్నాభిన్నము చేసెను. అప్పుడు రావణుడు ఒక పదునైన బాణములో సుగ్రీవునిపై వేయగా అది సుగ్రీవుని వేధించెను. సుగ్రీవుడు ఆ బాణపు దెబ్బతో అరచుచు నేలపై బడెను. వెంటనే మిగతా వానర వీరులు రావణునునిపై దండెత్తగా రావణుడు వారిని తమ బాణపు దెబ్బలతో తూట్లు పొడిచెను. వారందరు అప్పుడు రాముని శరణు జొచ్చిరి. శరణన్న వారిని రక్షించుటలో సమర్థుడు, సర్వలోకములకు శరణ్యుడైన శ్రీరాముడు వారికి అభయము ఇచ్చెను. అంత లక్ష్మణుడు రావణునిపై యుద్ధము చేయుటకు అనుమతించవలసినదిగా కోరగా అందుకు రాముడు సమ్మతించెను. రావణుడు బాణవర్షములో వానరుల శరీరములను చీల్చుతుండగా హనుమ వాని బాణములను అడ్డుకొని అతనిపై పరుగిడి అరచేతితో ఒక్క దెబ్బ కొట్టెను. కొంతసేపటికి రావణుడు తేరుకొని ...

**అథాఽఽశ్వాస్య మహాతేజా రావణో వాక్యమఽబ్రవీత్**

**సాధు వానర వీర్యేణ శ్లాఘనీయోఽసి మే రిపుః**

**రావణే నైవ ముక్త స్తు మారుతి ర్వాక్య మఽబ్రవీత్**

**ధి గఽస్తు మమ వీర్యేణ య స్త్వం జీవసి రావణ**

బాగు బాగు. నీవు నాకు సరియైన ప్రతిద్వందివి అనెను. రావణుడిట్లు చెప్పగా హనుమ రావణునితో "రావణా! నీ వింకను జీవించి యున్నావు. కావున నా పరాక్రమమునకు ధిక్కారం" అనగా రావణుడు మెరుపు వేగములో హనుమ వక్షస్థలముపై మెరుపు వేగములో మోదగా హనుమ స్పృహ తప్పి పడిపోయెను. అత్తరి నీలుడు ఒకప్పుడు రావణుని ధ్వజము మీదను, ఒకప్పుడు కిరీటము పైనను కూర్చొనియుండుట చూచి శ్రీరామునకు, లక్ష్మణునకు, హనుమకు చాలా ఆశ్చర్యము కలిగెను. రావణునకు కూడా చాలా విస్మయము కలిగెను. రావణుడు

అప్పుడు మిగుల క్రోధముతో ఆగ్నేయాస్త్రమును నీలునిపై ప్రయోగించెను. నీలుడు వివశుడై రణరంగమున పడిపోయెను. అయినను తండియైన అగ్ని మహిమాప్రభావము వలన మోకాళ్లపై నిలువరించుకొనెను. పిదప రావణుడు రణోత్సాహముతో లక్ష్మణుని పైకి ఉరికెను. లక్ష్మణుని బాణములచే రావణుని ధనుస్సు విరిగిపోయెను. శరీరముపై దెబ్బలు తగిలి రక్తసిక్తమయ్యెను. అట్టి స్థితి యందు రావణుడు బ్రహ్మదేవుడొసగిన "శక్తి"ని ప్రయోగించెను. ఆ శక్తి ప్రహారముచే విహ్వాలుడైన లక్ష్మణుడు భూమిపై పడి పోయెను. వెంటనే రావణుడు వేగముగా వెళ్లి లక్ష్మణుని తన రెండు చేతులతో పైకి ఎత్త దొడగెను.

**తామ్ ఆపతన్తీం భరతాఽనుజోఽస్త్రైః, జఘాన బాణై శ్చ హుతాఽగ్ని కల్పైః**
**తథాఽపి సా తస్య వివేశ శక్తిః, భుజాఽన్తరం దాశరథే ర్విశాలమ్**

ఏ రావణుడు దేవతలతో కూడిన కూడిన హిమవత్పర్వతమును, మందరాచలమును, మేరుపర్వతమును లేక ముల్లోకములను తన భుజబలముతో లేపగలిగిన శక్తి యుండునో, ఆ రావణుడు లక్ష్మణుని పైకెత్తుటకు సమర్థుడు కాలేక పోయెను. కైలాస పర్వతమును చలింపజేసిన బలశాలి గనుక హిమవత్పర్వతమును కూడా లేపగలడు. మంథర పర్వగతముచే సాగర మథనమును దేవతలు చేసినారు కావున అట్టి దేవతలను రావణుడు ఓడించాడు గావున మంథర పర్వతము రావణునికి ఒక లెక్కలోనిది కాదు. సకల కుల పర్వతములకు కేంద్రమైనది మేరుపర్వతము. దాని శిఖరమును సముద్రమున నిక్షిప్తము చేసినవాడు వాయుదేవుడు. అట్టి వాయువుదేవుడను తన అధీనములో ఉంచుకొన్నాడు కావున మేరుపర్వతము అతనికి లోకువే. ముల్లోకములు అధిపతియైన దేవేంద్రుని జయించాడు గావున ముల్లోకములు అతనికి అధీనములే. కానీ సమస్త భువన భారములను మోసువాడు ఆదిశేషుడు. లక్ష్మణుడు అట్టి ఆదిశేషుని అవతారము గావున రావణుడు లక్ష్మణుని ఎత్త

లేకపోయినాడు. పాయసం విభాగము చేసినప్పుడు సగభాగము కౌసల్యకు ఇచ్చెను. కావున శ్రీరాముడు విష్ణువు అంశములో సగ భాగము. అలానే లక్ష్మణుడు చతుర్ధ అంశము. అట్టి లక్ష్మణుని కదల్చలేకపోయిన రావణుడు రాముని ఏమి చేయగలడు? కానీ అవివేకము ఆలోచనలను ప్రసరింపజేయనీయదు. సత్యభామ అహంకార రూపమైన ధనమునకు గాక రుక్మిణి భక్తి భావముతో ఒక్క తులసి దళముతో శ్రీకృష్ణుడు తూగినాడు. ఆ సమయమున వాయుపుత్రుడగు హనుమ క్రోధుడై తన పిడికిటిచే రావణుని వక్షస్థలమున గట్టిగా కొట్టెను. దానితో రావణుడు భూమిపై మోకాలు ఆనించి క్రింద పడెను. పిమ్మట హనుమ రావణ పీడితుడగు లక్ష్మణుని రెండు చేతులలో ఎత్తుకొని శ్రీరాముని వద్దకు తీసుకొని వెళ్లెను.

**వాయు సూనోః సుహృత్త్వేన భక్త్యా పరమయా చ సః**
**శత్రూణామ్ అప్రకమ్ప్యోఽపి లఘుత్వ మఽగమ త్కపేః**
**ఆశ్వస్త శ్చ విశల్య శ్చ లక్ష్మణ శ్శత్రు సూదన:**
**విష్ణోర్భాగ మఽమీమాంస్య మాఽఽత్మానం ప్రత్యఽనుస్మరన్**

హనుమంతుని యొక్క సౌహార్ధము, అత్యంత భక్తి భావముల వలన లక్ష్మణుడు తేలిక అయ్యెను. అంతట శత్రుసూదనుడైన లక్ష్మణుడు అచింత్యమైన విష్ణువు యొక్క చతుర్థఅంశమైన తనను గూర్చి స్మరించుటతో అతని గాయము లన్నియు తొలగి పోయెను.

## 6.31 రావణ పరాభవము

రణరంగమున మూర్ఛితుడై యున్న రావణుడు స్పృహలోకి వచ్చెను. పిమ్మట వాడియైన తన శరములను, ధనస్సును గ్రహించి భీకరముగా పోరుసల్పగా వానర వీరులందరు పలాయనం చిత్తగించిరి. అప్పుడు హనుమ శ్రీరాముని వద్దకు వెళ్లి విష్ణుభగవానుడు, గరుత్మంతుడిపై కూర్చొని దైత్యులను సంహరించినట్లు, నా (హనుమ) భుజములపై కూర్చొని రావణునకు దండన ఒసగమని కోరెను. అందుకు సమ్మతించిన శ్రీరాముడు హనుమ భుజములపై నెక్కి ధనుస్సు

టంకారనాదము గావించెను. ఆ టంకారము వానరులలో ఉత్సాహమును, రాక్షసులు లో భీతిని గొల్పించెను. శ్రీరాముడు రాక్షసరాజగు రావణునితో ఇట్లు పలికెను.

**యదీన్ద్ర వైవస్వత భాస్కరాన్ వా,**
**స్వయమ్భు వైశ్వానర శంకరాన్ వా**
**గమిష్యసి త్వం దశ వా దిశో వా,**
**తథాఽపి మే నాఽద్య గతో విమోక్ష్యసే**
**తతో రామో మహా తేజా రావణేన కృత వ్రణమ్,**
**దృష్ట్వా ప్లవగ శార్దూలం క్రోధస్య వశ మేయివాన్**
**యో వజ్ర పాతాఽశని సన్నిపాతాన్,**
**న చుక్షుభే నాఽపి చచాల రాజా**
**స రామ బాణాఽభిహతో భృశాఽఽర్తశ:,**
**చచాల చాపం చ ముమోచ వీరః**

రావణా! నీవు ఇంద్రుడు, యముడు, సూర్యుడు - వీరి యొద్దకు కానీ, బ్రహ్మ, అగ్ని, శంకరుడు - వీరి సమీపమునకు గాని, లేక దశ దిక్కులకు గాని పరుగిడి పోయినను ఇప్పుడు నా చేతి నుండి కాపాడబడజాలవు. శ్రీరాముని వచనములు విని రావణుడు రాముని మోయుచున్న హనుమను తీవ్రమగు బాణములతో కొట్టెను. రావణ బాణములతో దెబ్బతిన్న కొలది సహజమగు తేజస్సు గల హనుమ అంతకంతకును తేజస్వంతుడయి విజృంభించు చుండెను. రాముడు సుందరమగు రూపము గలవాడు. ఇతరులకు ఆనందం గలిగించువాడు. అట్టివాడు రావణుని దెబ్బలు తిని రక్తముతో తడిసి యున్న హనుమను జూచి కోపమునకు వశుడయ్యెను. ఈ శ్లోకము రామ స్వభావమును నిరూపించును. ఎప్పుడు పడితే అప్పుడు అతనికి కోపము రాదు. కోపము వచ్చినను అతని

మాటలలో పౌరుష్యముగాని, అశ్లీలముగాని కనబడదు. తనకంటే, తనవారికి బాధ కలిగినప్పుడు సహింపజాలడు. కొట్టినవాడు రావణుడు. దుష్టమైన మాటలు మాటలాడుటయే అతని స్వభావము. **"రావయతి అసత్ ప్రలాపాన్ కారయతి"** చెడుమాటలను పలికెడివాడు, పలికించెడివాడు రావణుడు. సేవకునికి కలిగిన వేదనను చూచి రాముడు క్రోధుడాయెను. ఇది రామ స్వభావము. కోపము వచ్చెడి పద్ధతి ఇది. పిదప శ్రీరాముడు రావణునిపై ఆక్రమణ సలిపి రథము, గుఱ్ఱములు, ఛత్రము, పతాకం, సారథి మున్నగు వాటితో కూడిన అతని రథమును ఛేధించెను. ఏ రావణుడ్డైతే వజ్రము యొక్క అఘాతముచే కూడా క్షోభ పొందకుండెనో, అట్టి రావణుడు శ్రీరాముని బాణఘాతములచే గాయపడి కంపితుడై పోయి సాయంకాలమున ప్రభ తగ్గిన సూర్యుని వలననే తేజోరహితుడయ్యెను. అట్టి స్థితి యందు యుద్ధభూమిలో రాక్షసరాజైన రావణునితో శ్రీరాముడు ఇట్లు చెప్పెను.

**కృతం త్వయా కర్మ మహత్ సుభీమం, హత ప్రవీర శ్చ కృత స్త్వయాఽహమ్**
**తస్మాత్ పరిశ్రాన్త ఇతి వ్యవస్య, న త్వం శరై ర్మృత్యు వశం నయామి**
**గచ్ఛాఽనుజానామి రణాఽర్దిత స్త్వం, ప్రవిశ్య రాత్రించర రాజ లంకాం**
**ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ, తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః**

రావణా! ఇతరులకు అసాధ్యమైన రీతిలో నీవు యుద్ధము చేసి యుంటివి. ఫలితముగా నా పక్షమున యున్న పెక్కు గట్టి వీరులు నెలకొరిగిరి. ప్రస్తుతము నీవు మిగుల అలసి యుంటివి.అందువలన నేను ఇప్పుడు నిన్ను మృత్యుముఖమునకు పంపను. కావున నీవు లంకకు వెళ్లి సేద తీర్చుకొనుము. పిమ్మట రథముపై ధనుర్బాణములను తీసుకొని రణరంగమునకు తిరిగి రమ్ము. అప్పుడు నీకు నా బలమెంతయో తెలియగలదు అని చెప్పెను. రావణుడు, గర్వమును, సంతోషమును కోల్పోయినవాడై లంకకు పోయెను. ఆ రాక్షసరాజు లంకలో ప్రవేశించిన పిమ్మట రాముని బాణములకు మిక్కిలి భీతిల్లి ఆందోళన పడ

సాగెను. ఇది మన భాగ్యము. రాముడు ఆయుధము లేనివానిని, పరిగెత్తుచున్న వానిని, వెనుతిరిగిన వానిని, రక్షించు అని అనక పోయినను తనను రక్షించుకొను ప్రయత్నము చేయని వాడిని తగిన ఆయుధ సామాగ్రి లేక నిర్వీర్యుడై చలించి పోవుచు నేలపై యున్నవానిని కొట్టడు. లోకములో అందరి ద్వేషమును పొంది జీవించు చున్నాడు రావణుడు. పొందవలసిన శ్రీరామసన్నిధి పొందుటకు అవకాశము లభించియు జారవిడుచుకొన్నాడు. ఇది అంతయు మన జీవితములో జరుగుచునే యుండును.

***(ఈ 59 వ సర్గ మకుట భంగము అనగా కిరీటము విరుగుట ప్రధానముగా నిరూపించిన సర్గ కావున దీనిని పారాయణ చేసినచో దీర్ఘకాలం నుండి చికిత్సకు లొంగక భాధించుచున్న రోగములు తప్పక తగ్గును. ఎన్నడును నేలపడని కిరీటము ఎట్లు నేలపడెనో, అదే విధముగా ఎప్పటి నుండియో వదలని రోగములు శరీరమును విడిపోవును. సందేహము లేదు అని ప్రవచన శిరోమణి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు గారు సెలవు ఇచ్చి యున్నారు).***

త్రేతాయుగ ధర్మము ప్రకారము రాముడు నిరాయుధుడైన రావణుని సంహరించకుండా విడిచి పెట్టెను. ద్వాపరయుగములో మహాభారత యుద్ధములో నిరాయుధుడైన కర్ణుని యొక్క అకృత్యములను గుర్తుచేస్తూ కర్ణుని సంహరించమని అర్జునుని ప్రోత్సహించాడు భగవానుడైన శ్రీకృష్ణుడు. ఈ యుగ ధర్మము ప్రకారము అకర్మణత్వము అనగా శత్రువుపై జాలితో అతనిని వదులుట మంచిది కాదు. భారతీయ రాజనీతి యందటువంటి నిస్సహాయ అహంకారము మరియు అకర్మణత్వము చరిత్రలో చోటుచేసుకున్నది. ఈ అకర్మణత్వమును పృధ్వీరాజ్ చౌహాన్ మహమ్మద్ ఘోరీ పట్ల ప్రదర్శించెను. పదహారు పర్యాయములు మహమ్మద్ ఘోరిని పృధ్వీరాజ్ చౌహాన్ ఓడించెను. మరింత

కఠినముగా ఉండకపోవుట వలన అనేక మార్లు తిరిగి తిరిగి భారత దేశముపై దండయాత్ర చేసి పదిహేడవ పర్యాయము ఘోరీ పృధ్వీరాజ్ చౌహాన్ ను ఓడించి చివరకు సంహరించెను. వ్యూహాలకు మారుపేరైన చాణక్యుడు, ఈతనినే కౌటిల్యుడు అని అంటారు. ప్రజారంజకంగా పాలించని నందులను రాజ్యభ్రష్టులను చేసి చంద్రగుప్తుని సింహాసనము అధిష్టింప జేశాడు. గొప్ప మహోన్నత మానవతా వాది. ప్రజలకు పాలన దగ్గర కావాలని చెప్పిన ఆయన ప్రజలే రాజ్య నిర్మాతలని తెలిపారు. ప్రజారంజకము కానీ రాజులను కుటిల నీతితోనైనను సంహరించవచ్చు అని చెప్తాడు. విదేశీయులు పరిపాలిస్తే ధనం వారి దేశానికి తరలించుకుని పోతారు... కాబట్టి మంత్రులు, ఉన్నతాధికారులుగా విదేశీయులకు అవకాశం ఇవ్వరాదని అన్నారు.

### 6.32 కుంభకర్ణుని నిద్ర మేల్కొల్పుట

రావణుడు, రాముని బాణములకు భయపడి, దర్పములుడిగి, చెదిరిన మనసులో లంకలో ప్రవేశించెను. వసిష్ఠుని చేతిలోని బ్రహ్మదండము వలె రాముని బాణములను తలచుకొని మిక్కిలి భయభీతుడయ్యెను. మనసు కుదుటబడక సభలోకి వెళ్లి రాక్షస ప్రముఖులను చూచి ఇట్లు పలికెను.

**విదితం మానుషం మన్యే రామం దశరథాఽఽత్మజం**
**ఇక్ష్వాకు కుల నాథేన అనరణ్యేన య త్పురా**
**ఉత్పత్స్యతే హి మద్వంశే పురుషో రాక్షసాఽధమ**
**య స్త్వాం సపుత్రం సాఽమాత్యం సబలం సాఽశ్వ సారథిం**
**నిహనిష్యతి సంగ్రామే త్వాం కులాఽధమ దుర్మతే**
**శప్తోఽహం వేదవత్యా చ యదా సా ధర్శితా పురా**
**సేఽయం సీతా మహా భాగా జాతా జనక నందినీ**
**ఉమా నందీశ్వర శ్చాఽపి రంభా వరుణ కన్యకా**
**యథోక్తా స్తపసా ప్రాప్తం న మిథ్యా ఋషి భాషితం**

"నేను ఎంతో తీవ్రమగు తపస్సు చేసితిని. అంతయు వ్యర్థమైనది. ఒక మనుష్యుడు నన్ను ఓడించినాడు. మనుష్యుల వలన చావు రాకూడదని నేను బ్రహ్మ దగ్గర వరము కోరుకొనలేదు. లోగడ ఇక్ష్వాకు వంశజుడైన అనరణ్యుడు, వేదవతి, ఉమ (పార్వతి), నందీశ్వరుడు, నలకూబరుడు, బ్రహ్మ ఇచ్చిన శాపములు వ్యర్థము కావు కదా! కుంభకర్ణుడు బ్రహ్మ శాపముచే నిద్రించినది మొదలు ఆరు మాసముల వరకు లేవడు. అతడు నిద్రావశమున యున్నాడు. అతడు అప్రతిమ గంభీరుడు. దేవదానవులు దర్పమును అణచగలవాడు. అతడు సర్వ రాక్షస శ్రేష్ఠుడు. యుద్ధములో ఇద్దరు రాజపుత్రులను, వానరులను శీఘ్రముగా వధింప గలడు. నిద్రాపరవశుడై యున్న కుంభకర్ణుని నిద్రలేపుము" అని రావణుడు ఆజ్ఞాపించాడు. ఇట్లు రాక్షస రాజు పలుకగనే కుంభకర్ణుని నిద్రలేపుటకు కుంభకర్ణభవనమునకు రాక్షసులు బయలుదేరిరి. రావణాజ్ఞను అనుసరించి మాంసము, రక్తము మొదలగు ఆహారపదార్థములు, పరిమళ ద్రవ్యములు, రకరకముల భక్షములను తీసుకొని కుంభకర్ణుడు నిద్రించుచున్న గుహకు చేరుకొనిరి. చందనమును అతని ఒడలిపై పూసిరి. ధూపము వేసిరి. పెద్ద పెద్ద కేకలను వేసిరి. శంఖములను పూరించిరి. మేఘముల వలె గర్జించిరి. ఇటునటు కదిల్చిరి. సింహనాదములను చేసిరి. పెద్ద పెద్ద సుత్తులతో మోదిరి. రోకళ్ళతో, గధలతో ప్రహరించిరి. పర్వత శిఖరములను, వృక్షములను మీద పడవేసిరి. కొన్నివేల మంది ఒక్కసారి గొడ్డళ్లను, పానవములను, భేరీలు, శంఖములను, కుంభములను మ్రోగించి ధ్వని చేసిరి. పెద్ద పెద్ద కాష్ఠములతో, స్తంభములతో తమ శక్తి యున్నంత వరకు పూనిక కొట్టిలేపిరి. కొందరు అతని కేశములు ఊడబెరికిరి. చెవులు కొరికిరి. చల్లటి నీటిని అతని చెవులలో పోసిరి. మహానిద్రావశుడై యున్న కుంభకర్ణుడు నిద్ర లేవలేదు. వేయి ఏనుగులను తెప్పించి అతని శరీరముపై పరిగెత్తించిరి. అప్పుడుగాని కుంభకర్ణునికి కొంచెము

తెలివి వచ్చి స్పర్శ గ్రహించాడు. కొంత సేపటికి నిద్ర మత్తు తొలగినది. ఆకలి అధికముగా వేయుచున్నది. పెద్దగా ఆవలించుతూ లేచెను. పెద్ద పెద్ద రెండు పర్వత శిఖరములు కదలి వచ్చుచున్నావా అనునట్లు రెండు బాహువులను చాచాడు. అతని ముఖము పాతాళము వలె అగాధము అయి కనబడెను. అతని కనులు కాలాగ్ని వలె, రెండు గ్రహ గోళముల వలె మెరయు చుండెను. ఆకలితో వివిధములైన భక్ష్యములను, వరాహములను, మహిషములను తినెను. రక్తమును త్రాగెను. తృప్తి కలిగిన కుంభకర్ణుడు రాక్షసులను చూచి భయపడవలదు అని ధైర్యము చెప్పెను. తనను నిద్రలేపుటకు గల కారణమడిగెను. అప్పుడు విరూపాక్షుడను రాక్షస మంత్రి, నర (రామలక్ష్మణులు), వానరులు లంకను చుట్టుముట్టారు. యుద్ధములో రావణుడు ఓడిపోయి వంటరివాడు కాగా రాముడు ప్రాణములు పోయే పరిస్థితి కల్పించి వదిలినాడు. ఇంతకంటే రావణునికి పరాభవమేముండును? అప్పుడు కుంభకర్ణుడు వెంటనే యుద్ధభూమికి వెళ్లి రామలక్ష్మణులను, వానరులను చంపి రావణ దర్శనము చేసుకొనెదని అనెను. అప్పుడు మహోదరుడు, రాముని ఒక్కడు ఎదురించుట సాధ్యము కాదు కావున ముందుగా రావణుని కలవవలెనని చెప్పెను. ఈ వార్త వారంతా రావణునికి తెలియజేసిరి. కుంభకర్ణుడు సోదర భవనమునకు వెళ్లునప్పుడు రాక్షసులు చేతులు జోడించి నిలిచిరి. వానరులు ఒక పెద్ద కొండ శిఖరము నడచి వెళ్లుచున్నట్లు అనుకొని భయపడి రాముని శరణు వేడిరి.

## 6.33 కుంభకర్ణుడు రావణునకు హితము చెప్పుట

కుంభకర్ణుడు పుష్పక విమానము నందు మనసు చెదరి దిగులుతో యున్న రావణుని చూచి నమస్కరించి తనను రప్పించిన కారణమేమని తెలుసుకొనగోరెను. అప్పుడు రావణుడు, తమ్ముడైన కుంభకర్ణునితో ... రాముడు, వానర రాజైన సుగ్రీవునితో మరియు అతని అశేష వానర సైన్యముతో సముద్రమునకు వారధి కట్టి లంకలో ప్రవేశించారు. మన రాక్షసులలో ప్రధానమైన

వారిని చంపినారు. వారిలో ప్రధానమైన వాడు ఒక్కడు చనిపోలేదు. నా కోశము, బలము కూడా అంతమగుచున్నది. నీవు అజేయ పరాక్రముడవు కావున నీ పరాక్రమముచే వానర సైన్యమును చెదరగొట్టుము.

రాక్షసరాజగు రావణుడు దీనంగా మాటాడుట కుంభకర్ణునకు నవ్వు తెప్పించెను. ఈ విధముగా పలికెను. యుద్ధ ప్రారంభములో నీవు మాతో ఆలోచన చేసినప్పుడు, సీతాపహరణము నందలి దోషములను చెప్పి యున్నాము. అప్పుడు నీకు మా మాటలు రుచింపలేదు. పాపకర్మకు తగిన ఫలితము అనుభవించక తప్పదు. వీర్యము ఉన్నదని దర్పముతో తరువాత వచ్చెడి ఆపదలను ఆలోచించినావు కాదు. నీకు అధికారము యున్నది కదా యని తప్పు పని చేసి ఇప్పుడు విచారించుట వలన ప్రయోజనమేమి?

**యః పశ్చాత్ పూర్వ కార్యాణి కుర్యా దైశ్వర్య మాఽఽస్థితః**
**పూర్వం చోత్తర కార్యాణి న స వేద నయాఽనయౌ**
**దేశ కాల విహీనాని కర్మాణి విపరీత వత్**
**క్రియ మాణాని దుష్యన్తి హవీం ష్యఽప్రయతే ష్వివ**
**ధర్మమ్ అర్థం చ కామం చ సర్వాన్ వా రక్షసాం పతే**
**భజతే పురుషః కాలే త్రీణి ద్వన్ద్వాని వా పునః**
**త్రిషు చైతేషు య చ్ఛ్రేష్ఠం శ్రుత్వా త న్నాఽవబుధ్యతే**
**రాజా వా రాజ మాత్రో వా వ్యర్థం తస్య బహు శ్రుతమ్**
**అస్మిన్ కాలే తు య ద్యుక్తం త దిదానీం విధీయతామ్**
**గతం తు నాఽనుశోచంతి గతం తు గత మేవ హి**
**స సుహృద్యో విపన్నాఽర్థం దీన మఽభ్యఽవపద్యతే**
**స బన్ధు ర్యోఽపనీతేషు సాహాయ్యా యోపకల్పతే**
**గర్జన్తి న వృథా శూరా: నిర్జలా ఇవ తోయదాః**

**పశ్య సంపాద్యమానం తు గర్జితం యుధి కర్మణా**
**న మర్షయతి చాఽఽత్మానం సంభావయతి నాఽఽత్మనా**
**అదర్శయిత్వా శూరా స్తు కర్మ కుర్వన్తి దుష్కరమ్**

ఏ కార్యము నైనను చేయుటకు ముందు మంత్రులతో, పెద్దలతో ఆలోచించి చేయవలెను. ముందు కార్యము చేసిన తరువాత ఆలోచన చేయుట నీతి మార్గమునకు విరుద్ధము. దేశకాలములకు అనుగుణముగా కాక అందులకు విపరీతముగా చేయబడు కార్యములు సంస్కారహీనులు. అగ్నిహోత్రము నందు అర్పించిన హవిస్సు వలె నిష్ఫలము అగును. రాజులు చేయవలసిన కార్యములు మూడు రకములుగా యుండును. ఉత్తమము, మధ్యమము, అధమము. నీతిజ్ఞుడగు వాడు ధర్మమును గాని, అర్థమును గాని, లేక అన్నింటిని కాని ఉపయుక్తమైన సమయము నందే సేవించ వలెను. ధర్మ, అర్ధ, కామముల మూడింటిలో ధర్మమే శ్రేష్ఠమైనది. కావున విశేష అవసరము లందు అర్ధ, కామములను ఉపేక్షించి ధర్మమునే సేవించ వలయును. ఈ విషయమును విశ్వసనీయులగు జనుల ద్వారా వినియు ఏ రాజు తెలిసికొనడో, లేక తెలిసికొనియు సవీకరింపడో అట్టి వాని యొక్క పెక్కు శాస్త్రముల అధ్యయనము వ్యర్థమేయగును. సరి! గడచి పోయినదేదియో గడచిపోయినది. బుద్ధిమంతులు గడచిన దానిని గూర్చి మరల శోకింపరు. ఇప్పుడు మనమేమి చేయవలెనో దానిని గూర్చి విచారింపుడు. ఎవడు కార్యమంతయు నష్టపోవుటచే దుఃఖితుడయ్యు స్వజనులపై ఆకారణముగనే అనుగ్రహము చూపునో అతడే సుహృత్తు. మరియు ఎవడు ఆ నీతి మార్గమున జనుటచే సంకటము పడిన జనులకు సహాయమొనర్చునో అతడే బంధువు. శూరవీరులు జలరహిత మేఘము వలె వ్యర్థముగా గర్జన చేయరు. యుద్ధస్థలమున నేను నా పరాక్రమముచే గర్జన చేయుట చూడుము. శూరవీరులు తమ నోటితోనే తమ గొప్ప చెప్పుకొనుటను సహింపరు. వారు వాక్కు ద్వారా ప్రదర్శనము చేయక

దుష్కర పరాక్రమమును ప్రకటించుదురు. మహాబలశాలియగు కుంభకర్ణుడు పర్వత శిఖరము వలె ఎత్తుగాను, విశాల దేహము గలిగి యుండెను. అతడు ఈ ప్రకారముగా పలికి వెంటనే ప్రాకారమును దాటి మహావేగముగా నగరము వెలుపలికి పోయెను.

## 6.34 కుంభకర్ణుని వధ

మహాతేజశ్శాలియైన రాముడు ధనస్సును ధరించి నిలిచి కుంభకర్ణుని చూసినాడు. కుంభకర్ణుడు పర్వతము వంటి దేహము కలవాడు. ఆశ్చర్యముతో రాముడు విభీషణుని అట్టి రాక్షసుడు ఎవ్వరో చెప్పమని అడిగెను. విభీషణుడు ఇట్లు చెపుతున్నాడు. "ఈతడు విశ్రవసుని కుమారుడు. రావణుడి సోదరుడు. యుద్ధములో యముని, ఇంద్రుని ఓడించాడు. మహాబలశాలి. ఇంత ఉన్నతమైన శరీరము గలవాడు వేరొకడు లేడు. దేవతలు ఈతడు మృత్యువని మోహము నొందినారు. జన్మసిద్ధముగనే ఈతడు మహాపరాక్రమశాలి. పుట్టగానే ఆకలి తీవ్రమయి ఈతడు వేలకొలది అనేకమైన జంతువులను భక్షించినాడు. అట్లు అతడు తినివేయుచున్నచో లోకములో ప్రజలే ఉండరని భయపడి ప్రజల విన్నపముపై ఇంద్రుడు వజ్రాయుధముతో ఈతనిని కొట్టెను. అందుకు ఇతను కోపించి ఐరావతము యొక్క దంతము నూడపెరికి, ఆ దంతముచే ఇంద్రుని గుండెలపై కొట్టగా అందుకు దేవతలు, ఋషులు దుఃఖించి బ్రహ్మ వద్ద మొరపెట్టుకొనిరి. బ్రహ్మకు కూడా భయము గొల్పునట్టి అతని రూపము చూడగనే, బ్రహ్మ కుంభకర్ణునితో లోకములను రక్షించుట కొరకు నీవు (కుంభకర్ణుడు) చనిపోయినట్లు పరుండెదవు అని శపించెను. రావణుడు అది చూచి బ్రహ్మతో ఈతడు మీ మునిమనవడు. చెట్టును పెంచవలసిన సమయమున నరికి వేయుట న్యాయము కాదు, నీ వాక్కు అసత్యము కానేరదు కావున తగిన ఉపాయము చేయమని ప్రార్థించెను. అప్పుడు బ్రహ్మ ఈతడు గాఢముగా ఆరు

నెలలు నిద్రించును ఆ పిదప ఒక్కరోజు మాత్రమే మెలొకొనును, ఆ ఒక్క రోజుననే భూమిపై సంచరించుచున్న ప్రాణికోటిని అగ్నివలె తినుచుండును అని ఉపశమనము చేసెను. రామా! నీ పరాక్రమముచే భయము నొంది, పరాభవం పొందిన రావణుడు, కుంభకర్ణుని మేల్కొలిపినాడు. నిద్ర లేచిన కుంభకర్ణుడు తీవ్రమగు కోపముచే వానరులను భక్షించుచున్నాడు. వానరులు అతనిని అడ్డగింపజాలరు. కావున రామా! అతను రాక్షసుడని చెప్పవద్దు. ఒక యంత్రము పైకి లేచినదని చెప్పుము. అప్పుడు వారి భయము కొంత వరకు తగ్గును. విభీషణుడు అట్లు చెప్పగానే రాముడు సేనాపతియైన నీలుని పిలిచి పెద్ద పెద్ద పర్వత శిఖరములు, చెట్లు మొదలగు ఆయుధములచే వానర ప్రముఖులైన గవాక్షుడు, శరభుడు, హనుమ, అంగదుడు మొదలగు వారు పర్వతాకారులై లంకాద్వారము వద్ద కాపుండమని చెప్పెను. కుంభకర్ణుని చూడగనే వానరులు భయభీతులై పరిగెత్తు చుండిరి. అప్పుడు వారిని చూచి అంగదుడు ఇట్లు చెప్పెను వానరులారా! ప్రాణములను రక్షించుకొనుటకు ఎక్కడికి పారిపోవుదురు. మీరు ఎక్కడికి వెళ్ళినను కుంభకర్ణుడు మిమ్ములను వెంటాడి వెంటాడి చంపును. లేదా రాజాజ్ఞ లేకుండా యుద్ధ రంగము నుంచి పారిపోయినందుకు సుగ్రీవుడు మిమ్ములను బ్రతుకనీయడు. ఈ రాక్షసుడు మన ముందు యుద్ధమునకు జాలడు. కేవలము మనను భయపెట్టుటకు చేయు ప్రయత్నము మాత్రమే! అని వారికి అంగదుడు ధైర్యము నూరిపోయగా వారు వెనుకకు వచ్చి మదపుటేనుగు వలె కుంభకర్ణుని కొట్టిరి. కుంభకర్ణుడు మిగుల క్రుద్ధుడై చెలరేగిన దావాగ్ని వనములను దహించి వేయునట్లు మహాబలశాలురైన వానరులను నుగ్గు నుగ్గు గావించెను. కుంభకర్ణుడు వానరులలో కొంతమందిని సముద్రములో విసిరి వేసెను. కొంతమందిని ఆకాశములో ఎగుర వేసెను.

**తాన్ సమీక్ష్యాఽంగదో భగ్నాన్ వానరాన్ ఇద మఽబ్రవీత్**

**అవతిష్ఠత యుధ్యామో నివర్తధ్వం ప్లవంగమాః**

**శయామహేఽథ నిహతాః పృథివ్యా మఽల్పజీవితాః**
**దుష్ప్రాపం బ్రహ్మలోకం వా ప్రాప్నుమో యుధి సూదితాః**
**సంప్రాప్నుయామః కీర్తిం వా నిహత్య శత్రుమ్ ఆహవే**
**జీవితం వీరలోకస్య భోక్ష్యామో వసు వానరాః**

అంగదుడు వారితో, ఓ వానరవీరులారా! ఆగుడు. వెనుకకు మరలుడు. వానితో మనమందరము కలసి యుద్ధము చేసెదము. మనము చిన్న శరీరము గలవారమైనప్పటికీ శత్రువుచే చంపబడి యుద్ధభూమి యందు పరుండినప్పటికీ కుయోగులకు పరమ దుర్లభమైన బ్రహ్మలోకము మనకు సంప్రాప్తించును. అట్లుకాక యుద్ధము నందు మనమే శత్రువులను వధించినచో మనకు కీర్తి లభించును. లేదా మనమే రణరంగమున అసువులు బాసినచో వీరస్వర్గ సుఖములను అనుభవింతుము. అప్పుడు కుంభకర్ణుడు, రోషముతో అంగదునిపై శూలము విసరగా దానిని చాకచక్యంగా తప్పించుకొని కుంభకర్ణుని గుండెలపై కొట్టెను. వెంటనే కుంభకర్ణుడు అంగదుని పిడికిలితో కొట్టగా అంగదుడు మూర్ఛ నొందెను. సుగ్రీవుడు కోపముతో కుంభకర్ణునిపై యుద్ధమునకు రాగా, కుంభకర్ణుడు సుగ్రీవునితో నీవు బ్రహ్మ మనవడవు[23]. ప్రసిద్ధమైన పౌరుషముగలవాడవు అని చెప్పి సుగ్రీవునితో తలపడెను. కుంభకర్ణుడు తన వాడియైన శూలముతో తలపడగా హనుమ ఆ శూలమును లాగి పట్టుకొని తన మోకాలున ఆనించి విరచెను. ఆ శూలము వెయ్యి బారువుల ఉక్కుతో చేయబడినది. వెంటనే

---

[23] బ్రహ్మదేవుని మానస పుత్రుడు ఋక్షరజసుడు. అతడు ఒకనాడు ఒక సరస్సులో మునగగా అందమైన స్త్రీమూర్తిగా మారెను. (పార్వతీదేవి స్నానవిహారాదులను గావించెడి సరస్సులో రాక్షసులు మునుగ సాగిరి. అందులకు కుపితయైన పార్వతి ఆ సరస్సులో స్నానము చేసిన పురుషులు స్త్రీలుగా మారుదురని వచించెను. అట్లు ఆ శాపమునకు గురియైన ఆ సరస్సుయే ఋక్షరజసుడు మునిగిన సరస్సు). స్త్రీ మూర్తిగా మారిన అట్టి ఋక్షరజసుడును చూచి ఇంద్రుడు, సూర్యుడు మోహపడగా వారి రేతస్సు స్కలన మయ్యెను. ఇంద్రుని రేతస్సు వాలము నందు పడుటచే వాలియు, సూర్యుని రేతస్సు కంఠము మీద యందు పడుటచే సుగ్రీవుడు జన్మించిరి. బ్రహ్మ జూచి ఋక్షరజసుడుని వేరొక సరస్సులో స్నానము చేయించగా ఋక్షరజసుడు మరల వానరుడయ్యెను. అందుచే సుగ్రీవుడు బ్రహ్మ మనవడు.

కుంభకర్ణుడు మలయపర్వత శిఖరమును ఒకదానిని తీసుకొని సుగ్రీవుని కొట్టగా సుగ్రీవుడు తెలివితప్పి నేలపై పడెను. వెంటనే ఆ సుగ్రీవుని తీసుకొని కుంభకర్ణుడు లంకలోకి తీసుకొనిపోవుచుండెను. అప్పుడు హనుమంతుడు ఈ విధముగా ఆలోచించెను. "నేను పర్వతమంత శరీరమును పెంచి కుంభకర్ణుని చంపి వానర రాజును విడిపించెదను. అట్లు చేసినచో ఒక సేవకుని ద్వారా ప్రాణరక్షణ పొందినందుకు సుగ్రీవుని మనసుకు క్లేశము నొందును. అతని కీర్తి మాసిపోవును. కొంచెము సేపు సైన్యము చెదిరిపోకుండా నిరీక్షించెదను" అని తలచి సైన్యము చెదిరిపోకుండా ఆపెను. కుంభకర్ణుడు సుగ్రీవుని ఎత్తుకొని రాజవీధులలో పోవుచుండగా ఎత్తైన గోపురముల నుండి రాక్షసులు పుష్ప వర్షము కురిపించగా ఆ చల్లదనానికి సుగ్రీవునికి మెలుకువ వచ్చెను. అప్పుడు తన గోళ్ళతో కుంభకర్ణుని చెవులను, పళ్లతో ముక్కును, గోళ్ళతో పక్కలను చీల్చుతూ బాధించుచుండగా కుంభకర్ణునికి కోపము వచ్చి సుగ్రీవుని క్రింద పడవేసెను. అట్లు క్రిందపడవేయగనే సుగ్రీవుడు తప్పించుకొని ఒక్కసారి పైకెగిరి రాముని వద్దకు వచ్చి చేరెను. అప్పుడు కుంభకర్ణుడు మరల కోపము తెచ్చుకొని ఒడలు తెలియక వానరులను, రాక్షసులను, పిశాచులను, ఎలుగుబంట్లను కూడా తినివేయుచుండెను. అప్పుడు వానరులు భయపడి రాముని శరణు జొచ్చగా, లక్ష్మణుడు యుద్ధము చేయుటకు సిద్ధమయ్యెను. కుంభకర్ణుడు లక్ష్మణుని వదిలి తిన్నగా రాముని వద్దకే వెళ్లెను. రాముడు రౌద్రాస్త్రమును ప్రయోగించగా, ఆ రామాస్త్ర బాణమునకు దెబ్బతిన్న కుంభకర్ణుడు భయంకరముగా అరచుతూ, వానరులను చెదరకొట్టుచు పరిగెత్తెను. చేతిలోని ఆయుధములన్నియు జారిపోయినవి. అయినను చేతులతోనే యుద్ధము చేయుచుండెను. రాముడు కోపముతో, పూర్వము వాలిని వధియించినది, ఏడు మద్దిచెట్లను చేధించినది అయినట్టి బాణమును కుంభకర్ణునిపై ప్రయోగించగా, అది అతనికి ఎట్టి వేదనను కలుగచేయలేదు. రాముడు వెంటనే కుంభకర్ణునిపై వాయువ్యాస్త్రమును ప్రయోగించెను. అది

కుంభకర్ణుని ముద్గరమును చేతితో సహా ఖండించెను. అప్పుడు కుంభకర్ణుడు రెండవ చేతితో ఒక చెట్టును పెకలించి రామునిపైకి పరిగెత్తెను. అప్పుడు రాముడు ఐన్ద్ర అస్త్రముతో రెండవ భుజమును ఖండించెను. రెండు అర్ధచంద్రాకార బాణములతో అతని రెండు పాదములను ఖండించెను. నోరు తెరుచుకొని వచ్చుచుండగా అతని నోటిని బాణములతో నింపెను. మరియొక వజ్రపు మొనగలిగిన బాణముతో కుంభకర్ణుని శిరస్సును చేధించెను. దేవతలు, వానరులు అందరూ సంతసించిరి.

కుంభకర్ణుడు అనగా కుంభముల వంటి చెవులు గలవాడు. కేవలము శ్రవణము ద్వారా పూర్ణ జ్ఞానము సాధించాను అని అనుకొనెడిసాధక వృత్తి. పర్వతాకారుడు మరియు అతి నిద్రాలోలుడు. జీవితమున సగభాగం నిద్దురకే సరిపోవు, మిగిలిన ఆ సగభాగం చిత్తశుద్ధి లేకపోవు, అతి నిద్రా లోలుడు తెలివి లేని మూర్ఖుడు, పరమార్ధం కానలేక వ్యర్ధంగా చెడతాడు అని "శ్రీకృష్ణ పాండవీయము" లో శ్రీకృష్ణుడు, భీమునికి తత్వ బోధ చేస్తాడు. అనగా సాధకుని యందలి వృత్తులు సూర్యుని ప్రకాశముచే (జ్ఞానముచే) ఎప్పుడు మేల్కొనకుండా అవిద్యచే యుండుట. అట్టి అవిద్యా రూపమైన కుంభకర్ణుని ముక్కు చెవులు కోసి ఆకర్షణ విహీనము చేసి రామ సాధకుడు సంహరింప వలెను.

## 6.35 కుంభకర్ణుని మరణ వార్తతో రావణుడు విలపించుట

రాక్షసులు కర్మ పరిపక్వమై కుంభకర్ణుడు చనిపోయినాడని రావణునికి నివేదించిరి. పినతండ్రి చనిపోయినాడని విని దేవాంతక నరాంతకులు, త్రిశరుడు, అతికాయుడు ఏడ్చిరి. సోదరుడు చనిపోయినాడని మహోదర, మహాపార్శులు శోకాక్రాంతులైరి. మూర్ఛ నుండి తేరుకున్న పిమ్మట రావణుడు దైన్యముతో విలపింప సాగెను.

**హా వీర రిపు దర్పఘ్న కుమ్భకర్ణ మహా బల**

**త్వం మాం విహాయ వై దైవాద్యాఽఽతోఽసి యమ సాదనం**

మమ శల్య మఽనుద్ధృత్య బాన్ధవానాం మహా బల
శత్రు సైన్యం ప్రతా ప్యైకః క్వ మాం సంత్యజ్య గచ్ఛసి
ఇదానీం ఖ ల్వఽహం నాఽస్మి యస్య మే దక్షిణో భుజః
పతితోఽయం సమాశ్రిత్య న బిభేమి సురాఽసురాన్
కథమ్ ఏవం విధో వీరో దేవ దానవ దర్పహా
కాలాఽగ్ని రుద్ర ప్రతిమో రణే రామేణ వై హతః
యస్య తే వజ్ర నిష్పేషో న కుర్యా ద్వ్యసనం సదా
స కథం రామ బాణాఽఽర్తః ప్రసుప్తోఽసి మహీ తలే
ఏతే దేవ గణాః సార్ధమ్ ఋషిభి ర్గగనే స్థితాః
నిహతం త్వాం రణే దృష్ట్వా నినదన్తి ప్రహర్షితాః
ధ్రువమ్ అద్యైవ సంహృష్టా లబ్ధ లక్ష్యాః ప్లవంగమాః
ఆరోక్ష్య న్తీహ దుర్గాణి లంకా ద్వారాణి సర్వశః
రాజ్యేన నాఽస్తి మే కార్యం కిం కరిష్యామి సీతయా
కుమ్భకర్ణ విహీనస్య జీవితే నాఽస్తి మే రతిః
య ద్యఽహం భ్రాతృ హన్తారం న హన్మి యుధి రాఘవమ్
నను మే మరణం శ్రేయో న చే దం వ్యర్థ జీవితమ్
అద్యైవ తం గమిష్యామి దేశం యత్రాఽనుజో మమ
న హి భ్రాతౄన్ సముత్సృజ్య క్షణం జీవితు ముత్సహే
దేవా హి మాం హసిష్యన్తి దృష్ట్వా పూర్వాఽపకారిణమ్
కథమ్ ఇన్ద్రం జయిష్యామి కుమ్భకర్ణ హతే త్వయి
త దిదం మా మఽనుప్రాప్తం విభీషణ వచః శుభమ్
య దఽజ్ఞానా న్మయా తస్య న గృహీతం మహాత్మనః
విభీషణ వచో యావత్ కుమ్భకర్ణ ప్రహస్తయోః
వినాశోఽయం సముత్పన్నో మాం వ్రీడయతి దారుణః

**త స్యాఽయం కర్మణః ప్రాప్తో విపాకో మమ శోక దః**
**య న్మయా ధార్మికః శ్రీమాన్ స నిరస్తో విభీషణః**
**ఇతి బహు విధమాఽఽకులాఽన్తరాత్మా,**
**కృపణ మఽతీవ విలప్య కుమ్భకర్ణమ్**
**న్యపత దఽథ దశాననో భృశాఽఽర్తః**
**త మఽనుజమ్ ఇన్ద్ర రిపుం హతం విదిత్వా**

శత్రువు యొక్క దర్పము అణచ జాలిన వీరుడు, మహాబలుడు అగు కుంభకర్ణుడు నన్ను విడిచి దైవ వశమున యమలోకమునకు వెళ్ళినాడు. మహాబలా! నా శరీరము పెకిలించకుండనే నీవు నన్ను వదలి వెళ్ళినావు. నా కుడి భుజము విరిగినది. ఇంకా నేను లేనట్లే. నీ సాయముతో నేను దేవతలకు, రాక్షసులకు భయపడకుండా యుంటిని. ప్రళయకాలాగ్ని వలె, రుద్రుని వలె భయంకరమైన నీవు రామునిచే ఎట్లు చంపబడినావు? ఇంద్రుని వజ్రపు దెబ్బ కూడా నీకు బాధను కలిగించలేదు. ఆకాశమున నిలిచి దేవతలు, ఋషులు నీవు చనిపోయినావని చూచి హర్షముతో గర్జించు చున్నారు. వానరులు అవకాశము లభించి ఆనందించు చున్నారు. ఇక వారందరు మన దుర్గములను లంకాద్వారములను ఆరూహించెదరు. నీవు లేని నాకు ఈ రాజ్యము అక్కర లేదు. సీతమ్మ అక్కర లేదు. కుంభకర్ణుడు లేని నేను జీవించుట వ్యర్థము. సోదరుని చంపిన రాముని యుద్ధములో చంపకుండ జీవించుట కంటే మరణించుట మేలు. సోదరుడు వెళ్లిన చోటుకే నేను కూడా వెళ్లెదను. ఆ లోకములో దేవతలు నన్ను చూచి వెనుక వారికి అపకారము చేసినాడను కదా! ఇప్పుడు పరాభవం నందితినని పరిహసించుదురు. నీ తోడు లేని నేను ఇంక ఇంద్రుని జయింపలేను. విభీషణుడు చెప్పిన మాటయే ఫలించింది. అజ్ఞానము వలన నేను అతని మాట వినక పోతిని. కుంభకర్ణుడు, ప్రహస్తుడు చనిపోవుటచే విభీషణుని మాటలు తలచుకొనిన నాకు

సిగ్గుపుట్టుచున్నది. ధార్మికుడగు విభీషణుని వెడల గొట్టిన పాపమునకు ఫలము వచ్చినది. అని దీనంగా మనసు కలత పడి విలపించెను. కుంభకర్ణుడు చనిపోయినాడని దుఃఖములో నేలపడెను.

## 6.36 రావణుని కుమారులు, పినతండ్రులు నిహతులగుట

అనంతరము రావణుని సూచన మేరకు రావణుని కుమారులైన త్రిశరుడు, దేవాంతకుడు, నరాంతకుడు, అతికాయుడు, రావణుని సోదరులగు మహోదర, మహాపార్శ్వులు రావణునికి నమస్కరించి మృత్యుప్రేరితులై యుద్ధోత్సాహముతో బయలుదేరిరి. ఆయుధపు దెబ్బలు తగిలితే నొప్పి లేకుండా చేసే పదివిధములగు ఓషధులను తమతో ఉంచుకొనిరి. అప్పుడు జరిగిన యుద్ధమున అంగదుడు నరాంతకుని, హనుమ దేవాంతకుని మరియు త్రిశురుని, నీలుడు మహోదరుని, ఋషభుడు మహాపార్శ్వుని సంహరించిరి. ఇంద్రుని అంతటి పరాక్రమవంతులైన తమ సోదరులు (నరాంతకుడు, దేవాంతకుడు, త్రిశురుడు) మరియు తన పిన తండ్రులైన మహోదరుడు, మహాపార్శ్వుడు నిహతులైనందుకు అతికాయుడు అమితముగా దుఃఖించెను. కుంభకర్ణుని వంటి శరీర పరిమాణముతో భయంకరమగు వింటి నారి ధ్వనితో వచ్చుచున్న ఆ రాక్షసుడు ఎవరని శ్రీరాముడు విభీషణుని అడిగెను. అప్పుడు విభీషణుడు రామునితో ఆ వచ్చువాడు రావణుని కుమారుడైన అతికాయుడు. రావణునితో సమానుడు. పెద్దలను సేవించి వేద వేదాంగములను, సర్వాస్త్ర విద్యలను పొందినాడు. ఇతను రావణుని ఒక భార్యయైన ధాన్యమాలిని కొడుకు. తపస్సు చేసి బ్రహ్మ వలన అనేకమైన అస్త్రములను, సురాసురులచే మరణము లేకుండా, దివ్యమగు కవచమును, రథమును మొదలగు వరములు పొందిన వాడు. కావున మన వానర సైన్యములు నశించక ముందే ఇతని విషయమున తీవ్రమగు ప్రయత్నము చేయవలెను అని చెప్పెను. ఆ అతికాయుడు రాముని వద్దకు యేగి "నేను సామాన్యులతో యుద్ధము చేయనని, నాతో యుద్ధము చేయగల పట్టుదల

గలవారు ఎవరైన ఉన్నచో యుద్ధము చేయుడు" అని అనెను. అప్పుడు లక్ష్మణుడు క్రోధముతో ధనుష్టంకారము చేసి నిలబడెను. అప్పుడు అతికాయుడు తీవ్రమగు కోపముతో శ్రేష్ఠమైన బాణములను లక్ష్మణుడు పై ప్రయోగించెను. వాటినన్నింటిని లక్ష్మణుడు చేధించెను. అనేకమైన తీవ్రమైన బాణములను ప్రయోగించుచున్నను అతికాయుని వజ్రభూతమగు కవచమునకు తగిలి చివరి ముళుకులచే విరిగి నేలబడెను. అప్పుడు వాయుదేవుడు వచ్చి లక్ష్మణునితో "ఈతనికి బ్రహ్మ వరముచే లభించిన అభేద్యమైన కవచము యున్నది. నీ బాణములేమియు చేయజాలవు. ఈ కవచమును బ్రహ్మాస్త్రముచే చేధింపుము. అది తప్ప వేరొకటి ఈతనిని చంపజాలవు". అని చెప్పెను. అప్పుడు లక్ష్మణుడు బ్రహ్మాస్త్రము ప్రయోగించగా అతికాయుడు శిరస్సు తెగి నేలబడెను. అప్పుడు రావణుడు చింతాక్రాంతుడై ..

**తం మన్యే రాఘవం వీరం నారాయణ మఃనామయం**

**తద్భయా ద్ధి పురీ లంకా పిహిత ద్వార తోరణా**

ఆ రఘువీరుడు సనాతనమైన శ్రీమన్నారాయణునిగా తలఁచెను. ఆ మహాత్ముని భయముచే లంకానగరము యొక్క అంతర్ద్వారములను, బహిర్ద్వారములను అన్నియు మూతబడినవి కనుక లంకానగరము యొక్క రక్షణ వ్యవస్థ మరియు సీత యుండు అశోకవనము జాగ్రత్త అని రావణుడు రాక్షసులకు ఆజ్ఞ యిచ్చెను. అంత ఇంద్రజిత్ తండ్రి యైన రావణుని అనుమతితో యుద్ధమునకు బయిలు దేరెను.

## 6.37 ఇంద్రజిత్తు యుద్ధ విజృంభణ

సూర్యకాంతితో ఆకాశము ప్రకాశించునట్లు ఇంద్రజిత్ యుద్ధభూమిని జేరెను. తన రథము చుట్టూ సైనికులను నిలిపెను. రాక్షస శ్రేష్ఠుడు మంత్రపూర్వకముగా అగ్నిహోత్రములో హోమము చేసెను. హవిస్సులతో, మాలికల్తో, గంధములతో

అగ్నిహోత్రుని ఆరాధించెను. శస్త్రములను, రెల్లును అగ్నిహోత్రమునకు చుట్టును అర్పించెను. ఉక్కుతో హోమము చేయు సాధనమును అనగా స్రువమును కల్పించెను. యుద్ధభూమి యందు అగ్ని చుట్టును దర్భలను, చిన్న ఈటెలను పరచి, సజీవంగా యున్న నల్లని మేక యొక్క కంఠమును పట్టుకొనెను. పిదప దానిని అగ్నికి ఆహుతి ఇచ్చెను. అప్పుడు పొగలేని అగ్నిజ్వాలలు ఒక్కసారిగా ప్రజ్వలించినవి. అందు విజయ సూచకమైన చిహ్నములు గోచరించినవి. అంతట అగ్నిదేవుడు మేలిమి బంగారు ఆభరణములను ధరించి ప్రదక్షణ పూర్వకముగా తిరుగుచున్న జ్వాలలు గలవాడై స్వయముగా వచ్చి ఆ ఆహుతిని (హోమద్రవ్యమును) స్వీకరించెను. తదుపరి ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ఆవాహనమొనర్చి, తనధనస్సును, రథమును అచట ఉంచి, బ్రహ్మాస్త్ర మంత్రములచే వాటిని అభిమంత్రించెను. ఆ రావణ సుతుడు అగ్నికి హవిస్సులను సమర్పించుచు, బ్రహ్మాస్త్రమును ఆహ్వానించుచున్నప్పుడు సూర్యచంద్రులు, నక్షత్రములు, అంతరిక్షమున గల ఇతర ప్రాణులు భీతికి లోనయ్యెను. అగ్నివలె తేజోమూర్తియు, మహేంద్రుని వలె మిక్కిలి ప్రభావశాలియు, అద్భుతమైన మంత్రశక్తి గలవాడును ఐన ఇంద్రజిత్తు తన అగ్నికార్యములు (హోమములు) పూర్తియైన పిమ్మట ధనుర్బాణములతో, ఖడ్గములతో రథాశ్వములతో, సారథితో సహా కూడి ఆకాశమునకు ఎగిరి అంతర్ధానమయ్యెను. అప్పుడు జరిగిన మహాసంగ్రామములో ఇంద్రజిత్తు బాణపు దెబ్బలచే అనేకమైన వానరులు నెలకొరిగిరి. కాలాగ్ని వలె వానరులందరూ దహించుచుండిరి. వానర సైన్యమంతయు బాణములచే మూర్ఛ నొందెను. రక్తము స్రవించు చుండెను. సైన్యము వ్యాకులము నొందెను. ఇది చూసి ఇంద్రజిత్తు ప్రీతీ నొందెను. అప్పుడు ఇంద్రజిత్తు తన సైన్యమును వదలి తాను ఎవ్వరికి కనబడకుండా తీవ్రమగు కారుమబ్బు జలధారలు వర్షించునట్లు బాణవర్షమును వర్షించు చుండెను. ఆ బాణవర్షముచే రామలక్ష్మణులను సైతము చీకాకు పరచెను. రాముడు

మహాశక్తి కలవాడయ్యు ఇంద్రజిత్తు వర్షించుచున్న బాణములను చూచి లక్ష్మణునితో "లక్ష్మణా! యీతడు బ్రహ్మాస్త్రముచే మన సైన్యము నంతయు పడగొట్టి మనలను కూడా చీకాకు పరచుచున్నాడు. బ్రహ్మ ఒసగిన వరముచే మనకు కనబడకుండా ఆకాశమున సంచరించుచున్నాడు. కావున ధైర్యముతో ఓరిమి వహించుము". అనెను. ఇంద్రజిత్తు హర్షముతో రామలక్ష్మణులతో సహా వానర వీరులందరు నేలపై పడి యుండుట చూచి విజయగర్వంతో లంకలో ప్రవేశించెను. ఈ విధముగా ..

**సప్త షష్టి ర్హతాః కోట్యో వానరాణాం తరస్వినామ్**

**అహ్నః పంచమ శేషేణ వల్లభేన స్వయమ్భువః**

ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్ర ప్రభావముచే మిగుల బలపరాక్రమవంతులైన వానరులు అరువదియేడు (67) కోట్ల మంది ఆ సాయంకాలమున హతులైరి. భీతిని కొల్పుచున్న వానర సైన్యమును చూచి హనుమంతుడు, విభీషణుడు జాంబవంతుని వెతకసాగిరి. వయోవృద్ధుడు, బ్రహ్మదేవుని సుతుడు అయిన జాంబవంతుడు బాణములచే గాయపడి యుండుట చూచిరి. వారు జాంబవంతునితో నీ ప్రాణములకు ముప్పు వాటిల్లలేదుగదా అని అడిగిరి. అప్పుడు జాంబవంతుడు విభీషణునితో .....

**అంజనా సుప్రజా యేన మాతరిశ్వా చ నైరృతా**

**హనూమాన్ వానర శ్రేష్ఠః ప్రాణాన్ ధారయతే క్వచిత్**

**శ్రుత్వా జామ్బవతో వాక్యమ్ ఉవా చేదం విభీషణః**

**ఆర్య పుత్రా వఽతిక్రమ్య కస్మాత్ పృచ్ఛసి మారుతిమ్**

**నైవ రాజని సుగ్రీవే నాఽంగదే నాఽపి రాఘవే**

**ఆర్య సందర్శితః స్నేహః యథా వాయు సుతే పరః**

**విభీషణ వచః శ్రుత్వా జామ్బవాన్ వాక్యమ్ అబ్రవీత్**

**శృణు నైరృత శార్దూల యస్మాత్ పృచ్ఛామి మారుతిమ్**
**తస్మిన్ జీవతి వీరే తు హత మఽప్యఽహతం బలమ్**
**హనూమ త్యుజ్ఝిత ప్రాణే జీవన్తోఽపి వయం హతాః**
**ధరతే మారుతి స్తాత మారుత ప్రతిమో యది**
**వైశ్వానర సమో వీర్యే జీవితాఽఽశా తతో భవేత్**

అంజనాపుత్రుడు, వానరోత్తముడైన హనుమ క్షేమముగా యున్నాడా! అని అడిగెను. అందుకు విభీషణుడు జాంబవంతునితో, రామలక్ష్మణుల క్షేమ సమాచారం గాకుండా హనుమ క్షేమము అడిగావు కారణమేమని అడిగెను. అందుకు జాంబవంతుడు హనుమ జీవించి యున్న చో వానర సైన్యము చచ్చినను, బ్రతికి యున్నట్లే, ఆ మారుతి ప్రాణములను విడిచినచో మనమందరము బ్రతికి యున్నను చచ్చిన వారితో సమానమే. పిదప వాయుసుతుడైన హనుమ జాంబవంతునికి ప్రణమిల్లెను.

### 6.38 హనుమ ఓషధీ పర్వతమును తీసుకొని వచ్చుట

జాంబవంతుడు హనుమతో "కపివరా! ఈ వానరులను కాపాడుటకు నీవే సమర్ధుడవు. కావున ముందునకు వచ్చి కటిబద్ధుడవు కమ్ము. పరాక్రమించుటకు నేవే సమర్ధుడవు, ఇదియే తగిన సమయము. వ్యధకు గురియైన ఈ రామలక్ష్మణులకు గ్రుచ్చుకొన్న బాణములను తొలగింపుము. నీవు వెంటనే సముద్రము మీదుగా అంతరిక్షమున పయనించి హిమవత్పర్వతమునకు వెళ్లుము. అక్కడ ..

**తతః కాంచన మఽత్యుచ్ఛమ్ ఋషభం పర్వతోత్తమమ్**
**కైలాస శిఖరం చాఽపి ద్రక్ష్య స్యఽరినిషూదన**
**తయోః శిఖరయో ర్మధ్యే ప్రదీప్త మఽతుల ప్రభమ్**
**సర్వౌషధి యుతం వీర ద్రక్ష్యసి ఔషధి పర్వతమ్**
**తస్య వానర శార్దూల చతస్రో మూర్ధ్ని సంభవాః**

**ద్రక్ష్య స్యోషధయో దీప్తా దీపయన్త్యో దిశో దశ**

**మృత సంజీవనీం చైవ విశల్య కరణీమ్ అపి**

**సావర్ణ్య కరణీం చైవ సంధాన కరణీం తథా**

**తాః సర్వా హనుమన్ గృహ్య క్షిప్ర మాఽఽ గన్తు మఽర్హసి**

**ఆశ్వాసయ హరీన్ ప్రాణై ర్యోజ్య గన్ధవహాఽఽత్మజ**

హనుమా! హిమాలయ పర్వతములపై నీకు స్వర్ణమయమై, అత్యున్నమైన "వృషభగిరి" అను ఒక మహాపర్వతము, కైలాస శిఖరము కనబడును. ఆ వృషభగిరికిని కైలాస శిఖరమునకు మధ్య సాటిలేని తేజస్సుతో చక్కగా వెలుగొందు చుండెడి "ఓషధి పర్వతము" కనబడును. అది వివిధములగు ఓషదులకు నిలయము. ఆ శిఖరంపై దివ్యములైన నాలుగు ఓషదులు నీకు గోచరించును. అవి దివ్య కాంతులతో దశ దిశలను ప్రకాశింప చేయుచుండును. మృతసంజీవని, విశల్యకరణి, సంధానకరణి, సావర్ణ్యకరణి అను నాలుగు మహౌషదులను[24] తీసుకొని శీఘ్రముగా మరలి రమ్ము. ఆ ఓషదుల ప్రభావంతో వానరులను సజీవులను గావించి వారికి స్వస్థత గూర్చుము. అప్పుడు హనుమ జాంబవంతుని మాటలను విన్నంతనే రెట్టించిన పరాక్రమములో, శ్రీరాముని ధ్యానము చేసి, ఆకాశ గమనమునకు వీలుగా ప్రాణవాయువును

---

[24] **"మృతం సంజీవయతి ఇతి మృతసంజీవని"**: మృతి చెందిన వారిని బ్రతికించునది.

**"జీవనానంతరం సంచారక్షమాతాయై విశల్యం కరోతి - ఇతి విశల్యకరణి"**: ప్రాణములు వచ్చిన పిమ్మట అటునిటు సంచరించుటకు వీలుగా బాధలను తొలగించునది.

**"విశల్యేకృతే త్వచస్సంధానం కరోతి ఇతి సంధానకరణి"**: గాయములు మానినంతనే చర్మమును యథాస్థికి తెచ్చునది.

**"తథోవ్రణ కృత వైవర్ణం విహాయ ప్రదేశాంతర సావర్ణ్యం కరోతి ఇతి సావర్ణ్యకరణి"**: గాయములు మానిన చోట్ల ఏర్పడిన మచ్చలను రూపుమాపి, యథాప్రకారముగా శరీరమును (చర్మమును) శోభిల్ల చేయునది.

నిరోధించి, త్రికూట పర్వతము నుంచి ప్రచండ వేగముతో మింటికి ఎగిరెను. అప్పుడు ఆ కపివీరుని వేగమునకు వృక్ష సమూహములు, గిరిశిఖరములు, మహాపాషాణములు, త్రికూట పర్వతముపై స్థిర నివాసమున్న వానరములు పైకి ఎగిరి కొంత తడవు పిమ్మట బలహీన పడి సముద్రములో పడిపోయినవి. ఈ విధముగా హనుమ ఆకాశమార్గమున/అంతరిక్షము పయనించి హిమవత్పర్వతమును గాంచెను. ఆ పర్వత ప్రదేశమున బ్రహ్మ నివాస స్థానము, కైలాసము, ఇంద్రుడు నివశించు ప్రదేశము, శివుడు విలాసముగా తన శరములను ప్రయోగించెడి భూమి, హయగ్రీవుడు ఆరాధించెడి స్థానము, ఈశ్వరునిచే ఖండితమైన బ్రహ్మ శిరస్సు పడిన చోటు, యమకింకరులు అప్పుడప్పుడు విశ్రాంతిగైకొనెడి ప్రదేశము, బ్రహ్మ ఇంద్రునకు వజ్రాయుధమును అనుగ్రహించిన ప్రదేశము, కుబేరుని నిలయము, సూర్యుని భార్య యగు ఛాయాదేవి[25] ప్రీతి కొరకు సూర్యకాంతిని తగ్గించుటకై విశ్వకర్మ భాస్కరుని బంధించిన ప్రదేశము, దేవతలకు దర్శనము కొరకై బ్రహ్మ ఆసీనుడగు ప్రదేశము, శంకరుడు తన ధనస్సును నిలిపెడు చోటు, పాతాళమును ప్రవేశించు ప్రదేశము మున్నగు విశిష్ట స్థానములను ఆ మారుతి దర్శించెను. జాంబవంతుని సూచన ప్రకారము సర్వఔషధ పర్వతమును మారుతి గాంచెను. అతడు ఆ పర్వతమునకు ప్రదక్షణమొనర్చి తనకు అవసరమగు ఓషదులకొరకై అన్వేషింప సాగెను. అప్పుడు ఆ దివ్య ఔషదములు తమను తీసుకొనిపోవుటకు ఎవరో వచ్చినారని గ్రహించి అదృశ్యమాయెను. అప్పుడు హనుమ ఆ ఓషదులు శ్రీరామునికి వారు చేయుచున్న అనాదరణకు క్రుద్ధుడై ఆ పర్వతమును పెకిలించి, చేబూని, ఆకాశమునకు ఎగిరెను. ప్రచండ వేగముతో ఆ పర్వతమును గైకొని త్రికూట

---

[25] ఉష, పద్మిని, ఛాయ, సంజ్ఞ అను నలుగురును సూర్యుని భార్యలు. ఛాయ యొక్క కుమారుడు శని. సంజ్ఞ యొక్క కుమారుడు  యముడు.

పర్వతమున గల వానర సైన్యము మధ్య దిగెను. ఆ ఓషదుల ప్రభావమున రామలక్ష్మణులకు తగిలిన గాయములు మటుమాయముగాగా ఎప్పటివలె తేజోమూర్తులైరి. పిమ్మట వానరులు గూడ స్వస్థత చేకూరి పునర్జీవితులై, గాయములు తొలగి, ఆరోగ్యవంతులైరి. వానర రాక్షస వీరుల మధ్య నేటి వరకు జరిగిన యుద్ధములో మృతులైన రాక్షసులను, రావణుని ఆజ్ఞ మేరకు ఆయన గౌరవము నిలుపుటకై సముద్రమున పడవేసిరి. అందువలన మృతులైన రాక్షసులు ఎవరును పునర్జీవితులు కాలేదు. తరువాత మారుతి ఆ ఓషధీశైలమును శీఘ్రముగా హిమవత్పర్వతమునకు చేర్చి మరుక్షణమే శ్రీరాముని వద్దకు వచ్చెను.

**6.39 సుగ్రీవుని ఆజ్ఞపై వానరులు లంకను దహించివేయుట**

ఆ తరువాత సుగ్రీవుడు హనుమతో కుంభకర్ణుడు చనిపోయినాడు. రావణ సుతులు చాలా మంది చనిపోయినవారు. ఇంక రావణుడు తన పట్టణమును రక్షించుకొను అవకాశము లేదు. కాన మన వానరులు లంకా నగరమును దహించి వేయమని ఆజ్ఞ ఇచ్చెను. అప్పుడు వానరులు ఆ భయంకరమైన రాత్రి యందు జ్వలించుచున్న కాగడాలతో లంక నగరంలోని పురద్వారములను, భవనములను, రాజవీధులను, ఉప వీధులను ఉత్సాహముతో నిప్పు పెట్టగా అవియన్నియు అగ్నికి ఆహుతి అయ్యెను. అగ్నిజ్వాలలచే వ్యాప్తములైన బహిర్ద్వారములు వర్షాకాలమందు విధ్యుత్కాంతులచే చుట్టబడిన మేఘమువలె ఒప్పుచున్నవి. అక్కడ ఉన్న నాగరికులు అందరు హాహాకారములు చేసిరి. అగ్నిచే దహింపబడుచున్న ఆ లంకకు చుట్టునుగల సాగరము తననీటిపై అగ్నిజ్వాలలు నీడలు ప్రతిఫలించుచుండుటచే అది ఒక ఎర్ర సముద్రము వలె కనబడెను. అంతట ఓషదుల ప్రభావము వలన శరీర బాధలు తొలగిన రామలక్ష్మణులు తమ ధనస్సులను చేబూని ధనుష్టంకారము చేయగా రాక్షసులెల్లరు భీతిల్లిరి. రాముని ధనుస్సు నుండి వచ్చిన బాణముల దాటికి

కైలాస శిఖరము వంటి లంకానగర గోపురము శిధిలమై క్రిందపడిపోయెను. రాక్షసులకు అది ప్రళయ రాత్రివలె గనిపించెను. సుగ్రీవుని అనుజ్ఞ మేరకు వానరవీరులు కాగడాలు పట్టుకొని రావణుని అంతఃపురమునకు సమీపించిరి. అప్పుడు రావణుడు క్రుద్ధుడై కుంభకర్ణుని పుత్రులైన కుంభ నికుంభులను గొప్ప రాక్షస సేనతో వారికి తోడుగా యూపాక్షుడు, శోణితాక్షుడు, ప్రజంఘుడు, కంపనుడు యుద్ధమునకు బయలుదేరిరి. అప్పుడు జరిగిన యుద్ధము నందు అంగదుడు కంపనుని, ప్రజంఘుని; ద్వివిదుడు శోణితాక్షుని; మైందుడు యూపాక్షుని, సుగ్రీవుడు కుంభుని; హనుమ నికుంభుని; శ్రీరాముడు మకరాక్షుని వధించిరి.

### 6.40 ఇంద్రజిత్తు అదృశ్యుడుగా యుండి యుద్ధము చేయుట

అప్పుడు మహాకుపితుడైన రావణుడు, ఇంద్రజిత్తును ఆదేశించుతూ ఇట్లు పలికెను.

**జహి వీర మహా వీర్యౌ భ్రాతరౌ రామ లక్ష్మణౌ**
**అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాఽధికః**

వీరుడా! నీవు శత్రువులకు కనబడచుగాని, కనబడకుండగాని యుద్ధము చేయగల గొప్ప నేర్పరివి. కనుక నీవు మహావీరులైన రామలక్ష్మణులను జయింపుము అని సెప్పి పంపెను. ఇంద్రజిత్తు రాజాజ్ఞను శిరసావహించి యజ్ఞభూమి యందు విధ్యుక్తముగా అగ్నిని ప్రేల్చెను. ఇంతలో ఋత్విక్కులు ధరించుటకై రాక్షస స్త్రీలు ఎర్రని తలపాగాలు తీసుకొని హోమము చేయుచున్న ప్రదేశమునకు వచ్చిరి. పిమ్మట హోమవేదికకు చుట్టును శస్త్రములను, రెల్లుగడ్డి పత్రములను అస్తరణములుగాను, రావిచెట్టు పిల్లలను సమిధలుగాను, ఋత్విక్కులకై ఎర్రని వస్త్రములను, నల్లని ఇనుపస్రువమును యుంచిరి. రెల్లు పరకలతో గూడిన తోమరములను యజ్ఞవేదికకు నలువైపులా చేర్చిరి. పిదప సజీవంగా యున్న నల్లని మేకను బలి యిచ్చిరి. అప్పుడు పొగలు లేని అగ్నిజ్వాలలు ఒక్కసారిగా

పైకి లేచెను. అందుండి అగ్నిదేవుడు స్వయముగా వ్యక్తమై ఆహుతులను స్వయముగా స్వీకరించెను. పిదప అతడు అంతర్ధాన శక్తి గలిగిన నాలుగు గుఱ్ఱములు, వాడియైన బాణములు, ధనస్సులతో గూడియున్న రథమును అధిరోహించెను. అట్టి రథముతోను, బ్రహ్మాస్త్రముతోను గూడి, మహాబలశాలియైన ఆ ఇంద్రజిత్తు శత్రువులకు ఎదిరింప శక్యము గాని వాడై యుండెను. అప్పుడు ఇంద్రజిత్తు అక్కడియున్న రాక్షసులతో "నేను రామలక్ష్మణులను, సకల వానరులను సంహరించి నా తండ్రియైన రావణునకు యుద్ధ విజయమును చేకూర్చెదను" అని చెప్పి అంతర్ధానమయ్యెను.

ఇంద్రజిత్తు రావణునిచే ప్రేరితుడై, మిగుల క్రుద్ధుడై వానరుల మధ్య యున్న రామలక్ష్మణులపై సంతత ధారగా బాణవర్షమును కురిపించెను. ఎవ్వరికిని కనబడకుండ ఇంద్రజిత్తు ప్రయోగించు బాణములకు కోపముతో రామలక్ష్మణులు అతనిపై దివ్యాస్త్రములను ప్రయోగించిరి. మహాబాహువుయైన ఇంద్రజిత్తు మబ్బు మాటున యుండి గురిపించుచున్న బాణవర్షమునకు రామలక్ష్మణులు రక్తసిక్తులయ్యిరి. అంతట లక్ష్మణుడు మిగుల కోపించి బ్రహ్మాస్త్రమును ప్రయోగించుటకు సిద్ధమయ్యెను. అప్పుడు రాముడు లక్ష్మణునితో ...

**తమ్ ఉవాచ తతో రామో లక్ష్మణం శుభ లక్షణమ్**
**నైకస్య హేతో రక్షాంసి పృథివ్యాం హన్తు మఽర్హసి**
**అయుధ్యమానం ప్రచ్ఛన్నం ప్రాంజలిం శరణాఽఽగతమ్**
**పలాయన్తం ప్రమత్తం వా న త్వం హన్తుమ్ ఇహాఽర్హసి**
**య ద్యేష భూమిం విశతే దివం వా, రసాతలం వాఽపి నభ స్తలం వా**
**ఏవం నిగూఢోఽపి మమాఽస్త్ర దగ్ధః, పతిష్యతే భూమి తలే గతాఽసుః**

సోదరా! ఒక్కనికొరకై భూమండలమున యున్న సమస్త రాక్షసులను సంహరించుట సముచితము గాదు. యుద్ధము చేయనివాడు, దాగుకొనిన వాడు,

చేతులు జోడించుకొని శరణు పొందినవాడు, యుద్ధమున పారిపోయినవాడు, పిచ్చివాడు - అట్టివారిని చంపరాదు. అప్పుడు రాముడు ఇంద్రజిత్తును మాత్రమే చంపుటకు పూనుకొని లక్ష్మణునితో "ఇతడు భూతలమున ప్రవేశించినను, స్వర్గమునకు ఏగినను, రసాతలమున జొచ్చినను, ఆకాశమందున్నను నా అస్త్రములచే దగ్ధుడై, ప్రాణరహితుడై తప్పక భూమిపై పడిపోగలడు" అని పలికి ఇంద్రజిత్తును చంపుటకు ఉపాయమును ఆలోచించసాగెను.

## 6.41 ఇంద్రజిత్తు మాయాసీతను సృష్టించి హనుమ ఎదురుగా చంపివేయుట

శ్రీరాముని మనోభావములను గుర్తించి, ఇంద్రజిత్తు యుద్ధరంగము నుండి మరలి లంకానగరమున ప్రవేశించెను. ఇంద్రజిత్తు మాయచే సీతను కల్పించి రథముపై కూర్చుండబెట్టి ఆమెను చంపుటకు సిద్ధపడెను. రథముపై ఏకవేణితో యున్న సీతను హనుమ చూచి మిగుల చింతాక్రాంతుడయ్యెను. అప్పుడు అడ్డుకొనుటకు హనుమ వానరులతో కూడి ఇంద్రజిత్తు రథమును చేరుకొనుటకు పరిగెత్తెను. అప్పుడు ఇంద్రజిత్తు తన ఒర నుండి కత్తిని లాగి కొట్టుచుండగా, సీత రామా! రామా! అని అరచుచుండెను. ఇంద్రజిత్తు హనుమతో "రాముడు ఎవతె కోసమై వచ్చినారో అట్టి సీతను చంపెదను" అని చెప్పి హనుమ చూచుచుండగా ఆ మాయాసీతను చంపెను. హనుమ వానరులకు ధైర్య వచనములు చెపుతూ ఇంద్రజిత్తును ఎదిరించుటకు సిద్ధపడెను. తరువాత ఇంద్రజిత్తు వారిపై తీవ్రమైన బాణప్రయోగము చేసెను. అప్పుడు హనుమ వానరులతో సహా ఈ విషయము రామలక్ష్మణులకు ఎరిగించుటకై వెనుకకు మరలెను. హనుమ వెనుకకు వెళ్ళుట గమనించి ఇంద్రజిత్తు ఇదే సమయమని నికుంభిలా హోమము చేయుటకు సిద్ధపడెను. యజ్ఞభూమిలో శాస్త్రోక్తముగా అగ్నిని ప్రజ్వలింప జేసెను. మాంసముతో, రక్తముతో అగ్నిని సంతృప్తి పరచు చుండెను. ఇంతలో హనుమ రాముని వద్దకు చేరి దుఃఖియై మేము చూచుచుండగానే ఇంద్రజిత్తు సీతమ్మను చంపినాడు అని చెప్పెను.

## 6.42 ఇంద్రజిత్తు నికుంభిలా హోమమును భగ్నపరచుట

ఆ మాట వినగనే రాముడు మొదలు నరికిన చెట్టు వలె మూర్ఛనొంది నేలపై పడిపోయెను. రాముని దుఃఖమును చూచి లక్ష్మణుడు అతనిని ఎంతయో ఊరడించెను. అప్పుడు విభీషణుడు శ్రీరామునితో "రామా! దురాత్ముడైన రావణుడు అభిప్రాయమును నేను ఎరుగుదును. ఎట్టి క్లేశము వచ్చినను సీతమ్మపై యున్న మోహముచే చంపుటకు సిద్ధపడడు. ఎన్ని బాధలైనను సహించును గాని సీతమ్మను నీకు అప్పగిచ్చుటకు ఒప్పుకొనలేదు. రాక్షసుడగు ఇంద్రజిత్తు వానరులను మోహమున బడవేసి నికుంభిలా హోమము చేయుటకు వెడలెను. ఆ హోమము పూర్తి కాక మునుపే సేనా సహితముగా ఆ మందిరమునకు వెడలవలెను. హోమము పూర్తియైనచో అతడు అవధ్యుడు. హోమము వదలి అతడు బయిటకు వచ్చునట్లు చేయవలెను. కావున మా వెంట లక్ష్మణుని పంపుము" అని చెప్పెను. అందుకు శ్రీరాముడు అనుజ్ఞ యిచ్చెను.

అక్కడ కొంత దూరములో వ్యూహాత్మకంగా నిలిచి యున్న ఇంద్రజిత్తు బలములను గాంచెను. ఇంద్రజిత్తు వద్దకు సమీపించి అతడు చేయుచున్న యాగమును భగ్నమొనర్చుటకై సన్నద్ధుడై దుర్భేధ్యముగా యున్న ఆ రాక్షస బలమందు లక్ష్మణుడు ప్రవేశించెను. అప్పుడు విభీషణుడు, లక్ష్మణునితో ఈ అభిచార హోమ కార్యములు ముగియక మునుపే ఈ రాక్షస సేనను మట్టి గరిపించినచో ఇంద్రజిత్తు మనకు కనపడును. విభీషణుని సూచనతో లక్ష్మణుని సారథ్యములో హనుమదదాది వానరాలు ఒక్కసారిగా ఇంద్రజిత్తు మరియు అక్కడున్న సమస్త వానర సేనలు ఆక్రమణ చేసిరి. అందుకు కినుక వహించిన ఇంద్రజిత్తు స్వయముగా హనుమతో యుద్ధమునకు పూనుకొనెను. అది చూచి లక్ష్మణునితో, విభీషణుడు; "లక్ష్మణా! ఆ రావణ కుమారుడు ఇంద్రుని జయించాడు. కావున అతనిని వెంటనే సంహరింపుము" అనెను. అంతియేగాక

ఇంద్రజిత్తు చేయుచున్న హోమమును, అక్కడ భూతములకు బలి ఇచ్చు మర్రిచెట్టును విభీషణుడు లక్ష్మణునికి చూపి, ఇంద్రజిత్తు ఆ మర్రిచెట్టు వద్దకు రాకుండా నివారింప వలెనని చెప్పెను. లక్ష్మణుడు ఆ మాటలను విని తన ధనస్సులో చిత్రవిచిత్రములుగా ధ్వని చేయుచు ఇంద్రజిత్తును యుద్ధమునకు పిలిచెను. లక్ష్మణుని వెనుక యున్న విభీషణుని చూచి ఇంద్రజిత్తు ఈ విధముగా దూషించెను.

**గుణవాన్ వా పరజనః స్వజనో నిర్గుణోఽపి వా**
**నిర్గుణః స్వజనః శ్రేయాన్ యః పరః పర ఏవ సః**
**య: స్వపక్షం పరిత్యజ్య పరపక్షం నిషేవతే**
**స స్వపక్షే క్షయం ప్రాప్తే పశ్చాత్ తై రేవ హన్యతే**

శత్రువు గుణవంతుడే గావచ్చు. తనవారు గుణము లేనివారే గావచ్చు. గుణము లేనివారైనను తనవారితో కలసి యుండుటయే శ్రేయస్కరము. ఎప్పుడైనను శత్రువు శత్రువే. తన పక్షమును వీడి పరపక్షమును ఒకనాడు చేరినను, తనవారు అందరూ చనిపోయిన తర్వాత శత్రువు వానిని కూడా తప్పక చంపును. అప్పుడు విభీషణుడు ఇంద్రజిత్తుతో "రాక్షసా! నా స్వభావమును నీవు ఎరుగుదవు. అపౌరుష్యమును వదిలుము.

**ధర్మాత్ ప్రచ్యుత శీలం హి పురుషం పాప నిశ్చయం**
**త్యక్త్వా సుఖ మఽవాప్నోతి హస్తా దాఽఽశీ విషం యథా**
**హింసా పరస్వ హరణే పర దారాఽభిమర్శనం**
**పరస్వానాం చ హరణం పర దారాఽభిమర్శనమ్**
**సుహృదా మఽతి శంకాం చ త్రయో దోషాః క్షయావహాః**

దర్మ భ్రష్టమైన శీలము గలవాడు, పాపపు తలంపులు గలవాడు, అగు పురుషునకు దూరముగా యున్నవాడు తీవ్రమగు విషముగల పాముకు దూరమగునట్లు సుఖము గలుగును. దర్మ భ్రష్టమైన శీలము గలవాని ఇల్లు ఎంత

ప్రమాదకరమో హింస, పరధన అపహరణము, పర భార్యాస్పర్శనము అంత ప్రమాదకరములు. నిప్పు అంటుకొనిన ఇంటిని ఎలా విడువ వలెనో అట్లే పరధనమును, పరభార్యను చేపట్టిన వానిని కూడా విడువవలెను. పరధనమును హరించుట, పరస్త్రీని కూడుట, తనను ప్రేమించిన మిత్రుని శంకించుట అను మూడు దోషములు మనుజునికి వినాశనమును తెచ్చి పెట్టును. ఈ దోషములచే నా సోదరుడు వినాశనమును కొని తెచ్చుకొన్నాడు. నీవు బాలుడవు. ఆ మర్రిచెట్టులో ప్రవేశింపజాలవు. రామలక్ష్మణులను ఎదిరించి బ్రతుకుట కష్టము. ఈ విధముగా విభీషణుడు ఇంద్రజిత్తుతో పలికినాడు.

## 6.43 లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తు హతుడగుట

ఇంద్రజిత్తు విభీషణుని మాటలను విని తీవ్రమైన క్రోధముతో, ప్రళయకాల మృత్యువువలె శత్రువినాశకరమగు బాణములను దాల్చి రథముపై దూకి లక్ష్మణుని ఎదురుగా నిలిచాడు. లక్ష్మణుని మహావేగముగల బాణములతో కొట్టగా, లక్ష్మణుడు పొగలేని అగ్నివలె కనబడెను. లక్ష్మణుడు, ఇంద్రజిత్తుల యుద్ధము ఆకాశములో రెండు గ్రహములు పోరాడుచున్నట్లు యుండెను. కోపగించిన లక్ష్మణుడు ఇంద్రజిఒత్తుపై పామువలె బుసగొట్టు బాణమును ప్రయోగించగా, ఇంద్రజిత్తు మొహము వివర్ణమయ్యెను. ఇది విభీషణుడు గమనించి లక్ష్మణునితో ఇంద్రజిత్తు ఓడిపోవు చిహ్నములు గనబడుతున్నాయి కావున త్వరపడమని చెప్పెను. ఇట్లు అనగానే లక్ష్మణుడు విషముగల మహాసర్పముల వంటి బాణములను ప్రయోగించగా ఇంద్రజిత్తు ఒక్క క్షణము తెలివి తప్పి మరియొక క్షణములో హనుమ, లక్ష్మణునిపై తీవ్రమైన బాణములు వేసెను. ఈ విధముగా వారిరువురు భీమ పరాక్రమముతో పోరాడుచుండిరి. అప్పుడు విభీషణుడు గమనించి రాముని సేవకునిగా, వానరులకు ఉత్సాహము గల్పించుతూ, రావణునికి ఈ ఇంద్రజిత్తు ఒక్కడే ఆధారము గావున

పరాక్రమించమని ప్రోత్సహించుతూ తాను గూడ యుద్ధమునకు దిగెను. విభీషణుడు అట్లు ప్రోత్సహించగా అప్పుడు వానరులకు, రాక్షసులకు మధ్య భీకర పోరు జరిగెను. లక్ష్మణుడు, ఇంద్రజిత్తు మధ్య పోరులో అంతరిక్షము అంతయు ఆచ్ఛాదితమయ్యెను. ఆకాశము బాణములతో చీకటి అయ్యెను. రక్తపు నదులు ప్రవహించుచుండెను. లక్ష్మణుడు ఇంద్రజిత్తు యొక్క రథమును గుఱ్ఱములు, సారథితో సహా మట్టుబెట్టెను. ఇంద్రజిత్తులో ఉత్సాహము తగ్గెను. అప్పుడు ఇంద్రజిత్తు క్షణ కాలములో నగరమునకు వెళ్లి మరియొక రథమును, బాణములను తీసుకొని యుద్ధభూమికి వచ్చి వానరులను తీవ్రముగా క్షోభ పెట్టెను. అతని హస్తలాఘవమునకు లక్ష్మణుడు ఎంతయో అచ్చెరు నొందెను. ఇంద్రజిత్తు వరుసగా రౌద్రాస్త్రమును, ఆగ్నేయాస్త్రమును, ప్రయోగించగా లక్ష్మణుడు వారుణాస్త్రమును, మహేశ్వరాస్త్రమును ప్రయోగించెను. అప్పుడు లక్ష్మణుడు శ్రేష్ఠమైన శరమును ధనుస్సు నందు సంధించి అర్థసాధకమగు ఒక వాక్యమును పలికినాడు.

**ధర్మాత్మా సత్యసంధ శ్చ రామో దాశరథి ర్యది**
**పౌరుషే చాఽప్రతి ద్వన్ద్వః శరైనం జహి రావణిమ్**

"దశరథ పుత్రుడగు రాముడు ధర్మాత్ముడు, సత్యసంధుడు, పౌరుషములో ఎదురులేనివాడు అయినచో, ఓ! బాణమా! నీవు రావణుని పుత్రుని చంపుము" అని బాణమును ఆకర్ణాంతము లాగి ఇంద్రజిత్తుపై వదలినాడు. వెంటనే ఇంద్రజిత్తు యొక్క శిరస్సు నేలబడినది.

లక్ష్మణుడు చెప్పిన ఈ శ్లోకము రామాయణములో ఒక మంత్రము. దీనిని సిద్ధి మంత్రము అందురు. ఈ మంత్రం ప్రభావము వలన ఇంతకు మునుపు వ్యర్థమైన అస్త్రముల వలె గాకుండా వ్యర్థము గాలేదు. దీనితో రాముడు ధర్మాత్ముడని, సత్యసంధుడని, పౌరుషములో ఎదురులేనివాడని ఋజువైనది. చెట్టు చాటు నుండి వాలిని సంహరించిన రాముడు ధర్మాత్ముడా!, పట్టాభిషేకమునకు అంగీకారము

తెలిపి వనవాస దీక్ష తీసుకొనుట సత్యసంధతయా!, ఖరునితో యుద్ధము చేయునప్పుడు మూడు అడుగులు వెనుకకు వేయుట పౌరుషములో ఎదురులేనివాఁడా! అను సందేహములను నివారించినది. అంతియే గాక రాముడు పాయసమునకు పుత్రుడు గాని దశరథునికి పుత్రుడా! అను సందేహమునకు కూడా ఋజువు కనబడినది.

రామాయణము పారాయణము చేయువారు ఈ శ్లోకమును మూల మంత్రముగా జపింతురు. ఏదైనా కార్యములో సిద్ధి కలగ వలెనన్న ఈ శ్లోకమును ధ్యానించినచో, జపించినచో తప్పక కార్యసిద్ధి కలుగునని శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారు సెలవు ఇచ్చిరి. అంతియేగాక ఈ శ్లోకమును జయమంత్రములతో (ఇది సుందర కాండలో యున్నది) కూడి ధ్యానించినచో/జపించినచో అమోఘమైన ఫలితములు పొందవచ్చు.

ఇంద్రజిత్తు నేలకూలతతో వానరుల ఆనందమునకు అవధులు లేకపోయెను. వారందరు రాముడు ఉన్న ప్రదేశమునకు వచ్చిరి. లక్ష్మణుడు శ్రీరామునికి నమస్కరించెను. అప్పుడు శ్రీరాముడు లక్ష్మణుని శిరస్సును నిండు ప్రేమతో మూర్కొనెను. ఇంద్రజిత్తు మరణించుటతో రాక్షసులందరిని మనము జయించినట్లే. ఈ విధముగా ఆ రామచంద్రప్రభువు తమ్మునకు ఊరట గూర్చి తనవిదీర హృదయమునకు హత్తుకొనెను.

## 6.44 లక్ష్మణుని తత్వజ్ఞానము

లక్ష్మణుడు ఇంద్రజిత్తు కొరకై శోధన చేసెను. ఇంద్రజిత్తు యుద్ధభూమి నుండి వెడలి తన శక్తిని మరింత ఇనుమడింప ప్రయత్నము చేయుచుండెను. ఇంద్రజిత్తు పన్నాగములో ఒక మాయాసీతను సృష్టించి హనుమ ముందు సంహరించెను. తల్లియైన సీత మీద ఉన్న అనన్య భక్తి వలన మహా జ్ఞాని అయి యుండియు హనుమ ఆ మాయను గ్రహించలేక దుఃఖ పడి ఆ విషయము ఎరిగించుటకు

రామలక్ష్మణుల చెంతకు వెడలెను. మాయను జయించుట కష్టము అనుటకు ఇది ఒక ఉదాహరణ. హనుమ జ్ఞానముపై ఉన్న విశ్వాసముతో రాముడు ఆ మాటను నమ్మెను. దుఃఖముతో ఉండిపోయెను. లక్ష్మణునికి కూడా పీడ కలిగినను తత్వము చెప్పుట ఆరంభించెను. పాపమునకు భయపడి ఇతరులకెవ్వరికి దుఃఖమును కలుగజేయక తమ జీవనమును నడిపించుకొను వ్యక్తులకు అన్ని విధముల కష్టములు కలుగుట, సమాజము నందు గౌరవనీయమైన వ్యక్తులు కూడా అటువంటి వారిపై అన్యాయము చేయుట కద్దు. ఈ విషయములను గురించి విచారించని మరికొంతమంది పాపములను చేయుచు, సమాజమునందు పెద్దలవలె గౌరవింపబడటం కూడా కద్దు. రాముని నిరంతర దుఃఖమును చూచి లక్ష్మణుడు పై విధమైన తత్వ జ్ఞానముతో చెప్పుచుండెను. ఇటువంటి పలుకులే అంతరమున పాపభీతితో డాంబికముగా నున్న ఈనాటి వ్యక్తులు చెప్పుట చూచెదము.

**తం లక్ష్మణోఽథ బాహుభ్యాం పరిష్వజ్య సుదుఃఖితః**
**ఉవాచ రామమ్ అస్వస్థం వాక్యం హేత్వఽర్థ సంహితమ్**
**శుభే వర్త్మని తిష్ఠన్తం త్వా మాఽఽర్య విజితేన్ద్రియమ్**
**అనర్థేభ్యో న శక్నోతి త్రాతుం ధర్మో నిరర్థకః**
**భూతానాం స్థావరాణాం చ జంగమానాం చ దర్శనమ్**
**యథాఽస్తి న తథా ధర్మ స్తేన నాఽస్తీతి మే మతిః**
**యథైవ స్థావరం వ్యక్తం జంగమం చ తథా విధమ్**
**నాఽయమ్ అర్థ స్తథా యుక్త స్త్వ ద్విధో న విపద్యతే**
**య ద్యఽధర్మో భవే ద్భూతో రావణో నరకం వ్రజేత్**
**భవాం శ్చ ధర్మ యుక్తో వై నైవం వ్యసన మాఽఽప్నుయాత్**
**యస్మా దఽర్థా వివర్ధన్తే యే ష్వఽధర్మః ప్రతిష్ఠితః**
**క్లిశ్యన్తే ధర్మ శీలా శ్చ తస్మా దేతౌ నిరఽర్థకౌ**

**వధ్యన్తే పాప కర్మాణో యద్యఽధర్మేణ రాఘువ**
**వధ కర్మ హతో ధర్మః స హతః కం వధిష్యతి**
**అదృష్ట ప్రతికారేణ తు అవ్యక్తే నాఽసతా సతా**
**కథం శక్యం పరం ప్రాప్తుం ధర్మేణాఽరి వికర్శన**
**త్వయి ప్రవ్రాజితే వీర గురో శ్చ వచనే స్థితే**
**రక్షసాఽపహృతా భార్యా ప్రాణైః ప్రియతరా తవ**

ఓ! రాముడా! జితేంద్రియుడవై ధర్మాచరణలో సర్వత్రా శుభకర్మ చేయువానికి ఎల్లప్పుడూ ఆటంకములు కలుగుచుండును. ధర్మము నిరర్థకము అను ప్రశ్న ఉదయించుచుండును. నీ అవస్థ అటులనే యున్నది. ధర్మము నిన్ను కష్టముల నుండి తప్పించుటలేదు. కష్టమే నీ ధర్మమైనది. జీవకోటికి, జడవస్తువులకు ధర్మము అనెడిది యుండదు. అవి ఏవిధమైన ధర్మాచరణ చేయనప్పటికిని వాటికి కష్టములు ఏమియు కలుగక తమ అవస్థల యందు సుఖంగానే యుండును. స్థావర జంగమములకు ఏ ధర్మము లేదు కనుక దుఃఖము లేదు. ధర్మాచరణముతో దుఃఖములను కొనితెచ్చుకొనుట వ్యర్థము. ధర్మమున్నచో రావణుడు నరకమునకు పోయి, నీకు ఎటువంటి ఆపత్తుకలుగకూడదు. పూర్తి జీవితమంతయు ధర్మమును తగిన ప్రతిష్ట గౌరవములతో పోషించువారికి ఏ విధమైన కష్టములు, క్లేశములు ఆపత్తి కలుగ కూడదు. అంచేత ఈ ధర్మ రక్షా ప్రయత్నము వ్యర్థము. ఇదంతయు అదృశ్యము, అవ్యక్తము అయినచో ధర్మాచరణ యొక్క ఆవశ్యకత ఏమి? ఏమి జరుగవలెనో అది జరుగును. రామా! నీవు రాజ్యమును స్వీకరించక పోవుటవలన ధర్మము నెరవేర్చ బడలేదు. ధనము, అంగబలం ఉన్నవారి దగ్గరే అన్ని ఉన్నట్లు. అనేక యుగముల తర్వాత కూడా భర్తృహరి తన వైరాగ్య శతకంలో **"సర్వే గుణా కాంచనం ఆశ్రయంతి"** అనే భావాన్ని ప్రకటించాడు. ఈ వాదన అన్ని కాలముల యందు సమాజములో

కొనసాగుచున్నది. రామా! నీవు గురువుల వచనములను పాటించుట ధర్మముగా తలచినావు.అయినను( ప్రియపత్నిని రాక్షసుడు గొనిపోయెను. ధర్మాచరణము వలన అర్థము లేదు.
పై విధమైన విచారణ అనాత్మవాదులు మరియు "సర్వంక్షణికం" అని భావించెడి వారు చేయునది. అటువంటి అనాత్మవాదులు క్షణభంగుర వాదులైన వారికి తగిన ప్రత్యుత్తరమిచ్చి భారతీయ సమాజమును మరల వైదిక పరమైన సనాతన తత్వము, ఆత్మవాదమునకు తీసుకొని వచ్చుటకై రామాయణము మార్గదర్శకం చేయబడినది. కేవలము ప్రవచనము చెప్పుట, వినుట వలన గాక ఆచరణ పూర్వకమైన ధ్యేయమును ముందుంచుకొనవలెను. రామాయణ కాలము నందు కూడా వివేకవంతులైన లక్ష్మణుడు వంటి వారుకూడా ధర్మాచరణ, పాపభీతి ఇటువంటి వాదనలతో క్షణికముగా విడిచి పెట్టేవారని ద్యోతకమవుతున్నది.
ఈ సంసారము నందు అజేయుడుగా యుండుట కొరకై ఒక యజ్ఞము చేయమని, ఆ యజ్ఞము పూర్తి అగు వరకు వేరొక చోటికి పోగూడదని ఇంద్రజిత్తుకు గురువు చెప్పెను. అందువలన అజ్ఞాత స్థానమున, నలువైపులా గట్టి బందోబస్తు చేసి ఇంద్రజిత్తు యజ్ఞమును ఆరంభించెను. కానీ విభీషణునికి ఆ యజ్ఞ స్థలము తెలియును. యజ్ఞము పూర్తి అయినచో ఇంద్రజిత్తు అజేయుడు అవును గాన ఆ యజ్ఞమును చెడగొట్టి అతని సంహారమే మేలని విభీషణుడు చెప్పగా శ్రీరాముడు లక్ష్మణునికి అనుమతి ఇచ్చెను. లక్ష్మణునికి కర్తవ్యము జ్ఞాపకమునకు వచ్చెను. యజ్ఞము పూర్తిగాకుండా ఇంద్రజిత్తును వధింపవలెను. తన సుఖదుఃఖములు ఎవరు గుర్తించినను, లేకపోయినను వారి దుఃఖములను, వారే మ్రింగికొని సమాధాన పరచుకొనవలెను. తమ అశ్రువులను తామే తుడుచుకొనవలెను. అటువంటి గంభీర స్వభావులు, సమాజ హితైభిలాషులు తమను తాము సముదాయించుకొని, మనస్సును ధృడము చేసుకొని, ఆపత్తులపై స్వారీ చేయుచు జీవన మార్గమును నిర్ణయించుకొందురు. అదియే వారి భగవత్

స్వరూపము. సాధారణ వ్యక్తి ఆపత్తులలో మునిగి కొట్టుకొని పోవును. కానీ ధీర పురుషులు క్షణ భంగురమైన లాభములపై మోహమును పొందక తమ ధర్మ చరిత్రను, వ్యక్తిత్వమును నిలబెట్టుకొని సత్యమార్గమునే అనుసరింతురు. అనంతమైన దుఃఖమును సహించుతూ తమ ఆదర్శమును వదిలిపెట్టరు. అటువంటి రామలక్ష్మణులు సమాజమునకు సదా ఆదర్శపురుషులు.

## 6.45 రాముని పరాక్రమమునకు రాక్షసులు నిహతులగుట

యుద్ధములో విభీషణుని సహాయముతో లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించాడని రావణుని మంత్రులు దూతల ద్వారా సమాచారం తెలుసుకొని రావణునికి నివేదించిరి. ఆ వార్త వినగానే తీవ్రమగు దుఃఖముతో రావణుడు మూర్ఛ నొందెను. అప్పుడు రావణుని ముఖము కోపముతో మహార్ణవములో ప్రళయకాలంలో మొసళ్ళు ఒకచోటికి చేరినట్లు, అతని కోపము పొగతో అగ్నిహోత్రము బయిటికి వచ్చినట్లు పుత్రవధచే సంతాపము నొందిన రావణుడు కోపమునకు వశమాయెను. వెంటనే సీతమ్మను చంపవలెనని నిర్ణయమునకు వచ్చెను. అప్పుడు రావణుడు రాక్షసులకు ధైర్యమును కలుగజేస్తూ నేను అమోఘమైన తపస్సంపన్నుడును, ఎన్నియో దేవాసుర యుద్ధములలో విజయమును సాధించితిని ఇప్పుడే యుద్ధభూమికేగి రామలక్ష్మణులను చంపెదను అనెను. ఈ విధముగా చెప్పి సీత తనకు లొంగినట్లయితే ఇప్పుడు పుత్రవధ జరిగేదికాదు, అని క్రోధముతో ఆశోకవనములోని సీతమ్మ వద్దకు చేరెను. అప్పుడు సీతమ్మ ఎంతయో దుఃఖించుతూ ఆనాడు హనుమతో వెళ్ళలేకపోతిని, రామలక్ష్మణులను ఈ నీచుడు చంపియుండును అనుకొనుచు దిగులు పడెను. దీనురాలైన సీతమ్మను చూచి సుపార్శ్వుడు అను పేరుగల బుద్ధిమంతుడగు ఒక మంత్రి రావణునితో, "ప్రభూ! నీవు కుబేరుని తమ్ముడవు, కోపమునకు వశబడితివి, వేదవిద్యను పూర్తిచేసి అవబృథ స్నానము చేసినవాడవు, స్వకర్మాచరణమున శ్రద్ధ కలవాడవు,

స్త్రీని చంపుట తగదు, నీ కోపమును రామునిపై చూపుము, ఈనాడు కృష్ణ పక్ష చతుర్దశి, ఈ మాసపు కృష్ణ పాడ్యమినాడు యుద్ధము ప్రారంభమాయెను, రేపు అమావాస్య, యుద్ధములో రేపు విజయమును ఆర్జించగలవు, రాముని చంపి సీతను పొందుము" అనెను. దైవవశముచే ధర్మబద్ధమగు అతని మాటలు రావణునికి నచ్చి తిరిగి తన భవనమునకు ఏగెను.

లంకలో యుద్ధము ధాతనామ సంవత్సరము ఫాల్గుణ బహుళ పాడ్యమినాడు ప్రారంభమయినది. ఆనాటి రాత్రియే ఇంద్రజిత్తు నాగాస్త్రముచే రామలక్ష్మణులను బంధించాడు. విదియనాడు ధూమ్రాక్షుడు చనిపోయినాడు. తదియనాడు వజ్రదంష్ట్రుడు మరణించాడు. చవితినాడు అకంపనుడు, పంచమినాడు ప్రహస్తుడు అంతమొందినారు. షష్ఠినాడు రావణుని కిరీటము నిలబడినది. సప్తమినాడు కుంభకర్ణుని వధ. అష్టమినాడు అతికాయుడు మొదలగువారు నుడివినారు. నవమినాడు ఇంద్రజిత్తు యుద్ధమునకు వచ్చినారు. ఆరాత్రి కుంభనికుంభులు చనిపోయినవారు. దశమినాడు మకరాక్షుడు చనిపోయినాడు. ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి తిథులలో ఇంద్రజిత్తుతో యుద్ధము జరిగినది. అప్పుడు ఇంద్రజిత్తు మరణించాడు. చతుర్దశి నాడు రావణుడు రామునితో యుద్ధమునకు బయిలుదేరుతున్నాడు.

సుపార్శ్వుని ఉపదేశముతో రావణుడు దీనుడై సభలో ప్రవేశించి అందరిని యుద్ధమునకు వెళ్ళవలసినదిగా ఆదేశించెను. అప్పుడు లంకలోని మూలబలము మొత్తము యుద్ధమునకు బయలుదేరి భయంకరముగా యుద్ధము చేసిరి. అప్పుడు ఆ వానరులందరూ శ్రీరాముని శరణు జొచ్చిరి. వెంటనే రాముడు మహాపరాక్రమముతో ధనస్సుపట్టి యుద్ధములో ప్రవేశించెను. కొరివి గుండ్రముగా త్రిప్పినప్పుడు ఒకే చక్రము తిరుగుతున్నట్లు ఎట్లు కనబడునో అట్లే గుండ్రముగా వంచి ధనస్సుతో బాణములను సంధించి ప్రయోగించినప్పుడు రాముడు చక్రమునకు మధ్యలో నాభివలె ఒప్పుచుండెను. ఒక్కసారి వేలకొలది బాణములను

సంధించి వదులుచుండగా ఎడతెగక వింటినారి ఘోష వినపడుచుండెను. రాముని శరీరమే ఆ ధనుశ్చక్రమునకు మధ్య నాభివలె, అతని తేజస్సే ఇరుసువలె, వింటినారి ధ్వని చక్రపు ధ్వనివలె, వంచిన విల్లు, చక్రము యొక్క నేమివలె, రాముని తేజస్సు; బాణప్రయోగములో చూపు నేర్పరి ప్రభ వలె కనబడుచుండెను. కామరూపులైన రాక్షసులతో రాముడు ఒక్కడే యుద్ధము చేయుచుండెను. సూర్యోదయమునకు ప్రారంభించిన యుద్ధములో పగలు ఎనిమిది ఆగములు అగుసరికి రాక్షస సైన్యము అంతయు నశించెను. అప్పుడు రాముడు తన వెంట యున్న సుగ్రీవ, విభీషణ, హనుమ, జాంబవంతులతో **(ఏత దఽస్త్ర బలం దివ్యం మమ వా త్ర్యమ్బకస్య వా)** "ఈ బలము రుద్రునికి నాకే యున్నది. ఇట్టి బలము ఇంకొకరికి లేదు" అనెను. ఇక్కడ శ్రీరామునికి, శివుడికి మధ్య అబేధమును తెలియుచున్నది. ఇంత యుద్ధము చేసిననుఁ రాముడు ఏమియు బడలిక చెందలేదు.

## 6.46 రావణుడు యుద్ధమునకు బయిలుదేరుట, రావణుని శక్తిచే లక్ష్మణుడు మూర్ఛ నొందుట

లంకలో ఇంటింటా ఆర్తలైన రాక్షస స్త్రీల జాలిగొలుపు రోదన ధ్వనులు రావణుడు వినెను. అతనిలో కోపము ప్రజ్వలించెను. అక్కడ యున్న మహాపార్శ్వుడు మొదలుగా గల సైన్యములను సిద్ధపరచెను. రావణుడు సత్వగంభీరుడు. మహాపార్శ్వ, మహోదర, విరూపాక్షులు ఆదిగా గల సైన్యము వెంట రాగ రావణుడు అనేకమైన ఉత్పాతములను లెక్కజేయక మృత్యుప్రేరితుడై యుద్ధమునకు బయలుదేరెను. క్రోధముచే రావణుని బాణపరంపరకు వానరుల శిరస్సులు ఖండింపబడి కకావికలులైరి. వానరులతో యుద్ధము చేసి రావణుడు శ్రీరాముని చెంతకు వచ్చెను. సుగ్రీవుడు వానరులకు ధైర్యము చెప్పి విరూపాక్షుని మహోదరుడిని సంహరించెను. అంగదుడు మహాపార్శ్వుని సంహరించెను.

అప్పుడు రావణుడు క్రోధముతో తామసమగు బ్రహ్మ నిర్మించిన మహాఘోరమగు అస్త్రముచే వానరులను నేల పడగొట్టెను. పద్మపత్ర విశాలాక్షుడు, దీర్ఘబాహువు, మాహాతేజశ్శాలి అగు రాముడు వానరులకు ధైర్యము నొసగుచు ధనుస్సు చేబూని టంకారము గావించెను. లక్ష్మణుడు ముందుగా తాను యుద్ధము చేయవలెనని కుతూహలంతో రావణునిపై అగ్నిజ్వాలలు వంటి బాణములను రావణునిపై ప్రయోగించెను. రావణుడు లక్ష్మణుని లెక్కజేయక రాముని ముందు నిలిచి తీవ్రమైన బాణవర్షమును గురిపించెను. రాముడు రౌద్రముతో రావణునిపై వరుసగా రౌద్రాస్త్రమును, పరమాస్త్రమును ప్రయోగించెను. రావణుని కవచము అభేధ్యము. రావణుడు అసురాష్ట్రమును ప్రయోగించగా రాముడు ఆగ్నేయాస్త్రమును, పావకాస్త్రమును ప్రయోగించెను. రావణుడు తీవ్రమైన కోపముతో బాణములతో రాముని మర్మస్థానములపై కొట్టెను. అందుకు కోపించిన లక్ష్మణుడు బాణములతో రావణుని ధ్వజమును కొట్టి , సారథిని చంపగా, విభిషణుడు తన గదలో గుఱ్ఱములను నేలకూల్చెను. రావణుడు మహాశక్తిని విభీషణునిపై ప్రయోగించగా దానిని లక్ష్మణుడు ముక్కలు జేసెను. అప్పుడు రావణుడు తన అస్త్రము విభీషణునిపై నిష్ఫలము అయినది అనే ఆక్రోశముతో, లక్ష్మణునిపై ఎనిమిది గంటల మహాధ్వనితో యున్న శక్తిని ప్రయోగించగా రాముడు చూచి **(స్వస్త్య ఽస్తు లక్ష్మణా యేతి మోఘా భవ హతోద్యమా)** "లక్ష్మణునికి క్షేమము కలుగు గాక. నీలోగల ప్రాణహరణ శక్తి నశించుగాక" అని అనెను. ఆ శక్తి లక్ష్మణుని వక్షస్థలముపై బడి బలముగా నాటుకొని భూతలముపై నాటుకొనెను. **(ముక్తా శూరస్య భీతస్య లక్ష్మణస్య మమజ్జ సా)** రాముని వచనముల ప్రభావము వలన అది ప్రాణహరణ శక్తి కోల్పోయి యుండెను. బలశాలియైన రాముడు ఆ శక్తిని తన రెండు చేతులలో బయిటకు లాగి విరచి వేసెను. రాముడు అట్లు శక్తిని లాగుచున్నప్పుడు రావణుడు బాణములతో రాముని అవయవములపై కొట్టెను. అప్పుడు రాముడు క్రుద్ధుడై

సుగ్రీవాదులతో లక్ష్మణుని జాగ్రత్తగా చూసుకొనమని చెప్పి **(అరావణమ్ అరామం వా జగ ద్ద్రక్ష్యథ వానరాః)** ఈ జగత్తు నందు రాముడో లేక రావణుడో మిగిలి యుండుట తథ్యమని ప్రతిజ్ఞ చేసెను. ఇట్లు పలికి వాడియగు బాణములతో రావణుని కొట్టెను. తన బహిప్రాణమగు లక్ష్మణుడు యుద్ధభూమిలో పడియుండుట జూచి రాముడు మిగుల చింతాక్రాంతుడయ్యెను. అప్పుడు రాముడు **(దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవా: తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదర:)** ఏ దేశములో నైనను భార్యలు లభింతురు. బంధువులు సమకూరుదురు. కానీ తోడబుట్టిన సోదరుడు లభింపడు అని విలపింపుట చూచి సుషేణుడు రామునితో ఇతను చనిపోలేదు అనెను, అప్పుడు హనుమతో వెంటనే వెళ్లి విశల్య కరణి, సంధాన కరణి, సవర్ణ కరణి, సంజీవని అను ఓషధులను వేగముగా తేవలెనని చెప్పెను. (ఈ ఓషధుల ప్రభావము ఇంతకు ముందు వివరించడమైనది) వెంటనే హనుమ ఆ ఓషదిపర్వతము వద్దకు వెళ్లి ఓషధులను గుర్తింపజాలక ఆ ఓషధిపర్వతమును పెకలించుకొని వచ్చెను. సుషేణుడు ఆయా ఓషధులను నూరి లక్ష్మణునికి వాసన చూపగానే అతను పూర్వ శక్తిలో లేచి నిలబడెను. లక్ష్మణుడు అప్పుడు రామునితో రావణుని చంపి విభీషణునికి లంకారాజ్యమును పట్టాభిషేకము చేసెదనని ప్రతిజ్ఞ చేసినావు గాన రావణుని చంపి ప్రతిజ్ఞ సూర్యుడు అస్తమించక మునుపే నెరవేర్చుమని చెప్పెను.అందుకు శ్రీరాముడు శత్రులను నిర్జింప నిశ్చయించి ధనస్సును చేపట్టెను.

## 6.47 రామబాణములకు కలత చెందిన రావణుని చూచి, సారథి రథమును యుద్ధభూమి నుండి ప్రక్కకు త్రిప్పుట

లక్ష్మణుని మాటలు విని శ్రీరాముడు శత్రువులను సంహరింప నిశ్చయించి ధనస్సును చేపట్టెను. రథముపై రావణుడు, నేలపై రాముడు యుద్ధము చేయదగదని యోచించి దేవరాజగు ఇంద్రుడు తన సారథి యగు మాతలిచే

స్వర్గము నుండి రథమును రాముని వద్దకు పంపెను. మాతలి రాముని వద్దకు వచ్చి రామా! ఇంద్రుడు నీకు విజయము సమకూర్చవలెనని ఈ రథమును పంపినాడు. ఇందు ఇంద్రునిచే పంపబడిన అమోఘమైన విల్లు, కవచము, శక్తి ఉన్నవి. అందుకు సమ్మతించిన రాముడు ఆ రథమునకు ప్రదిక్షణ చేసి నమస్కరించి రథమును అధిరోహించెను. ఆనాడు రామరావణుల యుద్ధము ఒడలు గగుర్పొడుచునదిగా యుండెను. రావణుడు వేసిన గాంధర్వాస్త్రమును రాముడు దైవాస్త్రముచే కొట్టెను. రావణుడు రాక్షశాస్త్రమును, రాముడు గరుడాస్త్రముచే నిరోధించెను. తన అస్త్రములన్నియు నిష్ఫలములు అగుట చూచి రావణుడు ఓర్వలేక ఘోరమగు బాణవర్షమును గురిపించగా రాముడు ధనస్సును సంధింప జాలని వాడై యుండెను. అప్పుడు రావణుడు పది ముఖములతో ఇరువది బాహువులతో మైనాక పర్వతము వలె కనబడెను. అప్పుడు కోపముతో, కన్నులు ఎర్రబారిన రాముని చూచుటకు రావణుడు, సర్వ భూతములు కలత చెందెను. "రామాజయ" అని దేవతులు, "రావణా జయ" అని రాక్షసులు పలుకుచుండిరి. రావణుడు మహత్తరమగు శూలమును చేపట్టి రామునిపై విసరగా, అది మెరుపులతో, ఎనిమిది గంటలతో ధ్వని చేయుచు అంతరిక్షమున వచ్చుటను చూచి రాముడు దానిని తన బాణములతో నివారించుటకు ప్రయత్నించెను. కానీ ఆ శూలము రామబాణములను అగ్ని మిడుతలను దహించినట్లు దహించి వేసెను. అప్పుడు రాముడు కోపముచే ఇంద్రుడు మాతలిచే పంపిన శక్తిని రావణుని శూలముపై ప్రయోగించెను. ఆ శక్తి యొక్క గంటలు పెద్ద ధ్వని చేయుచు ఆకాశములో ఉల్కలు సంచరించునట్లు శూలముపై పడెను. రాముడు ప్రయత్నపూర్వకంగా రావణుని లలాటము నందు కొట్టగా రావణుడు కూడా అంతే తీవ్రముగా ప్రతిస్పందించెను. రాముడు కోపముతో రావణుని చూచి పరుషముగా "రాక్షసరాజా! జనస్థానమున నా భార్యను ఒంటరిగా యున్నదానిని అపహరించి తెచ్చితివి. నీచునిలా ప్రవర్తించితివి. నేను

చూచుచుండగా నీవు సీతను తెచ్చినచో ఆనాడే నీవు మరణించి యుండెదవు. నీ అదృష్టము వలన నీవు నా కంట బడలేదు. నేడు కనబడినావు గాన ఇక నీవు జీవించుట దుర్లభము" అని పలుకుచు పరాక్రమముతో రావణునిపై బాణమును ప్రయోగించెను. అప్పుడు రావణుడు ప్రతీకారము చేయలేక మృత్యువు ఆసన్నమయినదా అనునట్లుండెను. అప్పుడు సారథి రావణుని అవస్థ చూచి మెల్లగా యుద్ధభూమి నుండి రథమును ప్రక్కకు తీసికొనిపోయెను. అందుకు కోపించిన రావణుడు సారథితో "నన్ను నీవు వీర్యము లేనివాడిగా, అశక్తునిగా, పౌరుషము లేనివాడిగా, పిరికివానిగా, ధైర్యము లేనివానిగా, తేజోవిహీనునిగా అనుకొంటివి. శత్రువు చూచుచుండగా నా రథమును ప్రక్కకు నడుపుటచే నేను చిరకాలము నుండి సంపాదించిన కీర్తి, పరాక్రమము, తేజస్సు, ఆత్మవిశ్వాసము నీ వలన నాశనము చేయబడినది" అని తీవ్రముగా సారథిని నిందించెను.

**శత్రోః ప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః**
**పశ్యతో యుద్ధ లుబ్ధోఽహం కృతః కాపురుష స్త్వయా**

నా అదృష్టము వలన ప్రసిద్ధమైన పరాక్రమము గల శత్రువు దొరికినాడు. పరాక్రమముతో అతనిని మెప్పించి సంతోషింప చేయదగిన అవకాశము లభించినది అట్టివానితో యుద్ధము చేయవలెనని నేను కోరుచున్నాను. కావున వెంటనే వేగముగా రథమును వెనుకకు మరలింపుము అని ఆజ్ఞాపించెను. సారథి రావణుని హితమును కోరినవాడు. అనునయముతో ఇట్లు పలుకుచున్నాడు. "శత్రువు చేసిన మోసాలకు లొంగినవాడను గాను. వారు నాకు రహస్యముగా లంచమిచ్చి ఆశలు చూపలేదు. మూఢుననుఁ గాదు. మీపై ప్రేమ లేనివాడను గాదు. మీ హితమును మరువలేదు. యుద్ధములో రామబాణం తీవ్రతచే మీరు కొద్దిగా అలసి యున్నారు. మీ ముఖములో కాంతిగాని, హర్షముగాని నాకు కనబడలేదు. గుఱ్ఱములు బాగుగా బడలి యున్నవి. అశుభ చిహ్నములు అధికముగా

పొడసూపినవి. సారథి దేశకాలములను గుర్తింపవలెను. రథికుని యొక్క ముఖములో ప్రసన్నత, దైన్యము గమనించ వలెను. కావున రాజా! నీకు, గుఱ్ఱములకు విశ్రాంతి ఒసగవలెనని తీవ్రమగు సహింప శక్యముగాని యుద్ధము నుండి ఒక్క క్షణము విరమింపవలెనని ఖేదము తొలగవలెనని ఈ రథమును ప్రక్కకు తెచ్చినాను. మీరు ఇప్పుడు ఎట్లు ఆజ్ఞాపించిన అట్లు చేయుదును" అని చెప్పెను. అప్పుడు రావణుని కోరికపై సారథి రథమును మరల యుద్ధభూమికి నడిపెను.

## 6.48 ఆదిత్య హృదయము

ఈ ఆదిత్య హృదయము యుద్ధ కాండము 107 వ సర్గలో కలదు

**తతౌ యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితం**

**రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితం 1**

యుద్ధము చేసి చేసి మిక్కిలి అలసియున్న శ్రీరాముడు సమరరంగమున చింతా క్రాంతుడైయుండెను. పిమ్మట రావణుడు యుద్ధసన్నద్ధుడై ఆ స్వామి యెదుట నిలిచి యుండెను.

**దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణం**

**ఉపగమ్యాబ్రవీద్రామం అగస్త్యో భగవానృషిః 2**

యుద్ధమును చూచుటకై దేవతలలతో కూడి అచ్చటికి విచ్చేసిన పూజ్యుడైన అగస్త్య మహర్షి శ్రీరాముని సమీపించి, ఆ ప్రభువుతో ఇట్లు పల్కెను.

**అగస్త్య ఉవాచ:**

**రామరామమహాబాహో శృణు గుహ్యం సనాతనం**

**యేన సర్వానరీన్ వత్స సమరే విజయష్యసి 3**

ఓరామా! మహాబాహో! నాయనా! సనాతనము మిగుల గోప్యము ఐన ఈ స్తోత్రమును గూర్చి తెలిపెదను వినుము. దీనిని జపించినచో సమరమున నీవు శత్రువులపై విజయము సాధించగలవు.

**ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనం**

**జయావహం జపేన్నిత్యం అక్షయం పరమం శివం 4**

ఈ ఆదిత్యహృదయ అను స్తోత్రము పరమ పవిత్రమైనది. సమస్త శత్రువులను నశింపజేయునది. నిత్యము దీనిని జపించినచో సర్వత్ర జయములభించుట తథ్యము. ఇది సత్ఫలములను అక్షయముగ ప్రసాదించునది.

**సర్వమంగళమాంగళ్యం సర్వపాపప్రణాశనం**

**చింతాశోకప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమం 5**

ఇది పరమపావనమైనది. సకల శ్రేయస్సులను సమకూర్చి సమస్త పాపములను నశింపజేయును ఆధివ్యాధులను తొలగించి ఆయుస్సును వృద్ధిపరుచును. సర్వ జపములలో శ్రేష్ఠమైనది. కావున దీనిని జపించుట ఎంతేని ఆవశ్యము.

**రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం**

**పూజయస్వవివస్వంతం భాస్కరం భువనేశ్వరం 6**

అనంతమైన బంగారుకిరణములతో శోభిల్లుచు, జాతికి జాగృతి కూర్చును. దేవాసురులు ఈయనకు ప్రణమిల్లుదురు. మిక్కిలి తేజస్సుగలవాడు, సమస్త భువనములన నియంత్రించువాడు, లోకములకు వెలుగునిచ్చు ఆదిత్యుని పూజింపుము.

**సర్వ దేవాత్మకో హ్యేశ తేజస్వీ రశ్మిభావనః**

**ఏశ దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః 7**

ఇతడు సమస్త దేవతలకు ఆత్మయైనవాడు. తేజో రాశి. తన కిరణములచే లోకమునకు శక్తిని, స్ఫూర్తిని ప్రసాదించువాడు. దేవాసుర గణములతో గూడి సమస్త లోకములను తన కిరణములచే రక్షించుచుండువాడు.

**ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః**

**మహేంద్రో ధనదః కాలో యమస్సోమో హ్యాపాంపతిః 8**

బ్రహ్మ, విష్ణువు, శివుడు, కుమారస్వామి, ప్రజాపతి, దేవేంద్రుడు, కుబేరుడు, కాలస్వరూపుడు, యముడు, చంద్రుడు, వరుణుడు మరియు

**పితరో వసవః సాధ్యాః అశ్వినౌ మరుతో మనుః**

**వాయుః వహ్నిః ప్రజాప్రాణా ఋతు కర్తా ప్రభాకరః 9**

పితృదేవతలు. వసువులు, సాధ్యులు. అశ్వినీదేవతలు, మరుత్తులు, మనువు, వాయువు, అగ్ని, ప్రజలు మొదలగువారి స్వరూపములు అన్నిము ఇతనివే. షడృతువులకు కారకుడు ఈ ప్రభాకరుడే.

<u>**(సూర్య నామావళి) :-**</u>

**ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్**

**సువర్ణసదృశో భానుః హిరణ్యరేతా దివాకరః 10**

ఆదిత్యుడు జగత్సృష్టికి కారకుడు. జనులు తమవిధులు నిర్వర్తించుటకు ప్రేరణయిచ్చును. లోకోపకారం కొరకు ఆకాశమున సంచరించి వర్షములద్వారా జగత్తును పోషించి తన కిరణములను ప్రకాశింపజేయును. బంగారు వన్నెలో తేజరిల్లుచు అద్భుతముగా ప్రకాశించువాడు. బ్రహ్మాండములు ఉత్పత్తికి బీజమైనవాడు. చీకట్లను తొలగించుచు దివాసమయమున ప్రాణులను కార్యనిమగ్నులను గావించువాడు.

**హరిదశ్వస్సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్**

**తిమిరోన్మథనః శంభుస్త్వష్టా మార్తండక అంషుమాన్ 11**

శ్యామవర్ణముగల రథాశ్వములు గలవాడు. అసం ఖ్యాకములైన కిరణములు గలవాడు. సప్త అను పేరుగల రథాశ్వముగలవాడు. రథమునకు ఏడు గుఱ్ఱములుగలవాడు. తేజో నిధానములైన కిరణములు గలవాడు. సర్వసంహారకుడు. జగత్ప్రళయమునకు పిమ్మట దానిని మరల సృజించుటకై ఆవిర్భవించెడివాడు. నిరంతరము తన కిరణములచే ప్రకాశించుచుండువాడు.

**హిరణ్యగర్భహ్ శిశిరస్తపనో భాస్కరో రవిః**
**అగ్నిగర్భోఅదితేః పుత్రః శంఖః శిశిరనాశనహ్ 12**

బ్రహ్మాండములను తన ఉదరమునందు ధరించువాడు. తాపత్రయములతో బాధపడువారికి ఆశ్రయమై వాటిని తొలగించుటకు శాంతిని ప్రసాదించువాడు, తపింపజేయువాడు. దివ్యములైన వెలుగులను గూర్చువాడు. సకల లోకములకు స్తుతిపాత్రుడు. దివాసమయమున అగ్నిని గర్భమునందు ధరించువాడు. అదితి దేవికి పుత్రుడుగా అవతరించినవాడు. సాయంకాలమున స్వయముగా శాంతించువాడు. మంచును తొలగించువాడు.

**వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్ యజుస్సామ పారగః**
**ఘన వృష్టిరపాం మిత్రో వింధ్య వీథీ ప్లవంగమః 13**

ఆకాశమునకు అధిపతియైనవాడు. రాహువును ఛేదించు లక్షణముగలవాడు. పూర్వాహ్ణమున ఋగ్వేదరూపము, మధ్యాహ్న సమయమున యజుర్వేదరూపమును, సాయంసమయమున సామవేదరూపమునను అలరారుచుండెడివాడు. ఘనముగా వర్షములను కురిపించుచుండువాడు. అందువలననే జలములను వర్షింపజేయువాడు అని ఖ్యాతి వహించెను. వింధ్యగిరి మార్గమున అతివేగముగా సంచరించువాడు.

**ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః**
**కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వ భవోధ్భవః 14**

వేడిని కలిగియుండువాడు. వృత్తాకారమైన బింబము గలవాడు. విరోధులను రూపుమాపువాడు. ప్రభాత సమయమున పింగళవర్ణము కలిగియుండువాడు. మధ్యాహ్న సమయమున సర్వప్రాణులను తపింపజేయువాడు. వ్యాకరణాది సమస్త శాస్త్రముల యందును పండితుడు. విశ్వమును నిర్వహించువాడు. గొప్ప

తేజస్సు గలవాడు. సకల ప్రాణులయందును అనురక్తి గలిగి యుండువాడు. సమస్త ప్రాణుల ఉత్పత్తికి కారణమైనవాడు.

**నక్షత్ర గ్రహతారాణాం అధిపో విశ్వ భావనః**

**తెజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోస్తుతే 15**

నక్షత్రములకు, గ్రహములకు, తారలకును అధిపతియైనవాడు. విశ్వస్థితికి హేతువు. అగ్న్యాది తేజస్సులకు మించిన తేజస్సు గలవాడు. పన్నెండు రూపములతో విలసిల్లువాడు. ఈ నామములతో ప్రసిద్ధికెక్కిన సూర్యభగవానుడా నీకు నమస్కారం.

<u>**(సూర్య నమస్కారః ) :-**</u>

**నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయె నమః**

**జ్యోతిర్గణాణాం పతయే దినధిపతయే నమః 16**

స్వామీ! నీవు పూర్వగిరియందును, పశ్చిమగిరి యందును విలసిల్లుచుండువాడు. గ్రహములకు, నక్షత్రములకు, దివారాత్రములకు అధిపతివి. ఉపాసకులకు జయము అనుగ్రహించునట్టి ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః**

**నమో నమస్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః 17**

జయములను, శుభములను చేకూర్చువాడవు. శ్యామవర్ణముగల రథాశ్వములుగలవాడవు. వేలకొలది కిరణములు గలవాడవు. అదితి పుత్రుడవైన ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః**

**నమః పద్మ ప్రబోధాయ ప్రచండాయ నమో నమః 18**

నిన్ను ఉపాసించని వారికి నీవు భయంకరుడవు. ప్రాణులకు శక్తిని ప్రసాదించువాడవు. శీఘ్రముగ ప్రయాణించువాడవు. పద్మములను

వికసింపజేయువాడవు. జగత్ప్రళయమునకు పిమ్మట మరల సృజించుటకై ఆవిర్భవించు నట్టి ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే**

**భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషె నమః 19**

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ప్రతీకవు. దివ్య తేజస్సంపన్నుడవు. కాంతికి నిధియైన వాడవు. ప్రళయకాలమున లయకారకుడవు. అందువలన రుద్రస్వరూపుడవైన ఓ సూర్యభగవానుడా నీకు నమస్కారము.

**తమొఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయ అమితాత్మనె**

**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః 20**

తమస్సును రూపుమాపువాడవు. జడత్వమును, శీతలత్వమును నశింపజేయువాడవు. నిన్ను ఆశ్రయించి నవారి శత్రువులను సంహరించువాడవు. పరమాత్మ స్వరూపుడవు. కృతఘ్నులను నశింపజేయుచు, దివ్యతేజస్సు విరజిమ్ముచు, జ్యోతులకు అధిపతివైన నీకు నమస్కారము.

**తప్త చామిక రాభాయ హరయే విష్వకర్మణే**

**నమస్తమోభినిఘ్నాయ రుచయే లొకసాక్షిణే 21**

బంగారమువంటి వన్నెగలవాడవు. ఆహుతులను గ్రహించువాడవు. సర్వజగత్కర్తవు. తమస్సులను పారద్రోలువాడవు. ప్రకాశస్వరూపుడవు. జగత్తున జరిగెడి సర్వజనుల కర్మలకు సాక్షియైన వాడవు. కనుక ఓ భాస్కరుడా నీకు నమస్కారము.

**నాశయత్యేష వై భూతం తదైవ సృజతి ప్రభుః**

**పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః 22**

రఘునందనా! ఈ ప్రభువే సమస్త ప్రాణులను లయమొనర్చును. పిదప సృష్టించి పాలించుచుండును. ఇతడు తన కిరణముల చేత జగత్తును తపింపజేయును. వర్షములను ప్రాసాదించుచుండును.

**ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః**
**ఏష చైవాగ్నిహోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణాం 23**

ఇతడు సకల ప్రాణులలో అంతర్యామిగా నుండును. వారు నిద్రించుచున్నను తాను మేల్కొనియే యుండును. హవిస్సు యొక్క స్వరూపము ఇతడే. తత్ఫలస్వరూపమూ ఇతడే.

**వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ**
**యాని కృత్యాని లోకేషు సర్వేషు రవిః ప్రభుః 24**

ఇతడు వేదవేద్యుడు. యజ్ఞఫలస్వరూపుడు. లోకములో జరిగెడి సమస్త కార్యములకు ఈ సూర్యభగవానుడే ప్రభువు.

**<u>(ఫలశ్రుతిః ):-</u>**

**ఏనమాపత్సు కృత్ శ్రేషు కాంతారేషు భయేషు చ**
**కీర్తయన్ పురుషః కశ్చిన్ నావసీదతి రాఘవః 25**

రఘురామా! ఆపదలయందును, కష్టముల యందును, దుర్గమమార్గములయందును, భయస్థితులయందును ఈ స్వామిని కీర్తించినవారికి నాశము ఉండదు.

**పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిం**
**ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి 26**

దేవదేవుడు, జగత్పతియైన ఈ సూర్యభగవానుని ఏకాగ్రతతో పూజింపుము. ఈ ఆదిత్యహృదయమును ముమ్మారు జపించినచో నీవు ఈ మహా సంగ్రామము నందు విజయము పొందగలవు.

**అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి**

**ఏవముక్త్వా తదాగస్త్యో జగామ చ యథాగతం 27**

మహాబాహో! రామా! ఈ క్షణముననే నీవు రావణుని వధింపగలవు అని పలిగి అగస్త్య మహర్షి తన స్థానమునకు చేరెను

**ఏతత్ శృత్వా మహాతెజా నష్టశొకొభవత్తదా**

**ధారయామాస సుప్రీతొ రాఘవహ్ ప్రయతాత్మవాన్ 28**

మహాతేజస్వియైన శ్రీరాముడు అగస్త్యమహాముని ద్వారా ఈ ఆదిత్యహృదయ మహిమను గ్రహించి చింతారహితుడయ్యెను. అతడు మిక్కలి సంతృప్తి పొంది ఏకాగ్రతతో ఆదిత్యహృదయ మంత్రమును మనస్సు నందు నిలుపుకొనెను.

**ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్**

**త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ 29**

పిదమ ముమ్మారు ఆచమించి శుచియై సూర్యభగవానుని జూచుచు ఈ మంత్రమును జపించి పరమ సంతుష్టుడాయెను. పిమ్మట ఆ రఘువీరుడు తన ధనువును చేబూనెను.

**రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్**

**సర్వ యత్నేన మహతా వధె తస్య ధృతోభవత్ 30**

మిక్కిలి సంతుష్టుడైయున్న ఆ రాముడు రావణుని జూచి యుద్ధమునకై పురోగమించెను. అన్ని విధములుగా గట్టి పూనికతో ఆ నిశాచరుని వధించుటకు కృతనిశ్చయుడయ్యెను.

**అథ రవి రవదన్నిరీక్ష్య రామం**

**ముదితమనాః పరమం ప్రహృష్యమాణః**

**నిశిచరపతి సంక్షయం విదిత్వా**

**సురగణమధ్యగతో వచస్త్వరేతి**

పిమ్మట దేవతలమధ్యనున్న సూర్యభగవానుడు రావణుడు నశించుట తథ్యము అని ఎరింగి మానసోల్లాసమును పొందినవాడై, పరమ సంతోషముతో శ్రీరాముని జూచి రామా! త్వరపడుము అని పలికెను.

## 6.49 అగస్త్య ముని ప్రభావము

**అగస్త్య ఇతి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా.** తన తపః ప్రభావముచే వింధ్య పర్వతమును స్థంబింప చేసినాడు కావున ఈయనకు అగస్త్య మహర్షి అని పేరు వచ్చినది. **("అగమ్ (పర్వతం) స్థంభయతీతి అగస్త్య").** సూర్యుని మార్గమునకు (గమనమునకు) అడ్డు వచ్చుచున్న ఈ మహా పర్వతము అగస్త్యుని ఆదేశానుసారం పెరుగుట మానివేసింది. అట్టి ప్రభావశాలి అగస్త్య మహర్షి. స్పందన లేని శూన్య అవస్థకు "అగస్త్యుడు" అని పేరు. నిర్వికల్ప సమాధి అవస్థకు చేరిన తర్వాత ఈ శూన్య అవస్థ ప్రాప్తమగును. వృత్తి రహిత శూన్య అవస్థ యందు ఎల్లప్పుడును ఉండెడి ఉచ్చసాధకుని రామాయణకారుడు **"అగస్త్యుడు"** అని పేరిడెను. సంసారమును సాగరముతో పోల్చినారు. అలాంటి సాగరమును ఒకే ఆచమనముతో త్రాగినాడు. అటువంటి పరాక్రముడు, పురుషార్థి అగస్త్య మహర్షి. అరణ్యవాసంలో అట్టి మహర్షి ఆశ్రమమున మూడు పగళ్లు, మూడు రాత్రులు శ్రీరాముడు ఉండెననగా రామసాధకుడు శూన్య నిర్వికల్ప అవస్థ యందు మూడు రోజులు ఉండెను. వాల్మీకి రామాయణములో అగస్త్య ముని రెండు సార్లు గోచరమగును. మొదటి సారి అరణ్య కాండములో ...

**త ద్ధను స్తౌ చ తూణీరౌ శరం ఖడ్గం చ మానద**
**జయాయ ప్రతిగృహ్ణీష్వ వజ్రం వజ్రధరో యథా 3.12.35**

మహర్షి రాముడికి విష్ణు ధనుస్సుని (పూర్వము ఈ వైష్ణవ ధనుస్సు పరశురాముని నుండి శ్రీరామునికి చేరెను. అతడు దీనిని వరుణునికి ఇచ్చెను. ఆ వరుణుడు దీనిని అగస్త్యునికి ఇచ్చెను. ఇప్పుడు మరల అగస్త్యుడు రామునకు ఇచ్చెను),

బ్రహ్మగారు ఇచ్చిన సూర్య తేజస్సు కలిగిన బాణాన్ని, ఇంద్రుడు ఇచ్చిన రెండు అక్షయబాణ తూణీరములు, ఒక బ్రహ్మాండమైన పిడి కలిగిన ఖడ్గాన్ని ఇచ్చి, వీటి ద్వారా జయాన్ని పొందు అని ఆశీర్వదించారు. రెండవ సారి యుద్ధ క్షేత్రములో ప్రత్యక్షమై ఆదిత్య హృదయమును బోధిస్తారు.

శ్రీరాముడు, వసిష్ఠ మహర్షి ద్వారా సమస్త జ్ఞానాన్ని తెలుసుకొన్న వాడైనప్పటికి, సర్వ శక్తిమంతుడు అయినప్పటికి, మాయా ప్రభావము వలన, సీతాపహరణము తర్వాత దుఃఖితుడై మార్గోపాయము కానరాక అగమ్య గోచరంగా అరణ్యములో సంచరిస్తుండగా అగస్త మహర్షి ఏతెంచి శ్రీరాముని జ్ఞానమును గుర్తు చేసి కర్తవ్య బోధన చేసి పరమేశ్వరుని ప్రార్ధన చేయమని తద్వారా దుఃఖోపశమనము కలుగునని విరజా దీక్ష ఇస్తాడు. ఈ విధముగా శ్రీరాముని చాతుర్మాస్య దీక్ష వలన పరమేశ్వరుడు ప్రత్యక్షమై పాశుపతాస్త్రమును ప్రసాదించి జ్ఞానబోధ చేస్తాడు. ఇదియే శివ-రామ సంవాదరూపమైన పద్మపురాణాతర్గతమైన "శివగీత". (ఇది వాల్మీకి రామాయణములో లేదు).

కాళిదాసు రఘువంశములోను -- ఇంకా బృహత్ సంహిత లో వరాహమిహిరాచార్యుడు "Canopus" అనే అగస్త్య నక్షత్రము ఉదయించడము వర్ణించాడు. అగస్త్యుడు ఉదయించిన వెంటనే నదులన్నీ కూడా మడ్డి తేరుకొని నిర్మలమైన నీళ్లతో ప్రవహిస్తాయి. టెలిస్కోపులో చూసిన Scientists ఈ అగస్త్య నక్షత్రము సూర్యుని కంటే 50 లక్షల రెట్ల పెద్దదని, అది ఒక డిగ్రీలో పదోభాగము భూమికి దగ్గరగా వచ్చినా సముద్రాలు ఆవిరై ఇగిరి పోతాయని చెప్పారు. దీనిని బట్టి అగస్త్యుడు సముద్రాల్ని త్రాగాడని భావము. పూర్వము హిమాలయాలకు సూటిగా అగస్త్యుడు ఉత్తర దిశగా ఉదయించే వాడని (మహాభారతము, అరణ్య పర్వము - 101) ఆ తర్వాత భూమి యొక్క ధ్రువము తలక్రిందులుగా తిరుగుట మూలాన దక్షిణంగా ఒంగి, వింధ్యను దాటి

ఉదయించాడని తెలియుచున్నది. ఇదియే అగస్త్యుని కథలో -- అగస్త్యమహర్షి వింధ్య పర్వతాల్ని దాటి రావడము. శ్రీ వెంకటేశ్వర స్వామి పద్మావతిని పెండ్లి చేసుకున్నప్పుడు పెండ్లి "సదస్యుల" లో యున్న మహర్షులలో అగస్త్య మహర్షి గూడ యున్నారు. వేరొక కథనం ప్రకారం, శివ పార్వతుల కళ్యాణానికి దేవతలు, ఋషులు అందరు హిమాలయాలకు వచ్చారు. అప్పుడు వారి శక్తికి ఉత్తరాన భూమి క్రుంగి పోవుచుండడం చూసి శివుడు అందరి శక్తికి ఇంచుమించు సమానమైన అగస్త్య భగవానులను దక్షిణ దిక్కున ఉండమని ఆదేశమిచ్చారు. అప్పుడు అగస్త్యులవారు కళ్యాణం చూడలేక పోతున్నందుకు చింతించుచుండగా వారికి అక్కడనుండి కూడా ప్రత్యక్షంగా చూసే వరాన్ని ప్రసాదించారు. అప్పటి నుండి అగస్త్యుడు దక్షిణాన ఉన్నారు. ఆ ప్రదేశము ప్రస్తుతము తమిళనాడులోని కుంభకోణము దగ్గర నల్లూర్ వద్ద ఉన్నదని స్థల పురాణము[26]. అందువలన భూమి సరియైన తన కక్షలో ఉండునని చెప్పాడు. అంటే అగస్త్యుని బరువు మిగిలిన అన్నింటికీ సమానము అని తెలియును). This temple is known as "Sri Kalyansundareswar Temple" Nallur, near Kumbhakonam, Tamilnadu. అగస్త్యుడు చెప్పినవి 26 ఋక్సంహిత వేదమంత్రాలు (ఋగ్వేదంలో 1.165వ శ్లోకం నుంచి 1.191వ శ్లోకం వరకూ). వ్యాసులవారు చేసిన యజ్ఞంలో (అగస్త్యో వామదేవశ్చ జాబాలి రథాకాశ్యపః) అగస్త్యుడు మొదలగు ఋషులు యజ్ఞం చూడడానికి వచ్చారని వ్యాస మహర్షి భారతంలో వ్రాసారు. అంటే వీళ్ళు చిరంజీవులు. ఎప్పుడు కావాలంటే అప్పుడు ఆవిరిగా యుండే వాళ్ళ ఆత్మ, వాళ్ళ శరీరాన్ని అట్టి ఆవిరి గడ్డకట్టించి (in the form of ice) స్థూల శరీరాన్ని ధరించగలరు. వారిని "నిర్మాణకాయులు" అంటారు. అంటే శరీరాన్ని ఎప్పుడు పడితే అప్పుడు నిర్మాణం చేసుకోగల సిద్ధపురుషులు. వీరికి మరణంతో పనిలేదు. పురాతన జపనీస్ గ్రంథం అగస్త్యపర్వ అనేది అగస్త్యుని

---

[26] Source: https://temple.dinamalar.com/en/new_en.php?id=367

గురించి రాసిన పుస్తకం. ఈ పుస్తకంలో అగస్త్యుని గొప్ప మహర్షిగా, గురువుగా వర్ణిస్తూ రాశారు. ఈ పుస్తకం యొక్క 11వ శతాబ్దపు ముద్రణ ఇప్పటికీ లభ్యమవుతోంది అని శ్రీ వేదవ్యాస్, ఐఏఎస్ గారు చెప్పారు.

**ప్రణవ పంచాక్షరోపనిషత్ప్రపంచంబు**
**గడదాక నెఱిగిన కఱకలాని**
**వాతాపిదైత్యు నిల్వలునితో గూడంగ**
**జఠరాగ్ని వ్రేల్చిన సవనరక్త**
**గోపించి నహుషుని గుంభీనసంబుగా**
**హుంకార మిచ్చిన యుగ్రతేజు**
**వానకాలము నాడు వండునట్టిన నీటి**
**కాలుష్య ముడిపెడు కతకఫలము**
**బాండుభాసిత త్రిపుండ్రాంక ఫాలభాగు**
**భద్రరుద్రాక్షమాలికా భరితవక్ష**
**వింధ్యగర్వాపహారి నాపీతజలధి**
**నయ్యగస్త్య మహర్షి న నభినుతింతు**
**- (శ్రీ కాశీ ఖండము; 2. 180)**

అగస్త్య ముని ప్రభావము కొంత భాగము "అరణ్య కాండ " లో వివరించడమైనది.

### 6.50 రావణ సంహారము

శ్రీరాముడు యుద్ధమునకు సిద్ధపడగా, రావణుడు రథముతో యుద్ధమునకు సిద్ధపడి వచ్చెను. రావణుడు ఆకాశమునే ఆక్రమించుచున్నాడా లేక భూమినే మ్రింగించుచున్నాడా అనునట్లు తన రథముపై కూర్చొని తన సైన్యమునకు ఆనందము కలుగ జేసెను. రథముతో వచ్చుచున్న రావణుడు మేఘము వర్షధారలను వదిలినట్లు బాణవర్షమును గురిపించెను. ఆ విధముగా

సంరంభముతో వచ్చుచున్న రావణుని చూచి, రాముడు మాతలితో అతని రథమునకు ఎదురుగా కుడి (సవ్య దిశలో) వైపు నుండి వెళ్లవలెనని చెప్పెను. ఒకరినొకరు ఎదురెదురుగా నిలిచి ఒకరినొకరు చంపుకొనవలెననే పట్టుదలతో పోరు చేయుచుండిరి. గ్రద్దలు గుంపులు గుంపులుగా రావణుని రథముపై తిరుగాడెను. శకున శాస్త్రజ్ఞుడగు రాముడు ఆ శకునములు చూచి విజయము తప్పక కలుగునని ఉత్సాహముతో అధికమైన పరాక్రమము చూపుచుండెను. రావణుడు గదలు, పరిఘలు, చక్రములు, రోకళ్ళు, పర్వత శిఖరములు, వృక్షములు, శూలములు మాయాశక్తిచే అస్త్రబలము వర్షించెను. రకరకముల అస్త్రములతో రాముని రథముపై, వానరులపై పడుచుండెను. అంతరిక్షము బాణములతో నిండెను. రావణుని చూచి రాముడు వానిపై వందలు, వేలు బాణములను గురిపించెను. ఆ యుద్ధము గగుర్పాటు కల్పించినదియై ఉండెను. కొద్ది సేపటిలో భీకరమైన ఆశ్చర్యజనకమై సర్వలోకము చూడదగినదియై యుద్ధము సాగుచుండెను. గాలి వీచుట మానెను. దేవతలు, ఋషులు ఆకాశమున నిలిచి రామునికి మంగళము పలుకుచుండిరి. ఆ యుద్ధమును చూచి దానికి పోలికగా వేరొకటి చెప్పలేక **(గగనం గగనాఽఽకారం సాగర: సాగరోపమ: రామ రావణయో ర్యుద్ధం రామ రావణయో రివ)** ఆకాశము ఆకాశము వలననే యున్నది. సముద్రము సముద్రము వలననే యున్నది. అనుటయే తప్ప వానిని పోలినది చెప్పుటకు ఎట్లు లేదో అట్లే రామ రావణుల యుద్ధము చెప్పుటకు పోలిక లేదనుచుండిరి. రామునికి కోపము వచ్చి బాణముతో రావణుని శిరస్సును ఖండించెను. వెంటనే దానిని పోలిన వేరొక శిరస్సు మొలచెను. వెంటనే ఆ శిరస్సును కూడా ఖండించెను. మరల శిరస్సు మొలచెను. ఈ విధముగా నూట ఒక్క సార్లు శిరస్సులను చేధించినను మరల మరల శిరస్సులు మొలచుచు రాముని శ్రమ యంతయు నిష్ఫలము అయ్యెను. ఏ బాణములతో మారీచుడు చంపబడెనో, దేనితో ఖరదూషణాదులు, విరాధుడు, కబంధుడు చంపబడిరో ఆ

బాణములన్నియు ప్రయోజనము శూన్యము అయినవి. అప్పుడు రావణుడు ఇంకను జాగ్రత్తగా ఆలోచన చేసి రావణుని గుండెలపై కొట్టెను. కోపము గలవాడై రావణుడు గధలను, ముసలములను వర్షించి రాముని నొప్పించెను. ఆ రాత్రి, మరుసటి పగలు అంతయు ఒక్క క్షణకాలం కూడా విరామము లేకుండా యుద్ధము సాగుచుండెను. రాముడుగాని, రావణుడు గాని జయించుట కానరాలేదు. అప్పుడు మాతలి రామునితో బ్రహ్మాస్త్రము ప్రయోగించమని, అతని మరణకాలము ఆసన్నమైనదని చెప్పెను. మాతలి చెప్పగానే ఆనాడు అగస్త్యుడు తనకు ఇచ్చిన అస్త్రము గుర్తు వచ్చెను. (అరణ్య కాండము 12 వ సర్గ) బుసకొట్టుచున్న పామువలె యున్న బాణమును తీసెను. పూర్వము ఈ బాణమును బ్రహ్మ నిర్మించి ఇంద్రునకు ఒసగినాడు. ఆ బాణమే ఇంద్రుడు అగస్త్యునకు ఇచ్చి శ్రీరామునికి ఒసగమని కోరెను. దానిని రామునకు అగస్త్యుడు ఒసగెను. ఆ బాణము యొక్క ప్రక్క రెక్కల యందు వాయుదేవుడు యుండును. మధ్య అగ్నిసూర్యులు ఉందురు. దానిశరీరము ఆకాశ స్వరూపమై యుండును. బరువులో మేరు పర్వతము, మంధర పర్వతము వలె యుండును. దాని ములుకులు బంగారముతో అలంకరింపబడి యున్నది. సర్వభూతముల యొక్క తేజస్సులతో, సూర్యకాంతిని బోలిన కాంతితో ఆ బాణము నిర్మింపబడినది. పొగతో నున్న కాలాగ్ని వలె యుండును. విషమున త్రాచు పాము వలె యుండును. ఎన్నియో యుద్ధములలో ప్రయోగించబడుటచే రక్తముతో తడిసి యుండును. మహా భయంకరమైనది. వజ్రసారమైనది. దివ్యాస్త్ర మంత్రమును బాణముపై అభిమంత్రించి మహాబలశాలి యగు రాముడు వేదోక్తమగు విధానంతో ధనస్సున సంధించెను. అస్త్రము తన ధనుస్సు నందు సంధింపగనే సర్వ భూతములు గడగడలాడినవి. అస్త్రములు మంత్ర రూపముగా యుండును. మంత్ర రూపముగా బాణమును సంధింపగనే వాటికి అట్టి శక్తి కలుగును. రాముడు

దానిని ప్రయోగించెను. ఆ బాణము రావణుని హృదయములో దూరి రక్తముతో తడిసి రావణుని ప్రాణములు హరించి భూమిలో ప్రవేశించి మరల రాముని అమ్ముల పొదిలోకి వచ్చి దూరెను. రావణుడు మృతుడగుట చూచి దేవదుందుభులు మ్రోగెను. పుష్ప వర్షము కురిసెను. వానర సేన ఎంతయో హర్షమును పొందెను. ఈ విధముగా రావణ సంహారము ధాత నామ సంవత్సరము ఫాల్గుణ బహుళ అమావాశ్య నాడు జరిగినట్లు బ్రహ్మాండ పురాణము ద్వారా తెలియు చున్నది.

**6.51 రావణ మృతికి విభీషణుని విలాపము, రాముని అనునయము**

సోదరుడు చనిపోయి నేలబడి యున్నాడు. శోకము పెల్లుబికిన విభీషణుడు ఇట్లు విలపింప సాగెను. "నీవు పరాక్రమశాలివి. లోక ప్రఖ్యాతి నొందినవాడివి. శాస్త్రములలో శిక్షణ పొందినవాడివి. అట్టి నీవు ఇప్పుడు నిర్జీవంగా నేలపై పరుండినావు. వెనుక నేను నీకు ఇట్టి దశ వచ్చునని చెప్పియుంటిని. ఆనాడు నా మాటలు నీకు రుచింపలేదు. నీతి మార్గ ప్రవర్తనను, మర్యాదను అతిక్రమించితివి. ధర్మమును నిరోధించితివి. రావణుడు మహాగ్నిహోత్రము. అట్టి అగ్నిని రాముడనే మేఘము చల్లార్చినది". ఈ విధముగా విభీషణుడు శోకించుట చూచి, అర్థ నిశ్చయమును ప్రకట మొనర్చు యుక్తి సంగతములైన మాటలు చెప్పుచు శ్రీరాముడు శోకమగ్నుడగు విభీషణునితో ఇట్లు పలికెను.

**నాఽయం వినష్టో నిశ్చేష్ట స్సమరే చండ విక్రమ:**
**అత్యున్నత మహోత్సాహ: పతితోఽయ మశంకిత:**
**నైవం వినష్టా శోచ్యన్తే క్షత్ర ధర్మ మఽవస్థితా**
**వృద్ధి మాఽఽశంసమానా యే నిపతంతి రణాఽజిరే**
**త దేవం నిశ్చయం దృష్ట్వా తత్త్వ మాఽఽస్థాయ విజ్వర:**
**య దిహాఽనంతరం కార్యం త దఽనుచిన్తయ**
**మరణాఽంతాని వైరాణి నిర్వృత్తం న: ప్రయోజనం**
**క్రియతా మఽస్య సంస్కారో మమాఽప్యేష యథా తవ**

విభీషణా! ఈ వీరుడు యుద్ధము నందు అసమర్థుడై చావ లేదు. ఇతను ప్రచండమైన పరాక్రమమును ప్రకటించెను. ఈతని ఉత్సాహము చాల గొప్పది. ఈతనికి మృత్యువు యెడల ఏ విధమైన భయము లేదు. దైవికముగా ఇతడు యుద్ధమున పడిపోయెను. ఎవరు తమ అభ్యుదయమును గూర్చిన కోరికచే క్షత్రియ ధర్మమందు నిలకడ కలిగి యుద్ధమందు చంపబడుదురో ఆ ప్రకారముగా నశించు జనుల విషయమై శోకించరాదు. శాస్త్రము యొక్క ఇట్టి నిశ్చయమును తెలుసుకొని, సాత్విక బుద్ధిని ఆశ్రయించి నీవు నిశ్చింతగా యుండుము. మరియు ఇప్పుడు ముందు చేయదగిన (ప్రేత సంస్కారము మొదలైన) పనుల విషయమై ఆలోచించుము. విభీషణా! వైరములు మరణము వరకే. మరణించిన పిదప ఆ వైరములు నశించును. ఇప్పుడు మన ప్రయోజనము సిద్ధించింది. కావున ఇపుడు నీవు ఈతని ప్రేత సంస్కారమును గావింపుము. ఈ సమయమున యీతడు నీకెట్లు స్నేహమునకు పాత్రుడై యున్నాడో అట్లే నాకును స్నేహభాజనుడై యున్నాడు.

శ్రీరాముడిట్లు పలుకగా శోకతప్తుడైన విభీషణుడు వారితో తన సోదరునకు హితకరమైనట్టి ఈ వాక్యమును పలికెను.

**ఏషో హితాఽగ్ని శ్చ మహా తపా శ్చ, వేదాన్తగః కర్మసు చాఽగ్ర్య వీర్యః**
**ఏతస్య య త్ప్రేత గతస్య కృత్యం, తత్ కర్తు మిచ్ఛామి తవ ప్రసాదాత్**

ఈ రావణుడు అగ్నిహోత్రియు, మహాతపస్వియు, వేదాంత వేత్తయు, యజ్ఞ యాగాది కర్మలందు శ్రేష్ఠుడైన శూరుడును, మహా కర్మరుడును అయియున్నాడు. కావున మీ కృపచే నేనే ఇపుడాతని ప్రేతకర్మను చేయదలిచాను.

## 6.52 పతి వియోగమునకు మండోదరి విలపించుట

అచింత్యములగు గొప్ప కర్మల నాచరించు శ్రీరామునిచే చంపబడిన తన భర్తయగు రావణుని చూచి మండోదరి దీనురాలై మహాదుఃఖమును పొంది ఈ ప్రకారముగా విలపింప దొడగెను.

**ఇన్ద్రియాణి పురా జిత్వా జితం త్రి భువనం త్వయా**
**స్మరద్భి: ఇవ త ద్వైరమ్ ఇన్ద్రియై: ఏవ నిర్జితః**
**అవశ్య మేవ లభతే ఫలం పాపస్య కర్మణ:**
**ఘోరం పర్యాగతే కాలే కర్తా నాఽస్త్యఽత్ర సంశయ:**
**శుభ కృత్ శుభ మాఽఽప్నోతి పాప కృత్ పాప మఽశ్నుతే**
**విభీషణ స్సుఖం ప్రాప్త స్త్వం ప్రాప్త: పాప మీదృశం**

నాథా! మొదట మీరు ఇంద్రియములను జయించియే ముల్లోకములపై విజయమును పొందిరి. ఆ వైరమును జ్ఞప్తియందుంచుకొని ఏమో ఇప్పుడా ఇంద్రియములే మిమ్ములను ఓడించి వేసినవి. మీరు శ్రీరామునితో విరోధము పెట్టుకొనవద్దని ఎన్ని సార్లో చెప్పితిని. కానీ నా మాటలు పెడ చెవిని పెట్టితిరి. దాని ఫలితమే ఈనాడు లభించినది. సమయము వచ్చినప్పుడు కర్తకు తన పాపకర్మ యొక్క ఫలము తప్పక లభించును. శుభకర్మ నొనర్చు వానికి ఉత్తమ ఫలము లభించును. పాపకర్మము చేయువానికి పాపఫలమగు దుఃఖము సంభవించును. విభీషణునకు తన శుభ కర్మల వలననే సుఖము సంప్రాప్తించింది. నీవిట్టి దుఃఖమును అనుభవించ వలసి వచ్చినది. మీ ఇంటి యందు సీత కంటే ఎక్కువ సౌందర్యము గల యువతులెందరో గలరు. కానీ మీరు కామవశులై ఈ విషయమును తెలుసుకొన లేక పోయిరి. మీరు ప్రపంచమును అంతయును క్షోభ పెట్టితిరి. సాదు మహాత్ములను హింసించితిరి. శత్రువుల చెంత బలపూర్వక, అహంకార పూరితములైన మాటలను పలికితిరి. మీరు పెక్కురు కులకాంతులను, గురుసేవాతత్పరులైన స్త్రీలను, ధర్మ పరాయణులైన వారిని విధవలుగా చేసి వారిని అవమానించితిరి.

**ప్రవాద: సత్య ఏవాఽయం త్వాం ప్రతి ప్రాయశో నృప**
**పతివ్రతానాం నాఽకస్మాత్ పతన్త్య శ్రూణి భూతలే**

మహారాజా! పతివ్రతలు యొక్క కన్నీరు ఈ భూమిపై వ్యర్థముగా పడరాదు. అట్లు పడినచో పెక్కు అనర్థములు సంభవించును అనునది పెద్దల మాట. ఆ జనశ్రుతి నీ విషయమున ఇప్పుడు సత్యమైనది. మీరు మీ యొక్క తేజముచే ముల్లోకములను ఆక్రమించి మిమ్ము మీరు గొప్ప శూరులుగా తలచుకొంటిరి. కానీ ఒక పరాయి స్త్రీని దొంగిలించునంతటి నీచ కార్యమును మీరేల చేసితిరి.

**కామ క్రోధ సముత్థేన వ్యసనేన ప్రసంగినా**
**నిర్వృత్త స్త్వ త్కృతేఽనర్థః ఽసోయం మూల హరో మహాన్**
**త్వయా కృతమ్ ఇదం సర్వమ్ అనాథం రక్షసాం కులమ్**
**మారీచ కుంభకర్ణాభ్యాం వాక్యం మమ పితు స్తదా**
**న శ్రుతం వీరమత్తేన తస్యేదం ఫల మీద్రుశం**

కామక్రోధముల వలన ఉత్పన్నమైన దోషముచే ఈ ఐశ్వర్యమంతయు నశించి పోయినది. మరియు సమూలంగా వినాశమొనర్చు ఈ గొప్ప అనర్థము సంప్రాప్తించినది. నేడు సమస్త రాక్షస వంశమును మీరు అనాథమొనర్చితిరి. మీరు మీ బలమును గూర్చిన గర్వముచే మత్తెక్కి యుంటిరి. అందుచే మారీచుడు, కుంభకర్ణుడు, నా తండ్రి చెప్పిన మాటలను సమ్మతించ కుంటిరి. దాని ఫలితమే ఇపుడు మీకు సంభవించినది. ఇట్లు మండోదరి కన్నీరు నిండిన కన్నులతో విలపించి మూర్ఛ నొందెను. అప్పుడామె సవతులిట్లు పలికిరి. మహారాణీ! ప్రపంచము యొక్క స్వరూపము అస్థిరమని మీకు తెలియదా? పరిస్థితి మారినప్పుడు రాజుల సంపద స్థిరముగా యుండదు.

తదుపరి విభీషణునితో గూడ ఇతర రాక్షసులున్ను రావణుని చితిపై వివిధ వస్త్రాలను, పేలాలు ఉంచిరి. అప్పుడు వారి ముఖంపై కన్నీటి ధారలు కారుచుండెను. అప్పుడు విభీషణుడు చితికి యధాప్రకారముగా అగ్ని

ముట్టించెను. అయోధ్య కాండలో, సారథి అయిన సుమంత్రునితో, దశరథుడు ఈ విధముగా చెప్పెను.

**సుమన్త్రాఽఽనయ మే దారాన్ యే కే చిత్ ఇహ మామకాః**
**దారైః పరివృతః సర్వై ర్ద్రష్టుమ్ ఇచ్ఛామి ధార్మికం**
**అర్ధ సప్త శతా స్తా స్తు ప్రమదా: తామ్ర లోచనాః**
**కౌసల్యాం పరివార్యాఽథ శనై: జగ్ము: ధృత వ్రతాః**

సుమంత్రా ఈ భవనమున గల నా భార్యలందరిని తీసుకొని రమ్ము. వారందరితో కూడి నేను రాముని చూడగోరుతున్నాను. అప్పుడు 350 మంది స్త్రీలు నియమనిష్టలతో కౌసల్యను అనుసరించి భవనమునకు చేరిరి.

పై విషయములను బట్టి తెలియునది ఏమనగా దశరథునికి 350 మంది భార్యలు గలరు. అందు ముఖ్యమైన వారు కౌసల్య, కైకేయి, సుమిత్ర. అలాగే రావణునికి కూడా పెక్కు మంది పత్నులు గలరు. కానీ ముఖ్యమైన వారు మండోదరి, ధాన్యమాలిని. రావణునికి మొత్తము ఏడుగురు కొడుకులు. వారు ఇంద్రజిత్తు. అతనినే మేఘనాథుడు అంటారు. ఇతను రావణాసురుని పెద్ద కొడుకు. ఇంకా అతికాయుడు, అక్ష కుమారుడు, దేవాంతకుడు, నరాంతకుడు, త్రిశిరుడు, ప్రహస్తుడు. ఇంద్రజిత్తు, అతికాయుడు, ప్రహస్తులను లక్ష్మణుడు సంహరించాడు. అక్ష కుమారుడు, దేవాంతకులను హనుమ సంహరించాడు. నరాంతకుడిని అంగదుడు, త్రిశిరుడ్ని నీలుడు సంహరించారు. ఇక్కడ గమనించింది ఏమనగా రావణుడు అహంకారి, దుష్ట స్వభావము కలవాడు. అధర్మ పరుడు. వీటి కారణంగానే అతను సంహరింప బడ్డాడు కానీ పరాక్రమము లేక కాదు. అలాగే పరాక్రమమ వంతులైనను అతని కొడుకులు గూడ తండ్రి గుణములను కలిగి యున్నారు. వారు కూడా ఈ కారణంగానే సంహరింప బడ్డారు. ఇంతమంది కొడుకులు గల్గినను తను, తన కొడుకుల అధర్మవర్తన వలన రావణాసురుని ప్రేత సంస్కారము చేయడానికి ఒక్క కొడుకు గూడ మిగిలి లేడు. అతని వంశము

మొత్తము సర్వ నాశనము అయ్యినది. అందువలననే విభీషణుడు రావణాసురుని ప్రేత సంస్కారము చేయవలసి వచ్చినది. లోకములో తండ్రి గుణములు కొడుకుకు అబ్బును కావున తండ్రి ధర్మవర్తనతో పిల్లలకు మార్గదర్శనం చేయవలసి యున్నది. ఇదేవిధముగా మహాభారతములో ధృతరాష్ట్రుని అధర్మవర్తనము, దుర్యోధనుని అహంకారము కారణంగా కౌరవుల వంశము మొత్తము క్షయమైనది. అయితే ఒక సందేహము రావచ్చు. హిరణ్యకశ్యపుడు అధర్మవర్తనుడు అయినను ప్రహ్లాదుడు ఎలా ధర్మపరుడు అయినాడు? ఇక్కడ గమనించితే ప్రహ్లాదుడు గురువుగా నారదుడు ఒసగిన నారాయణ మంత్రము వలన సంస్కరింపబడ్డాడు.

రాముడు సత్యవాది. సత్యవాది యొక్క మాటలు ఎన్నడును వ్యర్థా పోవు. యుద్ధము ప్రారంభమునకు ముందు చివరి ప్రయత్నముగా శ్రీరాముడు, అంగదునితో సంధి ప్రయత్నము చేసెను. శ్రీరాముడు ఈ విధముగా రావణునికి కబురు పంపెను.

**బ్రవీమి త్వాం హితం వాక్యం క్రియతామ్ ఔర్ధ్వదేకికమ్**

**సుదృష్టా క్రియతాం లంకా జీవితం తే మయి స్థితమ్**

రావణా! నీ మేలు కొరకై హితవచనములు నుడుపుచున్నాను. రాక్షసులందరు మృతి చెందనున్నారు గావున నీకు పుణ్యలోకములు ప్రాప్తించుకొనుటకై తగిన శ్రాద్ధాది పుణ్య కర్మలను నీ కొరకై నీవే ఆచరించుకొనుము. కడసారిగా లంకను ఒక్కసారి చూచుకొనుము. నీ ఆయువుపట్టు నా చేతిలో యున్నది. చివరికి శ్రీరాముడు వచించినట్లే రావణుడికి శ్రాద్ధము పెట్టుటకు కొడుకులు ఎవ్వరును జీవించి యుండలేదు.

## 6.53 విభీషణుని పట్టాభిషేకము

దేవతలు, గంధర్వులు మొదలగు వారు ఆకాశములో నిలిచి రావణ సంహారమునకు హర్షము వ్యక్తం చేసి, ఆ వృత్తాంతమును చెప్పుకొనుచు తమ

స్థానములకు ఎగిరి. శ్రీరాముడు ఇంద్రుని రథమును వెనుకకు పంపెను. తరువాత శ్రీరాముడు సుగ్రీవుని గాఢముగా ఆలింగనము చేసుకొనెను. శ్రీరాముడు, లక్ష్మణునితో "లక్ష్మణా! విభీషణుడు మనపై అనురాగము గల భక్తుడు. నాకు ఎంతయో ఉపకారము చేసినాడు. వెనుక సముద్ర తీరమున విభీషణునకు లంకారాజ్యాభిషేకము చేసినను, విభీషణునికి సింహాసనాధీస్టుని చేసి మకుట ధారణ చేయవలెను". అని చెప్పెను. శ్రీరాముని అభిప్రాయము ప్రకారము సీతమ్మను చేపట్టుటకు ముందే శరణాగతుడైన విభీషణుని లంకారాజ్యాభిషేకము ముఖ్యము. సోదరుని అభిప్రాయము ఎరిగిన లక్ష్మణుడు వానరులతో బంగారు కలశములో సముద్ర జలములు తెప్పించెను.లంకానగర ప్రవేశము చేసినచో తన అరణ్య వాసమునకు భంగమగునని శ్రీరాముడు నగర ప్రవేశమే చేయక లక్ష్మణుని పంపెను.

**తత స్త్వేకం ఘటం గృహ్య సంస్థాప్య పరమాఽఽసనే**
**ఘటేన తేన సౌమిత్రి: అభ్యషించ ద్విభీషణమ్**
**లంకాయాం రక్షసాం మధ్యే రాజానం రామ శాసనాత్**
**విధినా మంత్ర దృష్టేన సుహృ ద్గణ సమా వృతం**
**అభ్యషించత్ స ధర్మాత్మా శుద్ధాత్మానం విభీషణమ్**
**త స్యాఽఽమాత్యా జహృషిరే భక్తా యే చాఽస్య రాక్షసాః**

రామాజ్ఞచే లక్ష్మణుడు జలపూర్ణమగు ఘటమును తన చేతిలో పట్టుకొని విభీషణుని సింహాసనంపై కూర్చుండ జేసి రాక్షసులందరు చూచుచుండగా మంత్రహితముగా లంకారాజుగా అభిషేకించెను. రాక్షస మంత్రులు మొదలగు వారు యుద్ధములో పోయినందుకు విభీషణుని ఓదార్చి లక్ష్మణుడు, శ్రీరాముని సన్నిధికి చేరెను.

ఈ విధముగా విభీషణుని పట్టాభిషేకము ఈశ్వర నామ సంవత్సర చైత్ర శుద్ధ తదియ నాడు జరిగినట్లుగా బ్రహ్మాండ పురాణము తెలియు చున్నది.

## 6.54 శ్రీరాముని విజయ వార్త సితాదేవికి తెలుపుట

శ్రీరాముడు తన ప్రక్కనే యున్న హనుమతో; "హనుమా! మహారాజగు విభిషణుని అనుమతితో, నీవు లంకలో ప్రవేశించి, రావణ భవనమునకు వెళ్లి విభిషణుని విజయమునకు అతనిని అభినందించుము. అటనుండి వైదేహి వద్దకు యేగి, లక్ష్మణునితో, సుగ్రీవునితో కలసి మేము కుశలముగా యున్నామని, రావణ సంహార మైనదని చెప్పుము. ప్రియమైన ఈ వృత్తాంతమును ఎఱింగించి, ఆమె సందేశమును తీసుకొని రమ్ము" అని ఆదేశించి పంపెను. రామాజ్ఞచే వెంటనే హనుమ అశోకవనమున ప్రవేశించి శరీర సంస్కారము లేకుండా, గ్రహ పేడతో కూడిన రోహిణి నక్షత్రము వలె వృక్షమూలమున ఆనందము లేనిదై రాక్షస స్త్రీలతో ఆవరింపబడి యున్న సీతను చూచెను. హనుమ సీతను చూచి నమస్కరించగా ఆ వచ్చినవాడు తాను పూర్వము చూచిన రామదూతయైన హనుమయేనని సీతమ్మ గుర్తించెను. హనుమ సీతతో; అమ్మా! శ్రీరాముడు తన కుశల వార్త మీకు తెలియ జేయమన్నాడు. రావణుని చంపి నిన్ను విముక్తి చేయవలెనని ప్రతిజ్ఞ పూని రావణ సంహారము చేసి యున్నాడు. హనుమ ఇట్లు చెప్పగనే సీత మనసు సంతోషముతో ఉప్పొంగినది. ఆనందముతో మాట రాక చూచుచు ఊరకుండెను. అప్పుడు హనుమ అమ్మా! నాతో మాటాడవేమి? అప్పుడు సీత హర్షముతో తొట్రువడుతున్న కంఠముతో పరమ ప్రీతితో ఇట్లు పలికెను. "హనుమా! ప్రభువు విజయ వార్తను వినుట తోడనే మనసున కలిగిన హర్షముచే మాట రాలేదు. ఈ భూమిలో ఇంత మంచి వార్తను ఎఱింగించిన నీకు కానుకగా సమర్పించుటకు ఏమియు లేదని మాటరాక ఊరకుంటిని. నీవు చెప్పిన ప్రియ వచనములను ప్రియమైన వస్తువు ఏదియు కానరావడం లేదు. (అదియే శ్రీరాముడు హనుమను గాడాలింగనము చేసుకొనెను. కాని సీతమ్మకు అది కుదరదు కదా!) అప్పుడు హనుమ; అమ్మా! నీవు చెప్పిన ఈ మాట పరమ

ప్రీతిని కలిగించినది. హనుమ వాక్యములను విని సీత పరమ ప్రీతితో; ఆనాడు పంపాతీరమున రాముని ప్రశంసలు అందుకొన్నావు. హనుమను సీతమ్మ ఈ విధముగా ప్రశంసించుచున్నది. "నీమాట లోకాతీతమగు లక్షణములతో సంపన్నమైనది. వాక్యము నందలి పదముల ఆకాంక్ష, యోగ్యత, సన్నిధి మొదలగునవి అన్నియు ఉన్నవి. శబ్ద సాధుత్వము భంగపడుట లేదు. వినుటకు ఎంతో మధురముగా యున్నది. నీ బుద్ధి అష్టాంగ సంపన్నమైనది. బుద్ధికి ఎనిమిది అంగములు యుండవలెను. అవి గ్రాహములు, ధారణము, స్మరణము, ప్రతిపాధనము, ఊహ, అపోహ, అర్ధవిజ్ఞానము, తత్వజ్ఞానము. ఇవియన్నియు నీకు యున్నవి." సీతమ్మ ఇట్లు ప్రశంసింపగా చేతులు జోడించి అమ్మా! ఈ రాక్షస స్త్రీలు పూర్వము నేను వచ్చినప్పుడు నిన్ను బెదిరించి దూషించుట చూచాను. ఇప్పుడు నీ ఆజ్ఞ అయినచో నేను వారిని అందరిని సంహరించవలెనని అనుకొంటున్నాను. హనుమ ఇట్లు పలుకగానే వైదేహి ధర్మబద్ధముగా ఇట్లు పలికెను.

**రాజ సంశ్రయ వశ్యానాం కుర్వతీనాం పరాఽఽజ్ఞయా**
**విధేయానాం చ దాసీనాం కః కుప్యే ద్వానరోత్తమ**
**భాగ్య వైషమ్య యోగేన పురా దుశ్చరితేన చ**
**మ యైతత్ ప్రాప్యతే సర్వం స్వ కృతం హ్యుపభుజ్యతే**
**ప్రాప్తవ్యం తు దశా యోగాన్ మయై తదితి నిశ్చితమ్**
**దాసీనాం రావణస్యాఽహం మర్షయా మిహ దుర్బలా**
**ఆజ్ఞప్తా రావణే నైతా రాక్షస్యో మామ్ అతర్జయన్**
**హతే తస్మిన్ న కుర్యుర్ హి తర్జనం వానరోత్తమ**

ఈ రాక్షస స్త్రీలు రాజసేవాపరాయణులు. తమ ప్రభువు చేయమనిన పనిని చేయువారలు. పరతంత్రులు. రావణుని దాసీలు. దాసీలపై కోపము తెచ్చుకొనువాడు ఎవరైనా ఉందురా? దాసీలను శాసించిన ప్రభువుపై కోపగించి

వలెనే గాని దాసీలపై కాదు. నా దురదృష్టము వలన, పూర్వము ఒనర్చిన దుష్కృతముల వలన ఈ కష్టములు దాపురించినవి. కనుక వారిని క్షమింపుము.

**న పరః పాపమ్ ఆదత్తే పరేషాం పాప కర్మణామ్**

**సమయో రక్షితవ్య స్తు సన్త శ్చారిత్ర భూషణాః**

**పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ**

**కార్యం కరుణమ్ ఆర్యేణ న కశ్చిన్ నాఽపరాధ్యతి**

**లోక హింసా విహారాణాం రక్షసాం కామ రూపిణమ్**

**కుర్వతామ్ అపి పాపాని నైవ కార్యమ్ అశోభనమ్**

శ్రేష్ఠుడగువాడు ఇతరులకు చెడ్డచేయు పాపుల యొక్క పాపకర్మను స్వీకరించడు. మరియు త్రిగి వారి యడల పాపపూర్ణమగు ప్రవర్తనమును గావించదలచడు. ఏలయన సాధుపురుషుడు తన ఉత్తమ చరిత్రతోనే విభూషితుడు అగుచున్నాడు. సదాచారమే అతని భూషణమైనది. శ్రేష్ఠుడైనవాడు పాపియైనను, పుణ్యాత్ముడైనను వధింపయోగ్యమైన అపరాధమొనర్చిన వాడైనను, వారందరి యడల దయగలిగి యుండవలెను. ఏలయనిన అపరాధమెపుడు చేయనట్టి ప్రాణి సామాన్యముగా ఎవడును ఉండడు. జనులను హింసించువారు, సదా పాపమునే ఆచరించు వారునగు క్రూర స్వభావము గల పాపులకు కూడా అమంగళమును చేయరాదు.

సీత ఇట్లు వచింప వాక్యకోవిదుడగు హనుమ సతియు, సాధ్వియు, శ్రీరామపత్నియు అగు సీతతో ఇట్లు పలికెను. "తల్లీ! మీరు శ్రీరాముని ధర్మపత్ని. కావున అట్టి సద్గుణములతో గూడి యుండుట సముచితమే. ఇక ఇప్పుడు మీ యొక్క సందేశమును చెప్పుడు". అప్పుడు సీత "హనుమా! నేను భక్తవత్సలుడైన శ్రీరాముని దర్శింప గోరుచున్నాను" అని చెప్పెను. అటు పిమ్మట, హనుమ శ్రీరామునకు సీతా సందేశమును వినిపించగా: శ్రీరాముడు విభీషణునితో

సీతమ్మను తల స్నానము చేయించి, దివ్యాభరణములతో అలంకరించి తీసుకొని రమ్మని చెప్పెను.

## 6.55 సీత అగ్ని ప్రవేశము

రామాజ్ఞతో, విభీషణుడు వేగముగా అంతఃపురమునకు వెళ్లి తమ స్త్రీలతో అశోకవనమునకు యేగి సీతకు స్నానాది కార్యములు చేయించి దివ్యాభరణములతో అలంకరించి, పల్లకి యందు సీతమ్మను గూర్చుండ జేసి వేగముగా శ్రీరామ సన్నిధికి తోడ్కొని రావలసినదిగా ఆజ్ఞాపించగా వారు అట్లే చేసిరి. అప్పుడు రాముడు ధ్యానమందుండెను. అది తెలిసియు విభీషణుడు వారి యొద్దకు వెళ్లి నమస్కరించి సీతాదేవి వచ్చినదియని తెలిపెను. రావణ భవనంలో సీత ఒక సంవత్సరము ఉన్నదని రామునకు హర్షము, దైన్యము, రోషము కలిగెను. బంధము వీడి నందుకు హర్షము, రావణుని చెరలో దుఃఖములో ఉన్నందుకు దైన్యము, ఆమెను తిరస్కరించబోవుతున్నందుకు రోషము వచ్చెను. విభీషణుడు సీత వచ్చుచున్నదని త్రోవలో ఎవరు ఉండరాదని ఆజ్ఞాపించగా, శ్రీరాముడు విభీషణునితో ఇట్లు పలికెను.

**న గృహాణి న వస్త్రాణి న ప్రాకారా స్తిరస్క్రియాః**
**నేదృశా రాజ సత్కారా వృత్తమ్ ఆవరణం స్త్రియాః**

విభీషణా! ఇల్లు, వస్త్రములు, ప్రాకారములు మున్నగునవి గాని, జనులకు దూరముగా పంపివేయుటకు గాని, ఇట్టి రాజ సత్కారములు స్త్రీకి ఆచ్ఛాదనమును కలుగ జేయవు. ఆమె సదాచారమే ఆమెకు ఆచ్ఛాదము. కావున సీత పల్లకి విడిచి నా యొద్దకు వచ్చుగాక. తదుపరి సీత వినయపూర్వకముగా తన సమీపమున నిలబడి యుండుట జూచి, ఆమెతో శ్రీరాముడు తన అభిప్రాయమును ఈ విధముగా చెప్పెను. "నీవు ఆశ్రమమున ఒంటరిగా యున్నప్పుడు రాక్షసుడు నిన్ను తీసుకొని పోయెను. ఆ దోషము నాకు దైవ వశమున సంప్రాప్తించినది. దానిని నేను మానవ సాధ్యమగు ప్రయత్నముచే

తొలగించుకొంటిని. శత్రు హస్తమున పడిన నిన్ను చూచి ఓర్వలేక ఆనాడు తపఃశ్శాలి అయి ఆత్మదర్శనము చేసిన అగస్త్యుడు దక్షిణ దిక్కును పొందినట్లు నిన్ను పొందితిని.

**సంప్రాప్తమ్ అవమానం య స్తేజసా న ప్రమార్జతి**

**క స్తస్య పురుషాఽర్థోఽస్తి పురుష స్యాఽల్ప తేజసః**

ఎవడు సంప్రాప్తించిన అవమానమును తన తేజస్సు చేతను, బలము చేతను తొలగించుకోలేడో, మందబుద్ధియగు అట్టి వానికి గొప్ప పురుషార్థముల వలన ఏమి లాభము? శ్రీరామునికి హృదయములో సీతమ్మ మీద ఎటువంటి సందేహము లేకున్నను, లోకము దృష్టిలో ఎటువంటి అనుమానమునకు తావీయరాదు అని ఆలోచన చేసెను. లోకోపవాదము అనునది ఆయన దృష్టిలో కంటి జబ్బు వలె ఏర్పడినది. కంటికి దీపమును చూడగలిగిన శక్తి యున్నను, జబ్బు గల కన్ను దీపమును ఎలా చూడలేదో అట్లే రాజు కాబోవు రాముని దృష్టికి ప్రజాపవాదమను జబ్బు ఏర్పడినది. ఇంకను రాముడు సీతతో ఇప్పుడు నీ చరిత్ర యందు సందేహమునకు అవసరమేర్పడినది. ఆ వాక్యములను విని సీత కన్నీటిచే తడిచిన ముఖమును వస్త్రముచే తుడుచుకొనుచు మెల్లమెల్లగా గద్గద స్వరములో పతిదేవునితో ఇట్లు పలికెను.

**న తథాఽస్మి మహా బాహో యథా త్వమ్ అవగచ్ఛసి**

**ప్రత్యయం గచ్ఛ మే యేన చారిత్రే ణైవ తే శపే**

మహాబాహు! ఇపుడు మీరు నన్నెట్లు ఊహ చేయుచున్నారో అట్టి దానను నేను కాదు. నన్ను విశ్వసింపుడు. నేను నా సదాచారముపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. నేను సందేహింప దానిని కాదు. ఇట్లు చెప్పుచుండ సీత యొక్క కంఠము నిరుద్ధ మయ్యెను. ఆమె ఏడ్చుచు, కన్నీరు కార్చుచు, దుఃఖపూరితయై, చింతానిమగ్నయై అచట యున్న లక్ష్మణునితో గద్గద స్వరములో ఇట్లు

పలికెను. "సుమిత్రా నందనా! నా కొరకు చితిని తయారు చేయుము. నా ఈ దుఃఖమునకు ఇదియే మందు. మిధ్యా కళంకితయై నేను జీవించ దలచి లేదు. లక్ష్మణుడు, రాముని మనసును గ్రహించి చితిని సిద్ధము చేసెను. తదుపరి సీత రామునికి ప్రదక్షిణము చేసి ప్రజ్వరిల్లుచున్న అగ్నిహోత్రము వద్దకు చేరెను.

**ప్రణమ్య దేవతాభ్య శ్చ బ్రాహ్మణేభ్య శ్చ మైథిలీ**
**బద్ధాఽంజలిపుటా చేదమ్ ఉవాచాఽగ్నిసమీపతః**
**యథా మే హృదయం నిత్యం నాఽపసర్పతి రాఘవాత్**
**తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః**
**కర్మణా మనసా వాచా యథా నాతి చరామ్యఽహం**
**రాఘవం సర్వ ధర్మజ్ఞం యథా మాం పాతు పావక:**
**ఆదిత్యో భగవాన్ వాయు: దిశ శ్చంద్ర స్తథైవ చ**
**అహ శ్చాఽపి తథా సంధ్యే రాత్రి శ్చ పృథివీ తథా**
**యథాఽన్యేఽపి విజానంతి తథా చారిత్ర సంయుతామ్**
**ఏవ ముక్త్వా తు వైదేహీ పరిక్రమ్య హుతాశనమ్**

సీత, దేవతలకు, బ్రాహ్మణులకు నమస్కరించి చేతులు జోడించుకొని అగ్నిదేవుని సమీపాన ఈ విధముగా చెప్పెను. "నా హృదయము ఒక్క క్షణమైనను శ్రీరాముని నుండి దూరముగా లేనిచో, సమస్త జగత్తుకు సాక్షియగు అగ్నిదేవుడు నన్ను రక్షించుగాక! కర్మచేతను, వాక్కు చేతను, మనస్సు చేతను, సర్వ ధర్మజ్ఞుడగు శ్రీరామునికి నేను అతిక్రమించనిచో అగ్నిదేవుడు నన్ను రక్షింసిబు గాక! భగవంతుడగు సూర్యుడు, వాయువు, దిక్కులు, చంద్రుడు, పగలు, రాత్రి, సంధ్యలు, భూదేవి, ఇతర దేవతలు నన్ను శుద్ధ చరిత్రలో గూడిన దానినిగా ఎరింగినచో అగ్నిదేవుడు నన్ను రక్షించు గాక!

ఈ ప్రకారముగా చెప్పి సీత అగ్నిదేవునకు ప్రదక్షిణము సల్పి నిశ్శంకతో గూడిన హృదయములో ఆ ప్రజ్వలితాగ్ని యందు ప్రవేశించెను. ఆ సమయమున

విశ్రవసుని పుత్రుడగు కుబేరుడు, పితరులతో కూడి యమధర్మరాజు, దేవతల ప్రభువగు ఇంద్రుడు, జలాధిపతియగు వరుణుడు, త్రినేత్రధారియైన పరమశివుడు, బ్రహ్మదేవుడు మొదలగువారు వారివారి వాహనములతో లంకానగరమునకు వచ్చిరి. రాముడు ఏమియు ఎరుగని వానివలె చేతులు జోడించి నిలిచి యుండెను. వారు శ్రీరామునితో - "రామా! నీవు సర్వలోక సృష్టికర్తవు. సర్వజ్ఞుడవు. సీత అగ్నిహోత్రములో పడుట చూచి ఉపేక్షించుట తగునా! మీరు సమస్త దేవతల యందు శ్రేష్ఠుడవగు 'విష్ణువు'. ఈ విషయమును మీరు ఎలా తెలుసుకొనుట లేదు?"

### 6.56 బ్రహ్మకృత రామ స్తోత్రము

లోకపాలురు ఈ విధముగా చెప్పగా లోకనాధుడగు శ్రీరాముడు ఇట్లు చెప్పెను.

**ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాఽఽత్మజమ్**

**యోఽహం యస్య యత శ్చాఽహం భగవాం స్త ద్బ్రవీతు మే**

నేను దశరథుని కుమారుడగు రాముడనని, మనుష్యుడనని తలంచుచున్నాను. పూజ్యుడగు బ్రహ్మ నేను ఎవడినో, నేను ఎవరికీ చెందిన వాడినో నేను ఎవరి వలన వచ్చిన వాడినో వివరింపగోరుచున్నాను. అని పల్కెను.

**బ్రహ్మకృత రామ స్తోత్రము**

శ్రీరాముడిట్లు అడుగగా బ్రహ్మదేవుడు ఈ విధముగా చెప్పెను.

**భవాన్ నారాయణో దేవః శ్రీమాం శ్చక్రాఽఽయుధో విభుః**

**ఏక శృంగో వరాహ స్త్వం భూత భవ్య సపత్నజిత్**

**అక్షరం బ్రహ్మ సత్యం చ మధ్యే చాఽన్తే చ రాఘవ**

**లోకానాం త్వం పరో ధర్మో విష్వక్సేన శ్చతు ర్భుజః**

**శార్ఙ్గధన్వా హృషీకేశః పురుషః పురుషోత్తమః**

**అజితః ఖడ్గ ధృద్విష్ణుః కృష్ణ శ్చైవ బృహ ద్బలః**

సేనాని ర్గ్రామణీ శ్చ త్వం బుద్ధిః సత్త్వం క్షమా దమః
ప్రభవ శ్చాఽప్యయ శ్చ త్వమ్ ఉపేన్ద్రో మధుసూదనః
ఇన్ద్రకర్మా మహేన్ద్ర స్త్వం పద్మనాభో రణాఽన్తకృత్
శరణ్యం శరణం చ త్వామ్ ఆహు ర్దివ్యా మహర్షయః
సహస్ర శృంగో  వేదాత్మా శత జిహ్వో మహర్షభః
త్వం త్రయాణాం హి లోకానా మాఽఽది కర్తా స్వయం ప్రభుః
సిద్ధానా మఽపి సాధ్యానామ్ ఆశ్రయ శ్చాఽసి పూర్వజః
త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వమ్ ఓంకారః పరంతప
ప్రభవం నిధనం వా తే న విదుః కో భవాన్ ఇతి
దృశ్యసే సర్వ భూతేషు బ్రాహ్మణేషు చ గోషు చ
దిక్షు సర్వాసు గగనే పర్వతేషు వనేషు చ
సహస్ర చరణః శ్రీమాన్ శత శీర్షః సహస్రదృక్
త్వం ధారయసి భూతాని వసుధాం చ సపర్వతామ్
అన్తే పృథివ్యాః సలిలే దృశ్యసే త్వం మహోరగః
త్రీన్ లోకాన్ ధారయన్ రామ దేవ గన్ధర్వ దానవాన్
అహం తే హృదయం రామ జిహ్వా దేవీ సరస్వతీ
దేవా గాత్రేషు రోమాణి నిర్మితా బ్రహ్మణః ప్రభో
నిమేష స్తే భవే ద్రాత్రిః ఉన్మేష స్తేఽభవ ద్దివా
సంస్కారా స్తే భవే న్వేదా న త దఽస్తి త్వయా వినా
జగత్ సర్వం శరీరం తే స్థైర్యమ్ తే వసుధా తలమ్
అగ్నిః కోపః ప్రసాద స్తే సోమః శ్రీవత్స లక్షణ
త్వయా లోకా స్త్రయః క్రాన్తాః పురాణే విక్రమై స్త్రిభిః
మహేన్ద్ర శ్చ కృతో రాజా బలిం బద్ధ్వా మహాఽసురమ్
సీతా లక్ష్మీ ర్భవాన్ విష్ణుః దేవః కృష్ణః ప్రజాపతిః

**వధాఽర్థం రావణ స్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్**
**త దిదం నః కృతం కార్యం త్వయా ధర్మ భృతాం వర**
**నిహతో రావణో రామ ప్రహృష్టో దివ మాఽఽక్రమ**
**అమోఘం బల వీర్యం తే అమోఘ స్తే పరాక్రమః**
**అమోఘం దర్శనం రామ న చ మోఘః స్తవ స్తవః**
**అమోఘా స్తే భవిష్యన్తి భక్తిమన్త శ్చ యే నరాః**
**యే త్వాం దేవం ధ్రువం భక్తాః పురాణం పురుషోత్తమమ్**
**ప్రాప్నువంతి సదా కామాన్ ఇహ లోకే పరత్ర చ**
**ఇమా మాఽఽర్ష స్తవం నిత్య మితిహాసం పురాతనం**
**యే నరాః కీర్తయిష్యన్తి నాస్తి తేషాం పరాభవః**

మీరు చక్రమును ధరించు సర్వ సమర్థులగు నారాయణుడివి. ఒక కోర కలిగి భూమిని భరించు వరాహరూపులు. దేవతల యొక్క భూత, భవిష్యత్ శత్రువులను జయించువారు. రఘునందనా! మీరు నాశరహితమగు పరబ్రహ్మ. సృష్టియొక్క ఆదిమధ్యాంతముల యందు మీరు సత్య రూపమున విరాజిల్లుతున్నారు. మీరీ లోకముల యొక్క పరమ ధర్మము. మేరే విష్వక్సేనులు మరియు నాలుగు భుజములు గల శ్రీహరి. మీరు శార్ఙ్గధన్వులు, హృషీకేశులు, అంతర్యామియగు పురుషులు, పురుషోత్తములు. మీరెవరిచేతను ఓడింపబడరు. మీరు నందకమను ఖడ్గమును ధరించు విష్ణువు మరియు మహాబలశాలియగు కృష్ణుడు అయి యున్నారు. మీరే దేవతల సేనాపతియు అయి యున్నారు. బుద్ధి, సత్వము, క్షమ, ఇంద్రియ నిగ్రహము, సృష్టి, ప్రళయము - వీనికి కారణ భూతులు మీరే. మీరే ఉపేంద్రులు, మధుసూధనులు. ఇంద్రుని కూడా ఉత్పన్నమొనర్చు మహేంద్రులు. యుద్ధమును సమాప్తము చేయు శాంత స్వరూపులగు పద్మనాభులు మీరే. దివ్య మహర్షులు మిమ్మలను

శరణదాతగాను, శరణాగతవత్సలునిగా చెప్పుచున్నారు. వేలకొలది శాఖలనే కొమ్మలు, వందల కొలది విధి వాక్యములను మస్తకములతో కూడిన వేదమను మహావృషభము మీరే. మూడు లోకములకు ఆదికర్త. స్వయంప్రభువు మీరే. మీరు సిద్ధులకు, సాధ్యులు ఆశ్రయులు మరియు పూర్వజులు. యజ్ఞము, వషట్కారము, ఓకారమున్ను మీరే. మీరు శ్రేష్ఠులలో శ్రేష్ఠులగు పరమాత్మ. మీ యొక్క ఆవిర్భావ తిరోభావములను ఎవడును తెలుసుకొనలేరు. మీరెవరో అదియు ఎవనికిని తెలియదు. సమస్త ప్రాణులయందును, గోవులందును, బ్రాహ్మణులు యందును మీరే కానిపించుచున్నారు. సమస్త దిక్కుల యందు, ఆకాశము నందు, పర్వతముల యందు, నదుల యందు, మీ యొక్క సత్తమే కలదు. మీకు వేలకొలది పాదములు, వందల కొలది శిరస్సులు, వేలకొలది నేత్రములు కలవు. మీరే సమస్త ప్రాణులను, భూమిని, సమస్త పర్వతములను ధరించుచున్నారు. భూమి అంతమైనపుడు మీరే జలము పైన గొప్ప సర్పమగు శేషనాగుని రూపమున కన్పించుచున్నారు. శ్రీరామా! మీరే మూడు లోకములను, దేవతలను, గంధర్వులను, దానవులను ధరించు విరాట్పురుషుడగు నారాయణుడవు. అందరి హృదయమున రమించు ఓ పరమాత్మా! బ్రహ్మనగు నేను మీ యొక్క హృదయము. సరస్వతి దేవి మీ యొక్క జిహ్వ. ప్రభూ! బ్రహ్మనగు నేను సృష్టించిన దేవతలందరును మీ యొక్క విరాట్ శరీరమున రోమములు వంటి వారు. మీ యొక్క నేత్రములను తెరచుట పగలు. మూయుట రాత్రి అయి యున్నవి. వేదములు మీ యొక్క సంస్కారములు.మీరు లేనిచో ఈ జగత్తు యొక్క అస్థిత్వము లేదు. విశ్వమంతయు మీ యొక్క దేహము. భూమి మీ యొక్క స్థైర్యము. అగ్ని మీ యొక్క కోపము. చంద్రుడు మీ యొక్క ప్రసన్నత్వము. వక్షస్థలమున శ్రీవత్సమను చిహ్నమును ధరించు భగవంతుడగు విష్ణువు మీరే. పూర్వము మీరే (వామనావతారమున) మీ మూడు పాదములచే మూడు లోకములను కొలిచితిరి. మీరు మహాభయంకరుడైన దైత్యరాజగు బలిని

బంధించి ఇంద్రుని ముల్లోకములు రాజుగా చేసితిరి. సీత సాక్షాత్ లక్ష్మి. మీరు సాక్షాత్ విష్ణుభగవానులు. మీరే సచ్చిదానంద స్వరూపుడగు శ్రీకృష్ణ భగవానుడు, మరియు ప్రజాపతి. ధర్మాత్ములలో శ్రేష్ఠుడగు రఘువీరా! మీరు రావణుని వధించుట కొరకే ఈ లోకమున మనుష్య శరీరమున ప్రవేశించితిరి. మా యొక్క కార్యమును మీరు చక్కగా నెరవేర్చితిరి. శ్రీరామా! మీచే రావణుడు చంపబడెను. ఇక ఇప్పుడు మీరు ప్రసన్న పూర్వకముగా మీ దివ్య ధామమునకు దయచేయుడు. దేవా! మీ బలము అమోఘము. మీ పరాక్రమము వ్యర్థమగునది కాదు. శ్రీరామా! మీ దర్శనము అమోఘమైనది. మీ యొక్క స్తోత్రమును అమోఘమైనది. మీ యందు భక్తి కలిగి యుండు మనుజులున్ను ఈ భూమండలమున అమోఘములై యుందురు. మీరు పురాణ పురుషోత్తములు. దివ్యరూప ధారులగు పరమాత్మ . ఎవరు మీ యందు భక్తి కలిగియు యుందురో, వారు ఈ లోకమున, పరలోకమున సమస్త వాంఛితములను పొందుదురు.

ఇది పరమ ఋషియగు బ్రహ్మదేవుడు చెప్పిన దివ్య స్తోత్రము. పురాతన ఇతిహాసము. ఎవరు దీనిని పాటించుదురో, వారికి ఎప్పుడును పరాభవం రాదు.

### 6.57 అగ్నిదేవుడు సీతాదేవి పాతివ్రత్య వైభవమును వెల్లడించుట

బ్రహ్మదేవుడు వచించిన ఈ శుభవచనములు విని అగ్నిదేవుడు విదేహనందిని యగు సీతను ఒడిలో నిడుకొని చితి నుండి పైకి లేచెను.

**అబ్రవీ చ్చ తదా రామం సాక్షీ లోకస్య పావకః**
**ఏషా తే రామ వైదేహీ పాపమ్ అస్యాం న విద్యతే**
**నైవ వాచా న మనసా నైవ బుధ్యా న చక్షుషా**
**సువృత్తా వృత్తశౌణ్డీరా న త్వామ్ అతిచచార హ**

అపుడు లోకసాక్షియగు అగ్ని శ్రీరామునితో "శ్రీరామా! ఈమె మీ ధర్మపత్నియగు విదేహరాజకుమారి యైన సీత. ఈమె యందు ఏ పాపమును, ఏ దోషమును లేదు.

ఉత్తమ ఆచరణ గల ఈ శుభలక్షణమగు సీత మనస్సు, బుద్ధి, వాక్కు, నేత్రములు వీని ద్వారా మిమ్ము తప్ప మరియొక పురుషుని ఆశ్రయించ లేదు. ఈమె సదా సదాచారపరాయణుడవగు మిమ్ములనే ఆరాధించింది. సత్యమును ఆశ్రయించి యున్నవాడవగుటచే ఈమె అగ్నిహోత్రములో ప్రవేశించుచున్నను, మూడు లోకములను నమ్మించుటకై ఊరుకొంటివి. పిదప మహాతేజస్వియు, ధైర్యవంతుడు, గొప్ప పరాక్రమము కలవాడును, ధర్మాత్ములలో శ్రేష్ఠుడగు శ్రీరాముడు అగ్నిదేవునకు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

**అనఽన్య హృదయాం భక్తాం మ చ్చిత్త పరివర్తినీమ్**

**అహ మఽప్యఽవగచ్ఛామి మైథిలీం జనకాఽఽత్మజామ్**

మిథిలేశనందినియైన, జనక కుమారి యగు సీత యొక్క హృదయము సదా నా యందే లగ్నమై యున్నదని నాకు తెలియును. నానుండి ఎప్పుడును వేరుగా నుండదు. ఆమె ఎల్లప్పుడూ నాయందే మనస్సును నిలుపును. నా ఇచ్ఛానుసారమే ప్రవర్తించును. కాని ముల్లోకములు యందలి ప్రాణుల మనంబున విశ్వాసము కలుగజేయుట కొరకు ఏకమాత్రమగు సత్యమును తీసుకొని అగ్నియందు ప్రవేశించుచున్న విదేహాకుమారి యగు సీతను అడ్డు పెట్టలేదు. ఈ ప్రకారముగా చెప్పి తన పరాక్రమము వలన ప్రశంసితుడగు మహాబలశాలియు, మహాయశస్వియు, విజయవంతుడును, వీర్యుడు అగు శ్రీరాముడు తన ప్రియురాలగు సీతను బడసి పరమ సుఖమున నుండెను. శ్రీరాముడు చెప్పిన ఈ శుభ వచనములు విని, ఇంతకంటే మంగళకరం వాక్యములను మహేశ్వరుడు పలికెను. శ్రీరామా! మీరు ధర్మాత్ములలో శ్రేష్ఠులు, మీరు రావణవధయను కార్యమును ఒనర్చితిరి. ఇది చాలా సౌభాగ్యకరమైన విషయము. ఇంకా నీవు దీనుడగు భరతుని ఓదార్చి, అయోధ్యలో రాజ్యమును స్వీకరించి ప్రజలను ఆనందింప జేయుము. అశ్వమేధ యాగమును జేయుము. మీ తండ్రి దశరథ మహారాజు విమానంలో నిన్ను చూచుచున్నాడు. నీవు అరణ్యమునకు

రాజ్యమును వదలి వచ్చినావని ఖేదముచే వెనుకకు మరలిరాని పరమపదమునకు వెళ్లక ఇంద్రలోకములో రావణ వధ చేసిన నిన్ను చూచుటకై ఇంతకాలము వేచియున్నాడు. ఇట్లు మహేశ్వరుడు చెప్పగానే విమానము నందున్న తండ్రికి లక్ష్మణునితో కలసి నమస్కరించెను. విమానంలో కూర్చున్న దశరథ మహారాజు ప్రియమైన పుత్రుని దగ్గరకు చేర్చుకొని, ఒడిలో కూర్చుండబెట్టుకొని గాఢముగా ఆలింగనము చేసుకొనెను. అప్పుడు శ్రీరాముడు అంజలి ఘటించి దశరథ మహారాజుతో, భరతుని, కైకేయిని నీచే ఆదరింపబడవలెనని కోరగా అందుకు సమ్మతించాడు. తరువాత స్వస్వరూపముతో ప్రకాశించుతూ విమానంలో ఏగెను. దశరథ మహారాజు వెడలిన పిదప ఇంద్రుడు అంజలి ఘటించి శ్రీరామునితో - శ్రీరామా! మేము నీ యడల చాలా ప్రసన్నులమైతిమి. కావున నీ మనస్సు నందు ఏ కోరిక కలదో దానిని నాకు చెప్పుడు. అపుడు శ్రీరాముని మనంబున చాలా సంతోషము కలిగెను. వారు హర్షాన్వితులై ఇట్లు చెప్పిరి.

**మమ హేతోః పరాక్రాన్తా యే గతా యమ సాదనమ్**

**తే సర్వే జీవితం ప్రాప్య సముత్తిష్ఠన్తు వానరాః**

దేవేశ్వరా! నా కొరకు యుద్ధమున పరాక్రమము చూపి మరణించిన ఆ వానరులందరూ మరల జీవించునట్లు చేయుము. ఎందుకనగా వారు నా కొరకై పరాక్రమించి మృతి చెందినవారు. అంతియేగాక వారు సంతోషముగా తమ బంధువులతో కలసి ఆనందించునట్లు, వారికి ఏ శారీరక పీడలు, వ్రణములు లేక బలపౌరుషములతో ఉండునట్లు అనుగ్రహింపుము. అట్లే వారు ఎక్కడికి ఏగినను, కాలము కాకపోయినను, వారికి తృప్తినిచ్చు వృక్ష మూలములు, ఫలములు సమృద్ధిగా ఉండునట్లు అనుగ్రహింపుము. రాముడిట్లు చెప్పగానే ఇంద్రుడు పరమ ప్రీతితో ఆయా వరములను అనుగ్రహించెను. అప్పుడు వానరులందరూ

గాయములు మానినవారై నిద్ర నుండి లేచినట్లు లేచిరి. అప్పుడు శ్రీరాముడు విభీషణునితో ఈ వానరులు యుద్ధము నందు అనేక విధములుగా విజయమునకై కష్టపడ్డారు గావున వారికి అమూల్యమైన రత్నములు, ధనము మొదలగు వానితో సత్కరింపుము అని చెప్పగా విభీషణుడు అట్లే చేసెను. మరునాడు విభీషణుడు రామునకు జయము పలికి స్నానము చేసి, తగిన ఆభరణములను, చందనమును పూసుకోను వలసినదిగా కోరగా అందుకు శ్రీరాముడు సున్నితముగా తిరస్కరించి, భరతుడు నాకొరకై వేచిచూస్తున్నాడు కావున వెంటనే ప్రయాణమునకు తగు ఏర్పాటు చేయమని అడిగెను. అప్పుడు విభీషణుడు పుష్పకమును సిద్ధముచేసినాడు.

**6.58 శ్రీరాముడు సీతకు ఉత్తర తీరము వరకు గల ప్రదేశములు వివరించుట**

ఆ వానరులందరికి విభీషణుడు రత్నధనాదులుచే సత్కరించటం చూచి సంతోషముతో శ్రీరాముడు సిగ్గుతో నున్న సీతను వెంటబెట్టుకొని, పరాక్రమవంతుడు, ధనుర్ధరుడు, సోదరుడుయగు లక్ష్మణునితో గూడి అచ్చట నున్న పుష్పక విమానమును అధిరోహించెను. విమానమున కూర్చుండి వానరులందరిని ఆదరించుచు శ్రీరాముడు విభీషణ సహితముగా యున్న సుగ్రీవునితో ఇట్లు పలికెను.

**య త్తు కార్యం వయస్యేన స్నిగ్ధేన చ హితేన చ**

**కృతం సుగ్రీవ తత్ సర్వం భవతా ధర్మ భీరుణా**

సుగ్రీవా! హితైషియు, ప్రేమియునగు ఒక మిత్రునకు చేయదగిన కార్యమంతయు మీరు పరిపూర్ణముగా చేసి చూపించితిరి. ఏలయన మీరు అధర్మమునకు భయపడువారు. వానరరాజా! ఇక మీరు మీ సేనతో గూడ శీఘ్రముగా కిష్కింధ నగరమునకు పోవుడు. విభీషణా! మీరును లంకకు పోయి నాచే నొసంగబడిన రాజ్యమున స్థిరముగా నుండుడు. ఇపుడు ఇంద్రాది దేవతలు కూడా మీకు అపకారము చేయజాలరు. శ్రీరాముడిట్లు పలుకగా వానర సేనాపతులు, రాక్షస

రాజగు విభీషణుడు చేతులు జోడించి; రాజశ్రేష్టా! మేమందరము అయోధ్యకు వచ్చి రాజ్యాభిషేకం సమయమున మంత్రపూరితమగు జలములచే తడిసిన మీ యొక్క స్వరూపమును దర్శించి, మాతృదేవియైన కౌసల్య చరణములపై శిరస్సు వంచి తదుపరి శీఘ్రముగా మా ఇండ్లకు తిరిగి వెళ్ళెదము. విభీషణ సహితముగా వానరులందరూ ఈ విధముగా విన్నవించగా అపుడు శ్రీరాముడు వారితో; మిత్రులారా! ఇది నాకు మహాప్రియమైన విషయము. మిత్రులగు మీ అందరితో గూడి నేను అయోధ్యాపురమునకు పోగల్గుచో, అది నాకు పరమ ప్రియమైన వస్తువు లభించినట్లే భావించగలను. నాకు చాల సంతోషము గల్గును. తదుపరి వారందరు విమానము ఎక్కగా, కుబేరుని ఆ పుష్పక విమానము శ్రీరాముని ఆజ్ఞను పొంది ఆకాశమున ఎగిరెను. అందరూ ఆ విమానంలో ఇరుకు లేకుండా హాయిగా కూర్చొండిరి. విమానంపై నుండి శ్రీరాముడు సీతమ్మకు ఆయా ప్రదేశములు వివరములు చెప్ప దొడగెను. సీతా! త్రికూట పర్వతముపై కైలాస శిఖరము వలె నున్న లంకను చూడుము. ఇది విశ్వకర్మ నిర్మించియున్నాడు. యుద్ధ భూమిని చూడుము. ఎంతమంది రాక్షస వీరులు చనిపోయినారో చూడుము. ఇక్కడే రావణకుంభకర్ణులు నీ కొరకై చంపబడినారు. రావణ పుత్రులైన ఇంద్రజిత్తు, అతికాయుడు, ప్రహస్తులను లక్ష్మణుడు సంహరించాడు. దేవాంతకుడును హనుమ సంహరించాడు. నరాంతకుడిని అంగదుడు, త్రిశిరుడ్ని నీలుడు సంహరించారు. సముద్రమును దాటి ఆ రాత్రి మేము విడిది చేసిన ప్రదేశము ఇదియే. సముద్రములో నీ కొరకై నలుని వలన సేతువు నిర్మింపబడినది చూడుము. అదిగో ఆ కన్పించుచున్నది హిరణ్యానాభము అను పేరుగల మైనాక పర్వతము. ఇది బంగారు కాంతులీనుచున్నది. హనుమ నిన్ను అన్వేషించుటకై సముద్రమును లంఘించునప్పుడు ఆ మారుతికి విశ్రాంతి నొసగుటకై సముద్రమును చీల్చుకొని బయిటకు వచ్చినది. ఇది సముద్ర మధ్య భాగమున

సేతువు మీద సేన విడిది చేసిన భాగము. సేతుబంధమని వ్యవహరింపబడు పవిత్రమగు తీర్థము. మూడు లోకములలో ఇది పూజింపబడుచుండును. సముద్రముపై సేతువు నిర్మించుటకు సముద్రుని అనుమతిని పొంది సేతు నిర్మాణము చేసితిమి. ఈ దర్భశయన స్థానము పరమ పవిత్రము. మహా పాతక నాశనము.

**అత్ర పూర్వం మహా దేవః ప్రసాద మఽకరోత్ ప్రభుః**
**అత్ర రాక్షస రాజోఽయమ్ ఆజగామ విభీషణః**

పూర్వము ఈ పవిత్ర ప్రదేశము నందే పరమ శివుడు నన్ను అనుగ్రహించెను. రాక్షస రాజైన విభీషణుడు నన్ను శరణు జొచ్చినదియు ఈ ప్రదేశమే! కూర్మ పురాణములో శ్రీరాముడు ఇచ్చట సేతు నిర్మాణమునకు పూర్వమే లింగ ప్రతిష్ట చేసినట్లు కనబడుచున్నది. **(సేతుమధ్యే మహాదేవం ఈశానమ్ కృత్తివాసనమ్, స్థాపయామాస వై లింగం పూజయామాస రాఘవః)**. అంతట పరమేశ్వరుడు పార్వతీసహితుడై ప్రత్యేక్షమయి ఈ లింగ దర్శనము సర్వ పాప క్షయకరము. ఈ భూమండలం, ఈ సేతువు స్థిరముగా యున్నంతవరకు అదృశ్య రూపమున ఉండి ఇచ్చట స్నానము, జపము, దానము, శ్రాద్ధము మొదలగు విధులను ఆచరించిన వారు అక్షయ పుణ్య పాహలములు పొందుదురని పరమశివుడు వరము ఇచ్చెను. అదియే పద్మ పురాణము నందు అయోధ్యకు తిరిగి వెళ్లునప్పుడు శివ లింగ ప్రతిష్ట చేసినట్లు తెలియు చున్నది. ఈ క్షేత్రమే "రామేశ్వరము" అను పేరుతో నేటికిని కీర్తింపబడుచున్నది. ఇతిహాస పురాణములలో, పురాణముల కంటే ఇతిహాసము వేదము వలె ప్రమాణము. వాల్మీకి నుండి వెలువడిన ఈ రామాయణము ఇతిహాసము. పురాణములకు, ఇతిహాసములు విరోధము ఏర్పడినప్పుడు ఇతిహాసమును ప్రమాణముగా తీసికొనవలెను. ఇచ్చట "మహాదేవ" శబ్దము ”సముద్రుడు” అని కొందరు వ్యాఖ్యాతలు తెలుపు చున్నారు. ఇంతకు మునుపు శ్రీరాముడు నిర్మించిన

సేతువు ఈనాటి రామేశ్వరము వద్ద కాదని, కన్యాకుమారి అగ్రమున ఉండవచ్చునని విశ్లేషణాత్మకంగా తెలియజేయడమైనది. శ్రీరాముడు నిర్మించిన సేతువు పది యోజనముల వెడల్పు, నూరు యోజనముల పొడవు కలదు. అనగా 49.2 మైళ్ళ వెడల్పు, 492 మైళ్ళ పొడవు కలదు. Space images taken by NASA reveal a mysterious ancient bridge in the Palk Strait between India and Sri Lanka. This is also popularly known as "Rama Sethu" or named as Adam's Bridge, approximately at a distance of 30 miles and 1.87 miles width. Archeological studies reveal that the first signs of human inhabitants in Sri Lanka date back to the primitive age, about 1,750,000 years ago and the bridge's age is also almost equivalent since, Ramayana, was supposed to have taken place in treta yuga (more than 1,700,000 years ago). So, there is much debate whether the Rama Sethu at Rameswaram is built by Bhagavan Srirama or not. I am not going into controversy into it. అన్నియు ఎవరి నమ్మకము, అభిప్రాయము వారివి.

## 6.59 శ్రీరాముడు భరద్వాజాశ్రమమునకు చేరిన సంగతి హనుమ ద్వారా భరతునికి తెలియజేయుట

శ్రీరాముడు, సీతమ్మకు ఉత్తర తీరమున చిత్ర విచిత్రములగు కాననములతో నిండిన సుగ్రీవుని కిష్కింధ రాజధానిని చూపెను. సీతమ్మ అప్పుడు శ్రీరామునితో చనువుతో సుగ్రీవుడు మనకెంతయో మేలుచేశాడు కావున వారి భార్యలు, అంతఃపుర స్త్రీలతో అయోధ్యకు వెళ్లవలెనని కోరికను తెలియజేయగా శ్రీరాముడు అందుకు అంగీకరించెను. అప్పుడు విమానమును క్రిందకు దింపగా వారందరు విమానమును అదిరోహించిరి. తరువాత ఋష్యమూక పర్వతము వద్దకు విమానము రాగా సీతకు అక్కడనే తాను సుగ్రీవునితో మైత్రిని చేసుకొని వాలిని సంహరించితినని శ్రీరాముడు చెప్పెను. తరువాత శ్రీరాముడు, ధర్మచారిని యగు శబరిని చూచిన ప్రదేశమును, కబంధుడు సంహరించిన ప్రదేశము, ఖరదూషణాదులను సంహరించిన జనస్థానమును, పంచవటిని,

శరభంగాశ్రమమును, అగస్త్యాశ్రమమును, విరాధుడు నేలకూలిన ప్రదేశమును, చిత్రకూటమిని, భరద్వాజాశ్రమమును, దూరమున నున్న అయోధ్యను సీతమ్మకు చూపెను. ఆనాడు చైత్ర శుద్ధ పంచమి. పదునాలుగు సంవత్సరముల క్రితము వనవాసము ప్రారంభమయ్యెను. షష్ఠి నాడు శృంగిబేరపురము, సప్తమి నాడు వటవృక్ష మూలమున నివాసము, అష్టమి నాడు భరద్వాజాశ్రమమున, నవమి నాడు యమునా నాదీ తీరమున యుండి దశమి నాడు చిత్రకూటమికి బయలుదేరిరి. వనవాసము పదునాలుగవ సంవత్సర ప్రారంభమున రావణుడు, సీతమ్మను పంచవటిలో అపహరించాడు. చైత్ర మాసములో సీతాపహరణము, వైశాఖంలో సుగ్రీవ సమాగమము, ఆషాడములో వాలి వధ, ఆశ్వయుజములో సీతాన్వేషణ, ఫాల్గుణ అమావాశ్య నాడు రావణ వధ, చైత్ర శుద్ధ పాడ్యమి నాడు రావణ సంస్కారము, విదియనాడు విభీషణ పట్టాభిషేకము, తదియనాడు లంక నుండి తిరుగు ప్రయాణము, చవితినాడు కిష్కింధలో ఆగుట, పంచమినాడు భరద్వాజాశ్రమమునకు వచ్చిరి. ఈనాటికి పదునాలుగు సంవత్సరములు నిండినవి. మరునాడు తెల్లవారేసరికి భరతుని చూడవలెను. భరద్వాజాశ్రమమున శ్రీరాముడు మహర్షికి నమస్కరించి అయోధ్యాపుర విషయములు, భరతుని రాజ్యపాలన, తమ తల్లుల క్షేమము అడిగెను. అప్పుడు మహర్షి శ్రీరామునితో అందరూ క్షేమమేనని చెపుతూ భరతుడు మీ ఆగమమునకై వేచియున్నాడు, మీరు ఈరోజు మా ఆతిథ్య సత్కారమును స్వీకరించుడు, మేము మీకు ఒక వరము ఈయగలను అనెను. అప్పుడు శ్రీరాముడు ఇచట నుండి అయోధ్యకు పోవు మార్గమంతయు వృక్షములన్నియు సమయము కానప్పటికీ ఫలములు, మధువు ఉత్పన్నమవవలెనని కోరగా మహర్షి అందుకు అంగీకరించెను. పిమ్మట తేజస్వియగు, శ్రీరాముడు తనలో విచారణ సలుపుకొని హనుమతో శీఘ్రముగా అయోధ్యకు వెళ్లి వారి క్షేమసమాచారములు తెలుసుకొని, శృంగిబేరపురమున గుహుని కలుసుకొని అతని కుశలం తెలుసుకొని, భరతుని కుశలం తెలుసుకొని

నేను సీతాలక్ష్మణ సహితముగా తిరిగి వచ్చిన వార్తను తెలియజేయమని చెప్పెను. రామాజ్ఞను గైకొని గుహునికి శ్రీరాముని క్షేమ వార్త తెలియ జేసి, దీనుడై, కృశించి, ఆశ్రమవాసియై, జటాధారియై యున్న భరతుని చూచెను.

**తం ధర్మమ్ ఇవ ధర్మజ్ఞం దేహవన్తమ్ ఇవాఽపరమ్**

**ఉవాచ ప్రాంజలి ర్వాక్యం హనూమాన్ మారుతాఽఽత్మజః**

దేహమును ధరించి వచ్చిన ధర్మము వలె కనబడే ధర్మజ్ఞుడైన భరతుని యొద్దకు వెళ్లి హనుమ శ్రీరాముడు రావణుని సంహారము చేసి, సీతమ్మను పొంది, మహాబలశాలురగు మిత్రులతో, సీతాలక్ష్మణులతో కూడి ఈ ముహుర్తములోనే మిమ్ములను చూచుటకు వచ్చుచున్నాడు. మీ కుశలం అడిగినాడు అని చెప్పెను. భరతుడు హనుమ చెప్పిన వార్తను విని సంతోషముతో ఇట్లు చెప్పెను.

**కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మే**

**ఏతి జీవన్తమ్ ఆనన్దో నరం వర్ష శతా దఽపి**

"మనుష్యుడు జీవించి యుండినచో ఎపుడో ఒకపుడు నూరేండ్ల అయిన పిదప కూడా ఆనందము సంప్రాప్తించును". అను ఈ శుభ ఆర్యోక్తి యదార్థమని తెలియు చున్నది. (సుందరకాండ 34 వ సర్గ లో హనుమ రామలక్ష్మణుల కుశల వార్త చెప్పినప్పుడు ఈ ఆర్యోక్తి చెపుతుంది) భరతుని కోరికపై హనుమ, వనవాసము మొదలుగా రావణ సంహారము, విభీషణ పట్టాభిషేకము వరకు రామచరితమును సంగ్రహముగా వివరించెను.

## 6.60 శ్రీరామ పట్టాభిషేకమునకై నదీ, సముద్ర జలములను తెప్పించుట

తదుపరి హనుమ మధుర వాక్యముల ద్వారా శ్రీరాముని వృత్తాంతమును విని భరతునికి చాల సంతోషము గలిగినది. అప్పుడు భరతుడు, శత్రుఘ్నునికి ఈ విధముగా ఆజ్ఞ యొసగెను. "జనులు శుచిర్భూతులై నగరమందలి దేవస్థానములను అలంకరించి వాయిద్యములను వాయించుచు సుగంధ

పుష్పములతో దేవతలను పూజించుదురు గాక". రాజాజ్ఞచే, శత్రుఘ్నుడు నందిగ్రామము నుండి అయోధ్య వరకు మార్గము అంతయు చల్లటి నీటితోను, సుగంధ పుష్పములతోను ఏర్పాటు గావించెను. అప్పుడు అయోధ్య ప్రముఖులు, మంత్రులు, తల్లులు, మొదలగు వారు ఉత్సాహముగా నందిగ్రామమునకు చేరిరి. తదుపరి భరతుడు ప్రజాసహితముగా, శిరస్సుపై రామపాదులలు ధరించి, శ్వేత ఛత్రమును దాల్చి రాముని కొరకై ఎదురు చూడగా హర్షపరవశమగు వానరుల ధ్వని, ఆ వెనుకనే పుష్పక విమానము, అందు సత్యపరాక్రముడైన సీతాలక్ష్మణ సహితముగా శ్రీరాముడు కనబడినారు. భరతుడు ఆనందముతో శ్రీరాముని చెంతకు వెళ్లి సాష్టాంగము చేయగా శ్రీరాముడు ఆనందముతో భరతుని కౌగలించుకొని తన ఒడి యందు కూర్చుండ పెట్టుకొనెను. పిమ్మట భరతుడు, వానర రాజగు సుగ్రీవుని కౌగలించుకొని ఇట్లనెను..

**త్వ మఽస్మాకం చతుర్ణాం తు భ్రాతా సుగ్రీవ పంచమ:**
**సౌహృదా జ్ఞాయతే మిత్ర మఽపకారోఽరి లక్షణం**

సుగ్రీవా! స్నేహపూర్వకమగు ఉపకారము చేయుటచే, మీరు మా నలుగురికి ఐదవ సోదరులు అగుచున్నారు. అపకారము చేయుట శత్రువు యొక్క లక్షణము. పిమ్మట భరతుడు విభీషణునితో; "రాక్షస రాజా! మీ యొక్క సహాయమును పొంది శ్రీరాముడు మహాదుష్కరమైన కార్యమును పూర్తి చేసెను. ఇది చాలా సౌభాగ్యదాయకమైన విషయము. అనంతరము ధర్మజ్ఞుడగు భరతుడు స్వయముగానే శ్రీరాముని పాదుకలను తీసుకొని వెళ్లి ఆ మహారాజగు శ్రీరాముని పాదములకు తొడిగి చేతులు జోడించుకొని ఇట్లు చెప్పెను. "ప్రభూ! నాకు అప్పగించిన ఈ సమస్త రాజ్యమును నేడు మీ చరణములందు తిరిగి సమర్పించుచున్నాను." అటుపిమ్మట శ్రీరాముని ఆజ్ఞను పొంది పరమోత్తమగు ఆ పుష్పక విమానము ఉత్తర వైపునకు పోయి కుబేరుని స్థానమును చేరెను. అపుడు భరతుడు, శ్రీరామునితో రాజ్య పరిత్యాగం, వనవాసమునకు కారణము దైవ

ప్రేరణయే గాని, కైకేయి నిమిత్తమాత్రురాలు. (కైకేయి ధీర వనిత. ఆమె వరముల యొక్క అంతరంగమును మరియు మంథర యొక్క యోగ రహస్యమును గూర్చి అయోధ్య కాండము లో వివరించడమైనది). అన్నా! రాజ్యపరిత్యాగము చేసి వనవాసమును అంగీకరించుటచే మా అమ్మ నీచే ఆరాధింపబడినది. ఆమె మనసు సంతసించినది. (శ్రీరాముడు కైకేయి అంతరంగమును అర్థము చేసుకున్నట్లుగా ఎవరును అర్థము చేసుకోలేదు. కైకేయి సంతసించుటలోని భావార్థము గ్రహించవలెను). చిత్రకూటమి నందు ఈ రాజ్యమును నాకు న్యాసముగా అప్పగించారు. మీరు వచ్చువరకు ఈ రాజ్యమును కాపాడినాను. ఇప్పుడు మీకు సమర్పించవలసిన బాధ్యత నాపై యుండినది. లోకమునంతను గుణములచే వశపరచుకొనినవారు. మీ రాజ్యమును మీరే పరిపాలించవలెను. మీ యొక్క రాజ్యాభిషేకము ప్రజలందరూ చూచి తరించుదురు అనెను.

**యావ దాఽఽవర్తతే చక్రం యావతీ చ వసుంధరా**

**తావత్ త్వమ్ ఇహ సర్వస్య స్వామిత్వమ్ అభివర్తయ**

ఎంతవరకు జ్యోతిష్య చక్రము పరిభ్రమించు చుండునో, ఎంతవరకు ఈ భూమండలము ఉండియుండునో, అంతవరకు మీరీ భూమండలమునకు ప్రభువుగా ఉండుదురు గాక!. (అనగా ఇప్పుడు కూడా శ్రీరాముడు అద్రుశ్యముగా యుండి ఈ భరత దేశమును పరిపాలించు చున్నారు అని భావము. ఎవరి అభిప్రాయాలు ఎలా ఉన్నా, ఇప్పుడు కూడా ప్రజాస్వామ్యములో ఈ భరత దేశము ప్రజల మన్ననలు పొందిన వారితో పరిపాలింప బడుట విదితమే కదా! శ్రీరాముడు కూడా ప్రజా పాలకుడు. ప్రజాభిప్రాయం మేరకే సింహాసనాధీష్టుడు అయినాడు) భరతుడు స్వయముగా రామలక్ష్మణులకు వనవాస దీక్ష విరమింప జేసినాడు. వానర స్త్రీ సమూహముతో సహా సీతమ్మ సర్వాలంకారణ భూషితయై అయోధ్యా నగరమునకు బయలుదేరిరి. సహస్రాక్షుడగు ఇంద్రుడు పచ్చని

గుల్మములను అధిరోహించినట్లు శ్రీరాముడు శ్రేష్ఠమైన రథమును నందిగ్రామములో అధిరోహించి బయలుదేరెను. ఆ రథమునకు భరతుడు సారథ్యము వహించెను. శత్రుఘ్నుడు ఛత్రమును ధరించెను. లక్ష్మణుడు వ్యజనము వీచుచుండెను. విభీషణుడు కూడా తెల్లని చామరమును పట్టుకొని ముందు నిలిచెను. ఆకాశమున దేవ, గంధర్వులు స్తోత్రము చేయుచుండిరి. సుగ్రీవుడు శత్రుంజయము అనెడి ఏనుగును అధిరోహించెను. రాముడు అయోధ్యా పురములో ప్రవేశించెను. అయోధ్యాపుర ప్రజలు హర్షముతో పొంగిపోవుచుండిరి. మహాత్ముడగు శ్రీరాముడు తల్లులకు నమస్కరించెను. అనంతరము భరతుని విన్నపముపై సుగ్రీవుని ఆజ్ఞతో జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శి, ఋషభుడు, గవయుడు, సుషేణుడు, నలుడు జలపూర్ణములగు కలశములతో సముద్రజలములను, ఐదు వందల నదులలో జలములను సేకరించి తీసుకొనిరాగా శత్రుఘ్నుడు వానిని రామపట్టాభిషేకము నిమిత్తము పురోహితులకు అప్పగించెను.

### 6.61 శ్రీరామ పట్టాభిషేకము

**తతః స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణైః సహ**
**రామం రత్నమయే పీఠే సహ సీతం న్యవేశయత్**
**వసిష్ఠో వామదేవ శ్చ జాబాలి: అథ కాశ్యపః**
**కాత్యాయనః సుయజ్ఞ శ్చ గౌతమో విజయ స్తథా**
**అభ్యషించన్ నర వ్యాఘ్రం ప్రసన్నేన సుగన్ధినా**
**సలిలేన సహస్రాఽక్షం వసవో వాసవం యథా**

మహర్షులలో శ్రేష్ఠుడు, వంశ పురోహితుడు ఐన వసిష్ఠ మహర్షి ఋత్విజులైన బ్రాహ్మణులతో గూడి సీతాసహితుడైన రామచంద్రుని రత్న సింహాసనముపై ఆసీనుని గావించెను. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు, విజయుడు మొదలగు మహర్షులు పురుషోత్తముడైన శ్రీరామచంద్ర ప్రభువును నిర్మలమైన సుగంధ జలములతో,

సహస్రాక్షుడగు ఇంద్రుని అష్టవసువులు అభిషేకించినట్లు అభిషేకించిరి. ఆకాశము నందు నిలిచిన లోకపాలకులు, దేవతలు సకల ఓషధీ రసములతో అభిషేకించిరి. పూర్వము మనువును రాజుగా ప్రతిష్ఠించునప్పుడు బ్రహ్మ రత్న శోభితమగు కిరీటమును నిర్మింప జేసి ధరింప జేసినాడు. ఆ కిరీటమునే వసిష్ఠ మహర్షి శ్రీరామునికి ధరింప జేసెను.

**ఛత్రం తస్య చ జగ్రాహ శత్రుఘ్నః పాణ్డురం శుభమ్**
**శ్వేతం చ వాల వ్యజనం సుగ్రీవో వానరేశ్వరః**
**అపరం చన్ద్ర సంకాశం రాక్షసేన్ద్రో విభీషణః**

సింహాసనముపై కూర్చున్న శ్రీరామునకు శత్రుఘ్నుడు శ్వేత ఛత్రమును, సుగ్రీవుడు తల్లటి వింజామరను, విభీషణుడు చామరమును పట్టుకొనిరి. ఇంద్రుని ప్రేరణచే వాయుదేవుడు నూరు బంగారు కమలములు గల మాలను, వివిధ రత్నములలో, మణులతో భాసిల్లుతున్న ముత్యాల హారమును రామునికి సమర్పించెను. శ్రీరామ పట్టాభిషేక సమయములో దేవ గంధర్వులు పాడిరి. అప్సరసలు నృత్యము చేసిరి. లోకమంతయు హర్షపారవశ్యములో యుండిరి. శ్రీరాముడు ఆ సమయములో బ్రాహ్మణులకు భూరి విరాళములు ఇచ్చెను. సుగ్రీవునకు దివ్య బంగారు మాలను ఇచ్చెను. అంగదునికి చంద్ర కిరణాలు గల రెండు కేయూరములను ఇచ్చెను. తనకు వాయుదేవుడు ఇచ్చిన ముత్యాల హారమును సీతాదేవి మెడలో వేసెను.

**తామ్ ఇంగితజ్ఞః సంప్రేక్ష్య బభాషే జనకాఽఽత్మజామ్**
**ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాఽసి భామిని**
**పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః**
**దదౌ సా వాయు పుత్రాయ తం హారమ్ అసితేక్షణా**

సీతమ్మ తన మెడలో రాముడిచ్చిన ఆ హారమును తీసి చేతపట్టి వానరుల వైపు, రాముని వేపు పరి పరి చూచుచుండెను. అప్పుడు సీత అభిప్రాయమును చూపులచే గుర్తించిన రాముడు, సీతతో కల్యాణి! నీకు పౌరుషముచే, పరాక్రమముచే, బుద్ధిచే ఎవరు నీకు సంతోషమును కలిగించిరో వారికి ఆ హారమును ఒసగమని చెప్పెను. ఆ శుభాంగి ఆ హారమును హనుమకు ఇచ్చెను. హనుమ ఆ హారములో అధికముగా శోభించెను. ఈ విధముగా వాయుదేవుడు ఇచ్చిన హారము, వాయుసుతుడైన హనుమకు చేరెను. శ్రీరాముడు - విభీషణుడు, సుగ్రీవుడు, హనుమ, జాంబవంతుడు మొదలగు శ్రేష్ఠమైన వారికి మనోవాంఛితములగు వస్తువుల ద్వారా, అనేకమైన రత్నముల ద్వారా సత్కరించెను. వానరులు, సుగ్రీవుడు ఆనందముతో రామునికి నమస్కరించి కిష్కింధకు ఏగిరి. విభీషణుడు మాత్రము లంకారాజ్యము లభించినను తృప్తి నొందక నిలిచి యుండెను. శ్రీరాముడు అతని మనోరథమును ఎరిగి లంకకు అతనిని మరలించవలెననే యోచనలో బ్రహ్మచే ఒసగబడిన శ్రీరంగము అను పేరుగల రంగనాధుడు వేంచేసి యుండెడి విమానమైన తమ కులదైవమును విభీషణునికి ఇచ్చెను. **లబ్ధ్వా కుల ధనం రాజా లంకాం ప్రాయాన్మహా యశా:** ఇక్ష్వాకు ప్రభువుల కులదైవమైన శ్రీరంగనాథ మూర్తిని గ్రహించి తన ఆరాధ్య ధైవమైన శ్రీరాముని తన హృదయము నందు నిలుపుకొని లంకకు విభీషణుడు బయలుదేరెను. (శ్రీరాముడు, విభీషణుని తో సూర్యచంద్రులు, భూమండలం, రామాయణ గాథ ఉన్నంతవరకు దర్మనిరతితో రాజ్యపాలన చేయమని, అప్పటివరకు ఇక్ష్వాకుల కులదైవం ను అరాధించమని చెప్పెను. హనుమ, విభీషణుడు ప్రళయ కాలము వరకు ఉందురని చెప్పెను.**(ఉత్తరాకండము: 108 వ సర్గ).** లంక కు వెళ్తున్న తరుణంలో విభీషణుడు ఆ విగ్రహాన్ని కింద పెట్టి విశ్రాంతి తీసుకుంటాడు. కానీ సూర్యునికి అర్ఘ్యము ఇచ్చే సమయము కావడముతో ఈ విగ్రహాన్ని శ్రీరంగము, కావేరి నది ఒడ్డున పెడతాడు. కాసేపయినాక తిరిగి లేచి ఆ

విగ్రహాన్ని పైకి ఎత్తుతాడు. కానీ ఆ విగ్రహం లేవదు. అప్పుడు ఆ ప్రాంతాన్ని పాలించే రాజు ధర్మచోళుడు అతనిని ఓదారుస్తాడు. అతని అనుమతితో ఆ విగ్రహం ఉన్న చోటే ఆలయాన్ని నిర్మిస్తాడు. విభీషణుడు కోరిక మేరకు స్వామివారు దక్షిణ దిక్కున తిరుగుతాడు (లంక దక్షిణ దిక్కున కలదు). ఈ అర్చామూర్తి ఉభయ కావేరి మధ్య భాగమున ఉండి పోయెను. లంక వైపు చూచుచు రంగనాధుడు ఆలయములో శయనించి యుండును. ఆ విమానము ప్రణవాకారముగా యుండును. విమానము పైన కూడా శ్రీరంగనాథుని మూర్తి లంకను చూచుచు వేంచేసి యుండును. ఈ క్షేత్ర మహత్యము, విభీషణుని చిరంజీవత్వము గురించి పూజ్యశ్రీ చాగంటి కోటేశ్వర రావు గారు రామాయణ ప్రవచనము చెపుతూ ఇలా తెలియ జేశారు. విభీషణుడు ఇప్పటికిని సముద్ర గర్భములోని కాంచన లంకలో చిరంజీవిగా యున్నారని అందుకు ఉదాహరణ చెపుతూ .. శ్రీరంగము యొక్క గుడిలో ఒకాయన రాత్రి నిద్రపోగా, విభీషణుని రామపూజకై రాక్షసులు ఆ గుడిలోని పూలు తీసుకొని వెళుతూ పొరపాటున పూలతో పాటు నిద్రపోతున్న ఆ వ్యక్తిని కూడా తీసుకొని వెళ్లి పూజా మందిరములో పెడతారు. విభీషణుడు రామపాదములను ఆ పూలతో పూజ చేయుచుండగా వాటిలో ఈ వ్యక్తి కూడా వచ్చాడు. అపుడు విభీషణుడు హడలిపోయి, వాని దీనావస్థను చూచి జాలిపడి మరల రాక్షసులు విభీషణుని ఆదేశముతో శ్రీరంగములో దిగబెట్టి వచ్చారు.

వానరులు రాక్షసులు అందరూ వారివారి స్థానములకు ఏగిన తర్వాత శ్రీరాముడు పరమ ఔదార్యముతో, పరమానందముతో రాజ్యమును పరిపాలించాడు. లక్ష్మణుడు యువరాజ్యపదవిని నిరాకరించగా, శ్రీరాముడు భరతుని యువరాజుగా చేసెను. శ్రీరాముడు పౌండరీకము, అశ్వమేథము, వాజపేయము మొదలగు యజ్ఞములను తరచుగా నిర్వహించెను. శ్రీరాముడు రాజ్యపాలన

చేయుచుండగా స్త్రీలకూ వైధవ్యము లేకుండెను. ప్రజలకు క్రూరమృగముల బాధ లేదు. రోగగ్రస్తులు గాకుండిరి. దొంగల భయము లేకుండెను. ఎటువంటి అనర్థములు లేకుండెను. పెద్దలు బ్రతికి యుండగా వారి పిల్లలు మృత్యువాత పడకుండిరి. ప్రజలెల్లరు ధర్మనిరతులై యుండిరి. ప్రజలందరూ దీర్ఘాయువులై, సంతాన సమృద్ధి కలిగి, శోక రహితులై, ఆరోగ్యములో వర్ధిల్లిరి. వృక్షములు పుష్ప, ఫల భరితములై యుండెను. సకాలములో వర్షములు గురియు చుండెను. వాయువు హాయిని గొల్పుచు వీచుచుండెను. అన్ని వర్ణముల వారు దురాశ లేక తమ తమ కర్మలచే ప్రవర్తిల్లుచు, సంతుష్టులై యుండిరి. ఎవరి నోటా విన్నాను రాముని గాధలు, రామనామము మాత్రమే వినబడుచుండెను.

**రామో రామో రామ ఇతి ప్రజానా మఽభవన్ కథా:**

**రామభూతం జగదఽభూ ద్రామే రాజ్యం ప్రశాసతి**

రాముడు పాలించు కాలము నందు ప్రజలందరూ "రాముడు, రాముడిని" రాముని గూర్చియే ముచ్చటించుకొనిరి. అంతారామ మయం, జగమంతా రామమయం

**దశ వర్ష సహస్రాణి దశ వర్ష శతాని చ**

**భ్రాతృభి: సహిత: శ్రీమాన్ రామో రాజ్య మఽకారయత్**

ఈ విధముగా శ్రీరాముడు 11,000 సంవత్సరములు (9,974 సంవత్సరముల 10 నెలలు సీతాదేవితో కూడి, 1,025 సంవత్సరముల 2 నెలలు సీతా వియోగములో) సోదరులతో కూడి రాజ్య పాలన చేసి వైకుంఠమునకు ఏగెను.

Note: శ్రీరాముడు చైత్ర శుద్ధ నవమి, పునర్వసు నక్షత్రం, బుధవారం జన్మించారు. ఉపనయనము చైత్ర శుద్ధ పంచమి నాడు (అనగా ఇంకా నాలుగు రోజులలో ఏడు సంవత్సరాలు నిండుతాయి) జరిగింది. 16 సంవత్సరాలకు యాగ సంరక్షణకు విశ్వామిత్రుని తో వెళ్ళడం, వివాహము అయినది. అయోధ్య కాండలో శ్రీరాముని వనవాసమునకు కౌసల్య దుఃఖిస్తూ, నీవు పుట్టిన ఈ 17 సంవత్సరాలు నీవు రాజవు అయితే సుఖపడుదామని అనుకొన్నా, కాని నాకు ఆ అదృష్టం లేదు

అంటుంది. తరువాత రాముని అరణ్యవాసం. ఇందులో సుమారు 13 సంవత్సరాలు దక్షిణ భారతంలోని దండకారణ్యం లో గడుపుతారు. అప్పుడు మానవుడిగా ఆయన నడయాడుట వలన ఈ సమస్త దక్షిణ భారతము, ఋషి మునులు, ప్రజలు పునీతము అవుతారు. అయోధ్యలో ఆయన మొదటి 17 సంవత్సరములు బాల్యము, విద్యాభ్యాసము తోనే గడచి పోతుంది. రావణ సంహారం తరువాత రాముడు, భగవంతునిగా ప్రకటితమౌతాడు. అయోధ్యలో 11000 సంవత్సరాలు భగవంతునిగా (ప్రకృతి, మాయ అతనికి లోబడి ఉంటుంది) రాజ్యపాలన చేస్తాడు. కావున అటువంటి భగవంతుని పాలనలో ప్రజలు సుఖంగా ఉన్నారనుటలో విశేషము ఏమి లేదు.

మనతో కలసి ఉండి, మనతో పాటు ఉన్నటువంటి రాముడు తిరిగిన ప్రదేశాలు అయిన పంచవటియైన భద్రాచలం, ఒంటిమిట్ట, జటాయువు పడిపోయిన లేపాక్షి, శబరిచే చెప్పబడిన సప్తసాగర తీర్థమైన కపిలతీర్థము/శ్రీవారిపష్కరిణి, హనుమ సమాగమమైన ఋష్యమూకము (హంపి పరిసరాలు) ఇత్యాది అయోధ్య కన్నను గొప్పవి అని లేఖకుని విశ్వాసము. అయోధ్యలో ఎంతకాలము ఉన్నారన్నది కాదు. ఇక్కడ ఎంత ప్రేమతో మనతో (అంటే మన పూర్వీకులు) తో కలసి, మన కష్ట నష్టాలలో, సుఖ దుఃఖాలు లో కలసి మనవాడుగా రాముడు ఉన్నాడన్నదే ముఖ్యము. లోకోపకారము కోసము రాముడు పడిన కష్టము ఈ నేల దుమ్ము, ధూళిలో కనబడుతుంది. పాదరక్షలు కూడా లేవాయె.

### 6.62 ఫలశ్రుతి

**ధన్యం యశస్య మాఽఽయుష్యం రాజ్ఞాం చ విజయావహం**

**ఆది కావ్య మిదం త్వాఽఽర్షం పురా వాల్మీకినా కృతం**

**య: పఠే చ్ఛృణుయా ల్లోకే నర: పాపా ద్విముచ్యతే**

**పుత్ర కామ స్తు పుత్రా న్వై ధన కామో ధనా నఽపి**

**లభతే మనుజో లోకే శ్రుత్వా రామాఽభిషేచనం**
**మహీం విజయతే రాజా రిపూం శ్చాప్యఽధి తిష్ఠతి**
**రాఘవేణ యథా మాతా సుమిత్రా లక్ష్మణే న చ**
**భరతేన చ కైకేయీ జీవ పుత్రా స్తథా స్త్రియ:**
**(భవిష్యంతి సదా నందా: పుత్ర పౌత్ర సమన్వితా:)**
**శ్రుత్వా రామాయణ మిదం దీర్ఘ మాఽఽయు శ్చ విందతి**
**రామస్య విజయం చైవ సర్వమఽక్లిష్ట కర్మణ:**
**శ్రుణోతి య ఇదం కావ్య మాఽఽర్షం వాల్మీకినా కృతం**
**శ్రద్ధదానో జిత క్రోధో దుర్గాణ్యఽతి తరత్యఽసౌ**
**సమాఽఽగమం ప్రవాసాఽన్తే లభతే చాఽపి బాన్ధవై:**
**ప్రార్థితాం శ్చ వరా న్సర్వా న్ప్రాప్నుయా దిహ రాఘవాత్**
**శ్రవణేన సురా: సర్వే ప్రీయంతే సంప్రశ్రుణ్వతాం**
**వినాయక శ్చ శామ్యంతి గృహే తిష్ఠంతి యస్య వై**
**విజయేత మహీం రాజా ప్రవాసీ స్వస్తిమాన్ వ్రజేత్**
**స్త్రియో రజస్వలా: శ్రుత్వా పుత్రా న్సూయు రఽనుత్తమాన్**
**పూజయంశ్చ పఠంశ్చేమ మితిహాసం పురాతనం**
**సర్వ పాపై: ప్రముచ్యేత దీర్ఘ మాఽఽయు: అవాప్నుయాత్**
**ప్రణమ్య శిరసా నిత్యం శ్రోతవ్యం క్షత్రియై ర్ద్విజాత్**
**ఐశ్వర్యం పుత్ర లాభ శ్చ భవిష్యతి న సంశయ:**
**రామాయణ మిదం కృత్స్నం శ్రుణ్వత: పఠత: సదా**
**ప్రీయతే సతతం రామ: స హి విష్ణు: సనాతన:**
**ఆది దేవో మహా బాహు: హరి: నారాయణ: ప్రభు:**
**సాక్షా ద్రామో రఘు శ్రేష్ఠ: శేషో లక్ష్మణ ఉచ్యతే**
**కుటుంబ వృద్ధిం ధన ధాన్య వృద్ధిమ్, స్త్రియ శ్చ ముఖ్యా: సుఖ ముత్తమం చ**

**శృత్వా శుభం కావ్యమిదం మహాఽర్థం, ప్రాప్నోతి సర్వాం భువి చాఽర్థ సిద్ధిం**
**ఆయుష్య మాఽఽరోగ్య కరం యశస్యం, సౌభ్రాతృకం బుద్ధి కరం శుభం చ**
**శ్రోతవ్య మేత న్నియమేన సద్భి:, ఆఖ్యాన మోజస్కర మృద్ధికామై:**
**ఏవ మేతత్ పురా వృత్త మాఖ్యానం భద్రమఽస్తు వ:,**
**ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణో: ప్రవర్ధతాం**
**దేవా శ్చ సర్వే తుష్యంతి గ్రహణా చ్ఛ్రవణా త్తథా**
**రామాయణస్య శ్రవణా త్తుష్యంతి పితర స్తథా**
**భక్త్యా రామస్య యే చేమాం సంహితాం ఋషిణా కృతాం**
**లేఖయం తీహ చ నరా స్తేషాం వాస స్త్రివిష్టపే**

వాల్మీకి మహర్షి రచించిన ఆదికావ్యమైన ఈ రామాయణము శుభప్రదమైనది, ఆయురారోగ్యములను, కీర్తి ప్రతిష్టలను పెంపొందించునది. ఇది రాజులకు విజయమును చేకూర్చునది. దీనిని పఠించువారు, వినువారు సమస్త పాపముల నుండి విముక్తులగుదురు. రామపట్టాభిషేక ఘట్టమును వినువారికి సంతానము కలుగును. సంపదలు వృద్ధి అగును. ఈ రామాయణ గాథ వినువారు దీర్ఘాయువులు అగుదురు. జిత క్రోధులై, దరిద్రాది దుఃఖముల నుండి విముక్తులగుదురు. బంధువులు దూరమైన వారు బంధువులను కలుసుకొందురు. శ్రీరాముని కృప వలన వారి కోరికలు అన్నియు నెరవేరును. రామాయణ శ్రవణముచే దేవతలు ప్రసన్నులై ఆ శ్రోతల యొక్క కుటుంబములకు దుష్ట గ్రహ బాధలు తొలగిపోవును. స్త్రీలు గర్భవతులై ఉత్తమ పుత్రులు పొందుదురు. పాపములు పటాపంచలగును. శ్రీరాముడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు యొక్క అవతారము. కనుక రామాయణము పఠించువారికి, వినువారికి రామానుగ్రహము ప్రాప్తించును. ఈ రామాయణ కావ్యము సర్వ శుభకరము. సమస్త ప్రయోజనములు సిద్ధించును.ఈ ఇతిహాసము ఆయురారోగ్యములను, కీర్తి ప్రతిష్టలను,

సౌభ్రాతృత్వమును,బుద్ధి కౌశలమును, సుఖ శాంతులను, తేజోవైభవములను ప్రసాదించును. కావున సమస్త సంపదలను అభిలషించెడి సత్పురుషులు నియమ నిష్ఠలతో దీనిని శ్రవణము చేయవలెను.

శ్రీరామ జయరామ జయజయ రామ

## యుద్ధ కాండము సమాప్తము

## శ్రీరాముడు - యోగ రహస్యము సమాప్తము

## శ్రీరామ జయరామ జయజయ రామ

**ప్రదీపజ్వాలాభిర్దివసకరనీరాజనవిధిః**
**సుధాసూతేశ్చంద్రోపలజలలవైరర్ఘ్యరచనా .**
**స్వకీయైరంభోభిః సలిలనిధిసౌహిత్యకరణం**
**త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచాం స్తుతిరియమ్**
**(సౌందర్య లహరి 100 వ శ్లోకము)**

విశ్వజననీ! పగటివేళ దివిటీలు వేసి సూర్యునకు హారతి నిచ్చినట్లుగా, చంద్రకాంత శిలల జలముతో సుధాకరునకు అర్ఘ్యమిచ్చినట్లుగా, సముద్రునకు అతని నీటిలోనే నిలిచి తర్పణము వదిలినట్లుగా నీవిచ్చిన వాక్కులలోనే చేసిన ఈ స్తుతి నీకు సమర్పించు చున్నాను. (హనుమత్ సమేత సీతారామలక్ష్మణ కృపలతో, శక్తితో, ఆ పరమేశ్వరి అనుజ్ఞలతో ఈ గ్రంథమును పూర్తి చేసి, ఆ పరమేశ్వరి పాదములకు సమర్పించుతున్నాను)